# సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..





## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఓజసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# సంగీత కళాప్రదర్శిని

## మొదటి భాగము



గ్రంథకర్త:
గానకళావిశారద,
అరిపిరాల సత్యనారాయణమూర్తి (వయొలినిష్టు)
Ex. మెంబరు: బోర్డు ఆఫ్ ఎగ్జామినర్స్ ఇన్ మ్యూజిక్,
ఆంధ్రా యూనివర్సిటీ.
మెంబరు: లోకల్ అడ్వైజరీ కమిటీ,
ఆల్ ఇండియా రేడియో, విజయవాడ.
సుందరవిలాస్ - గాంధీనగర్ - విజయవాడ.

1960

# పీఠిక

★

వేదకాలమునుండి భారతీయ సంగీతము మిక్కిలి పవిత్రమైనదిగా చెప్పబడుచునేయున్నది. ఇందుకు ముఖ్యకారణము త్రిమూర్తులు నాదస్వరూపులై నాదోపాసితులుగా నుండుటే యగును. గనుకనే శారదాది మహర్షులేగాక శ్రీ జయదేవ, పురందరదాస, అన్నమాచార్య, నారాయణతీర్థ, త్యాగరాజ, దీక్షిత, శ్యామశాస్త్రిలాదిగాగల భక్త శిఖామణులు సైతము నిరంతరము భక్తితో సంగీతకళోపాసనచేసి తరించగల్గిరి. ఈ విధముగా తరణోపాయమైన భారతీయ సంగీతకళావిశిష్టతను, మన భారత ప్రభుత్వమేమి, రాష్ట్ర ప్రభుత్వములేమి చక్కగా గుర్తించినందువల్లనే మన దేశములోని వివిధవిశ్వవిద్యాలయములందును, తదితర ప్రభుత్వ విద్యాసంస్థలందును సంగీత కళకు తగిన స్థానమిచ్చి పరీక్షలు జరపుట తటస్థించినది. ఈ విధముగా యేర్పడిన సంగీత పరీక్షలలో ఒక ముఖ్యభాగమైన కర్నాటక సంగీత పరీక్షలను దక్షిణభారతంలో కొన్ని సంవత్సరములుగా జరుపబడుచున్నను, ఆ యా పరీక్షల కనువైన పాఠ్య గ్రంథములుమాత్రం ప్రత్యేకంగా నేటికిని వెలువడలేదనే చెప్పవచ్చును. ఈ కారణముచే విద్యార్థులకు గలుగుచున్న కష్టనష్టముల నివారించుటకై కొందరు విద్యాధికారులు లోగడ నన్నెంతో ప్రోత్సహించినందున "గాన కళా చంద్రిక" "గానశాస్త్ర ప్రశ్నోత్తరావళి" "సంగీత లక్షణ సంగ్రహము" "సంగీత శబ్దార్థ చంద్రిక" వంటి గ్రంథములను రచించి ప్రకటించుట జరిగెను. కాని ప్రస్తుతము విశ్వవిద్యాలయాది వివిధ సంగీత పరీక్షా ప్రణాళికలందు సూచించినట్లు పలురకముల గ్రంథములకంటె వివిధ సంగీత పరీక్షల కుపకరించునట్లుగా నొక పాఠ్య గ్రంథమును ప్రకటించినచో నేటి ఆర్థిక పరిస్థితులలో విద్యార్థుల కెంతేని సహాయకారిగా నుండునను తలంపుతో "సంగీత కళా ప్రదర్శిని" యను పేరిట నేనీ గ్రంథమును రచించుటకు కారణమైనది. ఇందు మొదటి భాగమున వివిధ సంగీత పరీక్షలకు సంబంధించిన షుమారు 300 వఱకు లక్షణవిషయములనే గాక రమారమి 120 మంది ప్రాచీన వాగ్గేయకారకుల జీవితవిశేషములను, రెండవభాగమున స్వరావళ్యాది కృతుల పర్యంతముగల వివిధరకములగు సంగీతరచనలనే గాక కొన్ని పల్లవులతో సహా షుమారు 300 రచనలకు మూలములను, భావములను, రాగలక్షణములను, స్వరసాహిత్యములను వ్రాసి వాటికి తాళాంగ, కాలప్రమాణ, ఆవర్త, స్థాయి గుఱుతుల నేర్పఱచి యుంటిని. కాని నేటికాలమాన పరిస్థితులవల్ల విశేషధనవ్యయ, ప్రయాసలతో కూడిన షుమారు 550 పుటలుగల యీ గ్రంథప్రచురణలో ప్రస్తుతము 250 పుటలతో కూడిన మొదటి (లక్షణ) భాగమును మాత్రము ప్రస్తుతము ప్రకటింపగల్గితిని. దైవానుగ్రహమువల్ల యావద్భాగానికే

ఏకైక సంగీత కళాపోషకసంస్థగా నున్న మన కేంద్ర సంగీత, నాటక అకాడమివారి యొక్క అమూల్య సహాయమే నాకు లభించినచో మిగిలిన రెండవ (లక్ష్య) భాగమును కూడ అతిత్వరలో ప్రచురించి గానకళార్థుల కందించగలనని ఆశిస్తున్నాను. ఈ నా గ్రంథమును జూపినంతనే తగు ఆసక్తితోను, విచక్షణతోను, పరిశీలించి తమ సదభిప్రాయముల నంపిన సంగీత కళానిధి కీ॥ శే॥ శ్రీ టి. వి. సుబ్బారావుగారికిని, సంగీత కళాశిఖామణి శ్రీ ప్రొఫెసర్ పి. సాంబమూర్తి (మద్రాసు యూనివర్సిటీ సంగీత శాఖాధ్యక్షులు) గారికిని, సంగీతకళానిధి శ్రీ చిత్తూరు సుబ్రహ్మణ్యం గారికిని, పద్మశ్రీ, సంగీతకళానిధి, సంగీతరత్నాకర, కళాప్రపూర్ణ, డాక్టర్ శ్రీ ద్వారం వేంకటస్వామినాయుడుగారికిని నా ప్రత్యేక అభివందనములను తెలుపుకొనుచున్నాను. ముఖ్యముగా నా యీ గ్రంథ ప్రచురణ యత్నములో యీ మొదటి భాగమునైనను నేటికి ప్రకటించి సంగీతకళాభిలాషుల కందించగలుగునట్లుగా దయతో తగు ధనసహాయ మొసగిన కేంద్ర సంగీత, నాటక అకాడమివారికి సాహృదయపూర్వకమైన అభివందనములను తెలుపుకొనుచున్నాను.

ఇట్లు బుధజన విధేయుడు,

గ్రంథకర్త:

అరిపిరాల సత్యనారాయణమూర్తి.

గ్రంథకర్త:

గానకళావిశారద

**అరిపిరాల సత్యనారాయణమూర్తి.**

# పండితాభిప్రాయములు.

Sangeetha Kalanidhi,
**T. V. Subba Rao,** (B.A.,B.L;) Advocate,
Principal, Teachers College of Music,
Madras.

Dated 19—4—1957
188, High Road,
Royapettah,
MADRAS.

I have great pleasure in commending "Sangeetha Kala Pradarsini" written by Sri Aripirala Satyanarayana Murthy to supply the want of a suitable text book for those who appear for various Examinations in Music held by the Universities and State Governments. The book is comprehensive and covers many a syllabus. I have no doubt it well serve the requirements of students of Music.

T. V. SUBBA RAO.

సంగీత కళానిధి,
టి. వి. సుబ్బారావు, బి. ఎ; బి యల్; అడ్వొకేట్. 
ప్రిన్సిపాల్ : టీచర్సు కాలేజ ఆఫ్ మ్యూజిక్, మద్రాసు.

19-4-1957
188, రాయపేట హైరోడ్డు
మద్రాసు.

విశ్వవిద్యాలయములున్నూ, రాష్ట్ర ప్రభుత్వములున్నూ జరుపు వివిధ సంగీత పరీక్షలకు హాజరగునట్టి విద్యార్థులకు సరియైన పాఠ్యగ్రంథము లేనికొఱత దీర్చుటకై శ్రీ ఆరిపిరాల సత్యనారాయణమూర్తిగారు రచించిన "సంగీత కళాప్రదర్శిని" అను గ్రంథము మిక్కిలి ప్రశస్తమైనదని తెలుపుటకు నేనెంతయు సంతసించుచున్నాను. ఈ గ్రంథము వివిధ రకములగు సంగీత పరీక్షాప్రణాళికల కనువగునట్లనేక లక్షణ విషయములతో రచింపబడిన దగుటచే సంగీతవిద్యార్థుల యావసరములను తప్పక తీర్చ గలదనుటలో నా కెట్టిసందేహము లేదు.

టి. వి. సుబ్బారావు

---

**University of Madras.**

Dated 5—11—1957.
Triplicane, Madras 5.

OPINION

I have had the opportunity of perusing portions of the manuscripts relating to the book "Sangeetha Kala Pradarsini" written in Telugu by Sri Aripirala Satyanarayana Murthy garu. The book is well written and the various topics are lucidly explained. The book deserves publication.

P. SAMBAMURTHY,
Head of the Department of Indian Music,
University of Madras.

మదరాసు విశ్వవిద్యాలయము. | ది 5-11-1957
తిరువళిక్కేణి P. O.
మదరాసు-5.

అభిప్రాయము.

శ్రీ అరిపిరాల సత్యనారాయణమూర్తిగారు ఆంధ్ర భాషలో రచించిన "సంగీత కళా ప్రదర్శిని" అను గ్రంథముయొక్క వ్రాతప్రతిలోని కొన్ని భాగములను తిలకించు నవకాశము యిటీవల నాకు లభించినది. ఈ గ్రంథము సంగీతశాస్త్రమందలి వివిధ విషయములను సుబోధకమగునట్లుగా చక్కని వివరణతో రచింపబడుటచే ప్రచురణకు మిక్కిలి యోగ్యముగా నున్నది.

పి. సాంబమూర్తి
భారతీయ సంగీత శాఖాధ్యక్షులు
మదరాసు విశ్వవిద్యాలయము.

---

Sangeetha Kalanidhi | Dated 9—5—1957
**Semmangudi R. Srinivasa Iyer,** | MADRAS.

I have great pleasure in commending this book "Sangeetha Kala Pradarsini" written by Vidwan Sri Aripirala Satyanarayana Murthygaru, an experienced Lakshya-Lakshana Vidwan of Andhra Desa, to all those interested in the spread of classical Carnatic Music. This book is successful in giving a vivid exposition of the various technical aspects of Music for the benefit of the lay reader. This is bound to be a compendium of knowledge not only to the students of Music but also to the general public who wish to gain proficiency in the technique of South Indian Music. There is also a short biographical sketch of the distinguished musicians of the past and this enhances its value. This book contains an anthology of Musicians, which is brief and quite pertinent.

R. SRINIVASA IYER.

సంగీతకళానిధి | ది 9-5-1957
శెమ్మంగుడి ఆర్. శ్రీనివాసయ్యర్. | మదరాసు.

ఆంధ్ర దేశములో అనుభవజ్ఞులును, లక్ష్యలక్షణ సంగీత విద్వాంసులునగు విద్వాన్ శ్రీ అరిపిరాల సత్యనారాయణమూర్తిగారు రచించిన "సంగీత కళా ప్రదర్శిని" అను గ్రంథము కర్నాటక సంగీత కళాభివృద్ధికై కృషిచేయువారందరికిని మిక్కిలి ఉపయుక్తమైనదని తెలుపుటకు నేనెంతయు సంతసించుచున్నాను. సంగీతకళకు సంబంధించిన. వివిధసాంకేతిక విషయములను స్పష్టముగాను, తేటతెల్లముగాను

తెలుపుటలో నీ గ్రంథము సామాన్యపాఠకులకు కూడ యెంతో ఉపకరించును. ఈ గ్రంథము సంగీత విద్యార్థులకేగాక దక్షిణదేశ (కర్నాటక) సంగీతములో ప్రావీణ్యము సంపాదింపగోరు ప్రజాబాహుళ్యమునకుసైతము సంగీతవిజ్ఞానసర్వస్వముగా నుండి తీరుననుట కెట్టి సందేహమును లేదు. మరియు నీ గ్రంథమున ప్రాచీన సుప్రసిద్ధ వాగ్గేయకారకుల జీవితవిశేషములనుకూడ సంగ్రహముగా చేర్చుటచే నీ గ్రంథము యొక్క విలువ యింకను అభివృద్ధి చెందినది.

ఆర్. శ్రీనివాసయ్యర్.

---

Sangeetha Kalanidhi,
**Chittoor Subrahmanyam,**
Professor of Vocal, Central College of
Karnataka Music, Madras.

27—2—1958,
44, Appu Mudali St.,
MADRAS-4.

I have always been wondering and rejoicing at the ceaseless endeavours being made by Ganakalavisharada Sri Aripirala Satyanarayanamurthy, for the promotion of the art of Music. He has already rendered immense service to the cause of Music by writing many books like Sangeetha Sabdartha Chandrika (Dictionary). His present work, " Sangeetha Kala Pradarsini " is an invaluable book that would be a guide not only to students of Music but also to the Vidwans who want to equip themselves with knowledge of Musicology. I hope the benevolent artistes and patrons of Music will encourage the author, Sri Satyanarayanamurthy, befitting his endeavours.

CHITTOOR SUBRAHMANYAM.

సంగీత కళానిధి చిత్తూరు సుబ్రహ్మణ్యం,
ప్రొఫెసర్ ఆఫ్ ఓకల్ : సెంట్రల్ కాలేజీ ఆఫ్
కర్నాటిక్ మ్యూజిక్, మదరాసు.

27-2-1958
44, అప్పుముదలివీధి,
మైలాపూరు, మద్రాసు-4.

గానకళావిశారద, శ్రీ అరిపిరాల సత్యనారాయణమూర్తి గారు సంగీత కళాభివృద్ధికై నిరంతరము చేయుచున్న కృషి నాకెంతయు ఆశ్చర్యమును, ఆహ్లాదమును కలిగించినది. వీరు యిదివరకే "సంగీతశబ్దార్థచంద్రిక" (నిఘంటువు) వంటి అనేక గ్రంథములను రచించి అపారమైన సంగీతకళాసేవ చేసియుండిరి. ప్రస్తుతము వీరు రచించిన "సంగీతకళాప్రదర్శిని" యను అమూల్యమైన గ్రంథము సంగీత విద్యార్థులకే గాక సంగీత విద్వాంసులకుగూడ సంగీతశాస్త్రవిషయసేకరణలో మిక్కిలి సహాయకారి కాగలదు. సంగీత కళోపాసకులును, పోషకులునగు సహృదయులు గ్రంథకర్తయగు శ్రీ సత్యనారాయణమూర్తిగారి కృషికి తగినట్లు ప్రోత్సహింతురని ఆశిస్తున్నాను.

చిత్తూరు సుబ్రహ్మణ్యం.

**Padmasri, Sangeetha Kalanidhi,**
**Sangeetha Ratnakara,**
Kalaprapoorna,
**Dr. Dwaram Venkataswamy Naidu**

Dwaram House,
Triplicane,
MADRAS-5,
Dated 19—12—1958

I have always felt that with the spread of Music in the Educational system, books dealing with the theory and practice of Music are increasingly in demand. Text books which contain the essentials of the science and Art of Music and cover the syllabus of various Examinations are indeed quite welcome in these days, when Music is entering the nook and corner of the country.

"Ganakala Visharada" Sri Aripirala Satyanarayana Murthygaru, a seasoned musicologist and publisher of books has done a real service to the cause of Music by writing and bringing out a handy edition of "Sangeethakala Pradarsini". This serves the students and other lay readers as well.

D. VENKATASWAMY.

పద్మశ్రీ, సంగీతకళానిధి,
సంగీతరత్నాకర, కళాప్రపూర్ణ,
డా॥ ద్వారం వేంకటస్వామి నాయుడు.

ద్వారం భవనం,
తిరువళ్ళిక్కేణి,
మద్రాసు-5.
ది 19-12-1958

మన విద్యావిధానములో సంగీత విద్యావ్యాప్తి జరుగుచున్నకొలది సంగీతము యొక్క లక్ష్య లక్షణములను బోధించు గ్రంథము లనేకము కావలసియుండునని నే నెల్లప్పుడూ తలంచుచుంటిని. వివిధకములైన సంగీతపరీక్షా ప్రణాళికల ననుసరించుచూ, శాస్త్రీయ సంగీతకళయొక్క ముఖ్యసిద్ధాంతములను, అనుభవములను వివరించగల పాఠ్యగ్రంథములు యీ రోజులలో యెంతో అవసరమై యున్నవి. దేశములో మూలమూలలను సంగీతము వ్యాపించుచున్నకొలది అట్టి గ్రంథములకు స్వాగతము విశేషముగా లభించుచునే యుండును.

గానకళావిశారద, శ్రీ అరిపిరాల సత్యనారాయణమూర్తిగారు ఒక అనుభవజ్ఞులైన సంగీత శాస్త్రజ్ఞులేగాక అనేక సంగీత గ్రంథములనుకూడ రచించి ప్రకటించుట ద్వారా సంగీతకళకు నిజమైన సేవయొనర్చినవారైరి. ప్రస్తుతము వీరు రచించిన "సంగీత కళా ప్రదర్శిని" అను గ్రంథము వివిధ సంగీత పరీక్షా ప్రణాళికల కనువైన ప్రతిగా నుండుటచే సంగీత విద్యార్థులందరికి యెంతో మేలొనర్చినవారగుచున్నారు. ఈ గ్రంథము సంగీతవిద్యార్థులకేగాక సామాన్యపాఠకులకుసైతము యెక్కువగా నుపకరించునని నా అభిప్రాయము.

డి. వేంకటస్వామి

# విషయసూచిక.

ఓ మ్

# సంగీతకళా ప్రదర్శని.

## మొదటిభాగము - సంగీతలక్షణము.

### వందనశ్లోకము.

శ్లో॥ బ్రహ్మగ్రన్థిజ మారుతానుగతినా చిత్తేన హృత్పంకజే,
సూరీణా మనురంజకః శ్రుతిపదం యోయం స్వయం రాజతే,
యస్మాద్గ్రామ విభాగ వర్ణరచనాలంకార జాతిక్రమో,
వందే నాదతనుం తముద్ధుర జగద్గీతం ముదే శంకరం॥

(సంగీత రత్నాకరము.)

మంగళవాచ్యసూచకమగు బ్రహ్మగ్రన్థి అను ప్రయోగముతో ప్రారంభించబడిన నీ శ్లోకపూర్వకముగా జగత్తున కాదికారణమైన నాదబ్రహ్మను యీగ్రంథమునిర్విఘ్నముగా సమాప్తిచేయుటకు ప్రార్థించుచున్నాను.

### నాదోత్పత్తి.

మనుష్య శరీరమునందుగల యోగాధారము లాఱింటిలోను మొదటిదైన మూలాధార స్థానమందుగల చతుర్దళదళ చక్రమునకు "బ్రహ్మగ్రన్థి" యని చెప్పబడును. ఈ బ్రహ్మగ్రన్థిలోనుండు సూక్ష్మాగ్నిచే ప్రేరేపింపబడిన ప్రాణవాయువు నాభి, హృదయ, కంఠ, శిరస్సు, ముఖములద్వారా పైకి వెడలునపుడు నాద ముత్పత్తియగు చున్నది. అట్లు యేర్పడిన నాదము, నాభియందుండునపుడు అతి సూక్ష్మమనియు, హృదయమం దుండునపుడు సూక్ష్మమనియు, కంఠమందుండునపుడు పుష్టమనియు, శిరస్సునందుండునపుడు అపుష్టమనియు, ముఖమునందుండునపుడు కృత్రిమమనియు చెప్పబడుచున్నది.

### నాదశబ్దార్థము.

నాద, అను శబ్దములో న, కారము ప్రాణమనియు, ద, కారము అగ్నియనియు సంజ్ఞయగును. అట్టి ప్రాణాగ్నుల సంయోగమువల్లనే ధ్వని యేర్పడినందున దానిని "నాదము" అని చెప్పుటకు కారణమైనది.

### నాదవిభాగము.

నాదము రెండువిధములుగా విభజింపబడినది. ఆ రెండువిధములు యేవనగా !

i ఆహతనాదము :— ఇది భవభంజకమైనదియును, గానోత్పత్తికారిణియై శ్రుతి, స్వర, గ్రామ, మూర్ఛనాదులద్వారా జనరంజకమును కలుగజేయునది యగును.

ii అనాహతనాదము :— ఇది రంజకములేనిదై, గురుముఖముగ నుపదేశింపబడినదై, ముక్తిప్రదంబై, అచంచల మనోరథముగల మునులచే నుపాసింపబడునది యగును.

## నాదవిశిష్టత.

పైన దెలిపినటుల మూలాధార జనితమైన యీ నాదము వేదముల కాధారస్థాన మగుటయేగాక పద, వాక్య, కావ్య, నాటకాలంకార శాస్త్రములును, శ్రుతి, స్వర, గ్రామ, మూర్ఛన, అలంకార, గీత, వర్ణ, పద, కీర్తనాదులును యేర్పడుటకు కారణమై జనరంజకమైన సంగీతముగా నేర్పడుచున్నది.

## సంగీత ప్రాశస్త్యము.

శ్లో॥ సామవేదాదిదం గీతం సంజగ్రాహ పితామహః॥ (సం. రత్నా.)

అను సంగీతరత్నాకర శ్లోక ప్రమాణమున సంగీతము సామవేదమునుండి బ్రహ్మచే గ్రహించబడి, లోకోపకారార్థమై భరతాదులచేతను, తదుపరి వాగ్గేయ కారకులచేతను వెల్లడిచేయబడిన శాస్త్రమగును. గనుక నీ సంగీతవిద్య మహనీయులచే సహితము కొనియాడబడినదై యున్నది.

## సంగీత పరమార్థము.

శ్లో॥ కావ్యాలాపాశ్చ యేకేచి ద్గీతాని సకలానిచ।
శబ్దమూర్తి ధరస్యైతే విష్ణోరంశా మహాత్మనః॥ (విష్ణు. పు.)

అను ప్రమాణమున శబ్దస్వరూపమైన కావ్యములును, సంగీతమును భగవంతుని స్వరూపాంశములని స్పష్టపడుచున్నది. అదియుగాక సూతసంహిత అను గ్రంథములో

శ్లో॥ గీతిగానేన యోగస్యాత్ యోగాదేవ శివైక్యతా।
గీతిజ్ఞోయది యోగేన సయాతి పరమేశ్వరం॥ (సూ. సం.)

అనెడి శ్లోకరీత్యా భక్తితో చేయబడు గానము యోగమై, ఆ యోగముచేత మానవులు పరమాత్మయం దైక్యమగుదురని స్పష్టపడుచున్నందున సర్వులకు భక్తియుతమైన సంగీతోపాసన తపజపోపాసనముకు సులభమార్గమగునని తెలియుచున్నది.

## సంగీత శబ్దార్థము.

శ్లో॥ గీతం వాద్యం తథా నృత్యం త్రయం సంగీత ముచ్యతే॥ (సం. ర.)

అను ప్రమాణముచే గీత, వాద్య, నృత్యముల మూటి చేరికయే సంగీతమని తెలియుచున్నది. కాని "గీత వాద్యోభయం యత్ర సంగీతమితి కేచన॥ రాగ స్వరశ్చ తాళశ్చ త్రిభి స్సంగీతముచ్యతే" అను ప్రమాణములచే గీత, వాద్యముల చేరికయే సంగీతమని కొందరును, రాగ, స్వర, తాళముల చేరికయే సంగీతమని కొందరును చెప్పియుండినను, మొదటిదిమాత్రము ప్రసిద్ధ వాగ్గేయకారుల మతముగాదనియే తెలియుచున్నది. ఈవిధముగా గీత, వాద్య, నృత్యాదులతోకూడినట్టి సంగీతమునకు నాదము ప్రధానమగును. అట్టి నాదమువల్లనే శ్రుతులును, శ్రుతులవల్లనే షడ్జాది స్వరములును, ఆ స్వరములవల్లనే రాగములును, గీతాదులును కలుగుటచే గీతము నాద స్వరూపమనియు, వాద్యము గీతము ననుసరించునదియుగా చెప్పబడుటకు కారణమైనది.

శ్రుతి :— అనగా "శ్రూయన్త ఇతి శ్రుతయః" అను ప్రమాణమున శ్రవణేంద్రియములకు వినపడునట్టి ధ్వనివిశేషమును "శ్రుతి" యని చెప్పబడును. అట్టి శ్రుతికి నాదము ప్రధానమగును. ఈ నాదమును అతి తక్కువధ్వనినుండి అతి హెచ్చు

ధ్వనివఱకు ఒకదానికొకటి హెచ్చుగాను, విడివిడిగాను విభజించినచో రాదగిన ధ్వనులు 66 మాత్రమే యగును. వీనినే "శ్రుతు" లని చెప్పబడుచున్నవి. ఇవి మానవునియందుగల హృదయ, కంఠ, శిరస్సులనెడి త్రిస్థానములనుండి క్రమముగా వెడలునపుడును, హృదయస్థానమందు యేర్పడు మొదటి 22 శ్రుతులను మంద్రశ్రుతు లనియును, కంఠస్థానమందు యేర్పడు రెండవ 22 శ్రుతులను మధ్యశ్రుతులనియును, శిర స్థానమందు యేర్పడు మూడవ 22 శ్రుతులను తారశ్రుతులనియును, చెప్పబడును.

ద్వావింశతిశ్రుతులు:—పైన దెలిపిన ఒక్కొక్క భాగమునందుగల 22 శ్రుతులనే పూర్వాచార్యులు ద్వావింశతి శ్రుతులని చెప్పియున్నారు.

ద్వావింశతి శ్రుతుల పథకము :— ద్వావింశతి శ్రుతులకుగల పేర్లను, వాటి ప్రత్యేక నామములను, వాటిజాతులను, సంఖ్యలతోకూడిన వాటి సంకేతస్వరములను, ఆయా శ్రుతులకు ఉదాహరణములుగానుండు రాగములను యీదిగువ పథకమున తెలుపుట గమనించదగును.

| | ద్వావింశతి శ్రుతుల పేర్లు. | జాతులు. | ప్రత్యేక నామములు | సంకేతములు. | ఆయా శ్రుతులుగల ఉదాహరణ రాగములు. |
|---|---|---|---|---|---|
| 1 | షడ్జము | దీ | తీవ్రా | స | అన్నిరాగములు |
| 2 | ఏకశ్రుతిరిషభము | ఆ | కుముద్వతీ | రి$^{1}$ | గౌళ |
| 3 | ద్విశ్రుతిరిషభము | మృ | మన్దా | రి$^{2}$ | మాయామాళవగౌళ |
| 4 | త్రిశ్రుతిరిషభము | మ | ఛన్దోవతీ | రి$^{3}$ | కాంభోజి & భైరవి |
| 5 | చతుశ్శ్రుతిరిషభము | క | దయావతీ | రి$^{4}$ | కల్యాణి |
| 6 | శుద్ధగాంధారము | మ | రఞ్జనీ | గ$^{1}$ | భైరవి & తోడి |
| 7 | సాధారణగాంధారము | మృ | రతికా | గ$^{2}$ | ఖరహరప్రియ |
| 8 | అంతరగాంధారము | దీ | రౌద్రీ | గ$^{3}$ | శంకరాభరణం & కాంభోజి |
| 9 | తీవ్రగాంధారము లేక చ్యుతమధ్యమగాంధార | ఆ | క్రోధీ | గ$^{4}$ | కల్యాణి |
| 10 | శుద్ధమధ్యమము | దీ | వజ్రికా | మ$^{1}$ | అన్నిశుద్ధ మధ్యమ రాగములు |
| 11 | తీవ్రమధ్యమము | ఆ | ప్రసారిణీ | మ$^{2}$ | బేగడ |
| 12 | ప్రతిమధ్యమము | మృ | ప్రీతి | మ$^{3}$ | పూర్వకల్యాణి |
| 13 | చ్యుతపంచమము | మ | మార్జనీ | మ$^{4}$ | వరాళి & రామప్రియ |
| 14 | పంచమము | నృ | క్షితి | ప | వర్జములేని అన్నిరాగములు |
| 15 | ఏకశ్రుతిధైవతము | మ | రక్తా | ధ$^{1}$ | సావేరి |
| 16 | ద్విశ్రుతిధైవతము | ఆ | సన్దీపినీ | ధ$^{2}$ | మాయామాళవగౌళ & తోడి |
| 17 | త్రిశ్రుతిధైవతము | క | ఆలాపినీ | ధ$^{3}$ | కాంభోజి |
| 18 | చతుశ్శ్రుతిధైవతము | క | మదన్తీ | ధ$^{4}$ | కల్యాణి |
| 19 | శుద్ధనిషాదము | ఆ | రోహిణీ | ని$^{1}$ | కాంభోజి & భైరవి |
| 20 | కైశికీ నిషాదము | మ | రమ్యా | ని$^{2}$ | ఖరహరప్రియ [ళవగౌళ |
| 21 | కాకలీనిషాదము | దీ | ఉగ్రా | ని$^{3}$ | శంకరాభరణం& మాయామా |
| 22 | చ్యుతషడ్జనిషాదము | మ | క్షోభిణీ | ని$^{4}$ | కల్యాణి & కురంజి |

ద్వావింశతిశ్రుతులుగల పంచజాతులు:—ద్వావింశతిశ్రుతులగు 22 ను, 1 దీప్తా, 2 ఆయతా 3 కరుణా 4 మృదూ 5 మధ్యా అను 5 జాతులకు చెందినవైయున్నవి. పై 22 శ్రుతులలో 1, 8, 10 21, శ్రుతులు దీప్తాజాతికిని, 2, 9, 11, 16, 19 శ్రుతులు ఆయతాజాతికిని, 5, 17, 18 శ్రుతులు కరుణాజాతికిని 3, 7, 12, 14 శ్రుతులు మృదూజాతికిని, 4, 6, 13, 15, 20, 22 శ్రుతులు మధ్యాజాతికిని చెందినవైయున్నటుల గమనించదగును. పురాతన సంగీతజ్ఞులు పైనదెలిపిన 22 శ్రుతులను సప్తస్వరములకు విభజించియుండిరి. కాని ఆ తరువాత షడ్జ, పంచమములు అవికృతస్వరములుగా నెంచుటచే, ఆ రెండిటికిని ఒక్కొక్క శ్రుతివంతున లెక్కించియు, మిగత 20 శ్రుతులను రిషభ, గాంధార, మధ్యమ, ధైవత, నిషాదములను 5 స్వరములకు ఒక్కొక్క స్వరమునకు 4 శ్రుతులవంతున లెక్కించియు $5 \times 4 = 20 + 1 + 1 = 22$ శ్రుతులుగా చెప్పియున్నారు. ద్వావింశతిశ్రుతు లనబడు నీ 22 శ్రుతులును యే విధముగా యేర్పడు నది, యీ క్రింద వివరముగా తెలుపుటను గమనించదగును.

## షడ్జ, పంచమభావ వివరము.

షడ్జ పంచమభావము:—ఏదైన ఒక తంత్రీవాద్యము నందలి మధ్యషడ్జతంతిని మీటునపుడు అందు సూక్ష్మముగా అంతరగాంధార, పంచమ, తార షడ్జధ్వనులు పలుకును. అట్లు పలుకు స్వరములు సంపూర్ణ ఐకమత్యముగల స్వరము లగును. షడ్జ పంచమములు సమగ్రమైన హార్మోనిగల స్వరము లగుటచే షడ్జ, పంచమభావప్రకారము లభ్యమగునట్టి యన్ని స్వరములును, సంపూర్ణమైన హార్మోనిగలవియైగాన యోగ్యములుగా నుండును. ఈ షడ్జ, పంచమభావము ఆరోహణక్రమములో లెక్క చేయదగును. షడ్జమునకు 14వ శ్రుతిలో పంచమము గలదు. ఈ షడ్జ-పంచమములకు మధ్య 12 శ్రుతులుండుటచే పై రెండును వాది, సంవాదు లగును. గనుకనివి సంపూర్ణమైన హార్మోనీ కలిగినవగుచున్నవి. ఇట్లు వాది, సంవాదులుగా ప్రస్తరించునపుడు మొదటి ఆధారషడ్జమునకు సరియైన పంచమమును కనిపెట్టి ఆ పంచమమునే షడ్జముగా నెంచి, దానికి సరియైన పంచమమును కనిపెట్టి, దానిని షడ్జముగా నెంచి, మరల దానికి సరియైన పంచమమునుకనిపెట్టుచూ యిటుల సరియైనశ్రుతులు రాగలిగి నంతవఱకు ఆరోహణముగా ప్రస్తరించుచూ వచ్చినచో షడ్జ, పంచమశ్రుతులతోసహా దీనిలో 12 శ్రుతులు లభ్యమగుట యీ క్రింది "సైకిల్ ఆఫ్ ఫిఫ్త్స్" పథకమున చూడదగును.

## షడ్జ, మధ్యమ భావ వివరము.

షడ్జమధ్యమ భావము:—పైన దెలిపిన విధముగా షడ్జపంచమభావము ననుసరించి ఒక స్వరమునకు మరియొక స్వరమునకు ఆరోహణమందు ఐకమత్యముండినచో అవ

రోహణమందుకూడ ఐకమత్యముండుట నిస్సందేహ మగును. గనుక యిట్టి ఐకమత్యము షడ్జమధ్య మ భావమునకుగూడ గల్గియుండును. ఎటులనగా! మధ్యస్థాయిపంచమమును ఆధారషడ్జముగానెంచినచో దీనికి తారషడ్జము శుద్ధమధ్యమ మగును. గనుక పస = సమ, యగుచున్నది. గనుక మధ్యపంచమ, తారషడ్జములకుగల యీ యనుగుణ్యామే షడ్జ, శుద్ధ మధ్యమములకుగూడ గలదని స్పష్టమగుచున్నది. గనుక అవరోహణముగ యీ శుద్ధ మధ్యమమునే షడ్జముగానెంచిన, మొదటి షడ్జము శుద్ధమధ్యమ మగును. షడ్జమునకు 10-వ, శ్రుతిలో శుద్ధమధ్యమము పుట్టుచున్నది. గనుక యీ రెంటికిని మధ్య 8 శ్రుతు లుండుటచే ఈ రెండు స్వరములును వాది, సంవాదులగును. ఇవి సంపూర్ణ ఐకమత్యముగలవి యగును. ఈ విధముగాషడ్జ మధ్యమభావమును అవరోహణక్రమముగా సరియైనశ్రుతులు రాగలిగినంతవఱకు ప్రస్తరించుచూ వచ్చినచో లోగడ షడ్జ, పంచమ భావమువలన లభించిన 12 శ్రుతులుగాక దీనిలో మిగత 10 శ్రుతులు యే విధముగ లభించునది యీ క్రిందదెలిపిన "సైకిల్ ఆఫ్ ఫోర్ త్ స్" పధకమున గమనించదగును.

లోగడదెలిపిన 66 శ్రుతులును స్థాయి ఒకటింటికి 22 శ్రుతులవంతున 3 స్థాయిలకు $3 \times 22 = 66$ శ్రుతులగును. వీచీతరంగ న్యాయమువలన కొందరు యీ శ్రుతులు అనంత మని చెప్పియున్నారు. వేపనములు 18 లేక 19-కి తగ్గినను, 10,000 లేక 20,000 కు హెచ్చినను ధ్వని చెవులకు వినపడదను సంగతి స్పష్టమగుటచే, వేపనములు అనంతముగ నుండవచ్చునేగాని శ్రుతులు మాత్రము అనంతముగ నున్నవనిచెప్పుట యెంతయు నసంభవమైన విషయమగును.

అలకులు :— పైన దెలుపబడిన 22 (ద్వావింశతి) శ్రుతులనే పురాతన తమిళ సంగీతములో "అలకులు" అని చెప్పబడెను.

సెంట్ :—ఈక్రిందిపధకములందు పేర్కొనబడిన సెంట్లనుగుఱించి మొదట తెలుసు కొనదగును. పాశ్చాత్య సంగీతశాస్త్రజ్ఞులు స్వరముల వ్యవధులను తెలియపఱచుటకు యేర్పఱచుకొనిన యూనిట్ ( unit )కు సెంటు అని చెప్పియుండిరి. ఇట్టి సెంట్లు ఒక స్థాయి( Octave ) లో 1200 వుండును. ఎటులనగా ! ఆధారషడ్జముయొక్క సెంటు విలువ సున్నగాయెంచి, తారషడ్జముయొక్క సెంట్లవిలువ 1200 గా నేర్పఱచిరి. గనుక యీక్రింద చూపబడిన సైకిల్ ఆఫ్ ఫిఫ్ త్ స్ & సైకిల్ ఆఫ్ ఫోర్ త్ స్ పధకములందు 22 శ్రుతులయొక్క సెంట్ల విలువనుకూడ తెలుపుటకు కారణమైనదవి గ్రహించునది.

## షడ్జ, పంచమ భావము. (Cycle of Fifths.)

| No. of the Cycle | అసలు శ్రుతి Besie Note | షడ్జ పంచమ భావముచే లభించుశ్రుతి Resulting Note | సెంట్ల యొక్క విలువ Value in cents | శ్రుతి, సంఖ్య Value in Sruti Number |
|---|---|---|---|---|
| 1 | స (షడ్జ) | ప (పంచమము) | 702 | 13 |
| 2 | ప (పంచమ) | చతుశ్రుతి - రిషభము | 702+702=1404- 1200=204 | 13+13=26- 22=4 |
| 3 | చతుశ్రుతి - రిషభ | చతుశ్రుతి - ధైవతము | 204+702=906 | 4+13=17 |
| 4 | చతుశ్రుతి - ధైవత | చ్యుతమధ్యమ - గాంధారము | 906+702=1608- 1200=403 | 17+13=30- 22=8 |
| 5 | చ్యుతమధ్యమ - గాంధార | చ్యుతషడ్జ - నిషాదము | 408+702=1110 | 8+13=21 |
| 6 | చ్యుతషడ్జ - నిషాద | చ్యుత- పంచమము | 1110+702= 1812 - 1200= 612 లేక 610 | 21+13=34- 22=12 లేక 11 |
| 7 | చ్యుత - పంచమ | శుద్ధ - రిషభము | 610+702=1312- 1200=112 | 11+13=24- 22=2 |
| 8 | శుద్ధ - రిషభ | శుద్ధ - ధైవతము | 112+702=814 | 2+13=15 |
| 9 | శుద్ధ - ధైవత | సాధారణ - గాంధారము | 814+702=1516- 1200=316 | 15+13=28- 22=6 |
| 10 | సాధారణ - గాంధార | కైశికీ - నిషాదము | 316+702=1 018 | 6+13=19 |
| 11 | కైశికీ - నిషాద | బేగడ- మధ్యమము | 1018+702= 1720-1200=520 | 19+13=32- 22=10 |
| 12 | బేగడ - మధ్యమ | ఈ శ్రుతి షడ్జము నకు ఒక ప్రమాణ శ్రుతివ్యవధి యెక్కువగనుక వాడుకలో లేదు. | 520+702= 1222-1200=22 | 10+13=23- 22=1 |

## షడ్జ, మధ్యమభావము. (Cycle of Fourths.)

| No. of the Cycle | అసలు శ్రుతి Basic Note | షడ్జ పంచమ భావముచే లభించు శ్రుతి Resulting Note | సెంట్లయొక్క విలువ Value in cents | శ్రుతుల సంఖ్య Value in Sruti Number |
|---|---|---|---|---|
| 1 | స (షడ్జ) | శుద్ధ - మధ్యమము | 498 | 9 |
| 2 | శుద్ధ - మధ్యమ | భైరవి-నిషాదము | 498 + 498 = 996 | 9 + 9 = 18 |
| 3 | భైరవి - నిషాద | భైరవి-గాంధారము | 996 + 498 = 1494 - 1200 = 294 | 18 + 9 = 27 - 22 = 5 |
| 4 | భైరవి-గాంధార | ఏకశ్రుతి-ధైవతము | 294 + 498 = 792 | 5 + 9 = 14 |
| 5 | ఏకశ్రుతి - ధైవత | ఏకశ్రుతి- రిషభము లేక గౌళ - రిషభము | 792 + 498 = 1290 - 1200 = 90 | 14 + 9 = 23 - 22 = 1 |
| 6 | గౌళ - రిషభ | ప్రతి-మధ్యమము | 90 + 498 = 588 లేక 590 | 1 + 9 = 10 లేక 11 |
| 7 | ప్రతి - మధ్యమ | కాకలీ-నిషాదము | 590 + 498 = 1088 | 11 + 9 = 20 |
| 8 | కాకలీ - నిషాద | అంతర - గాంధారము | 1088 + 498 = 1586 - 1200 = 386 | 20 + 9 = 29 - 22 = 7 |
| 9 | అంతర-గాంధార | త్రిశ్రుతి-ధైవతము | 386 + 498 = 884 | 7 + 9 = 16 |
| 10 | త్రిశ్రుతి - ధైవత | త్రిశ్రుతి-రిషభము | 884 + 498 = 1382 - 1200 = 182 | 16 + 9 = 25 - 22 = 3 |
| 11 | త్రిశ్రుతి - రిషభ | ఈ శ్రుతి పంచమమునకు ఒక ప్రమాణ శ్రుతి వ్యవధి తక్కువ గనుక వాడుకలో లేదు. | 182 + 498 = 680 | 3 + 9 = 12 |
| 12 | ప్రమాణ శ్రుతి తక్కువగల పంచమము | ఈ శ్రుతి షడ్జమునకు ఒక ప్రమాణశ్రుతి వ్యవధి తక్కువ గనుక వాడుకలో లేదు. | 680 + 498 = 1178 | 12 + 9 = 21 |

## షడ్జ పంచమ-షడ్జ మధ్యమ భావములవల్లలభించు 22 శ్రుతుల భిన్నము Ratio) లను దెలుపు పథకము.

| | స | రి | | | | గ | | | | మ | | | | ప | ధ | | | | ని | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| Cycle of fifths. | 1 | | $\frac{16}{15}$ | | $\frac{9}{8}$ | | $\frac{6}{5}$ | | $\frac{81}{64}$ | | $\frac{27}{20}$ | | $\frac{729}{512}$ లేక $\frac{64}{45}$ | $\frac{3}{2}$ | | $\frac{8}{5}$ | | $\frac{27}{16}$ | | $\frac{9}{5}$ | | $\frac{243}{128}$ | 2 |
| Cycle of fourths. | 1 | $\frac{256}{243}$ | | $\frac{10}{9}$ | | $\frac{32}{27}$ | | $\frac{5}{4}$ | | $\frac{4}{3}$ | | $\frac{1024}{729}$ లేక $\frac{45}{32}$ | | | $\frac{128}{81}$ | | $\frac{5}{3}$ | | $\frac{16}{9}$ | | $\frac{15}{8}$ | | 2 |

ప్రమాణశ్రుతివ్యవధి:—ఇది $\frac{81}{80}$ భిన్నమును, 22 సెంట్ల విలువను గలదియగును. దీనినే ప్రమాణశ్రుతి వ్యవధి (కామా ఆఫ్ డి. డిమస్) అని చెప్పబడును.

న్యూనశ్రుతివ్యవధి:— ఇది $\frac{25}{24}$ భిన్నమును, 70 సెంట్ల విలువను గలదియగును. దీనినే న్యూనశ్రుతి వ్యవధియని చెప్పబడును. ఇది పూర్ణ శ్రుతి వ్యవధి కంటె కొంచెము తక్కువగానుండు శ్రుతి వ్యవధియగును. ఈ శ్రుతుల విలువలు ఆయా స్థాయిలనుబట్టి వుండును.

పూర్ణశ్రుతివ్యవధి :— ఇది $\frac{256}{243}$ భిన్నమును 90 సెంట్ల విలువను గలదియగును. దీనినే హెచ్చుస్థాయికి చెందిన ఏకశ్రుతివ్యవధి (పితగోరియన్ లైమా లేక లిమ్మ) యని చెప్పబడును. మన సంగీతమునందుగల స్వర వ్యవధులన్నియు పైన తెలుపబడిన మూడు రకములగు శ్రుతి వ్యవధులలో నేదో యొక రకమునకు చెందియుండునని గ్రహించునది. పై 22 శ్రుతులలో 7 పూర్ణకు, 5 న్యూనకు, 10 ప్రమాణకు చెందినవగును.

గనుక 7 × 90 = 630 సెంట్లు, 5 × 70 = 350 సెంట్లు, 10 × 22 = 220 సెంట్లు కలిసి మొత్తము 630 + 350 + 220 = 1200 సెంట్లును, ఒక స్థాయిలోగల 7 + 5 + 10 = 22 శ్రుతివ్యవధులకు చెందిన వగుచున్నవి.

స్వయంభూధ్వనులు :— ఆధారషడ్జను ననుసరించి వాటియంతట అవే కలుగు నట్టి సున్నితమైన ధ్వనులకు స్వయంభూధ్వనులని పేరు. ఇంగ్లీషులో వీటినే "అప్పర్ పార్షల్ టోన్స్" (Upper Partial Tones) అని చెప్పబడును.

## స్వర నిరూపణము.

స్వరము :— పైనదెలిపిన ద్వావింశతి శ్రుతులు విడివిడిగా శబ్దించినచో వాటి వ్యవధులు మిగుల తక్కువగుచున్నందున గనుక మొనర్చుటకు వీలులేక రంజకము కలుగకుండును. గనుకనే పూర్వాచార్యులు శ్రుతులను పంచి, రంజకనుగల యక్షర ములతో చేర్చియున్నారు. వీటినే సప్తస్వరములని చెప్పబడును.

స్వరశబ్దార్థము:— స్వ = స్వయముగా, రం = రంజింపజేయు ధ్వనివిశేషమును స్వరమని చెప్పబడును. (శ్లో॥ స్వతోరంజయతి శ్రోతృ చిత్తంసుస్వరవుచ్యతే॥) సం. ర.

సప్తస్వరనామములు :— 1 షడ్జము; 2 రిషభము; 3 గాంధారము; 4 మధ్యమము; 5 పంచమము; 6 ధైవతము; 7 నిషాదములనునవి, సప్తస్వర నామములగును.

సప్తస్వర సంకేతాక్షరములు :— 1 స, 2 రి, 3 గ, 4 మ, 5 ప, 6 ధ, 7 ని అనునవి. వీటినే సప్తస్వర సంకేతాక్షరములని చెప్పబడును.

స్వరసప్తకము :— పైనదెలిపిన స, రి, గ, మ, ప, ధ, ని, అను 7 స్వరములకే "స్వరసప్తక" మని చెప్పబడును,

స్వర అష్టకము :— స్వరసప్తకమగు స, రి, గ, మ, ప, ధ, ని, కి తారషడ్జమును కూడ చేర్చిన యేర్పడు స, రి, గ, మ, ప, ధ, ని, ṡ అను 8 స్వరములకు "స్వరఅష్టక" మని చెప్పబడును.

పూర్వాంగము :— సప్తస్వరములగు స, రి, గ, మ, ప, ధ, ని, లోని మొదటి భాగమగు స, రి, గ, మ, ను పూర్వాంగమని చెప్పబడును. దీనినే ఇంగ్లీషులో లోవర్ టెట్రాకార్డ్స్ (Lower-Tetra chord) అని చెప్పుదురు.

ఉత్తరాంగము :— సప్తస్వరములగు స, రి, గ, మ, ప, ధ, ని, లోని రెండవ భాగమగు ప, ధ, ని, ని ఉత్తరాంగమని చెప్పబడును. దీనినే ఇంగ్లీషులో అప్పర్ టెట్రాకార్డ్ (Upper Tetra chord) అని చెప్పుదురు.

**ఆరోహణము**:—ఒకస్వరము ననుసరించి తక్కిన స్వరములు వరుసగా హెచ్చుధ్వని తో పోవుటను ఆరోహణమని చెప్పబడును. ఉ॥ స, రి, గ, మ, ప, ధ, ని స̇.

అవరోహణము :— ఒక స్వరము ననుసరించి తక్కిన స్వరములు వరుసగా తగ్గు ధ్వనితో పోవుటను అవరోహణమని చెప్పబడును. ఉ॥ స̇, ని, ధ, ప, మ, గ, రి, స.

ద్వాదశ స్వరములు :— సప్తస్వరములలో షడ్జ, పంచమములు తప్ప మిగత రిషభ, గాంధార, మధ్యమ, ధైవత, నిషాదములు శుద్ధ (ప్రకృతి) వికృతి భేదముల నొందుటచే యేర్పడు 12 స్వరములను "ద్వాదశస్వరము"లని చెప్పబడును. అవి ఏవనగా 1. షడ్జము, 2. శుద్ధరిషభము, 3. చతుశ్రుతిరిషభము, 4. సాధారణ గాంధారము, 5. అంతరగాంధారము, 6. శుద్ధమధ్యమము, 7. ప్రతిమధ్యమము, 8. పంచమము, 9. శుద్ధధైవతము, 10. చతుశ్రుతిధైవతము, 11. కైశికీనిషాదము, 12. కాకలీనిషాదములగును. ఈ 12 స్వరములను లేక 12 స్వరస్థానములను వీణాది వాద్యములందు గమనించిన స్పష్టముగా తెలియును.

షోడశ స్వరములు :—పైన దెలిపిన 12 స్వరములు లేక 12 స్వరస్థానములలో 3వ, చతుశ్రుతిరిషభస్థానమందు శుద్ధగాంధారమును, 4వ, సాధారణ గాంధార స్థానమందు షట్శ్రుతిరిషభమును, 10 వ, చతుశ్రుతి ధైవతస్థానమందు శుద్ధనిషాదమును. 11 వ, కైశికీనిషాదస్థానమందు షట్శ్రుతిధైవతమును పలుకుటచే మొత్తము 12+4=16 స్వరములగుచున్నవి. వీటినే షోడశస్వరములని చెప్పబడును. వాటివివరములు యీ క్రింది పథకమున గమనించునది.

షోడశస్వర, ద్వాదశ స్వరస్థానపథకము :—

| ద్వాదశ స్వర స్థానములసంఖ్య. | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| షోడశ స్వరములు. | షడ్జము | శు-రి | చ-రి శు-గ | ష-రి సా-గ | అం-గ | శు-మ | ప్ర-మ | పంచమము | శు-ధ | చ-ధ శు-ని | ష-ధ కై-ని | కా-ని |
| షోడశ స్వరసంఖ్య | 1 | 2 | 3-4 | 5-6 | 7 | 8 | 9 | 10 | 11 | 12-13 | 14-15 | 16 |

శుద్ధస్వరములు :—పైనదెలుపబడిన షోడశ స్వరములలో, నియమితములైన శ్రుతులతో కూడుకొనిన స్వరములను శుద్ధస్వరములనబడును. అవి 1. షడ్జము, 2. శు-రిషభము, 3. శు-గాంధారము, 4. శు-మధ్యమము, 5. పంచమము, 6. శు-ధైవతము, 7. శు-నిషాదములగును.

వికృత స్వరములు :- పైనదెలుపబడిన షోడశస్వరములలో నియమితములకు హెచ్చు, తగ్గులుగల శ్రుతులతో కూడుకొనిన స్వరములను వికృతస్వరములనబడును. అవి 1. చ- రిషభము 2. ష- రిషభము 3. సా- గాంధారము 4. అం- గాంధారము 5. ప్ర- మధ్యమము 6. చ- ధైవతము 7. ష- ధైవతము 8. కై- నిషాదము 9. కా- నిషాదము లగును.

వెంకటమఖి శుద్ధస్వర సంకేతములు :- పైన దెలిపిన 7 శుద్ధస్వరములకు వెంకట మఖివారు 1 స 2 ర 3 గ 4 మ 5 ప 6 ధ 7 న, యను సంకేతములను ప్రత్యేకముగా నేర్పఱచి యుండిరి. వీటినే వెంకటమఖి శుద్ధస్వర సంకేతము లనబడును.

వెంకటమఖి వికృతస్వర సంకేతములు :— పైన దెలుపబడిన 9 వికృత స్వరములకు వెంకటమఖివారు 1 రి 2 రు 3 గి 4 గు 5 మి 6 ధి 7 ధు 8 ని 9 ను, అను సంకేతములను ప్రత్యేకముగా నేర్పఱచియుండిరి. వీటినే వెంకట మఖి వికృత స్వరసంకేతములని చెప్పబడును.

కోమల స్వరములు :—ద్వాదశస్వరములనబడు 12 స్వరములలో 1 శు - రిషభ, 2 సా - గాంధార, 3 శు - మధ్యమ, 4 శు-ధైవత, 5 కై-నిషాదములను కోమల స్వరములని చెప్పబడును.

తీవ్ర స్వరములు :— ద్వాదశస్వరములగు 12 టిలో 1 చ- రిషభ, 2 అం- గాంధార, 3 ప్ర - మధ్యమ, 4 చ - ధైవత, 5 కా - నిషాదములను తీవ్రస్వరములని చెప్పబడును. ఈ కోమలస్వర, తీవ్రస్వరములను పేర్లను ముఖ్యముగా హిందూస్థానీ సంగీతమునందు వాడుదురు.

అల్పత్వ స్వరము :— ఏదైన ఒక రాగములో ఒక స్వరము అరుదుగా ప్రయోగింపబడినచో అట్టి స్వరమును అల్పత్వస్వరమని చెప్పబడును. ఉ॥ శ్రీరాగము. ఇందుగల సంచారములలో "పధని" అను విశేషసంచారమునందు గల "ధ" అను (చతుశ్రుతిధైవతము) స్వరము అరుదుగా ప్రయోగింపబడును. గనుక అట్టి దానిని "అల్పత్వస్వర" మని చెప్పబడును.

బహుత్వ స్వరము :— ఏదైన ఒక రాగములో ఒక స్వరము విశేషముగా ప్రయోగింపబడినచో అట్టి స్వరమును "బహుత్వస్వర" మని చెప్పబడును. ఉ॥ కానడ రాగము. ఇందుగల అవరోహణ సంచారములలో సాధారణగాంధారము బహు పర్యాయములు ప్రయోగింపబడుచున్నందున అట్టిదానిని "బహుత్వస్వర" మని చెప్పబడును.

దుర్బలస్వరము :— ఏదైన ఒక రాగములో ఒక స్వరము దుర్బలముగా పలుకుచున్నచో అట్టి స్వరమును "దుర్బలస్వర" మని చెప్పబడును. ఉ॥ ఆరభి రాగము. ఇందుగల అవరోహణ సంచారములలో "సాగరిసరి" అను సంచారము నందు పలుకు అంతరగాంధారము చాలాదుర్బలము( తేలిక )గా పలుకుచుండును. గనుక అట్టిస్వరమును "దుర్బలస్వర" మని చెప్పబడును.

## వాది, సంవాది, వివాది, అనువాది స్వరములవివరము.

వాదిస్వరము :— ఏదైన ఒక రాగములో జీవస్వరమువలె మాటిమాటికి ప్రయోగింపబడు స్వరమును వాది స్వరమని చెప్పబడును. దీనినే "అంశస్వర" మని కూడ చెప్పబడును. ఇది రాజును బోలునదిగా నుండును.

సంవాదిస్వరము :— ఏదైన ఒక రాగములో రెండు స్వరముల మధ్య 8 గాని లేక 12 గాని శ్రుతులు వున్నచో అట్టి రెండు స్వరములు పరస్పరము (ఒకదానికొకటి) సంవాదిస్వరము లగును. ఇది మంత్రిని బోలునదిగా నుండును.

శుద్ధస్వరములలోని సంవాదులు :— శుద్ధస్వరములగు 7 టిలో (షడ్జ – శు.మ) (షడ్జ – పంచమ) (శు.రి – శు.ధై) (శు.గాం – శు.ని స్వరములు శుద్ధస్వరములలోని సంవాదులగును.

వికృతస్వరములలోని సంవాదులు :– (సా.గాం–కై.ని) (అం.గాం–కా.ని) (చ.రి–ప్ర.మ) స్వరములు వికృతస్వరములలోని సంవాదులగును.

వివాది స్వరము :– ఏదైన ఒక రాగములో రెండుస్వరములమధ్య ఒకశ్రుతి యుండినచో అట్టి రెండుస్వరములు పరస్పరము (ఒకదానికొకటి) వివాదులగును. ఇది శత్రువును బోలునదిగా నుండును.

శుద్ధస్వరములలోని వివాదులు:– (శు.రి–శు.గాం)ములును, (శు.ధై–శు.ని)ములును, శుద్ధస్వరములలోని వివాదులగును.

వికృతస్వరములలోని వివాదులు:– (సా.గాం, లేక ష.రి–అం.గాం) ములును, (కై.ని, లేక ష.ధై–కా.ని) ములును వికృత స్వరములలోని వివాదులగును.

అనువాది స్వరము :– ఏదైన ఒకరాగములో వాది, సంవాది, వివాది స్వరములు కాని స్వరములను "అనువాది స్వరము"లని చెప్పబడును. ఇది భృత్యుని బోలునదిగా నుండును.

సంవాద ద్వయ :– షడ్జమునకు–శుద్ధమధ్యమమును, షడ్జమునకు–పంచమమును సంవాదులగుటచే యీ రెంటిని "సంవాదద్వయ" అని చెప్పబడును.

స్థాయివివరణము :- ద్వాదశ స్వరస్థానములు లేక షోడశస్వరములు గల ఒక భాగమునకు స్థాయి అని పేరు. అనగా షడ్జమునుండి దానికి పైనగల షడ్జమువఱకు స్థాయి అని పేరు. దీనినే ఇంగ్లీషులో "ఆక్టేవు" (octave) అని చెప్పుదురు.

త్రిస్థాయిలు:-పైనదెలిపిన స్థాయిలు ముఖ్యముగా 3 విధములుగా నున్నవి. అవి 1. మంద్రస్థాయి 2. మధ్యస్థాయి 3. తారస్థాయి అనునవి. కర్నాటక సంగీతములోగల సుప్రసిద్ధ రచనలన్నియు యీ త్రిస్థాయిలందే రచింపబడుటచేతను, గాత్రసంగీతము యీ త్రిస్థాయిలందు మాత్రమే పాడుటకు సాధ్యమగుటచేతను ముఖ్యముగా నీ త్రిస్థాయిలు మాత్రమే వాడుకలో యుండుటకు కారణమైనదని గ్రహించదగును.

పంచస్థాయిలు :- పైనదెలిపిన త్రిస్థాయిలుగాక వాటిలో మొదటిమంద్రస్థాయికి క్రింద, అను మంద్రస్థాయియును, మూడవతారస్థాయికిపైన, అతితారస్థాయియును వుండుటచే మొత్తము 3+2=5 స్థాయిలు యేర్పడినందున వాటిని పంచస్థాయిలని చెప్పబడుచున్నవి. వాటి వివరములను యీక్రింది పధకమున తెలియదగును.

## పంచస్థాయిలపధకము.




పైన చూపబడిన పంచస్థాయిలలో మొదటి అనుమంద్రస్థాయి స్వరములకు క్రింద రెండేసి చుక్క- (..) లును, రెండవమంద్రస్థాయి స్వరములకు క్రింద ఒకచుక్క (.) యును, మూడవ మధ్యస్థాయి స్వరములకు క్రిందగాని పైనగాని చుక్కలు లేకను, నాల్గవతారస్థాయి స్వరములకు పైన ఒకచుక్క- (.) యును, ఐదవ అతితార స్థాయిస్వరములకు పైన రెండేసి చుక్క- (..) లును గుర్తుగాయుండుట గమనించి సంగీత రచనలను గ్రంథములద్వారా పాఠముచేయునపుడు ఆయా స్వరములకు గల చుక్క-గురుతులను బట్టి స్వరసాహిత్యములను ఆయా స్థాయిలందు పాడుకొనుచూ అభ్య

సించవలెను. మరియు సంగీత రచనలను వ్రాయునపుడుకూడ యిదేపద్ధతి ననుసరించి ఆయా స్థాయిలందుగల స్వరములకు ఆయా చుక్కగుర్తులను పెట్టుచూ వ్రాయదగును.

ద్విగుణత్వము :- మధ్యస్థాయి షడ్జమునకును, తారస్థాయి షడ్జమునకును గల ధ్వనితారతమ్యమును "ద్విగుణత్వమని" చెప్పబడును.

## గ్రామ వివరము.

గ్రామము :- అనగా భారతీయ సంగీతమునకు ప్రాముఖ్యమైన సప్తస్వరముల కొలతను గ్రామమని చెప్పబడును. కొన్నికుటుంబములు చేరి ఒక గ్రామము యెట్లగునో, అట్లే కొన్నిస్వరములుచేరిన ఒక గ్రామమగును. సంగీతకళ అభివృద్ధి నొందినప్పటినుండి ఒకస్థాయిలోని యెక్కువస్వరములను పాడునట్టి సంగీతసామర్థ్యమును కనిపెట్టబడెను. ఆ తరువాత గ్రామము అనునది ఒక సంగీతకొలతగా నెంచి పాడుచూ వచ్చిరి. దీనిలో శుద్ధస్వరములు, వికృతస్వరములుగూడ యిమిడి వుండును. ప్రాచీన ప్రముఖ లక్షణకారుడైన మతంగుని కాలమునుండికూడా గ్రామమునకు యిదే అర్థమును చెప్పబడుచుండెను. ఇట్టిగ్రామములు మూడు విధము లగును. అవి (1) షడ్జగ్రామము. (2) మధ్యమగ్రామము (3) గాంధారగ్రామము లగును. వాటివివరములను యీ క్రింద దెలుపుట గమనించదగును.

1. షడ్జ గ్రామము :—ఈ షడ్జగ్రామము $4+3+2+4+4+3+2=22$ శ్రుతులను క్రమముగాపొందిన "సరిగమపధని" అను సప్తస్వరములు గలది యగుటచే నిది గానయోగ్యమైనదని చెప్పబడెను. ప్రాచీనలక్షణకారుడైన శ్రీరామామాత్యుడు అన్నిదేశీరాగములును యీ షడ్జగ్రామమునకు చెందినవే యని చెప్పియుండుట ముఖ్యముగా గమనించదగిన విషయమగును.

2. మధ్యమ గ్రామము :— ఈ మధ్యమగ్రామము షడ్జగ్రామమును బోలునదియైనను, యిందుగల పంచమము ఒక శ్రుతి మాత్రము తక్కువగానుండి $4+3+2+4+3+4+2=22$ శ్రుతులను క్రమముగాపొందిన సరిగమపధని"అను సప్తస్వరములు గలది యగుటచే గాన యోగ్యమైనదనే కొందరు లక్షణకారులు చెప్పియున్నను, మరికొందరు యిందుగల పంచమము ఒక శ్రుతి తక్కువగానున్నందున గానయోగ్యముకాదనే చెప్పియుండిరి. ఒక శ్రుతి తక్కువగానుండు యీ పంచమమునే చ్యుతపంచమమనియు, లఘుపంచమమనియు, కైశికీ పంచమమనియు, త్రిశ్రుతి పంచమమనియు చెప్పబడును.

3. గాంధార గ్రామము:— ఈ గాంధార గ్రామము 3+3+3+3+3+3+4=22 శ్రుతులను క్రమముగా పొందిన "సరిగమపధని" అను సప్తస్వరములు గలదియైనను, వికృతి స్వరములతో కూడుకొన్నదియగుటచే నిది గానయోగ్యము కాదని ప్రాచీనకాలమునందే వాడుకనుండి తొలగించినట్లు చెప్పబడెను. గనుకనే ఆదిగ్రంథమైన భరతుని "నాట్యశాస్త్రము"లో కూడా నీ గాంధార గ్రామము గురించి చెప్పక పోవుట జరిగెను. అయితే ఈ విధంగా గాంధార గ్రామము వాడుకయందు లేకపోయినను ప్రాచీన సంగీతచరిత్రము తెలిసికొనుటకై దానినికూడజేర్చి గ్రామత్రయ మూర్ఛనల వివరమును ఈ క్రింది పట్టికయందు తెలుపుటకు కారణమైనదని గ్రహించదగును.

గ్రామముయొక్క వివిధస్వరములను గ్రహ స్వరము ( Tonic Note ) లుగా తీసుకొను "మోడల్ షిఫ్టు" పద్ధతిని బట్టి యేర్పడు 7 కొలతలను 7 మూర్ఛనలని చెప్పబడును. ఈ విధంగా షడ్జ, మధ్యమగ్రామముల రెంటికి గల 7+7=14 (చతుర్దశ) మూర్ఛనలలో కొన్ని మరల వచ్చుటచే వీటిలో 7 మూర్ఛనలుమాత్రమే ముఖ్యమైనవని చెప్పబడెను. ఈ 7 డింటినే ప్రాచీనులు 7 జాతులు (రాగములు) గా చెప్పియుండిరి. మూర్ఛన అనునది ఆధునిక స్వచ్ఛరాగ భావమునకు సరిపోవునది యగును. ఈ మూర్ఛనలకు జీవస్వరములును, న్యాసస్వరములును చేరి రంజకమైన వ్యక్తిత్వము కలుగగానే యిదియొకజాతి (రాగము) గా పరిణమించినది. 18వ శతాబ్దము ఆరంభము వఱకును 72 మేళకర్తలుకూడ రాగములయొక్క స్థానమునకు చేరవనియే యనుకొనెడివారు. కాని సంగీత త్రిమూర్తులగు శ్రీ త్యాగరాజ, దీక్షిత, శ్యామశాస్త్రిలవంటి సుప్రసిద్ధ సంగీత రచయితలు యీ మేళకర్తలలో రచించిన అపూర్వమైన సంగీత రచనలచే కర్నాటక సంగీతములో 72 మేళకర్తలకు గల విలువ ధృవపడిపోయినది.

సప్తశుద్ధ జాతులు :— పైన తెలుపబడిన 7 జాతులనే సప్తశుద్ధ జాతులని చెప్పబడును. అవి ఏవనగా 1. షాడ్జి, 2. నైషాది, 3. ధైవతి, 4. ఆర్షభి, 5. గాంధారి 6. మధ్యమ, 7. పంచమ అనునవి. వీటిలో మొదటి నాలుగు (1, 2, 3, 4) జాతులును షడ్జగ్రామమునకును, రెండవ మూడు (5, 6, 7) జాతులును మధ్యమ గ్రామమునకును చెందినవిగా ప్రాచీన లక్షణకారులు చెప్పియున్నారు. ఈ యేడింటిని కచ్చేరీలందుపయోగించుటకలదు. వీటితరువాత కనుగొనబడిన త్వరితగతిని నడచు కొలతలను కూడ జాతులనే చెప్పబడెను. తరువాత మతంగుడు వీటిని శుద్ధ, ఛాయాలగ, సంకీర్ణ రాగములుగా విభజించి, యిప్పటి జనక, జన్యరాగపద్ధతికి మార్గము నేర్పఱచెను.

గ్రామత్రయ మూర్ఛనలు :- షడ్జగ్రామము, మధ్యమగ్రామము, గాంధార గ్రామములను, వాటి మూర్ఛనల పేర్లను, వాటి ప్రథమస్వరములను యీ దిగువ కనుపఱచిన పట్టికయందు జూపుట గమనించదగును.

| 1. షడ్జగ్రామమూర్ఛనల పేర్లు. | | | 2. మధ్యమగ్రామమూర్ఛనల పేర్లు. | | | 3. గాంధారగ్రామమూర్ఛనల పేర్లు. | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 ఉత్తరమంద్రము–స | | (స నుండి స వఱకు) | 1 సౌవీరము | మ | (మ నుండి మ వఱకు) | 1 నందా * | గ | (గ నుండి గ వఱకు) |
| 2 రజని * | ని | (ని ,, ని ,, ) | 2 హారిణాశ్వము | గ | (గ ,, గ ,, ) | 2 విశాల | రి | (రి ,, రి ,, ) |
| 3 ఉత్తరాయతము | ధ | (ధ ,, ధ ,, ) | 3 కలోపనతము | రి | (రి ,, రి ,, ) | 3 సుముఖి | స | (స ,, స ,, ) |
| 4 శుద్ధషడ్జము | ప | (ప ,, ప ,, ) | 4 శుద్ధమధ్యము | స | (స ,, స ,, ) | 4 విచిత్రము | ని | (ని ,, ని ,, ) |
| 5 మత్సరికృతము | మ | (మ ,, మ ,, ) | 5 మార్గి | ని | (ని ,, ని ,, ) | 5 రోహిణి | ధ | (ధ ,, ధ ,, ) |
| 6 అశ్వక్రాంతము | గ | (గ ,, గ ,, ) | 6 పౌరవి | ధ | (ధ ,, ధ ,, ) | 6 సుఖ | ప | (ప ,, ప ,, ) |
| 7 అభిరుద్గతము | రి | (రి ,, రి ,, ) | 7 హృష్యకము | ప | (ప ,, ప ,, ) | 7 ఆలాపము | మ | (మ ,, మ ,, ) |

పైన దెలుపబడిన 21 మూర్ఛనలలో రజని, ని, రంజని అనియు, నందా, న, సంరా యనియు నారదుడు తన సంగీతమకరంద గ్రంథములో చెప్పియుండెను. పై మూర్ఛనల యొక్క ప్రథమస్వరములు అవరోహణ క్రమముగా నుండుట ముఖ్యముగా గమనించవగును.

షడ్జగ్రామ స్వర నిష్పత్తులు :— ఒక సెకండుకు మధ్యస్థాయి షడ్జముయొక్క వేపనసంఖ్య 240 గా నేర్పఱచుకొనినచో షడ్జ గ్రామము (ఖరహరప్రియ) యొక్క స్వరనిష్పత్తులీక్రింది విధముగా నుండునని గమనించదగును.

| స | రి | గ | మ | ప | ధ | ని | స |
|---|---|---|---|---|---|---|---|
| 1 | $\frac{10}{9}$ | $\frac{32}{27}$ | $\frac{4}{3}$ | $\frac{3}{2}$ | $\frac{5}{3}$ | | 2 |

ఈ విధముగా నుండునని గ్రహించునది.

సామగాన స్వరనిష్పత్తులు:—ఇవియు షడ్జగ్రామము (ఖరహరప్రియరాగము) యొక్క స్వరనిష్పత్తులనే గలిగియుండునని గ్రహించునది.

మిక్కిలి పురాతనకాలములో ఋగ్వేదమును సాధారణంగా ఒకే శైలియగు స్వరిత (స) లో పాడుచుండెడివారు. కాని ఆ తరువాత ఉదాత్త (రి) అనుదాత్త (ని) స్వరములనుచేర్చి పాడుచుండెడి వారు. ఈ విధంగా ఋగ్వేదగానంలో ప్రారంభమైన ఏకస్వరకాలత రి స ని, అను త్రిస్వరకాలతగాను ఆ తరువాత గ రి స ని ధ, అను పంచ స్వర కాలతగాను ఆ తరువాత మ గ రి స ని ధ ప అను సప్తస్వరకాలతగాను వృద్ధి చేయుబడినది. ఈ విధంగాయేర్పడిన సంపూర్ణకాలతయగు యీ మ గ రి స-స ని ధ ప లో స ని ధ ప అను భాగమును హెచ్చుస్థాయినుండి పాడినపుడు అదిఒక సంపూర్ణమైన స్థాయి (అష్టేవు) గా యేర్పడును. భారతీయ సంగీతచరిత్రలో యీ స్థాయిని కనిపెట్టిన పద్ధతి అతిముఖ్యమైనదనియు, అప్పటినుండే సంగీతకళ యదార్థముగా ప్రారంభమైన దనియు చెప్పవచ్చును. ఋగ్వేదములో కూడ యీ స్థాయిలు మూడు విధములనియు అవి ఒకదానికంటె మరియొకటి హెచ్చుస్థాయిలో పాడదగుననియు చెప్పియుండుటచే యీ త్రిస్థాయి పద్ధతి షుమారు మూడువేల సంవత్సరములక్రిందటనే ఆమోదింప బడినట్లు మనకు స్పష్టమగుచున్నది.

స్వరితస్వరము :— ఋగ్వేదగానములో పలుకు మధ్యస్వరమగు 'స' ను స్వరిత స్వరమని చెప్పబడును.

ఉదాత్తస్వరము :— ఋగ్వేదగానములో పలుకు హెచ్చుస్వరమగు 'రి' ని ఉదాత్తస్వరమని చెప్పబడును.

అనుదాత్త స్వరము:— ఋగ్వేదగానములో పలుకు తగ్గుస్వరమగు 'ని' ని అనుదాత్త స్వరమని చెప్పబడును.

స్వరసంఖ్యనుబట్టి రాగములకేర్పడిన పేర్లు :— పైన దెలిపినటుల క్రమంగా అభివృద్ధి చేయబడిన సప్తస్వరములందలి కాలతలకు యీ క్రిందిపేర్లు నేర్పఱచియుండుట గ్రహించునది. 1 స్వరముగలది ఆర్చిక యనియు 2 స్వరములుగలది గాతిక, యనియు, 3 స్వరములు గలది సామికయనియు, 4 స్వరములుగలది స్వరాంతర యనియు, 5 స్వరములు గలది ఔడవ, యనియు, 6 స్వరములుగలది షాడవ యనియు 7 స్వరములుగలది సంపూర్ణమనియు చెప్పబడును. వాటి వివరములు ముందుదెలుపుట గమనించదగును.

## జనక రాగ వివరము.

రాగము :— స్వరవర్ణములచే అలంకరింపబడి వినువారిచిత్తమును రంజింప చేయు ధ్వని విశేషమును రాగమని చెప్పబడును. ఇట్టి రాగములు ముఖ్యముగా 72 అగును.

వీటినే జనకరాగములనియు, మేళకర్తరాగములనియు, ముఖ్యరాగములనియు, రూట్ రాగములనియు చెప్పబడును. వాటి వివరముల నీక్రింద దెలుపుట గమనించదగును.

**72 మేళకర్తరాగస్కీము**:— సప్తస్వరములయొక్క శుద్ధ, వికృతిభేదములచే యేర్పడు షోడశస్వరముల ప్రస్తారముచే మేళకర్తలు 72 గా నేర్పడుచున్నవి. ఎటులనగా? సప్తస్వరములగు, సరిగమపధని, లో మొదటిభాగమైన, సరిగమ, ను పూర్వాంగమనియు, రెండవభాగమైన, పధని, అనునది ఉత్తరాంగమనియు చెప్పబడును. పూర్వాంగములోని శుద్ధస్వరములగు షడ్జ, _ శు _ రిషభ, _ శు _ గాం, _ శు _ మధ్యమములను ఉత్తరాంగములోని శుద్ధ స్వరములగు పంచమ, శు _ ధై, _ శు_ నిషాదములతో ప్రస్తరించిన యేర్పడునది మొదటి మేళకర్తరాగమగును. ఇదేవిధముగా పైన దెలిపిన పూర్వాంగములోనిశుద్ధస్వరములను ఉత్తరాంగ శుద్ధ, వికృతి స్వరములచే వరుసగా ప్రస్తరించినచో 6 మేళకర్తలు యేర్పడుట నీక్రింద గమనించునది.

| పూర్వాంగస్వరభేదములు. | | | | ఉత్తరాంగ స్వరభేదములు. | | | |
|---|---|---|---|---|---|---|---|
| (1) షడ్జ-శు. | రి_శు. | గాం_శు. | మ-లను— | పం_శు.ధై-శు. ని-తో | ప్రస్తరించిన | 1వ | మే॥ |
| (2) ,, | ,, | ,, | ,, | ,,—,, శు.ధై_కై.ని_తో | ,, | 2వ | ,, |
| (3) ,, | ,, | ,, | ,, | ,,—,, శు.ధై-కా.ని_తో | ,, | 3వ | ,, |
| (4) ,, | ,, | ,, | ,, | ,,—,, చ_ధై_కై_ని-తో | ,, | 4వ | ,, |
| (5) ,, | ,, | ,, | ,, | ,,—,, చ.ధై_కా.ని_తో | ,, | 5వ | ,, |
| (6) ,, | ,, | ,, | ,, | ,,—,, ష.ధై_కా.ని_తో | ,, | 6వ | ,, |

యేర్పడును. ఇదేవిధముగా.

2వ పూర్వాంగస్వరభేధములగు షడ్జ-, శు-రి,-సా_గాం_, శు_మ_లను, ఉత్తరాంగస్వర భేదములతో ప్రస్తరించిన _ 6 మే॥

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 3వ | ,, | ,, | షడ్జ-శు.రి_,అం.గా_,శు_మ_, ములను | ,, | ,, | 6 మే॥ |
| 4వ | ,, | ,, | షడ్జ-చ.రి_,సా-గాం_, శు_మ_, ములను | ,, | ,, | 6 మే॥ |
| 5వ | ,, | ,, | షడ్జ,చ_రి,అం_గాం, _శు_మ_, ములను | ,, | ,, | 6 మే॥ |
| 6వ | ,, | ,, | షడ్జ, ష_రి,అం_గాం_,శు_మ_, ములను | ,, | ,, | 6 మే॥ |

యేర్పడుచున్నవి. అనగా $6 \times 6 = 36$ మేళకర్తలు యేర్పడుచున్నవి. వీటినే శుద్ధ మధ్యమ మేళకర్తలని చెప్పబడును. వీటిని మరల ప్రతిమధ్యమముతో ప్రస్తరించిన మరియొక 36 మేళకర్తలు యేర్పడి మొత్తము $36 + 36 = 72$ మేళకర్తలగుటయు అవి 12 చక్రములుగా విభజింపబడుటయు యీక్రింది పథకమున గమనించదగును.

# 72 మేళకర్తల పథకము.

| మేళ సంఖ్యలు | పూర్వమేళకర్తలు లేక శుద్ధమధ్యమ మేళకర్తలు. (1 - 36) శ్రీ గోవిందాచారి పెట్టిన నామములు. | శ్రీ వెంకటమఖి * పెట్టిన నామములు. | మేళకర్తల స్వరములు. షడ్జ - రి - గాం - మ - పం - ధై - ని. |
|---|---|---|---|
| | 1. ఇందు - చక్రము | | |
| 1 | కనకాంగి | కనకాంబరి | ష - శు - శు - శు - పం - శు - శు |
| 2 | రత్నాంగి | ఫేనద్యుతి | ,, - ,, - ,, - ,, - ,, - శు - కై |
| 3 | గానమూర్తి | గానసామవరాళి | ,, - ,, - ,, - ,, - ,, - శు - కా |
| 4 | వనస్పతి | భానుమతి | ,, - ,, - ,, - ,, - ,, - చ - కై |
| 5 | మానవతి | మనోరంజని | ,, - ,, - ,, - ,, - ,, - చ - కా |
| 6 | తానరూపి | తనుకీర్తి | ,, - ,, - ,, - ,, - ,, - ష - కా |
| | 2. నేత్ర - చక్రము | | |
| 7 | సేనావతి | సేనాగ్రణి | ష - శు - సా - శు - పం - శు - శు |
| 8 | హనుమతోడి | జనతోడి | ,, - ,, - ,, - ,, - ,, - శు - కై |
| 9 | ధేనుక | ధునిభిన్నషడ్జము | ,, - ,, - ,, - ,, - ,, - శు - కా |
| 10 | నాటకప్రియ | నటాభరణము | ,, - ,, - ,, - ,, - ,, - చ - కై |
| 11 | కోకిలప్రియ | కోకిలారవము | ,, - ,, - ,, - ,, - ,, - చ - కా |
| 12 | రూపవతి | రూపవతి | ,, - ,, - ,, - ,, - ,, - ష - కా |
| | 3. అగ్ని - చక్రము. | | |
| 13 | గాయకప్రియ | గేయహెజ్జజ్జి | ష - శు - అం - శు - పం - శు - శు |
| 14 | వకుళాభరణము | వాటివసంతభైరవి | ,, - ,, - ,, - ,, - ,, - శు - కై |
| 15 | మాయామాళవగౌళ | మాయామాళవగౌళ | ,, - ,, - ,, - ,, - ,, - శు - కా |
| 16 | చక్రవాకము $ | తోయవేగవాహిని | ,, - ,, - ,, - ,, - ,, - చ - కై |
| 17 | సూర్యకాంతము | ఛాయావతి | ,, - ,, - ,, - ,, - ,, - చ - కా |
| 18 | హాటకాంబరి | జయశుద్ధమాళవి | ,, - ,, - ,, - ,, - ,, - ష - కా |
| | 4. వేద - చక్రము. | | |
| 19 | ఝుంకారధ్వని | ఝుంకారభ్రమరి | ష - చ - సా - శు - పం - శు - శు |
| 20 | నఠభైరవి | నారీరీతిగౌళ | ,, - ,, - ,, - ,, ,, - శు - |
| 21 | కీరవాణి | కిరణావళి | ,, - ,, - ,, - ,, - ,, - శు - కా |
| 22 | ఖరహరప్రియ | శ్రీరాగము | ,, - ,, - ,, - ,, - ,, - చ - కై |
| 23 | గౌరీమనోహరి | గౌరీవేళావళి | ,, - ,, - ,, - ,, - ,, - చ - కా |
| 24 | వరుణప్రియ | వీరవసంతము | ,, - ,, - ,, - ,, - ,, - ష - కా |

| సంఖ్య | పూర్వమేళకర్తలు లేక శుద్ధమధ్యమ మేళకర్తలు. | | మేళకర్తల స్వరములు. |
|---|---|---|---|
| | శ్రీ గోవిందాచారి పెట్టిన నామములు. | శ్రీ వెంకటమఖి * పెట్టిన నామములు. | షడ్జ-రి-గాం-మ-పం-ధై-ని. |
| | 5. బాణ-చక్రము. | | |
| 25 | మారరంజని | శరావతి | ష-చ-అం-శు-పం-శు-శు |
| 26 | చారుకేశి | తరంగిణి | ,, - ,, - ,, - ,, - ,, - శు - కై |
| 27 | సరసాంగి | సౌరసేన | ,, - ,, - ,, - ,, - ,, - శు - కా |
| 28 | హరికాంభోజి | హరికేదారగౌళ | ,, - ,, - ,, - ,, - ,, - చ - కై |
| 29 | ధీరశంకరాభరణము | ధీరశంకరాభరణము | ,, - ,, - ,, - ,, - ,, - చ - కా |
| 30 | నాగానందిని | నాగాభరణము | ,, - ,, - ,, - ,, - ,, - ష - కా |
| | 6. ఋతు-చక్రము. | | |
| 31 | యాగప్రియ | కలావతి | ష-ష-అం-శు-పం-శు-శు |
| 32 | రాగవర్ధని | రాగచూడామణి | ,, - ,, - ,, - ,, - ,, - శు - కై |
| 33 | గాంగేయభూషణి | గంగాతరంగిణి | ,, - ,, - ,, - ,, - ,, - శు - కా |
| 34 | వాగధీశ్వరి | భోగచ్ఛాయానాట | ,, - ,, - ,, - ,, - ,, - చ - కై |
| 35 | శూలిని | శైలదేశాక్షి | ,, - ,, - ,, - ,, - ,, - చ - కా |
| 36 | చలనాట | చలనాట | ,, - ,, - ,, - ,, - ,, - ష - కా |
| | ఉత్తరమేళకర్తలు లేక ప్రతిమధ్యమ మేళకర్తలు 7. ఋషి-చక్రము. (37-72) | | |
| 37 | సాలగము | సౌగంధిని | ష-శు-శు-ప్ర-పం-శు-శు |
| 38 | జలార్ణవము | జగన్మోహనము | ,, - ,, - ,, - ,, - ,, - శు - కై |
| 39 | ఝాలవరాళి | ధాలివరాళి | ,, - ,, - ,, - ,, - ,, - శు - కా |
| 40 | నవనీతము | నభోమణి | ,, - ,, - ,, - ,, - ,, - చ - కై |
| 41 | పావని | కుంభిని | ,, - ,, - ,, - ,, - ,, - చ - కా |
| 42 | రఘుప్రియ | రవిక్రియ | ,, - ,, - ,, - ,, - ,, - ష - కా |
| | 8. వసు-చక్రము, | | |
| 43 | గవాంబోధి | గీర్వాణి | ష-శు-సా-ప్ర-పం-శు-శు |
| 44 | భవప్రియ | భవాని | ,, - ,, - ,, - ,, - ,, - శు - కై |
| 45 | శుభపంతువరాళి | శివపంతువరాళి | ,, - ,, - ,, - ,, - ,, - శు - కా |
| 46 | షడ్విధమార్గిణి | స్తవరాజము | ,, - ,, - ,, - ,, - ,, - చ - కై |
| 47 | సువర్ణాంగి | సౌవీరము | ,, - ,, - ,, - ,, - ,, - చ - కా |
| 48 | దివ్యమణి ‡ | జీవంతిని | ,, - ,, - ,, - ,, - ,, - ష - కా |

| మేళసంఖ్య | ఉత్తరమేళకర్తలు లేక ప్రతిమధ్యమ మేళకర్తలు, | | మేళకర్తల స్వరములు. |
|---|---|---|---|
| | శ్రీ గోవిందాచారి పెట్టిన నామములు. | శ్రీ వెంకటమఖి * పెట్టిన నామములు. | షడ్జ- రి- గాం- మ- పం- ధై- ని. |
| | 9. వ బ్రహ్మ - చక్రము. | | |
| 49 | ధవళాంబరి | ధవళాంగము | ష-శు-అం-ప్ర - పం -శు - శు |
| 50 | నామనారాయణి | నామదేశి | ,,-,,- ,, - ,, - ,, -శు - కై |
| 51 | కామవర్ధని | కాశిరామక్రియ | ,,-,,- ,, - ,, - ,, -శు - కా |
| 52 | రామప్రియ | రమామనోహరి | ,,-,,- ,, - ,, - ,, -చ - కై |
| 53 | గమనశ్రమ | గమకక్రియ | ,,-,,- ,, - ,, - ,, -చ - కా |
| 54 | విశ్వంబరి $ | వంశవతి | ,,-,,- ,, - ,, - ,, -ష - కా |
| | 10. దిశి - చక్రము. | | |
| 55 | శ్యామళాంగి | శ్యామళ | ష - చ -సా - ప్ర -పం-శు - శు |
| 56 | షణ్ముఖప్రియ | చామరము | ,, - ,, - ,, - ,, -,, -శు - కై |
| 57 | సింహేంద్రమధ్యమము | సుమద్యుతి | ,, - ,, - ,, - ,, -,, - శు-కా |
| 58 | హేమవతి | దేశిసింహారవము | ,, - ,, - ,, - ,, -,, - చ-కై |
| 59 | ధర్మవతి | ధామవతి | ,, - ,, - ,, - ,, -,, - చ-కా |
| 60 | నీతిమతి | నిషధము | ,, - ,, - ,, - ,, -,, - ష-కా |
| | 11. రుద్ర - చక్రము. | | |
| 61 | కాంతామణి | కుంతలము | ష-చ-అం-ప్ర - పం - శు - శు |
| 62 | ఋషభప్రియ $ | రతిప్రియ | ,,-,,- ,, - ,, - ,, - శు - కై |
| 63 | లతాంగి | గీతప్రియ | ,,-,,- ,, - ,, - ,, - శు - కా |
| 64 | వాచస్పతి | భూషావతి | ,,-,,- ,, - ,, - ,, - చ - కై |
| 65 | మేచకల్యాణి | శాంతకళ్యాణి | ,,-,,- ,, - ,, - ,, - చ - కా |
| 66 | చిత్రాంబరి $ | చతురంగిణి | ,,-,,- ,, - ,, - ,, - ష - కా |
| | 12. ఆదిత్య - చక్రము. | | |
| 67 | సుచరిత్ర | సంతానమంజరి | ష -ష-అం -ప్ర-పం - శు - శు |
| 68 | జ్యోతిస్స్వరూపిణి | జోతిరాగము | ,, -,, - ,, -,,- ,, - శు - కై |
| 69 | ధాతువర్ధని | ధౌతపంచమము | ,, -,, - ,, -,,- ,, - శు - కా |
| 70 | నాసికాభూషణి | నాసామణి | ,, -,, - ,, -,,- ,, - చ - కై |
| 71 | కోసలము | కుసుమాకరము | ,, -,, - ,, -,,- ,, - చ - కా |
| 72 | రసికప్రియ | రసమంజరి | ,, -,, - ,, -,,- ,, - ష - కా |

$ ఈగురుతుగల మేళములు కటపయాది సంఖ్యలకు విరోధముగా నున్నవగును.

పైన దెలిపినపూర్వ, ఉత్తరమేళములగు 72 ను, షడ్జ, పంచమములందు ధ్వని భేదమునొందక యెల్లప్పుడును ఒకేధ్వనితో అన్నిరాగములకు సమముగా నుండును. 72 మేళకర్తలలో 1 మొదలు 36 వరకు శుద్ధమధ్యమమును, 37 మొదలు 72 వరకు ప్రతిమధ్యమము నుండుటచే, మ, అనుస్వరము 72 మేళకర్తలను రెండుసమభాగములుగా విభజించుచున్నదని చెప్పుటకు కారణమైనది. మేళకర్తరాగ స్కీము (ప్రణాళిక) ననుసరించి మేళకర్తలు 72 మాత్రమే గలవనుటకు మాతృకయందుగల 51 అక్షరములు కంటె నధికముగ జేయుట నెటుల శక్యముగాదో, యటులనే మేళకర్తలు 72 కంటె నధికముగా గాని, తక్కువగా గాని జేయుట నుదుట కన్నులుగల పరమేశ్వరునికైనను సాధ్యముగాదని శ్రీ వెంకటమఖి చెప్పియుండుట ముఖ్యముగా గమనించదగిన విషయమగును. శ్లో॥ తస్మాద్వ్యేక పంచాశ (చతుర్దండి ప్రకాశిక.)

## కనకాంబరి మొదలగు 72 మేళకర్తల పేర్లను గురించిన ప్రతీతి.

పై పథకమునందు దెలిపిన 72 మేళకర్తలపేర్లను శ్రీ వెంకటమఖివారు తానే కల్పించితిననియు ఆకాలమున మిక్కిలి ప్రసిద్ధములగు 20 మేళములలో కొన్నిటిని తనమేళములతో జేర్చవలెనను కోరికతో ప్రాచీనమైన మాళవగౌళ, శంకరాభరణము నాట, మొదలగు మేళములను జేర్చుకొని "కటపయాది" సూత్రమునకు సరిపడు నటుల పై మూడుమేళముల పేర్లకు ముంగు రెండేసి అక్షరములను అనగా మాయా మాళవగౌళ, ధీర శంకరాభరణము, చలనాట యిటుల జేర్చితిననియు చెప్పియున్నారు. కాని యీ 72 మేళకర్తలకు యివ్వబడిన కనకాంబరి, ఫేనద్యుతి, గానసామవరాళి, మొదలగుపేర్లు శ్రీ వెంకటమఖివారు గాక ఆయనవంశీయులలో నొకరైన శ్రీముద్దు వెంకటమఖివారు యేర్పఱచినట్లు ఒక ప్రతీతిమాత్రముగలదు. అయితే ఈకాలములో సాధారణముగా వాడుకలోనున్న కనకాంగి, రత్నాంగి, గానమూర్తి, మొదలగు 72 పేర్లను మాత్రము పూర్వీకులగు శ్రీ గోవిందాచారిగారే యేర్పఱచినట్లు మనకు రూఢిగా తెలియుచున్నది.

## మాయామాళవగౌళరాగముయొక్క ప్రాముఖ్యము.

పైన దెలిపబడిన 72 మేళకర్తరాగములును ప్రాముఖ్యమైనవిగా వాడుచున్నను వీనిలో 15 వ, మేళకర్తయగు మాయామాళవగౌళరాగమునందే ప్రథమాభ్యాసమున కనువగు స్వరావళ్యాదులను పూర్వాచార్యు లేర్పఱచుటకు తగిన కారణము ఈక్రింద దెలుపబడినముఖ్య విషయములేయని గమనింపదగును.

(1) సప్తస్వరములందుగల మధ్యమభేదములలో శ్రేష్టముగ నెంచబడు శుద్ధ మధ్యమము యీ 15 వ మేళకర్తయగు మాయామాళవగౌళరాగమునందుండుటవలనను,

(2) ఈరాగమునగల రిషభ, గాంధార, ధైవత, నిషాదములు, శుద్ధ, వికృతము లనెడి రెండు విధములగు స్వరభేదముల నొందియుండుట వలనను,

(3) అట్లుండుటలో రిషభ, ధైవతములు తక్కువ ధ్వనిగల శుద్ధస్వరములుగను, గాంధార, నిషాదములు హెచ్చైన ధ్వనిగల వికృతస్వరములుగా నుండుటవలనను,

(4) పైన దెల్పినవిధమున శుద్ధ వికృతములనబడు తగ్గు, హెచ్చుధ్వనులుగల స్వరములు రెండును అభ్యాసకులకు మొట్టమొదట పట్టుబడిన యెడల మిగత అన్ని మేళకర్తరాగములందలి స్వరభేదములు గూడ సులభముగా పట్టుబడును గనుకను,

(5) మరియు స్వరస్థానములు పదిరెండగుటచే నీ రాగమునందు ప్రథమస్థానమున మధ్యషడ్జమును, ద్వితీయస్థానమున శుద్ధ రిషభమును, పంచమస్థానమున అంతర గాంధారమును, షట్ స్థానమున శుద్ధమధ్యమమును, అష్టమస్థానమున మధ్యపంచమమును, నవస్థానమున శుద్ధధైవతమును, ద్వాదశస్థానమున కాకలీ నిషాదమును, మరియు త్రయోదశస్థానమున తారషడ్జమును పుట్టుటవలన షడ్జమునకు శుద్ధరిషభమును, అంతరగాంధారమునకు శుద్ధమధ్యమమును, పంచమమునకు శుద్ధధైవతమును కాకలీనిషాదమునకు తారషడ్జమును అంటియున్నటువంటి మీది స్వరస్థానములుగా యేర్పడియున్నందున విద్యార్థులు అభ్యసించుటకు సులభముగానుండును గనుకను,

(6) పూర్వాచార్యులు నాశనములేని శుద్ధవికృతిస్వరములుగల మేళకర్తరాగము మంగళకర మనిచెప్పియుండుట వలనను, యీ మాయామాళవగౌళరాగము శ్రేష్టముగా నెంచి ప్రథమాభ్యాసమునం దుపయోగించెడి స్వరావళ్యాదుల నీ మాయామాళవ గౌళరాగమునందే యేర్పఱచుటకు కారణమైనదని గ్రహించునది.

## కటపయాది సూత్రవివరము.

పైన దెలుపబడిన 72 మేళకర్తలయొక్క పేర్ల ననుసరించి ఆయా మేళకర్తల సంఖ్యల నెరుగుటకై సూత్రముగ పూర్వాచార్యులు యేర్పఱచిన గణితశాస్త్రమునకు "కటపయాది" సూత్రమని పేరు. ఈసూత్రమువలన మేళకర్తలయొక్క సంఖ్యలను సులభముగా నెఱుగువిధము నీక్రింది పథకమునందు గమనించదగును.

## కటపయాది సంఖ్యాపథకము.

| కటపయాదిసంఖ్యలు. | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 0 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కాది నవకము. | క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ |
| టాది నవకము. | ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న |
| పాది పంచకము. | ప | ఫ | బ | భ | మ | | | | | |
| యాద్యష్టకము. | య | ర | ల | వ | శ | ష | స | హ | | |

పైన దెలిపిన కటపయాదిసంఖ్యలను గుర్తించునపుడు "అంకానాం వామతోగతిః" యనెడి సూర్యసిద్ధాంతానుసారము క్రిందనుండి ఏక, దశస్థానములు పైకొనుచు మేళ సంఖ్య నిర్ణయింపదగును. ఉదా:—మాయామాళవగౌళ, ఇందు మొదటి "మా" యను అక్షరము పాదిపంచకములో 5, వ, అంకెకు సరియగును. రెండవ "య" అను అక్షరము యాద్యష్టకములో 1 వ, అంకెకు సరియగును. గనుక మొదటి 5 వ, అంకె ఏక స్థానమునను, రెండవ 1 వ, అంకె దశస్థానమునందును వేసిన మాయామాళవగౌళ 15వ, సంఖ్య యగును. ఇటుల 72 మేళములసంఖ్యలను కనుగొనుటలో *సంయుక్తాక్షరములుగల మేళసంఖ్య నిర్ణయించునపుడు యీ క్రిందివిషయమును గమనింపవలెను.

ఉదా:—షణ్ముఖప్రియ. ఇందు మొదటి 'ష' యను అక్షరము యాద్యష్టకములో 6వ అంకెకుసరియగును. రెండవ ణ్ము, అను సంయుక్తాక్షరములో, 'ణు' యను హల్లునువదలి మకారమునే లెక్కించిన'మ'యనునది పాదిపంచకములో 5వ అంకెకుసరియగును. గనుక మొదటి 6 ను, ఏకస్థానమునను, రెండవ 5 ను, దశస్థానమునను బెట్టిన 56అగును. ఈరీతిగా తక్కినయన్ని మేళముల సంఖ్యల నెఱుగదగును. పైపథకమునందు జూపిన ఞ, న, యనెడి యక్షరములు వచ్చినపుడు వానిఅంకె సున్న (౦) యగుటచే నది దశస్థానమందున్నను లెక్కకు రానటుల దెలియదగును. ఉదా:—గానమూర్తి. ఇందు మొదటి 'గా'అనుఅక్షరము, కాదినవకము, లో 3వ,అంకెకుసరియగుటచే ఏకస్థానమునను, రెండవ, న, యను అక్షరము (౦) సున్న యగుటచే దశస్థానమునను యుంచిన '03' యగును. సంఖ్యకు ముందుగల సున్నకు విలువలేదు గావున, గానమూర్తి 3 వ, మేళమగును. ఇటులనే తక్కిన మేళములసంఖ్యలన్నిటిని యూహించునది. అయితే యీకాలమున వాడు72 మేళకర్తలలో 5 మేళకర్తలను మాత్రము, కటపయాది, గణితశాస్త్రమునకు వ్యతిరేకముగా సంయుక్తాక్షరములోని మొదటి హల్లునే లెక్కించుటయును, ఋ, అనుప్రాణాక్షరమును, రి, అను ప్రాణాక్షరముగా నెంచి లెక్కించుటయును ఈ క్రింద దెలుపు4+1=5 మేళకర్త రాగముల సంఖ్యలద్వారా గుర్తెఱుంగునది.

1 చక్రవాకము గణితశాస్త్రరీత్యా 26 వ, మేళమగుచున్నను 16 వ, మేళముగను...
2 దివ్యమణి ... ,, 18 వ, ,, 48 వ,
3 విశ్వంభరి ... ,, 44 వ, ,, 50 వ, ...
4 చిత్రాంబరి ... ,, 26 వ, ,, 66 వ, ,,
5 ఋషభప్రియ ... ,, 60 వ, ,, 62 వ, మేళముగను

లెక్కించుచున్నారు. కావున యిప్పటికాలమున వాడు 72 మేళములలో పై 5 మేళములుగాక మిగత 67 మేళములే కటపయాదివిధులను సరిగా ననుసరించుచున్నవి.

పూర్వ మేళ కర్తలు ;—72 మేళకర్తలలో 1 నుండి 36 వరకుగల 36 మేళకర్తలను పూర్వమేళకర్తలని చెప్పబడును. వీటినే శుద్ధమధ్యమ మేళకర్తలనబడును.

ఉత్తర మేళ కర్తలు:—72 మేళకర్తలలో 37 నుండి 72 వరకుగల 36 మేళకర్తలను ఉత్తరమేళకర్తలని చెప్పబడును. వీటినే ప్రతిమధ్యమ మేళకర్తలనబడును.

కల్పిత మేళ కర్తలు :— శ్రీ వెంకటమఖికి పూర్వము వాడుకలోనుండి కొందరిచే 19 మేళకర్తలనియు, మరికొందరిచే 20 మేళకర్తలనియు చెప్పబడిన ప్రాచీన మేళకర్తలనే శ్రీ వెంకటమఖి కల్పితమేళకర్తలని పేరుపెట్టియుండెను.

మేళ చక్రములు :— శ్రీ వెంకటమఖి 72 మేళకర్తలను 12 సమభాగములుగాచేసి వాటికి మేళచక్రములని పేరుపెట్టెను. వాటినే (1) ఇందు (2) నేత్ర (3) అగ్ని (4) వేద (5) బాణ (6) ఋతు (7) ఋషి (8) వసు (9) బ్రహ్మ (10) దిశి (11) రుద్ర (12) ఆదిత్యచక్రములని చెప్పబడును.

మేళ సంజ్ఞలు :— శ్రీ వెంకటమఖిచే ఒక్కొక్క చక్రములోగల 6 మేళకర్తలకు యివ్వబడిన 6 సంజ్ఞలను మేళసంజ్ఞలని చెప్పబడును. అవి (1) పా (2) శ్రీ (3) గో (4) భూ (5) మా (6) షా యగును.

జాతులు:—క్రీస్తుకు పూర్వము రచింపబడిన సంగీత రచనలందు పేర్కొనబడి, కొంతవఱకు రాగములకు సంబంధించినట్టివిగా నుండువాటిని జాతులని చెప్పబడెను.

దాట్ :—హిందూస్థానీ సంగీతములో మేళకర్తరాగమునకుదాట్ అని పేరు.

సంపూర్ణ మేళములు :—ఈ కాలములో వాడుకలో నున్నట్టివన్ని, ఆరోహ, ణావరోహణములలో సప్తస్వరములు గల్గినట్టి 72 మేళకర్తలను సంపూర్ణమేళములని చెప్పబడును. ॥ఉ॥ కనకాంగి, రత్నాంగి, గానమూర్తి, మొదలగునవి.

అసంపూర్ణ మేళములు :— శ్రీ వెంకటమఖికి ముందుకాలములో వాడుకలో నున్నట్టివన్ని, "రాగతాళచింతామణి" అను గ్రంథములో పేర్కొనబడినట్టివన్ని, సంపూర్ణములు కానట్టి 19 లేక 20 మేళములను, అసంపూర్ణ మేళములని చెప్పబడును. ఉ॥ (1) నారీ రీతిగౌళ, (2) కిరణావళి, (3) శ్రీరాగము, (4) హరికేదారగౌళ మొదలగునవి యిట్టి రాగములకు చెందినవగును. వాటి వివరము లేమనగా !

1 నారీరీతిగౌళ. 20 వ మే॥—సా రి గా మ ని ధ ప ని ని స-సా ని నీ ధ మా గ గ రి స.

2 కిరణావళి. 21 వ మే॥—స రి మ ప ధ ప ధ ని స - స ని ప ధ ప మ ప గ రి స.

3 శ్రీరాగము. 22 వ మే॥ — స రి మ ప ని స - స ని ప ధ ని ప మ రి గ రి స.

4 హరికేదారగౌళ. 28 వ మే॥ — సా రి మ ప ని స - సా ని ధ ప మ గ రి స.

మూర్ఛనాకారక మేళవివరణ:—72 మేళకర్తలలో యే మేళకర్తలోనైనను షడ్జముగాక మిగతస్వరములగు రిషభ, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాద ములలో యే 1 గాని 2 గాని 3 గాని లేక అంతకంటె యెక్కువగాని స్వరములను గ్రహస్వరములు చేసి మూర్ఛనగావించినచో వాటిలో యింకొక మేళము యేర్పడ గల మేళకర్తలను మూర్ఛనాకారక మేళములని చెప్పబడును.

మూర్ఛనాకారక మేళసంఖ్య:—72 మేళకర్తలలో 1 నుండి 5 వఱకుగల 5 మేళములును, 7 నుండి 11 వఱకుగల 5 మేళములును, 13 నుండి 30 వఱకుగల 18 మేళములును, 32 నుండి 36 వఱకుగల 5 మేళములును, 43 నుండి 46 వఱకుగల 4 మేళములును, 51 మేళమగు 1 మేళమును, 53 నుండి 66 వఱకుగల 14 మేళములను 69 నుండి 72 వఱకుగల 4 మేళములునుకలిసి యేర్పడు 5+5+18+5+4+1+14+4=56 మేళములను మూర్ఛనాకారక మేళములని చెప్పబడును.

మూర్ఛనాకారక మేళములందలి గ్రహస్వరసంఖ్య:—పైన తెలుపబడిన 56 మూర్ఛనాకారక మేళములందుగల ఆయాగ్రహస్వరములుగలమేళసంఖ్యను, వాటి యం దేర్పడు మొత్తము మేళములసంఖ్యను యీక్రింద తెలుపుట గమనించునది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏకమూర్ఛనా మేళములు | — 20 | వాటిలో | పుట్టునవి | 20 × 1 = | 20 మేళములు |
| ద్విమూర్ఛనా మేళములు | — 18 | ,, | ,, | 18 × 2 = | 36 ,, |
| త్రిమూర్ఛనా మేళములు | — 12 | ,, | ,, | 12 × 3 = | 36 ,, |
| పంచమూర్ఛనా మేళములు | — 6 | ,, | ,, | 6 × 5 = | 30 ,, లగును. |

గనుక మూర్ఛనాకారక మేళములు 56 లోను పుట్టు మేళముల మొత్తం 122 అగును.

ఆయాగ్రహ స్వరములం దేర్పడు మేళసంఖ్య:—మూర్ఛనాకారక మేళములం దేర్పడుచున్న పై 122 మేళములలో యే గ్రహస్వరమునందు యెన్ని మేళములు యేర్పడునది యీ క్రిందిపట్టికలో తెలుపుట గ్రహించునది.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| పై 122 | మేళములలో— | రిషభ | మూర్ఛనలవలన | యేర్పడునవి | 17 | మేళములును, |
| ,, | ,, | గాంధార | మూర్ఛనలవలన | ,, | 20 | ,, |
| ,, | ,, | మధ్యమ | మూర్ఛనలవలన | ,, | 24 | ,, |
| ,, | ,, | పంచమ | మూర్ఛనలవలన | ,, | 24 | ,, |
| ,, | ,, | ధైవత | మూర్ఛనలవలన | ,, | 20 | ,, |
| ,, | ,, | నిషాద | మూర్ఛనలవలన | ,, | 17 | మేళములగును. |

పైన తెలుపబడిన వివరములన్నిటిని యీక్రింది పథకమునందు గమనించదగును.

## మూర్ఛనాకారక మేళపధకము.

ఆయాగ్రహ స్వరములం దేర్పడు మేళముల సంఖ్యలు.

| నం. | శుద్ధమధ్యమ మేళకర్తలు | స | రి | గ | మ | ప | ధ | ని |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | కనకాంగి | | 51 | ... | ... | ... | ... | ... |
| 2 | రత్నాంగి | | 53 | ... | 19 | ... | ... | ... |
| 3 | గానమూర్తి | | 54 | ... | 55 | ... | ... | ... |
| 4 | వనస్పతి | | ... | ... | 25 | ... | ... | ... |
| 5 | మానవతి | | ... | ... | 61 | ... | ... | ... |
| 6 | తానరూపి * | | — | — | — | — | — | — |
| 7 | సేనావతి | | 63 | ... | ... | ... | 17 | ... |
| 8 | హనుమత్తోడి | | 65 | 28 | 20 | ... | 29 | 22 |
| 9 | ధేనుక | | 66 | ... | 56 | ... | 35 | ... |
| 10 | నాటకప్రియ | | ... | 64 | 26 | ... | ... | 23 |
| 11 | కోకిలప్రియ | | ... | ... | 62 | ... | ... | ... |
| 12 | రూపవతి * | | — | — | — | — | — | — |
| 13 | గాయకప్రియ | | 69 | ... | ... | ... | ... | ... |
| 14 | వకుళాభరణము | | 71 | ... | 21 | ... | ... | 58 |
| 15 | మాయామాళవగౌళ | | 72 | ... | 57 | ... | ... | ... |
| 16 | చక్రవాకము | | ... | ... | 27 | ... | ... | 59 |
| 17 | సూర్యకాంతము | | ... | 7 | 63 | ... | ... | ... |
| 18 | హాటకాంబరి | | ... | 43 | ... | ... | ... | ... |
| 19 | ఝంకారధ్వని | | ... | ... | ... | 2 | 53 | ... |
| 20 | నఠభైరవి | | ... | 29 | 22 | 8 | 65 | 28 |
| 21 | కీరవాణి | | ... | ... | 58 | 14 | 71 | ... |
| 22 | ఖరహరప్రియ | | 8 | 65 | 28 | 20 | ... | 29 |
| 23 | గౌరీమనోహరి | | 10 | ... | 64 | 26 | ... | ... |
| 24 | వరుణప్రియ | | ... | ... | ... | 32 | ... | ... |
| 25 | మారరంజని | | ... | ... | ... | 4 | ... | ... |
| 26 | చారుకేశి | | ... | ... | 23 | 10 | ... | 64 |
| 27 | సరసాంగి | | ... | ... | 59 | 16 | ... | ... |
| 28 | హరికాంభోజి | | 20 | ... | 29 | 22 | 8 | 65 |
| 29 | ధీరశంకరాభరణము | | 22 | 8 | 65 | 28 | 20 | ... |
| 30 | నాగానందిని | | ... | 44 | ... | 34 | ... | ... |
| 31 | యాగప్రియ * | | — | — | — | — | — | — |
| 32 | రాగవర్ధని | | ... | ... | 24 | ... | ... | ... |
| 33 | గాంగేయభూషణి | | ... | ... | 60 | ... | ... | ... |
| 34 | వాగధీశ్వరి | | ... | ... | 30 | ... | 44 | ... |
| 35 | శూలిని | | ... | 9 | 66 | ... | 56 | ... |
| 36 | చలనాట | | ... | 45 | ... | ... | ... | ... |

## మూర్ఛనాకారక మేళపథకము.

ఆయాగ్రహస్వరములం దేర్పడు మేళముల సంఖ్యలు.

| నం. | ప్రతిమధ్యమమేళకర్తలు | స | రి | గ | మ | ప | ధ | ని |
|---|---|---|---|---|---|---|---|---|
| 37 | సాలగము * | | — | — | — | — | — | — |
| 38 | జలార్ణవము * | | — | — | — | — | — | — |
| 39 | ఝాలవరాళి * | | — | — | — | — | — | — |
| 40 | నవనీతము * | | — | — | — | — | — | — |
| 41 | పావని * | | — | — | — | — | — | — |
| 42 | రఘుప్రియ * | | — | — | — | — | — | — |
| 43 | గవాంబోధి | | ... | ... | ... | ... | 18 | ... |
| 44 | భవప్రియ | | ... | 34 | ... | ... | 30 | ... |
| 45 | శుభపంతువరాళి | | ... | ... | ... | ... | 36 | ... |
| 46 | షడ్విధమార్గిణి | | ... | 70 | ... | ... | ... | ... |
| 47 | సువర్ణాంగి * | | — | — | — | — | — | — |
| 48 | దివ్యమణి * | | — | — | — | — | — | — |
| 49 | ధవళాంబరి * | | — | — | — | — | — | — |
| 50 | నామనారాయణి * | | — | — | — | — | — | — |
| 51 | కామవర్ధని | | ... | ... | ... | ... | ... | 1 |
| 52 | రామప్రియ * | | — | — | — | — | — | — |
| 53 | గమనశ్రమ | | ... | 19 | ... | ... | ... | 2 |
| 54 | విశ్వంబరి | | ... | 55 | ... | ... | ... | 3 |
| 55 | శ్యామలాంగి | | ... | ... | ... | 3 | 54 | ... |
| 56 | షణ్ముఖప్రియ | | ... | 35 | ... | 9 | 66 | ... |
| 57 | సింహేంద్ర మధ్యమము | | ... | ... | ... | 15 | 72 | ... |
| 58 | హేమవతి | | 14 | 71 | ... | 21 | ... | ... |
| 59 | ధర్మవతి | | 16 | ... | ... | 27 | ... | ... |
| 60 | నీతిమతి | | ... | ... | ... | 33 | ... | ... |
| 61 | కాంతామణి | | ... | ... | ... | 5 | ... | ... |
| 62 | రిషభప్రియ | | ... | ... | ... | 11 | ... | ... |
| 63 | లతాంగి | | ... | ... | ... | 17 | ... | 7 |
| 64 | వాచస్పతి | | 26 | ... | ... | 28 | 10 | ... |
| 65 | మేచకల్యాణి | | 28 | 20 | ... | 29 | 22 | 8 |
| 66 | చిత్రాంబరి | | ... | 56 | ... | 35 | ... | 9 |
| 67 | సుచరిత్ర * | | — | — | — | — | — | — |
| 68 | జ్యోతిస్వరూపిణి * | | — | — | — | — | — | — |
| 69 | ధాతువర్ధని | | ... | ... | ... | ... | ... | 13 |
| 70 | నాసికాభూషణి | | ... | ... | ... | ... | 46 | ... |
| 71 | కోసలము | | ... | 21 | ... | ... | 58 | 14 |
| 72. | రసికప్రియ | | ... | 57 | ... | ... | ... | 15 |

అమూర్ఛనాకారక మేళవివరణ :— 72 మేళకర్తలలో మూర్ఛనాకారక మేళములగు 56 గాక మిగత 16 మేళములను * అమూర్ఛనాకారక మేళములని చెప్పబడును. వీటికి పేరువచ్చుటకు కారణము వీటిలో యే మేళములో యే స్వరమును గ్రహస్వరము చేసినను యింకొక మేళము యేర్పడ నట్టిమేళములగుటే యగును.

అమూర్ఛనాకారక మేళములు, వాటి సంఖ్యలు :—1. తానరూపి (6 మే.) 2. రూపవతి (12 మే.) 3. యాగప్రియ (31 మే.) 4. సాలగము (37 మే.) 5 జలార్ణవము (38 మే.) 6. ఝాలవరాళి (39 మే.) 7. నవనీతము (40 మే.) 8. పావని (41 మే.) 9. రఘుప్రియ (42 మే.) 10. సువర్ణాంగి (47 మే.) 11. దివ్యమణి (48 మే.) 12. ధవళాంబరి (49 మే.) 13. నామనారాయణి (50 మే.) 14. రామప్రియ (52 మే.) 15. సుచరిత్ర (67 మే.) 16 జ్యోతిస్వరూపిణి (68 మే.) యగును.

వివాదిమేళ వివరణ :—72 మేళకర్తలలో శు. గాం, – శు. ని, – ష. రి, – ష. ధై, – స్వరములలో యే ఒకటిగాని లేక రెండుగాని స్వరములను కలిగియున్న మేళకర్తలను వివాది మేళములని చెప్పబడును.

వివాది మేళసంఖ్యలు :—72 మేళకర్తలుగల 12 చక్రములలో శుద్ధ గాంధారముగల 1,7 చక్రములందలి $2 \times 6 = 12$ మేళములును, షట్ఛ్రుతిరిషభముగల 6,12 చక్రములందలి $2 \times 6 = 12$ మేళములును, 2, 3, 4, 5, 8, 9, 10, 11 = యీ 8 చక్రములలో శుద్ధ నిసాదముగల 1 వ మేళమును, షట్ఛ్రుతి ధైవతముగల 6 వ మేళమును కలిపి $8 \times 2 = 16$ మేళములతో నేర్పడు మొత్తము $12 + 12 + 16 = 40$ మేళములను వివాది మేళములని చెప్పబడును.

పూర్వము యిప్పుడును ఒకేపేరుగల మేళకర్తలు :—(1) మాయామాళవగౌళ (15 మే.) (2) ధీరశంకరాభరణము (29 మే ) (3) చలనాట (36 మే.) మేళకర్తలగును.

పూర్వము మేళకర్తలనబడిన యిప్పటి జన్యరాగములు :—(1) తోయవేగవాహిని (16 మే) (2) నారీరీతిగౌళ (20 మే) (3) కిరణావళి (21 మే) (4) శ్రీరాగము (22 మే) (5) హరికేదారగౌళ (28 మే) (6) శైలదేశాక్షి (35 మే) (7) జగన్మోహనము (28 మే) యనునవి.

పూర్వము ఉపాంగములనబడిన యిప్పటి భాషాంగరాగములు :—(1) ఖమాసు. (28 మే. జన్యము) (2) కాంభోజి (28 వ మేళజన్యము) మొదలగునవి.

## జన్యరాగ వివరము.

జన్యరాగ వివరణ :—72 మేళకర్తలలో ప్రతిఒక్కదానినుండి జనించునట్టి రాగములను జన్యరాగములని చెప్పబడును. ఈజన్యరాగములేర్పడు విధమును, వాటి పంఖ్యయును యీక్రింద దెలుపుట గమనింపదగును.

జన్యరాగస్కీము :—72 మేళకర్తలలో ఒక్కొక్క మేళకర్తయందు సంపూర్ణ, షాడవ, ఔడవ భేదములచే యేర్పడు 22 రకముల భేదముల నీక్రింద దెలుపుట గమనించునది.

## సంపూర్ణ భేదము — 1.

1. సరిగమపధనిస — సనిధపమగరిస.

## షాడవ భేదములు — 6.

1 సరిగమపధస - సధపమగరిస.
2 సరిగమపధస - సనిపమగరిస.
3 సరిగమధనిస - సనిధమగరిస.
4 సరిగపధనిస - సనిధపగరిస.
5 సరిమపధనిస - సనిధపమరిస.
6 సగమపధనిస - సనిధపమగస.

## ఔడవ భేదములు — 15.

1. సరిగమపస - సపమగరిస.
2. సరిగమధస - సధమగరిస.
3. సరిగమనిస - సనిమగరిస.
4. సరిగపధస - సధపగరిస.
5. సరిగపనిస - సనిపగరిస.
6. సరిగధనిస - సనిధగరిస.
7. సరిమపధస - సధపమరిస.
8. సరిమపనిస - సనిపమరిస.
9. సరిమధనిస - సనిధమరిస.
10. సరిపధనిస - సనిధపరిస.
11. సగమపధస - సధపమగస.
12. సగమపనిస - సనిపమగస.
13. సగమధనిస - సనిధమగస.
14. సగపధనిస - సనిధపగస.
15. సమపధనిస - సనిధపమస.

పైన దెలిపిన విధముగా నేర్పడిన $1+6+15=22$ భేదములును మరల సంపూర్ణ, షాడవ, ఔడవ భేదముల నొందుటచే 484 జన్యరాగము లేర్పడు విధమును యీ క్రింద వుదాహరణలతో దెలుపుట గమనించునది.

| | | | | |
|---|---|---|---|---|
| సంపూర్ణ - సంపూర్ణ | భేదములు | 1 | ఉ॥ భైరవి | -సరిగమపధనిస-సనిధపమగరిస. |
| సంపూర్ణ - షాడవ | భేదములు | 6 | ఉ॥ భైరవము | -సరిగమపధనిస-సధపమ గరిస. |
| షాడవ - సంపూర్ణ | భేదములు | 6 | ఉ॥ కాంభోజి | -సరిగమ పధస-సనిధ పమగరిస. |
| సంపూర్ణ - ఔడవ | భేదములు | 15 | ఉ॥ సారమతి | -సరిగమపధనిస-స ని ధ మగస. |
| ఔడవ - సంపూర్ణ | భేదములు | 15 | ఉ॥ బిలహరి | -సరి గ ప ధ స-సనిధపమగరిస. |
| షాడవ - షాడవ | భేదములు | 36 | ఉ॥ శ్రీరంజని | -సరిగ మ ధనిస-సనిధ మ గరిస. |
| షాడవ - ఔడవ | భేదములు | 90 | ఉ॥ నాటకురంజి | -సరిగ మ ధనిస-సనిధ మ గ స. |
| ఔడవ - షాడవ | భేదములు | 90 | ఉ॥ మలహరి | -సరిమ ప ధ స-సధపమగ రి స. |
| ఔడవ - ఔడవ | భేదములు | 225 | ఉ॥ శుద్ధసావేరి | -సరి మ ప ధ స-సధ ప మ రి స. |
| | | 484 | | |

పైవిధముగా ఒక్కొక్క మేళకర్తకు 484 జన్యరాగము లేర్పడుచున్నందున 72 మేళకర్తలకు 72 × 484 = 34,848 జన్యరాగము లేర్పడుచున్నవి. వీటినే ఉత్పత్తి రాగములనియు, అముఖ్యరాగములనియు చెప్పబడును. వీటికి మరల వక్రసంపూర్ణ, వక్రషాడవ, వక్రఔడవ సంబంధము కలిగినచో "అనంతావై రాగాః" అను ప్రమాణమున రాగము లనంతములగునని తెలియదగును.

N. B:— జన్యరాగములయొక్క ఆరోహణ, అవరోహణములందలి స్వరములను లెక్కించునపుడు సూత్రము ననుసరించి తారషడ్జమును వదలి లెక్కింపదగును.

వర్జరాగ వివరణ :—పైన దెలిపిన జన్యరాగములలో ఆరోహణములోగాని అవరోహణములోగాని లేక రెండిటిలోగాని 1గాని లేక 2గాని లేక మూడుగాని స్వరములు వర్జింపబడియుండు రాగములను వర్జరాగములని చెప్పబడును. అయితే యివి వక్రములుగాగాని, అవక్రములుగాగాని యుండవచ్చునని యెఱుగునది.

వర్జరాగ స్కీము :—జన్యరాగ స్కీముచే ఒక్కొక్క మేళకర్తయందేర్పడిన 484 జన్యరాగములలో సంపూర్ణ - సంపూర్ణ భేదముగల రాగమొక్కటిని తీసినచో మిగత 484—1 = 483 రాగములను వర్జరాగములని చెప్పబడును. గనుక 72 మేళకర్త రాగములం దేర్పడు వర్జరాగముల సంఖ్య 72 × 473 = 34,776 అని గ్రహింపదగును.

N. B:— అయితే కొందరు పైన దెలిపిన జన్య రాగ, స్కీము కూడ సరియైనది కాదని తెలుపుచున్నారు. ఏలననగా ఉ॥ మోహనరాగము. ఇందు ఆరోహణ, అవరోహణముల రెంటిలోను మధ్యమ, నిషాదములు వర్జములగుటచే నిది 28 వ, మేళజన్యముగనే గాక 29 వ, మేళజన్యము యెందుకు కాకూడదని వీరివాదము. అయితే మోహనరాగంలోని అంతరగాంధారము శుద్ధమధ్యమచ్ఛాయను, చతుశ్రుతిధైవతము కైశికీనిషాదచ్ఛాయను స్ఫురింపజేయునవిగా నుండుటచే నిది 28 వ, మేళజన్యమనుటకే యెక్కువ ఆధారము కలదను సమాధానము లేకపోలేదు. ఈ విధంగా అక్కడక్కడ కొన్ని సందేహములు కలుగుచున్నను యింతకు మించిన నిర్దిష్టమైన స్కీము కనపడనందున యిప్పటికాలమున వాడునటువంటి 34, 848 జన్యరాగముల స్కీమే ఆచరణ యోగ్యమైనదని యెరుగదగును.

వక్రరాగ వివరణ :—పైన దెలుపబడిన 34,848 జన్యరాగములలో ఆరోహణమునందుగాని, అవరోహణమునందుగాని, లేక రెంటియందుగాని యుండు స్వరములు వక్రముగా నున్నచో నట్టి రాగములను వక్రరాగములని చెప్పబడును.

*రాగవిభాగము :—సుప్రసిద్ధ ప్రాచీనలక్షణకారుడైన శార్ఙ్గదేవుడు తన "సంగీత రత్నాకర" గ్రంథములో రాగములు ముఖ్యముగా రెండు విధములని పేర్కొనెను. వాటిని 1 మార్గరాగములు 2 దేశ్యరాగములని చెప్పబడును.

1 మార్గరాగ విభాగము :—ఇది శార్ఙ్గదేవునిచే పేర్కొనబడిన రాగవిభజన లోని రెండు విధములలో మొదటిదియగును. ఇది 6 విధములగును. అవి 1 గ్రామ రాగము, 2 ఉపరాగము, 3 శుద్ధరాగము, 4 భాషారాగము, 5 విభాషారాగము, 6 అంతర భాషారాగము లగును. అయితే శార్ఙ్గదేవుడు తనకాలమునందే యీ రాగములు లేవనియు, నవి గంధర్వలోకమున మాత్రమే గలవనియు పేర్కొని యున్నందున నీ మార్గరాగవిభాగమునందలి పేర్లు ప్రాచీన సంగీత చరిత్రను తెలిసికొనుటకు మాత్రమే వుపయోగపడునని గ్రహించునది.

దేశ్యరాగవిభాగము :—ఈ రాగవిభాగము 4 విధములగును. అవి 1 రాగాంగ రాగము, 2 ఉపాంగరాగము, 3 భాషాంగరాగము, 4 క్రియాంగరాగము లగును. వాటి వివరముల నీదిగువను దెలుపుట గమనించునది.

i రాగాంగరాగము :—సంపూర్ణమైనట్టియు, వక్రముకానట్టియు, ఆరోహణ-అవరోహణముల రెంటియందును ఒకే రకమైన స్వరములు కలిగియున్నట్టియు, జన్య రాగములకు జనక స్థానముగా నుండునట్టి రాగమును రాగాంగరాగమని చెప్పబడును. దీనినే జనకరాగ, మేళరాగ, మేళకర్తరాగ, కర్తరాగ, ప్రధానరాగ, రూట్ (వేరు) రాగ, ప్రైమరీ (ముఖ్య) రాగమనికూడ చెప్పబడును.

ii ఉపాంగరాగము :—రాగాంగరాగమున జనించినదై, తన జనకరాగస్వర ములను మాత్రమే కలిగినదై, ఔడవ, లేక షాడవ, లేక సంపూర్ణ, లేక యేరెంటినైనను కలిగియుండు జన్యరాగములను ఉపాంగరాగములని చెప్పబడును. ఉ॥ 1 హంసధ్వని, 2 మలహరి మొదలగునవి యీ రకమునకు చెందును.

iii భాషాంగరాగము :—రాగాంగరాగమున జనించినదై, తాను జనించిన జనకరాగస్వరములనే గలదియైనను, రంజకముకొఱకు అన్యజనకరాగములందుగల శుద్ధ, వికృతస్వరములలో నేదైన నొకటి, లేక రెండు, లేక మూడు స్వరములను ప్రయోగింప బడు జన్యరాగములను భాషాంగరాగములని చెప్పబడును. ఇవి, ఔడవ, లేక షాడవ, లేక సంపూర్ణములుగాగాని, వక్ర, లేక అవక్రములుగాగాని అయి వుండవచ్చును. ఉ॥ 1 బిలహరి, 2 కాంభోజి, 3 భైరవి, 4 బేగడ మొదలగునవి.

iv క్రియాంగరాగము :—ఇంద్రియములకు నుత్సాహము కలిగించునదియై, దేవతాస్తుతి, ఉత్సాహ, శోక, వీర, పరాక్ర, యుద్ధసమయములం దుపయోగించునట్టి రాగమును క్రియాంగరాగమని చెప్పబడును. అయితే యిట్టి రాగములు యీ కాల ములో వాడుకయందు యేమాత్రము లేనందున వాటి వివరముల నిచట తెలుపబడ లేదని గ్రహించదగును.

అంతరమార్గరాగము :— భాషాంగరాగమను పేరు వాడుకలోలేని ప్రాచీన కాలములో అన్యరాగచ్ఛాయలను కలిగియుండురాగములను అంతరమార్గరాగములని చెప్పబడెను. కాని కాలక్రమముగా వీటినే భాషాంగరాగములని చెప్పబడుచున్నవి.

రాగవిభాగము :— పూర్వాచార్యులు ఒక పద్ధతిలో రాగములను 3 విధములుగా విభజించిరి. వాటినే 1. ఘనరాగము. 2. రక్తిరాగము. 3. దేశ్య రాగము లని చెప్పబడును.

i ఘనరాగము :—ఘనమైన నాభితానముగా, గానముచేయదగినదిగాను, యుద్ధమునందు, శౌర్య, వీరోత్సాహములు గల వీరునిబోలినదిగాను, గంభీరముగా నుండు రాగమును ఘనరాగమని చెప్పబడును. ఇట్టి రాగములు ముఖ్యముగా 5 గలవు. అవి 1. నాట. 2. గౌళ. 3. ఆరభి. 4. శ్రీరాగము 5. వరాళీ రాగము లగును. వీటినే ఘనరాగపంచకమని చెప్పుదురు. ఈ ఘనరాగపంచకము నందే శ్రీ త్యాగరాజు తనకుగల ధాతు, మాతువులందలి కవితావిశిష్టతకు నిదర్శన ముగా "ఘనరాగపంచక"మను 5 కీర్తనలనురచించి ఆచంద్రతారార్కముగ నుండునట్లు చేసెను. ఈ ఘనరాగపంచకమునకు మరియొక ఉపఘనరాగపంచకమునుకూడ ప్రాచీన లక్షణకారు లేర్పఱచిరి, అవి 1. కేదార. 2. నారాయణగౌళ. 3. రీతిగౌళ. 4. సారంగ నాట 5. బౌళిరాగము లగును. ఈ 5 రాగములనుకూడాచేర్చి మొత్తము 10 ఘనరాగ ములుగా చెప్పియుండుట గమనించదగును.

ii రక్తిరాగము :— వినువారి చిత్తమును రంజింపచేయునట్టిరాగమును రక్తిరాగమని చెప్పబడును. దీనినే నయరాగమనియు, మార్గరాగమనియు చెప్పుదురు. ఉ॥ 1. తోడి, 2. భైరవి. 3. శంకరాభరణము. 4. కల్యాణి మొదలగునవి.

iii దేశ్యరాగము :— ఉత్తరదేశమునుండి స్వీకరింపబడినట్టియు, కొన్ని యితర రాగకళలతో స్ఫురించునట్టిరాగమును దేశ్యరాగమని చెప్పబడును. దీనినే దేశీయరాగమనికూడ చెప్పుదురు. ఉ॥ 1. ఖమాసు. 2. బేహాగ్. 3. కాపి మొదలగునవి యిట్టిరాగములకు చెందును.

రాగవిభాగము :— పూర్వీకులగు లక్షణకారులు రాగములను మరియొక విధములో 3 రకములుగా విభజించియున్నారు. అవి 1. పంచమాంత్యరాగము. 2. ధైవతాంత్యరాగము. 3. నిషాదాంత్యరాగము లగును.

i పంచమాంత్యరాగము :— ఒక రాగములో హెచ్చుగానున్నట్టి స్వరము మధ్యస్థాయిపంచమముగానున్నచో అట్టిరాగమును "పంచమాంత్యరాగ"మని చెప్పబడును.

ఉ॥ నవరోజు రాగము. ఇది 29వ, మేళజన్యము- ఆరో॥ అవ॥ ప ధ ని స రి గ మ ప - ప మ గ రి స ని ధ ప.

ii ధైవతాంత్య రాగము :— ఒక రాగములో హెచ్చుగానుండు స్వరము మధ్యస్థాయి ధైవతముగానున్నచో అట్టిరాగమును "ధైవతాంత్యరాగ" మని చెప్పబడును.
ఉ॥ కురంజిరాగము. ఇది 29వ, మేళజన్యము-ఆరో॥అవ॥ స ని స రి గ మ ప ధ- ధ ప మ గ రి స ని స.

iii నిషాదాంత్య రాగము :—ఒక రాగములో హెచ్చుగానుండు స్వరము మధ్యస్థాయి నిషాదముగానుండినచో అట్టి రాగమును నిషాదాంత్యరాగమని చెప్ప బడును.

ఉ॥ నాదనామక్రియ రాగము. ఇది 15వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ సరిగమ పధని - ని ధ ప మ గ రి స ని .

రాగవిభాగము :— జన్యరాగములను 3 విధములుగా విభజించుటను గమనించు నది. అవి (1) ఔడవరాగము (2) షాడవరాగము (3) సంపూర్ణ రాగములగును.

ఔడవరాగము :—ఇందు ఆరోహణ, అవరోహణముల రెంటియందును 5 స్వరములు మాత్రమే యుండును. గనుక దీనిని "ఔడవరాగ" మని చెప్పబడును. ఉ॥ మోహనరాగము. ఇది 28 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ స రి గ ప ధ స - స ధ ప గ రి స.

ఔడవరాగవిభాగము 1 :—ఔడవరాగములను 3 విధములుగా విభజించుట జరిగెను. అవి (1) ఔడవ - సంపూర్ణము (2) ఔడవ - షాడవము (3) ఔడవ - ఔడవములగును.

i ఔడవసంపూర్ణము :—ఇందు ఆరోహణము ఔడవముగను, అవ రోహణము సంపూర్ణముగను వుండును. ఉ॥ బిలహరిరాగము. ఇది 29 వ, మేళ జన్యము. ఆరో॥ అవ॥ స రి గ ప ధ స - స ని ధ ప మ గ రి స.

ii ఔడవషాడవము :—ఇందు ఆరోహణము ఔడవముగను, అవరోహ ణము షాడవముగను వుండును. ఉ॥ జగన్మోహినిరాగము. ఇది 15 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ స గ మ ప ని స - స ని ప మ గా రి స.

iii ఔడవఔడవము :— ఇందు ఆరోహణ, అవరోహణముల రెంటి యందును ఔడవముగానే యుండును. ఉ॥ శుద్ధ ధన్యాసిరాగము. ఇది 22 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ స గ మ ప ని స - స ని ప మ గ స.

ఔడవరాగ విభాగము 2:—మరియు నీ ఔడవరాగములను యింకొక పద్ధతిలో 3 విధములుగా విభజింపబడెను. అవి (1) శుద్ధ ఔడవ (2) సంకీర్ణ ఔడవ, (3) వక్ర ఔడవములగును.

i శుద్ధ ఔడవము:—ఇందు ఆరోహణ, అవరోహణముల రెంటియందును ఒకేరకమైన 2 స్వరములు వర్జింపబడియుండును.

ఉ॥ హంసధ్వనిరాగము. ఇది 29వ, మేళజన్యము. ఆరోహణ, అవరోహణములు. స రి గ ప ని స̇ - స̇ ని ప గ రి స.

ii సంకీర్ణ ఔడవము:— ఇదియు శుద్ధ ఔడవరాగమువలె నుండినను, యిందు వర్జింపబడిన రెండు స్వరములు ఒకేరకమునకు చెందినవిగాక వేరువేరు రకములకు చెందినవిగా నుండును.

ఉ॥ ఆందోళికరాగము, ఇది 28వ, మేళజన్యము. ఆరోహణ, అవరోహణములు. స రి మ ప ని స̇ - స̇ ని ధ మ రి స.

iii వక్ర ఔడవము:—ఇందు ఆరోహణ, అవరోహణముల రెంటియందు గల 5 స్వరములు వరుసగా నుండక వక్రముగా నుండును.

ఉ॥ భోగిసింధురాగము. ఇది 48 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ స ప మ ప ధ ని స̇ - స̇ ని ధ ని ప మ స.

షాడవరాగము:—ఇందు ఆరోహణ, అవరోహణముల రెంటియందును 6 స్వరములుండును.

ఉ॥ పుష్పలతికరాగము. ఇది 22 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ స రి గ మ ప ని స̇ - స̇ ని పమ గ రి స

షాడవరాగ విభాగము 1:—షాడవరాగములను 3 విధములుగా విభజించిరి. అవి (1) షాడవ సంపూర్ణము. (2) షాడవ షాడవము. (3) షాడవ ఔడవములగును.

i షాడవ సంపూర్ణము:— ఇందుగల ఆరోహణము షాడవముగను, అవరోహణము సంపూర్ణముగను వుండును.

ఉ॥ కాంభోజిరాగము. ఇది 28 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ స రి గ మ ప ధ స̇ - స̇ ని ధ ప మ గ రి స.

ii షాడవ షాడవము:—ఇందు ఆరోహణ, అవరోహణముల రెంటియందును షాడవముగనే యుండును.




ఉ॥ శ్రీరంజనిరాగము. ఇది 22 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ స రి గ ధ ని స̇ - స̇ ని ధ మ గ రి స.

iii షాడవ ఔడవము :—ఇందు ల ఆరోహణము షాడవముగను, అవరోహణము ఔడవముగను వుండును.

ఉ॥ బహుదారిరాగము. ఇది 28 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ స గ మ ప ధ ని స - స ని ప మ గ స.

షాడవరాగవిభాగము 2 :— మరియు నీ షాడవరాగములను యింకొక పద్ధతిలో 3 విధములుగా విభజింపబడెను. అవి (1) శుద్ధ షాడవము. (2) సంకీర్ణ షాడవము. (3) వక్రషాడవములగును.

i శుద్ధ షాడవము :—ఇందు ఆరోహణ, అవరోహణముల రెంటియందును వర్జింపబడియుండు ఒక్కస్వరము ఒకేరకమునకు చెందినదిగా నుండును.

ఉ॥ శుద్ధ తోడిరాగము. ఇది 8వ, మేళజన్యము. అరోహణ, అవరోహణములు స రి గ మ ధ ని స - స ని ధ మ గ రి స.

ii సంకీర్ణ షాడవము :—ఇదియు శుద్ధషాడ్వమువలె నుండినను, ఆరోహణ, అవరోహణముల రెంటిలోను వర్జింపబడిన ఒక్కస్వరము వేరువేరు రకములకు చెందినదిగా నుండును.

ఉ॥ కన్నడ గౌళరాగము. ఇది 22 వ, మేళజన్యము. ఆరోహణ, అవరోహణములు. స రి గ మ ప ని స - స ని ధ ప మ గ స.

వక్రషాడవము :—ఇందుగల ఆరోహణ, అవరోహణముల రెంటియందుగల 6 స్వరములు వరుసగానుండక వక్రముగా నుండును.

ఉ॥ గౌళరాగము. ఇది 15 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ స రి గ రి మ ప ని స - స ని ప మ గ మ రి స.

సంపూర్ణ రాగము:—ఇందుగల ఆరోహణ, అవరోహణముల రెంటియందును 7 స్వరము లుండును.

ఉ॥ తోడిరాగము. ఇది 8వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ స రి గ మ ప ధ ని స - స ని ధ ప మ గ రి స.

సంపూర్ణ-రాగవిభాగము 1 :—సంపూర్ణ రాగమును 3 విధములుగా విభజించిరి. అవి1. సంపూర్ణ-సంపూర్ణము. 2. సంపూర్ణ షాడవము. 3. సంపూర్ణ-ఔడవములగును.

i సంపూర్ణ-సంపూర్ణము:- ఇందుగల ఆరోహణ, అవరోహణముల రెంటిలోను 7 స్వరము లుండును.

ఉ॥ కల్యాణిరాగము. ఇది 65వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ సరిగమపధనిస- ని ధ ప మ గ రి స.

ii సంపూర్ణ-షాడవము :— ఇందుగల ఆరోహణము సంపూర్ణముగను, అవరోహణము షాడవముగను వుండును.

ఉ॥ మార్గహిందోళరాగము. ఇది 20 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ సరిగమపధనిస - సనిధపమగస.

iii సంపూర్ణ ఔడవము :— ఇందుగల ఆరోహణము సంపూర్ణముగను, అవరోహణము ఔడవముగను వుండును.

ఉ॥ నాటరాగము. ఇది 36 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ సరిగమపధనిస - సనిపమరిస.

సంపూర్ణ రాగవిభాగము 2 :—సంపూర్ణ రాగములను యింకొకపద్ధతిలో 3 విధములుగా విభజింపబడెను. అవి 1. శుద్ధ సంపూర్ణము. 2. సంకీర్ణ సంపూర్ణము. 3. వక్ర సంపూర్ణము లగును.

i శుద్ధసంపూర్ణము:—ఇందుగల ఆరోహణ, అవరోహణముల రెంటిలోనుగల సప్తస్వరములు ఒకేరకమునకు చెందినవిగాయుండును.

ఉ॥ శంకరాభరణరాగము. ఇది 29వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ సరిగమపధనిస - సనిధపమగరిస.

ii సంకీర్ణ-సంపూర్ణము:—ఇందుగల ఆరోహణ,అవరోహణముల రెంటిలోనుగల సప్తస్వరములు ఒకేరకమునకు చెందినవిగాక వేరు వేరు రకములకు చెందినవిగానుండును.

ఉ॥ భైరవిరాగము. ఇది 20 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ సరిగమపధనిస - సనిధపమగరిస.

iii వక్రసంపూర్ణము :— ఇందు ఆరోహణ, అవరోహణముల రెంటిలోను గల సప్తస్వరములు వరుసగా నుండక వక్రముగా నుండును.

ఉ॥ మాళవిరాగము. ఇది 28 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ సరిగమపనిమధనిస - సనిధనిపమగమరిస. దీనినే ఉభయవక్రసంపూర్ణమనబడును.

వక్రరాగవివరణము :— ఒక రాగములోని ఆరోహణ, అవరోహణము లందలి స్వరములు వక్రముగా నున్నచో అట్టి రాగమును వక్రరాగమని చెప్పబడును.

వక్రరాగవిభాగము 1 :—ఇది మూడు విధములుగా విభజింపబడినది. అవి 1. వక్ర సంపూర్ణము. 2. వక్ర షాడవము. 3. వక్ర ఔడవములగును.

i వక్రసంపూర్ణము :— ఇందు ఆరోహణములోని స్వరములు వక్ర సంపూర్ణముగను, అవరోహణములోని స్వరములు క్రమ సంపూర్ణముగను వుండును.

ఉ॥ హుసేనిరాగము. ఇది 22 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ స రి గ మ ప ని ధ మ ప ని ధ ని ṡ – ṡ ని ధ ప మ గ రి స.

ii వక్ర షాడవము:—ఇందుగల ఆరోహణములోని స్వరములు వక్ర షాడవముగను, అవరోహణములోని స్వరములు క్రమ షాడవముగను వుండును. ఉ॥ రవిచంద్రిక రాగము. ఇది 28 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ స రి గ మ ధ ని ధ ṡ – ṡ ని ధ మ గ రి స.

iii వక్ర ఔడవము :—ఇందు ఆరోహణములోని స్వరములు వక్ర ఔడవముగను, అవరోహణములోని స్వరములు క్రమ ఔడవముగను వుండును. ఉ॥ కుంతలవరాళి రాగము. ఇది 28 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ స మ ప ధ ని ధ ṡ – ṡ ని ధ ప మ స.

వక్రరాగవిభాగము 2 :—వక్రరాగములను మరియొక పద్ధతిలో 3 విధములుగా విభజింపబడినవి. అవి 1. ఆరోహణవక్రము. 2. అవరోహణవక్రము. 3. ఉభయవక్రములగును.

i ఆరోహణవక్రము :—ఇందు ఆరోహణము వక్రముగా నుండి అవరోహణము మాత్రము క్రమముగా నుండును. ఉ॥ బేగడరాగము. ఇది 29 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ స గ రి గ మ ప ధ నీ ధ ప ṡా – ṡ ని ధ ప మా గ రి సా.

ii అవరోహణవక్రము :—ఇందు ఆరోహణము క్రమముగా నుండి, అవరోహణము వక్రముగా నుండును. ఉ॥ సారంగరాగము. ఇది 65వ, మేళజన్యమగును. ఆరో॥ అవ॥ స రి గ మ ప ధ ని ṡ – ṡ ని ధ ప మ రి గ మ రీ సా.

iii ఉభయవక్రము:—ఈ రాగమున ఆరోహణ, అవరోహణములు రెండును వక్రముగా నుండును. ఉ॥ (1) సహానరాగము. ఇది 28 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ స రి గ మ ప మ ధా ని ṡ – ṡ ని ధ ప మ గ మ రి గ రి స. (2) కానడరాగము. ఇది 22 వ, మేళజన్యము.—ఆరో॥ అవ॥ స రి గ మ ప మ ధా ని ṡ – ṡ ని ప మ ప ధ ని ధ ప మ గా మ రి స.

ఉభయవక్రవర్జరాగము :— ఇందు ఆరోహణ, అవరోహణములు రెండును వక్రముగాను, వర్జముగాను వుండును. ఉ॥ హిందోళ వసంతరాగము. ఇది 20వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ స గ మ ప ధ ని ధ ṡ – ṡ ని ధ ప మ ధ మ గ స.

ఏకస్వరవక్రరాగము :— ఇది ఒకేస్వరము వక్రముగానుండురాగమునకు గల పేరు. ఉ॥ ద్విజావంతి. మే. 28 జ॥ స రి మ గ మ ప ధ ని ṡ – ṡ ని ధ ప మ గ రి గ స,

ఏకస్వర వర్జరాగము :— ఇది ఒకేస్వరము వర్జముగానుండురాగమునకుగల పేరు. ఉ॥ శ్రీరంజని రాగము. స రి గ మ ధ ని సం - సం ని ధ మ గ రి స.

ఏకస్వర భాషాంగరాగము :—ఇది ఒకేస్వరము అన్యస్వరముగానుండురాగము నకుగల పేరు. ఉ॥ భైరవి రాగము. స రి గ మ ప ధ ని స - స ని ధ ప మ గ రి స.

క్రమసంపూర్ణరాగము:— ఇది సప్తస్వరములు వరుసగానున్న రాగమునకు గల పేరు. ఉ॥ కల్యాణి. స రి గ మ ప ధ ని సం - సం ని ధ ప మ గ రి స.

క్రమషాడవరాగము :— ఇది 6 స్వరములు వరుసగానున్న రాగమునకుగల పేరు. ఉ॥ మలయమారుతరాగము. స రి గ ప ధ ని సం - సం ని ధ ప గ రి స.

క్రమఔడవరాగము :—ఇది 5 స్వరములు వరుసగానున్న రాగమునకుగల పేరు. ఉ॥ మోహనరాగము. స రి గ ప ధ సం - సం ధ ప గ రి స.

నారదునిరాగవిభాగము 1:- ఇది 2 విధములగును. అవి 1.సూర్యోదయరాగము, 2 సూర్యాస్తమయరాగము లగును. వీటినే సంధిప్రకాశికరాగము లనబడును.

1. సూర్యోదయరాగము :— ఇది సూర్యుడు ఉదయించునపుడు పాడదగిన రాగమగును. ఉ॥ భూపాలరాగము. ఇది 15 వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ స రి గ ప ధ సం - సం ధ ప గ రి స. ఇదేరాగము 8వ, మేళజన్యముగాకూడ యుండేగలదు.

2. సూర్యాస్తమయరాగము :— ఇది సూర్యుడు అస్తమించునపుడు పాడదగిన రాగమగును. ఉ॥ నాటరాగము. ఇది 36 వ, మేళకర్తజన్యము. ఆరో॥ అవ॥ స రి గ మ ప ధ ని సం - సం ని ప మ రి స.

నారదుని రాగవిభాగము 2 :— ఇవి మూడు విధములు. అవి 1. ముక్తాంగ కంపితరాగములు. 2. అర్ధకంపితరాగములు. 3. కంపవిహీనరాగము లగును.

i ముక్తాంగ కంపితరాగము :— ఇందుగల అన్నిస్వరములును కంపిత గమకములను కలిగియుండును. అనగా యిది ఇప్పటి సర్వస్వర గమక,వరికరాగమునకు సరిపోవును. ఉ॥ భైరవిరాగము. ఇది 20 మేళజన్యము. సరిగమపధనిసం-సంనిధపమగరిస.

ii అర్ధకంపితరాగము :—ఇందుగల కొన్నిస్వరములు మాత్రమే గమకములను కలిగియుండును. మిగతస్వరములు స్వచ్ఛముగా నుండును. ఉ॥ ఖరహరప్రియరాగము. ఇది 22 వ, మేళకర్తరాగము. ఆరో॥ అవ॥ స రి గ మ ప ధ ని సం - సం ని ధ ప మ గ రి స.

iii కంపవిహీనరాగము :— ఇందుగల స్వరము లన్నియు కంపిత, గమకములు లేనివై స్వచ్ఛముగా నుండును. ఉ॥ కదనకుతూహలరాగము. ఇది 29వ, మేళజన్యము. ఆరో॥ అవ॥ స రి మ ధ ని గ ప సం - సం ని ధ ప మ గ రి స.

నారదుని రాగవిభాగము 3:—ఇది 3 విధము లగును. అవి 1. ఉదయరాగము. 2. మధ్యాహ్నరాగము 3. సాయంకాలరాగము లగును. ఇది ఆ యా రాగములు పాడదగిన కాలములను బట్టిచేసిన రాగవిభజన యగును.

i ఉదయరాగము :— ఇది ప్రాతఃకాలమందు పాడదగిన రాగ మగును. ఉ॥ బిలహరి, 2. మలహరి. 3. ముఖారి. 4. భైరవి మొదలగునవి.

ii మధ్యాహ్నరాగము :— ఈ రాగము మధ్యాహ్నకాలమందు పాడదగిన రాగమగును. ఉ॥ 1. శ్రీరాగము 2. మధ్యమావతి 3. నీలాంబరి 4. కల్యాణి 5. శంకరాభరణము 6. మోహన 7. వసంత మొదలగునవి.

iii సాయంకాలరాగము :—ఇది సాయంకాలమందు పాడదగిన రాగ మగును. ఉ॥ 1. తోడి, 2, సౌరాష్ట్రి 3. పంతువరాళి, 4. వరాళి, 5. హుసేని, 6. మాళవి, 7. హిందోళ, 8. లలిత, మొదలగునవి.

నారదుని రాగవిభాగము 4 :—ఈ రాగవిభాగము 2 విధములుగా విభజింపబడినది. అవి (1) సూర్యాంశ రాగములు (2) చంద్రాంశ రాగములగును.

i సూర్యాంశ రాగములు:— ఈ రాగములు సూర్యుడు కనుపడుచున్న సమయములో పాడదగిన రాగములగును. ఉ॥ 1 సౌరాష్ట్రము, 2 కాపి, 3 సారంగ, 4 శంకరాభరణము, 5 కల్యాణి, 6 తోడి, 7 మోహన మొదలగునవి.

ii చంద్రాంశ రాగములు :—ఈ రాగములు చంద్రుడు కనుపడుచున్న సమయములో పాడదగిన రాగములగును. ఉ॥ 1. కాంభోజి, 2. సావేరి, 3. బేగడ 4. కేదార, 5. సురటి మొదలగునవి.

నారదుని రాగవిభాగము 5 :—ఇవి 3 రకములుగా విభజింపబడినది. అవి 1. పురుషరాగములు, 2. స్త్రీరాగములు, 3. నపుంసక రాగములగును. ఈ విభజన ఆ యా రాగముల పేర్లనుబట్టి చేసిన రాగవిభజనగా కనుపడుచున్నది.

i పురుషరాగములు :—ఈ రాగములు పురుషజాతికి చెందిన రాగములగును. ఉ॥ (1) భైరవి, (2) భూపాలము, (3) శ్రీరాగము, (4) వసంత మొదలగునవి.

ii స్త్రీరాగములు :—ఈరాగములు స్త్రీజాతికి చెందిన రాగములగును. ఉ॥ (1) కురంజి (2) బిలహరి (3) ఆంధాళి (4) వరాళి (5) గౌళ, (6) సావేరి మొదలగునవి.

iii నపుంసక రాగములు :—ఇవి నపుంసక జాతికి చెందినరాగములగును.

రామామాత్యుని రాగవిభాగము :— ఇది 3 రకములుగా విభజింపబడెను. అవి 1. ఉత్తమరాగము 2. మధ్యమరాగము 3. అధమరాగములగును.

i ఉత్తమ రాగము :—ఇది సంకరములేనట్టియు, స్వచ్ఛమైనట్టియు, రచనలకును, ఆలాపనకును పనికివచ్చునట్టి రాగమగును.

ii మధ్యమ రాగము :—ఇది కొన్ని భాగములను మాత్రమే పాడదగినట్టి రాగమగును. అనగా దీని ఉపయోగము సామాన్యముగా నుండును.

iii అధమ రాగము :—ఇది రచనలకు యెంతమాత్రము పనికిరాని రాగమగును. ఈ రాగవిభజనను శ్రీ సోమనాథుడుకూడ మెచ్చుకొనినట్లు తెలియుచున్నది.

ప్రభాత రాగము :—ఇది సూర్యోదయము కాకముందు అనగా ప్రభాత సమయములో పాడదగిన రాగమగును. ఉ॥ భూపాలరాగము మొదలగునవి.

మతంగుని రాగ విభాగము :—ఇది 3 విధములుగా విభజింపబడినది. అవి (1) శుద్ధము, (2) ఛాయాలగ, లేక సాలగము (3) సంకీర్ణములగును.

i శుద్ధ రాగము :—శాస్త్రమునందు చెప్పబడినటుల ఒకేరాగకళను స్ఫురింపజేయునది శుద్ధరాగమనబడును. ఉ॥ 1. శంకరాభరణము, 2. శ్రీరంజని, 3. మోహన మొదలగు రాగములు యీ రకమునకు చెందినవగును.

ii సాలగ రాగము :—అన్యరాగచ్ఛాయలను పొంది, జనమనోరంజకమైన రాగమును సాలగరాగమని చెప్పబడును. ఉ॥ 1 భైరవి, 2. రీతిగౌళ, 3. ముఖారి, 4. సారంగ మొదలగునవి. (ఛాయా = సదృశము, లగము = చెందుట)

iii సంకీర్ణ రాగము :— శుద్ధము, సాలగములకు చెందిన అనేక రాగచ్ఛాయలను పొంది, జనరంజకమైన రాగమును సంకీర్ణరాగమని చెప్పబడును.
ఉ॥ 1. దేశ్యకాపి 2. ఆహిరి 3. సౌరాష్ట్రము 4. భైరవము 5. ద్విజావంతి మొదలగునవి.

పార్శ్వదేవుని రాగ విభాగము :—ఇది 4 విధములుగా విభజింపబడినది. అవి i రాగాంగసంపూర్ణములు, రాగాంగషాడవములు, రాగాంగఔడవములును, ii ఉపాంగ సంపూర్ణములు, ఉపాంగషాడవములు, ఉపాంగఔడవములును, iii భాషాంగ సంపూర్ణములు, భాషాంగషాడవములు, భాషాంగఔడవములును, iv క్రియాంగ సంపూర్ణములు, క్రియాంగషాడవములు, క్రియాంగఔడవము లగును. ఈ పార్శ్వదేవుని రాగవిభజనకూడా ప్రాచీనసంగీతచరిత్రను తెలిసికొనుటకుమాత్రమే ఉపయోగకరముగానుండునని గ్రహింపదగును.

పురాతన తమిళ సంగీతరాగ విభాగము :— ఇది రెండు విధములగును. అవి 1 పణ్ 2 తిరమ్ లగును. వాటివివరముల నీ క్రింద తెలుపుట గమనించునది.

i పణ్ :— ఇది ప్రాచీనకాలములో రాగాంగ రాగమునకు తమిళములోగల సాధారణమైన నామమగును. అయితే ఇది జనక, జన్యరాగములకుకూడ వర్తించునదిగా నుండును. ఇది యెల్లప్పుడును సంపూర్ణ-సంపూర్ణములుగానుండ నక్కరలేదు. వీటిలో కొన్ని అసంపూర్ణ మేళములుగాకూడా యున్నటుల తెలియుచున్నది.

ii తిరమ్ :— ఇది తమిళములో జన్యలేక వర్జ్యరాగమునకుచెందిన నామమగును.

పణ్ విభాగము :— ప్రాచీన తమిళ సంగీతములో ఆయారాగములు పాడదగిన కాలమునుబట్టి 8 విధములుగా విభజింపబడెను. అవి 1. పగల్ పణ్ లు 2. ఇరవుపణ్ లు 8. పొదుప్పణ్ లగును. వాటి వివరములేమనగా !

i పగల్ పణ్ లు :—ఇవి పగటికాలమునందు మాత్రమే పాడదగిన రాగములకు గల పేరు. ఇవి మొత్తము 12 రాగములగును.

ii ఇరవుపణ్ లు :—ఇవి రాత్రికాలమునందు మాత్రమే పాడదగిన రాగములకు గల పేరు. ఇవి మొత్తము 9 రాగములగును.

iii పొదుప్పణ్ లు :—ఇవి అన్ని కాలములందును పాడదగిన రాగములకు గలపేరు. ఇవి మొత్తము 3 రాగములగును. గనుక పైనదెలిపిన 3 రకములగు పణ్ ల మొత్తము 12+9+8=24 అగునని గ్రహించునది.

హిందూస్థానీ సంగీతరాగ విభాగము :—ప్రాచీనకాలమున హిందూస్థానీ సంగీతములోని రాగములను 3 విధములుగా విభజించిరి. అవి (1) రాగ (2) రాగిణీ. (3) పరివార, రాగములగును. వాటి వివరములేమనగా !

i రాగ (పురుషరాగము) :—ఇవి మొత్తము 6 రాగములగును.

ii రాగిణి (స్త్రీ (భార్య) రాగము) :—ఇవి ప్రతిపురుషునికి 5 గురు భార్యల వంతున 6×5=30 రాగములగును.

iii పరివార (పుత్రులు, వారి భార్యలు) :—ఇవి ప్రతిపురుషునికి 8 మంది పుత్రుల వంతున 6×8=48 పుత్రరాగములును, ప్రతిపుత్రునికి 1 భార్యవంతున 48×1=48 భార్యరాగములును కలసి మొత్తము 48+48=96 పరివార రాగములగును. గనుక మొత్తము 6+30+96=132 రాగములగునని గ్రహించునది.

స్త్రీ, పురుషరాగముల వివరణ :—రాగములలో కొన్ని ముఖ్యమైన పురుష రాగములకు, స్త్రీరాగములును, వాటి అధిదేవతలు, వేదములు, కులములు, రసములు, గుణములు మొదలగునవి నీక్రింద తెలుపుటను గమనించునది.

| పురుషరాగములు. | స్త్రీ (భార్య) రాగములు. | అధిదేవతలు. | వేదములు. | కులములు. | రసములు. | గుణములు. |
|---|---|---|---|---|---|---|
| 1 భూపాలము | బిలహరి - మలహర్, భౌండి | శివుడు | సామవేద | బ్రాహ్మణ | శృంగార | రాజస |
| 2 భైరవి | దేవక్రియ, మేఘరంజి, కురంజి | విష్ణువు | ,, | ,, | రౌద్ర | ,, |
| 3 శ్రీరాగము | ఆంధాళి, భల్లాతి, సాహుళి | సరస్వతి | యజుర్వేద | క్షత్రియ | భీభత్స | తామస |
| 4 ఫలమంజరి | దేశి, ముఖారి, లలిత | లక్ష్మి | ,, | ,, | కరుణ | ,, |
| 5 వసంత | రామక్రియ, వరాళి, గౌళ | సూర్యుడు | ఋగ్వేద | వైశ్య | హాస్య | సాత్వీక |
| 6 మాళవి | గుండక్రియ, ఘూర్జరి, బౌళి | నారదుడు | ,, | ,, | భయానక | ,, |
| 7 బంగాళ | కల్యాణి, సావేరి, ఆహిరి | వినాయకుడు | అధర్వణవేద | శూద్ర | అద్భుత | రాజస, |
| 8 నాట | ఘంటారవము, కాంభోజి, శంకరాభరణము | తుంబురు | ,, | ,, | వీర | ,, |

పైన దెలిపిన 8 రాగములు గాక మిగత రాగములన్నియు శాంతరసమునకు చెందిన వగుటచే రాగములు నవరసములని తెలియదగును.

పుత్ర రాగములు:—పురుషరాగములకు జనించిన రాగములను పుత్రరాగములని చెప్పబడును. అవి ఉ॥ కాపి, రేగుప్తి, నీలాంబరి, మారువ, రామగిరి, సారంగ, మందార్, సౌరాష్ట్రి, కేదార, ముఖారి, లలిత, తోడి, ధన్యాసి, నారాయణి, గౌరి, పంతువరాళి వరాళి, పూర్వి, సావేరి, బేగడ, బౌళి, మనోహరి, యమున మొదలగు రాగములగును.

మిశ్రరాగములు:—నామభేదముచే వ్యవహరింపబడురాగములను మిశ్ర రాగములని చెప్పబడును. అవి భైరవి, ఆనందభైరవి, వసంతభైరవియును, వరాళి, నాగవరాళి, పున్నాగవరాళి, శోకవరాళి, వసంతవరాళియును, కాంభోజి, గున్మ్ర కాంభోజి, గోపికాకాంభోజి, చెంచుకాంభోజి, నందికాంభోజి, యదుకులకాంభోజియును, నాట, ఛాయనాట, గంభీరనాట, సారంగనాట. ప్రతాపనాట యును, గౌళ, రీతిగౌళ, నారాయణగౌళ, కేదారగౌళ, ఛాయాగౌళయును, మల్లారు, సామంతమల్లారు, గౌడమల్లారు, చెంచుమల్లారు, మొదలగురాగములను మిశ్రరాగములని చెప్పబడును.

ఉభయసంగీతఏకనామరాగములు:— కర్నాటక, హిందూస్థానీ సంగీతముల రెంటిలోను ఒకే పేరుతో నుండునట్టి రాగములను ఉభయసంగీత ఏకనామ రాగములని చెప్పదగును, ఉ॥ కల్యాణి, యమునాకల్యాణి, కానడ, అఠాణా, ఖమాసు, బేహాగ్ మొదలగురాగములు యీరకమునకు చెందును.

ఉభయసంగీతఏకరాగములు:—మన కర్నాటకసంగీతములోని కొన్నిముఖ్యరాగములకు సమమైన హిందూస్థానీరాగముల నీ దిగువ గమనించునది.

| | కర్నాటక రాగములు— | | | హిందుస్థాని రాగ॥ |
|---|---|---|---|---|
| 1 | తోడిరాగమునకు— | సమమైనది— | | భైరవి |
| 2 | మాయామాళవగౌళ | ,, | | భైరవ |
| 3 | సావేరి | ,, | ,, | జౌనియ |
| 4 | ఆభేరి | ,, | ,, | భీమ్‌పలాస్ |
| 5 | హిందోళ | ,, | ,, | మాల్‌కౌస్ |
| 6 | ఖరహరప్రియ | ,, | ,, | కాపి |
| 7 | శ్రీరంజని | ,, | ,, | భాగేశ్వరి |
| 8 | శుద్ధసావేరి | ,, | ,, | దుర్గా |
| 9 | నాటకురంజికి— | సమమైనది— | | మాల్కుంజి |
| 10 | ద్విజావంతి | ,, | ,, | జయ్‌జయ్‌వంతి |
| 11 | శంకరాభరణము | ,, | ,, | బిలావల్ |
| 12 | మోహన | ,, | ,, | భూప్ |
| 13 | నాట | ,, | ,, | తిలాంగ్ |
| 14 | శుభపంతువరాళి | ,, | ,, | తోడి |
| 15 | పూర్వకల్యాణి | ,, | ,, | పూర్వి |
| 16 | హంసానంది— | ,, | ,, | సోహనీ |

హిందూస్థానీ సంగీతమునుండి స్వీకరింపబడినరాగములు:— ఇవి ముఖ్యంగా 6 రాగము లగును. అవి ఉ॥ మాండ్, బేహాగ్, కాఫీ, జంఝూటి, ఫరజు, ఖమాసు.

క్రీ. శ. 1876 తరువాత కల్పింపబడినరాగములు: — ప్రస్తుతము వాడుకలో నున్న 1. కదనకుతూహలము 2. వలజి 3. సునాదవినోదిని మొదలగురాగములగును.

వివిధపేర్లుగల ఒకేరాగములు:—ప్రస్తుతము వాడుకలోనున్నటువంటి ధన్యాసి, యదుకులకాంభోజి, వంటిరాగములు యీ రకమునకు చెందినవగును.

ఉ॥ i ధన్యాసి, ని— ధన్నాశి, ధనాశీ, ధనాసరి, ధనాశ్రీ అనియును,

ii యరుకుల కాంభోజి, ని—ఎరుకల కాంభోజి, ఎరుకుల కాంభోజి, యరకల కాంభోజి అనియును చెప్పబడును.

రెండు పేర్లుగల ఒకేరాగములు :— ఈ దిగువ దెలుపబడినరాగము లగును.

| | | |
|---|---|---|
| ఉ॥ 1. ఆందోళిక | ఈ రాగమును, | మయూరధ్వనిరాగమనియును, |
| 2. ఉదయరవిచంద్రిక | ,, | శుద్ధధన్యాసి ,, |
| 3. మంగళకైశిక | ,, | మంగళకైశికి ,, |
| 4. రామమనోహరి | ,, | రమామనోహరి ,, |
| 5. రేవగుప్త | ,, | రేవగుప్తి ,, |
| 6. సౌరాష్ట్రి | ,, | సురాష్ట్రియని పిలువబడును. |

ఒకే పేరుగల రెండు రాగములు :— ఈ క్రింద దెలుపబడినరాగము లగును.

ఉ॥ 1. అమృతవర్షిణి — 39వ, మేళజన్యము. సరిగమపధనిపస — సనిపధమగరిస.
2. అమృతవర్షిణి — 66వ, మేళజన్యము. సగమపనిస — సనిపమగస.

1. మయూరధ్వని — 44వ, మేళజన్యము. సరిగమపధనిస — సధనిధపమపగరిస.
2. మయూరధ్వని — 45 వ, మేళజన్యము. సరిమపధనిస — స ని ధ ప మరిస.

1. మాధవకల్యాణి — 10 వ, మేళజన్యము. స రి గ ప ధ స—స ని ధ ప మ గ రి స.
2. మాధవకల్యాణి — 65 వ, మేళజన్యము. స రి గ మ ప ధ స — స నిధపమగరిస.

పరస్పర గ్రహాభేదముచే నేర్పడు జంట లేక జోడు రాగములు :— ఈ క్రింద దెలిపిన రాగము లీతరగతికి చెందినవగును.

1 శంకరాభరణము — దీని మధ్యమమును గ్రహస్వరము చేసినచో — కల్యాణి యేర్పడును.
2 కల్యాణి — దీనిపంచమమును గ్రహస్వరము చేసినచో—శంకరాభరణమేర్పడును.

3 శంకరాభరణము — దీని రిషభమును గ్రహస్వరము చేసినచో —ఖరహరప్రియ యేర్పడును.
4 ఖరహరప్రియ — దీని నిషాదమును గ్రహస్వరము చేసినచో — శంకరాభరణరాగము యేర్పడును. గనుక వీటిని పరస్పర గ్రహాభేదముచే నేర్పడు జంట రాగములు, లేక జోడురాగములని చెప్పబడును.

రి ష భ గ్ర హ రా గ ము లు:—ఇవి రిషభస్వరముతో ప్రారంభింపదగిన రాగములకు వర్తించు పేరు. ఉ॥ హూరువధన్యాసి (32వ, మేళజన్యము) వంటి రాగములగును.

ధై వ త గ్ర హ రా గ ము లు:—ఇవి ధైవతస్వరముతో ప్రారంభింపదగిన రాగములకు వర్తించు పేరు. ఉ॥ వసంతభైరవి (13 మే॥ జ॥) సారంగనాట (15 మే॥ జ॥) రీతిగౌళ (20 మే॥ జ॥) ఆనందభైరవి (20 మే॥ జ॥) అమృతవాహిని (20 మే॥ జ॥) వంటిరాగము లీతరగతికి చెందును.

నిషాదగ్రహరాగములు :— ఇవి నిషాదస్వరముతో ప్రారంభింపదగిన రాగములకు వర్తించుపేరు. ఉ॥ నాదనామక్రియ (15 మే॥ జ॥) బౌళి (15 మే॥ జ॥) కళావతి (16 మే॥ జ॥) జయంతశ్రీ (20 మే॥ జ॥) కన్నడగౌళ (22 మే॥ జ॥) వంటిరాగము లగును. మిగతరాగములు షడ్జగ్రహమునకు చెందినవగును.

కర్నాటక రాగములకు సమమైన తేవారములందలి పణ్‌లు:— ఈ క్రింద దెలుపబడిన 15 కర్నాటక రాగములకు తమిళములోని తేవారములందుగల 15 పణ్‌లు (రాగములు) సమానమని తెలియదగును.

| కర్నాటక రాగములు | — తేవారములందలి పణ్ (రాగము)లు. | |
|---|---|---|
| 1 ఆహిరి | ... పంచమమ్ | (Panchamam) |
| 2 నాదనామక్రియ | ... శికమారమ్ | (Sikamaram) |
| 3 భూపాలము | ... పురనీర్మై | (Puranirmai) |
| 4 సౌరాష్ట్రము | ... వియాళక్కుఱింజి | (Viyazhakkurinji) |
| 5 భైరవి | ... కౌశికమ్ | (Kausikam) |
| 6 మధ్యమావతి | ... శెందురుతి | (Senturuti) |
| 7 కేదారగౌళ | ... గాంధార పంచమమ్ | (Gandharapanchamam) |
| 8 సామ | ... అందాళిక్కుఱింజి | (Andalikkurinji) |
| 9 కాంభోజి | ... తక్కేశి | (Takkesi) |
| 10 యదుకుల కాంభోజి | ... శెవ్వాళి | (Sevvazhi) |
| 11 శంకరాభరణము | ... పళమ్ పంజురమ్ | (Pazhampanjuram) |
| 12 నవరోజు | ... కొల్లి | (Kolli) |
| 13 నీలాంబరి | ... మేగరాగక్కుఱింజి | (Megaragakkurinji) |
| 14 నాట | ... నట్టపాడై | (Nattapadai) |
| 15 పంతువరాళి | ... సాదారి | (Sadari) |

## గమక వివరణము.

గమకము :—గానముచేయునపుడు సంగీత సంప్రదాయజ్ఞులు శుద్ధ, వికృతి, భేదముగల స్వరములను సహజమైన ఆయాధ్వనులందే గానముచేయక వినుటకు రంజకము కలుగునట్లుగా, కదలించుటను గమకమనబడును. అనగా! ఏదైన ఒక స్వరమును దాని సహజమైన ధ్వనియందేగాక ప్రక్కనవున్న మీది స్వరచ్ఛాయను కూడ పొందునటుల జేయుటను గమకమనబడును. ఇట్టి గమకములు 15 రకములని శ్రీ వెంకటమఖి చెప్పియుండెను. వీటినే పంచదశగమకములందురు. [ఛాయ = శోభ]

పంచదశగమకములు:—1. కంపితము 2. లీనము. 3. ఆందోలితము 4. ప్లావితము. 5. స్ఫురితము 6. తిరుపము. 7. ఆహతము 8. వళి. 9. ఉల్లసితము 10. హుంపితము 11. కురుళము 12. త్రిభిన్నము 13. ముద్రితము 14 నామితము 15 మిశ్రితములను వాటిని పంచదశ గమకములని చెప్పబడును. వాటి వివరముల నీక్రింద దెలుపుట గమనింపదగును.

i కంపితము:—ఏదైన ఒక స్వరమును ఒక అక్షరకాలము కదలించుటలో దానికి దగ్గరనున్న మీది స్వరముయొక్క ఛాయను రాకుండునటుల జేయుటను "కంపిత"మని చెప్పబడును [కంపితము = కదలింపు.] [దీనిగురుతు ~~~ ]

(ii) లీనము:—ఏదైన ఒక స్వరమును రెండక్షరకాలము కదలించి దానికి డాసినమీది (పైనున్న) స్వరముయొక్క ఛాయనురప్పించి, లయింపజేయుటను "లీన"మని చెప్పబడును. [లీనము = లయింపు, లేక తగులజేయుట.]

(iii) ఆందోలితము:—ఏదైన ఒక స్వరమును నాలుగు అక్షరకాలము వరకు కదలించి దానికి మీది స్వరముయొక్క ఛాయను రప్పించుటను "ఆందోలిత" మని చెప్పబడును. [ఆందోలితము = ఊఁగడము.]

(iv) ప్లావితము:—ఏదైన ఒక స్వరమునందు పదిరెండక్షరకాలము కదలించి దానికి దగ్గరమీది స్వరముయొక్క ఛాయను రప్పించుటను "ప్లావిత"మనబడును. [ప్లావితము = తేలుట] పైన దెలిపిన 2, 3, 4 గమకములును కంపిత భేదములగును.

(v) (1) స్ఫురితము:—అనగా స స, రి రి మొదలగు ఆరోహణ జంట స్వరములలో రెండవ స్వరమునందు షుమారు ముప్పాతిక అక్షరకాలము నిలచి కొట్టి దానికి దగ్గర క్రింది స్వరముయొక్క ఛాయనురా జేయుటను, "స్ఫురిత"మనబడును. ఉదా:—స స. అను దానిలో రెండవ స, ను కొట్టి స ని స, అగునట్లు జేయుటను "స్ఫురిత"మనబడును. [స్ఫురితము = తోచుట లేక చలనము.] [దీని గురుతు ∴]

(2) ప్రత్యాఘాతము:—అనగా యిది పైవిధముగా అవరోహణ జంట స్వరములలో రెండవ స్వరమును కొట్టి దానికి మీది స్వరముయొక్క ఛాయను రప్పించుటగును. ఉ॥ స స, అను దానిని స రి స, అగునట్లు జేయుట "ప్రత్యాఘాత"మని చెప్పబడును. దీనిని స్ఫురితమునకు మాఱుగా "డోలము" అని కూడ చెప్పబడును. [డోలము = కదలింపు] ఈ కదలింపు, ముత్యములోని పొరలిన నీటివలె నుండును.

(vi) తిరుపము:—అనగా 'ఏదైన ఒక స్వరమునందు అర అక్షరకాలము నిలిచి దానిని అదిమి డాసిన మీది స్వరముయొక్క ఛాయను రాజేయుట "తిరుప" మనబడును. దీనినే "నొక్కు" అని కూడ చెప్పుదురు. [తిరుప్ = హింసపరచుట.]

(vii) ఆహతము :—అనగా కొట్టుటయగును. ఇది రెండు విధములగును. అవి 1. రవ 2. ఖండింపు, అని చెప్పబడును.

(1) రవ:—అనగా ఏదైన ఒక స్వరము పైనుండి క్రిందికి దిగునపుడు పైస్వరము యొక్క ఛాయతో క్రింది స్వరమునకు దిగుటను "రవ"యనబడును. ఉదా :—ప మ, అని దిగునపుడు, ప ప మ, అని పలికించుటను "రవ"యని చెప్పబడును.

(2) ఖండింపు :—అనగా ఒక స్వరమునుండి దానికి డాసిన క్రింది స్వరముగాక, మరియొక క్రింది స్వరమునకు దిగునపుడు నడిమి స్వరమును ఖండించి క్రింది స్వరమునకు పై ఖండింపబడిన స్వరచ్ఛాయను గలుగజేయుట "ఖండింపు" అనబడును. ఉదా:—మరి, అను దానిని మ గ రి, అనునటుల పలికించుట "ఖండింపు"యనబడును.

(viii) వళి :— అనగా ఏదైన ఒక స్వరమును సుడియించిపట్టి దానిమీది స్వరముయొక్క ఛాయనురాజేయుట "వళి" యనబడును. (వళి = సుడియింపు)

(ix) ఉల్లసితము :—అనగా దీనిని "జారు"అని చెప్పబడును. ఇది రెండు విధములు. అవి 1. ఎక్కుజారు 2. దిగుజారు లగును.

(1) ఎక్కుజారు :— అనగా ఒక స్వరమునుండి దానికిపైగల ఏదేని మరియొక స్వరమునకేగునపుడు నడుమనుండుస్వరముల నంటిరాచుకొనిపోవుటగును. ఇటుల పోవునపుడు నడుమనుండు స్వరములఛాయ, లోపల నణగియుండునేగాని వ్యక్తముగా వినబడదు. ఉదాహరణము :— షడ్జమునుండి పంచమునకేగునపుడు షడ్జమునందే పంచమస్వరమును ప్రారంభించుచూ రిషభ, గాంధార, మధ్యమ, స్వరముల నణచి పంచమస్వరస్థానమునకేగుటను "ఎక్కుజారు" అనిచెప్పబడును. (జారు = జారడము.)

(2) దిగుజారు :— అనగా పైనజెప్పినవిధమున అవరోహణముగా ఉ॥ పంచమమునుండి షడ్జమునకు వచ్చు గమకమును "దిగుజారు" అని చెప్పబడును.

(x) హుంపితము :— అనగా దీనినే "గుంభితమని" చెప్పుదురు. ఇదియు జారు,నుబోలినదిగాయుండి, బయలువెడలినదిమొదలు నిలుచువరకు నాదము హుం, అనునటుల ఆరోహణక్రమమున నేగుటయును, అవరోహణక్రమమున దిగుటయును "హుంపిత"మని చెప్పబడును. (హుంపితము = హుం అని ధ్వనిని వర్ధిల్లజేయుట).

(xi) కురళిము :— అనగాయిది రెండు విధములగును. అవి 1. ఒదిగింపు 2. ఒరయిక లగును. (కురళిము = ముంగురులు.)

(1) ఒదిగింపు :— అనగా ఒకస్వరస్థానమందే దానికి పై స్వరముగాని, లేక రెండవ, స్వరముగాని పలుకునటులజేయుటను "ఒదిగింపు"యనబడును.

ఉదా॥ రి ష భ స్వరమునందే గాంధారముగాని, మధ్యమము గాని పలుకునటుల జేయుటను "ఒడిగింపు" అనిచెప్పబడును. ఇది వీణలోమాత్రము పలికింపదగును.

(2) ఒ ర యి క :— అనగా ఒక స్వరమునుండి మరియొక స్వరమునకు దిగు నపుడు దానికి మీదిస్వరములయొక్క ఛాయను గనుపించునటుల రాచుకొనిదిగుటను "ఒరయిక" లేక "ఒరిక" యనిచెప్పబడును. (ఒరిక = రాచుట)

ఉదా:- సా నీ ధా పా = అనునది సా రి, నీస, ధా ని పా, ఇటులపలికింపవలెను.

(xii) త్రి భి న్న ము :—అనగా వీణావాద్యములో మీది 1-2-3 తంత్రులను ఎడమచేతి వ్రేళ్ళతో నదిమి కుడిచేతివ్రేళ్ళతో ఒకేసారి రంజకమునకై మీటుటను "త్రిభిన్న" మని చెప్పబడును.

(iii) ము ద్రి త ము :— అనగా నోటినిమూసుకొని స్వరములను కదలించి పాడుటను "ముద్రిత" మని చెప్పబడును. ఇది గాత్రపాటయందే చేయదగును.

(xiv) నా మి త ము :—అనగా నాదము తగ్గించి సూక్ష్మధ్వనితో పాడుట వలన గలుగు స్వరముల కదలింపును "నామిత" మని చెప్పబడును.

(xv) మి శ్రి త ము :—అనగా పైన దెలుపబడిన గమకములలో నేవేని రెండు లేక మూడు గమకములు కలిసివచ్చునట్లు జేయుట "మిశ్రిత" మని చెప్పబడును.

పైన దెలిపియున్న 15 గమకములలో పది మాత్రమేగలవని కొందరు తెలిపియున్నను, వాటి వివరములు యేప్రమాణ గ్రంథములందును గనుపడనందున వాని నిచట దెలుప బడలేదని దెలియదగును. మరియు నిశ్శంకుడగు శార్ఙ్గదేవుడు తన "సంగీతరత్నాకర ము"న పైన దెలుపబడిన 15 విధములగు గమకములును "ఏతేషాం మిశ్రణాన్మిశ్రా స్త స్యాస్యుః ర్వ్యాధరయోభిధాః" యను ప్రమాణమున ఒకటితో నొకటిచేరి మిశ్ర గమక ములగుచున్నవనియును, అవి యనేకమనియును, "తాసాంతుస్థాయవాగేషు విశ్రుతిస్స విధాస్వతే॥ అను ప్రమాణమున యీగమకములు స్థాయవాగమునం దుపయోగింపబడు చున్నవనియును, చెప్పుటయేగాక స్థాయములనెడి 96 రాగావయవములను, వాటికి సంకీర్ణా సంకీర్ణ లక్షణములను కూడా జెప్పియుండుట గమనించదగును. స్థాయమను శబ్దమునకు రాగావయవమనియును, "వాగమ" ను శబ్దమునకు గమకము అనియును అర్థము. గనుక స్థాయవాగమనగా గమకములను అవయవముగా బడసిన రాగమని తెలియదగును. మన సంగీతములో పై గమకములను దెలుపుటకు స్వరములపైన కొన్ని రకముల వంకరగీతలను యేర్పరచుచుండిరి. ఇదేవిధముగా పాశ్చాత్యసంగీతములోకూడ కొన్ని స్వరములను కలిపి ఒకేపదజాలముతో మాధుర్యముగ వాయింపవలెనని తెలియ పఱచుటకు స్వరములపైన కొన్ని రకముల చుక్కలను గీతలను యేర్పఱచుచుండిరి. ఆ గుర్తుల ననుసరించియే పాశ్చాత్య సంగీతమును ప్రదర్శింతురని తెలియదగును.

దశవిధగమక వివరము.—ప్రకృతకాలమున కొందరు నవీనగ్రంథకర్తలు గమకములు దశవిధములుగా వ్రాసియున్నారు. అవి యేవనగా 1 ఆరోహణము. 2. అవరోహణము 3. ఢాలు 4. స్ఫురితము 5. కంపితము 6. ఆహతము 7. ప్రత్యాహతము 8. త్రిపుచ్ఛము 9. ఆందోళనము 10. మూర్ఛన లగును. వీటిలో 1, 2, 10 గమకములగు ఆరోహణ, అవరోహణ, మూర్ఛనలనబడు మూడును త్రికాలముల యందును వాడబడుచున్నందున వీనికి కంపితముగలుగుటలేదు. గనుక నివిగమకములు కానేరవు. మరియు ఈ దశవిధగమకములు ప్రాచీనగ్రంథస్థమైనవి గావనియు, ప్రాచీన గమకములతో కొన్నిటినిమాత్రమేజేర్చి యీ దశవిధ గమకముల నెవరో కల్పించియుండవచ్చుననియు స్పష్టమగుచున్నది. అంతేగాక ఈ దశవిధగమకములవల్ల రాగములను సంపూర్ణముగ పోషించుట, కేవలము సాధ్యముకానేరదు. గనుకనే "నిశ్శంకుడు" గమకము లనేకము యుండినగాని రాగస్ఫూర్తి కలుగదని స్పష్టీకరించి యుండుటకు కారణమైనదని గ్రహించునది.

## రాగ వివరము.

రాగము :— "యోసౌధ్వని విశేషస్తుస్వరవర్ణ విభూషితః రంజకోజన చిత్తానాం సరాగః కధితోబుధైః॥ (సం.ర) యనెడి శ్లోకానుసారము స్వరవర్ణములచే నలంకరింపబడి వినువారి చిత్తమును రంజింపచేయుధ్వని విశేషమును రాగమని చెప్పబడును. (రాగము = ఆస) ఈ రాగములకుగ్రహ, అంశ, మంద్ర, తార, న్యాస, అపన్యాస, సన్యాస, విన్యాస, బహుత్వ, అల్పత్వములను పదిలక్షణములను మతంగాది మునులు జెప్పియుండిరి. ఆ పది లక్షణములయొక్క వివరముల నీక్రింద దెలుపుట గమనించునది.

రాగదశలక్షణ వివరము :—ఇవి 10 విధములుగానుండుట నీ క్రిందగమనించునది.

i గ్రహము :— అనగా ఒక రాగముగాని లేక అందుగల సంగతులుగాని మొదట యే స్వరముచే ప్రారంభింపబడుచున్నవో యా స్వరమును "గ్రహము" లేక గ్రహస్వరమని చెప్పబడును. (గ్రహము = గ్రహించుట.) రాగలక్షణములందు ఒక్కొక్కరాగమున కొక్కొక్కస్వరము గ్రహస్వరమని విధింపబడియుండును. ఒక రాగమునకు షడ్జముగాక మరియొకస్వరము గ్రహముగా విధింపబడియున్నచో, నది యే స్వరముగానున్నను, షడ్జస్వరస్థానమునుండియే పాడుకొనవలెననియు షడ్జగ్రహమునుకూడ షడ్జస్వరస్థానమునుండియే పాడుకొనవలెననియు తెలియుచున్నది. ఈ గ్రహస్వరలక్షణమును క్రీస్తుశకము. 1550 కాలమునగల శ్రీ గోవిందామాత్యులు తన "రాగతాళచింతామణి" యను పద్యకావ్యములో జెప్పియుండుటచే నిది షుమారు 400 సంవత్సరముల క్రిందటి సంప్రదాయమని తెలియదగును.

ii అంశము :— అనగా ఒక రాగమునుగాని లేక సంగతులనుగాని పాడునపుడు ఆ రాగకళను జూపుటకై మాటిమాటికి ప్రయోగింపబడి రంజకము కలిగించునదియును, రాజువలె ముఖ్యమైనదియునగు స్వరమును 'అంశస్వరము' లేక 'జీవస్వరమని' చెప్పబడును.

iii మంద్రము:—అనగా ఒక రాగమునుగాని లేక సంగతులనుగాని తగ్గుస్వరములతో పాడునది "మంద్రము" లేక 'మంద్రస్వర' మనబడును. ఇది మంద్రస్థాయి స్వరము అగునని కొందఱు చెప్పుదురు. దీనినే మంద్రగతియనిగూడ చెప్పటకలదు.

iv తారము :—అనగా ఒక రాగమునుగాని లేక అందుగల సంగతులనుగాని ఉచ్ఛస్వరముతో పాడుట "తారము" లేక "ఉచ్ఛస్వర" మని చెప్పబడును. దీనినే తారగతియనిగూడ చెప్పటకలదు.

v న్యాసము :— అనగా ఒక రాగమునందుగాని లేక సంగతులందుగాని పాడి ముగించు స్వరమును "న్యాసము" లేక "న్యాసస్వర"మని చెప్పబడును.

షరా :- ఏదైన నొక రాగమునకు గ్రహ, అంశ, న్యాసములు జెప్పబడని యెడల ఆ రాగమునకు షడ్జమునే గ్రహ, అంశ, న్యాసములుగా నెంచి పాడుట సంప్రదాయమని గ్రహింపదగును.

vi అపన్యాసము :— అనగా ఒక రాగమునుగాని లేక సంగతులనుగాని పాడునపుడు నడుమ, నడుమ ముగించుస్వరమును "అపన్యాస"మని చెప్పబడును. ఇందు సన్యాస, విన్యాసము లణగియున్నవని భరతాదులు చెప్పియుండుట గమనించదగును.

vii సన్యాసము :— అనగా ఒక రాగమును పాడునపుడు దానిని పలు ఖండములుగ భాగింపబడి, ఒక్కొక్క ఖండమును ముగించు స్వరమును "సన్యాసము" లేక "సన్యాసస్వర"మని చెప్పబడును.

viii విన్యాసము :— అనగా ఒక రాగమును పాడునపుడు దానిని పలు ఖండములుగాజేసి ఆ యా ఖండములలో రాగకళలను జూపుటకై మాటిమాటికివచ్చు ఖండావయవమునుగానుండుస్వరమును 'విన్యాసము' లేక 'విన్యాసస్వర'మని చెప్పబడును.

ix బహుత్వము :— అనగా ఒక రాగమును పాడునపుడు ఒకేస్వరమును మాటిమాటికి గ్రహించిపాడుటను 'బహుత్వ'మని చెప్పబడును. ఇది రెండు విధములు. అవి 1. అలంఘనము 2. అభ్యాసము లగును.

(1) అలంఘనము :— అనగా ఒకరాగమును పాడునపుడు ఒకేస్వరమును విడువక పాడునది "అలంఘన"మని చెప్పబడును.

(2) అభ్యాసము :— అనగా ఒక రాగమును పాడునపుడు ఒకేస్వరమును ఎడతెగకనైనను, మాటిమాటికైనను ఉచ్చరించుట "అభ్యాస"మని చెప్పబడును.

x అల్పత్వము :— అనగా ఒక రాగమును పాడునపుడు ఒక స్వరమును అధికముగా నుచ్చరింపకయుండుటను "అల్పత్వ"మని చెప్పబడును. ఇది రెండు విధములు. అవి 1. లంఘనము 2. అనభ్యాసము లగును.

(1) లంఘనము :— అనగా ఒక రాగమును పాడునపుడు ఒక స్వరమును యేమాత్రము నుచ్చరింపక విడిచి దానిమీది స్వరమునకుదాటుట "లంఘన"మని చెప్పబడును.

(2) అనభ్యాసము :— అనగా ఏదైన ఒక రాగమును పాడుటలో ఒక స్వరమును మాటిమాటికి నుచ్చరింపక, యేదైన ఒక సమయమున అల్పముగా నుచ్చరించుటను "అనభ్యాస"మని చెప్పబడును. పైన దెలుపబడిన రాగదశలక్షణములు ప్రాచీనరాగములకేగాని యిప్పటిరాగములకు కానేరవనియు, యిప్పటిరాగములకు గ్రహ, అంశ, న్యాసములను మూడు లక్షణములుమాత్రమే గలవనియు శ్రీ వెంకటమఖి, తన గ్రంథములో పేర్కొనియున్నను, యిప్పటి ప్రసిద్ధ సంగీత సంప్రదాయజ్ఞుల యొక్క గానమును పరిశీలించినచో నీపదిలక్షణములు రాగాలాపనలో స్పష్టముగా కనపడుచుండునని తెలియదగును.

తానము :— అనగా స్వరముల విస్తరింపు లేక గుణించుటను "తాన"మని చెప్పబడును. ఇది రెండు విధములు. అవి 1. శుద్ధతానము 2. కూటతానము లగును.

i శుద్ధతానము :—ఇది తానములోని రెండు రకములలో మొదటిది యగును. ఇందుగలస్వరములు ఒక క్రమమైనవిధమున అభివృద్ధిచెందుచూ, తగ్గుచూ, రాగమును ప్రకాశింపజేయుచుండును. ఇట్టి శుద్ధతానములు రమారమి 84 వఱకు గలవని తెలియుచున్నది. ఉ॥ శంకరాభరణము, కల్యాణి మొదలగు రాగములు యిట్టి తానములకుపయోగింప తగినవగును.

ii కూటతానము :— ఇది తానములోని రెండు రకములలో రెండవది యగును. ఇందు రెండు రాగములు ప్రకాశించును. ఎటులనగా! ఈ కూటతానములోని మొదటి సగభాగము నందొకరాగమును, రెండవ సగభాగము నందొకరాగమును ప్రకాశింపవలెనని ప్రాచీనలక్షణకారులు దెలిపియున్నను, కొందరు యీకూటతానము రెండురాగముల నేగాక యధికరాగకళలను స్ఫురింపజేయునదియగునని జెప్పుచున్నారు. మఱికొందరు యీకూటతానము భాషాంగరాగస్ఫూర్తిచే కలుగు తానమని చెప్పుటకూడ కలదు. అయితే భాషాంగరాగము తన జనకరాగస్వరములనే కలిగియుండి, రంజకము

కొఱకై అన్యరాగాంగ రాగస్వరములలో నొకటిగాని లేక రెండుగాని ఆయా తావులందు ప్రయోగింపబడి నంత మాత్రమున నది రెండు రాగములకుగల కళలను పూర్తిగా ప్రకాశింపజేయలేదు. గనుక నిది భాషాంగరాగస్ఫూర్తిచే గలుగు తానమనుట సరికాదని మాత్రము తెలియదగును. తానములు మరియొకపద్ధతిలో 6 విధములుగా చెప్పబడినవి. అవి 1. చక్రతానము 2. వక్రతానము 3. మిశ్రతానము 4, మాలికాతానము 5. గంభీరతానము 6. విస్యూతానము లగును. వీటివివరములను గ్రంథవిస్తరభీతిచేతను, వాడుకయందు అంతగా లేకపోపుటవల్లను నిచట దెలుపలేదని గ్రహించదగును.

తానములు మరియొకపద్ధతిలో రెండు విధములుగా విభజింపబడినవి. అవి 1. సంపూర్ణతానములు 2. అసంపూర్ణతానము లగును.

i సంపూర్ణతానములు :— ఇవి స రి గ మ ప ధ ని, అను సప్తస్వరములతో వచ్చునట్టి ప్రస్తారము లగును. ఇవి మొత్తము (720 × 7) 5040 అగును. వీటినే సంపూర్ణతానములని చెప్పబడును.

ii అసంపూర్ణతానములు :— ఇవి 6,5,4,3,2 యిటుల స్వరములు వచ్చునట్టి ప్రస్తారములకు గలపేరు. ఈ అసంపూర్ణతానములు మొత్తము 872 అగును. వాటి వివరములను యీ క్రిందదెలుపుట గమనించునది. సరి, అను రెండు స్వరములతో (సరి, రిస) వచ్చు ప్రస్తారములు 1 × 2 = 2ను, స రి గ, అను మూడు స్వరములతో వచ్చు ప్రస్తారములు 2 × 3 = 6ను, అనగా స రి గ, రి స గ, స గ రి, గ స రి, రి గ స, గ రి స, అనునవి యగును, స రి గ మ, అను నాలుగు స్వరములతో వచ్చు ప్రస్తారములు 6 × 4 = 24ను, స రి గ మ ప, అను అయిదు స్వరములతో వచ్చు ప్రస్తారములు 24 × 5 = 120ను, స రి గ మ ప ధ, అను ఆఱు స్వరములతోవచ్చు ప్రస్తారములు 120 × 6 = 720 అగును. గనుక మొత్తము 720 + 120 + 24 + 6 + 2 = 872ను, అసంపూర్ణతానములని చెప్పబడును. గనుక సంపూర్ణ, అసంపూర్ణ తానములుకలిసి మొత్తము 5040 + 872 = 5912 అని గ్రహించదగును. కూటతానముయొక్క ఆకారమును నిర్ణయించుపద్ధతిని నష్ట (పోగొట్టబడినది) అని చెప్పబడును. కూటతానముయొక్క క్రమసంఖ్యను కనుగొనుపద్ధతిని ఉద్దిష్ట (కోరబడినది) అని చెప్పబడును. సోమనాథుడు తన 'రాగవిబోధము'లో పేర్కొన్న 960 మేళములకు యీ నష్ట, ఉద్దిష్ట, సూత్రముల నుపయోగించెను. గనుకఒక మేళములోని స్వరములనునిర్ణయించుటకు నష్టఅనుసూత్రము, వరుససంఖ్యను కనుగొనుటకు ఉద్దిష్టఅనుసూత్రము సహాయము చేయుననిగ్రహించునది.

వర్ణము :— అనగా గానముయొక్క క్రియను "వర్ణ"మని చెప్పబడును. ఇది 4 విధములు. అవి (1) స్థాయివర్ణము (2) ఆరోహివర్ణము (3) అవరోహివర్ణము 4) సంచారివర్ణము లగును. వీటివివరములనీ క్రింద తెలుపుట గమనించునది.

i స్థాయి వర్ణము :— గానముచేయునపుడు గానము మొదట యే స్వరముచే ప్రారంభింపబడునో అదేస్వరమునకు తిరిగివచ్చి నిలచెడి గానక్రియను "స్థాయి వర్ణ"మని చెప్పబడును. ఉ॥ స స స స — రి రి రి రి — లేక సా పా సా, 2 సా సా సా (3) సా పా సా (4) స రి గ రి సా (5) రి గ మ ప మ గ రీ మొదలగునవి.

ii ఆరోహివర్ణము :— గానము చేయునపుడు గానము ప్రారంభించి నస్వరమునుండి క్రమముగా హెచ్చుచూ బోవునట్టి గానక్రియను "ఆరోహివర్ణ"మని చెప్పబడును. ఉ॥ స రి గ మ పా (2) రి గ మ ప ధా (3) గ మ ప ధ నీ మొదలగునవి యీ రకమునకు చెందును.

iii అవరోహివర్ణము :— గానము చేయునపుడు ప్రారంభించిన స్వరమునుండి క్రమముగాతగ్గుచూ బోవునట్టి గానక్రియను "అవరోహివర్ణ" మని చెప్పబడును. ఉదా॥ స ని ధ ప మ గ రీ (2) ని ధ ప మ గ రి సా (3) ధ ప మ గ రి సా. మొదలగునవి యీ రకమునకు చెందును.

iv సంచారివర్ణము :— పైన కెలుపబడిన మూడు విధములగు వర్ణములు కలియునట్టి గానక్రియను "సంచారివర్ణ"మని చెప్పబడును. ఉ॥ స మ గ ని ధా (2) స ని ధ ప ధా (3) రి మ గ మ గ రి సా, మొదలగునవి యీ రకమునకు చెందును. అయితే యీ కాలమునందు యీ వర్ణములతో కూడిన ధాతు, మాతువులను వర్ణమెట్టని సాధారణముగా చెప్పుటకలదు.

అలంకారము:—అనగా వర్ణభేదములననుసరించి స్వరములను జేర్చుటయే గాక, గానమునకు అందమును గలుగజేయునట్టి భావగర్భితమగుసమ్మేళనమును 'అలంకార' మని చెప్పబడును. ఇట్టి అలంకారములేని గీతాదులు నిష్ప్రయోజనమని భరతాదులు చెప్పియుండుట గమనించదగినవిషయమగును. శార్ఙ్గదేవుడు తన 'సంగీత రత్నాకరము'లో ఈ అలంకారములను 5 విధములుగా జెప్పియున్నారు. అవి (1) స్థాయిగతాలంకారము, (2) ఆరోహ్యాలంకారము, (3) అవరోహ్యాలంకారము, (4) సంచార్యాలంకారము (5) సప్తాలంకారములగును. అహోబలుడు తన "సంగీత పారిజాతము"లో ప్రసిద్ధమైన 7 అలంకారములను జెప్పియున్నారు. సూళాదిమార్గములైన యీ 7 అలంకారములనే ధృవాదిసప్తతాళములుగ జెప్పబడుచూ నేటికాలమున అందరిచేతను వాడబడుచున్నవి. వెంకటమఖి తన 'చతుర్దండిప్రకాశిక' గ్రంథములో అలంకారములను పేర్కొనునపుడు సూళాదిసప్తతాళములకు సప్త అలంకారములును, ఝంపటాతాళమునకు మరియొక అలంకారమునుజేర్చి మొత్తము 8 అలంకారములుగా జెప్పియుండిరి. సూళయనగా గీతమని యర్థము. సూళయను నది దేశీయపదమగును. "లడయోరభేదః"అను ప్రమాణమున సూడశబ్దములోగల డ,కారమునకు ల,కారమువచ్చి సూళయైనదని గ్రహించునది.

# తాళప్రకరణము.

తాళము :— మనము పాడునట్టి సంగీతరచనయొక్క కాలప్రమాణమును చేతితోకొలచిగాని తాళయంత్రము కొట్టుటవలనగాని తెలుపునది తాళమని చెప్పబడును. ఈ తాళము రెండు విధములు. అవి (1) మార్గతాళము (2) దేశితాళము లగును. ఇవి ఒక్కొక్కటి 1. శుద్ధము 2. సాలగము 3. సంకీర్ణములను మూడు విధములుగా నుండును. మరియు తాళమునకు దశప్రాణములుగలవు. వాటిని యీ క్రింద దెలుపుటను గమనించునది. అవి 1. కాలము 2. మార్గము 3. క్రియ 4. అంగము 5. గ్రహము 6. జాతి 7. కళ 8. లయ 9. యతి 10. ప్రస్తారము లగును.

i కాలము :— సంగీతముయొక్క వేగమునుదెలుపునది "కాల"మని చెప్పబడును. ఇది పది విధములుగా నుండును. అవి ఎటులనగా! నూరు తామరరేకులను దొంతిగాబెట్టి సూదితో పొడుచునపుడు అందు ఒక తామరరేకు తెగునట్టికాలము 1 క్షణమనియు, అట్టి 8 క్షణములకాలము 1 లవమనియు, అట్టి 8 లవములకాలము 1 కాష్టమనియు, అట్టి 8 కాష్టములకాలము 1 నిమిషమనియు, అట్టి 8 నిమిషముల కాలము 1 త్రుటి లేక అనుద్రుతము లేక విరామమనియు, (1 అక్షరకాలము) అట్టి 2 అనుద్రుతములకాలము 1 ద్రుతమనియు, (2 అక్షరకాలములు) అట్టి 2 ద్రుతముల కాలము 1 చతురశ్రలఘువనియు, (4 అక్షరకాలములు) అట్టి 2 చతురశ్ర లఘువుల కాలము 1 గురువనియు, (8 అక్షరకాలములు) అట్టి 3 చతురశ్రలఘువులకాలము 1 ప్లుతమనియు, (12 అక్షరకాలములు) అట్టి 4 చతురశ్రలఘువులకాలము 1 కాకపాద మనియు (16 అక్షరకాలములు) చెప్పబడును. పైనదెలిపిన 1 అక్షరకాలమనునది ఒక హ్రస్వాక్షరము నుచ్చరించుకాలమగును. ఇది పాతిక మాత్రయని చెప్పబడును. గనుక ముందు దెలుపబడు తాళషడంగములలో అనుద్రుతము పాతికమాత్రగను, ద్రుతము అరమాత్రగను, చతురశ్రలఘువు ఒక మాత్రగను, గురువు రెండు మాత్రలుగను, ప్లుతము మూడుమాత్రలుగను, కాకపాదము నాలుగుమాత్రలుగను తెలియదగును.

ii మార్గము :— ఒకదానికొకటి ద్విగుణీకృతములైన కాలప్రమాణములతో పాడుటను "మార్గ"మని చెప్పబడును. ఇది మూడు విధములు. అవి (1) దక్షిణము (2) వార్తికము (3) చిత్రము లగును. వీటినే యిప్పుడు ప్రథమ, ద్వితీయ, తృతీయ కాలములనియు, మరియు విళంబ, మధ్య, ద్రుతకాలములనియు చెప్పబడుచున్నవి. పై మూడుమార్గములు ఒక్కొక్కదానికి 3 భేదములవంతున 3 × 3 = 9 భేదములగు చున్నటుల కల్లినాథుడు తన వాఖ్యాన గ్రంథములో జెప్పియున్నారు. శార్ఙదేవుడు

యీ మార్గములు నాల్గు విధములనియు, అవి (1) ధ్రువము (2) చిత్రము (3) వార్తికము (4) దక్షిణము లగుననియు జెప్పియున్నారు. వాటి వివరము లేమనగా ?

i ధ్రువము :-ఒక మాత్రను ఒక కళగా గొనుదానిని 'ధ్రువ'మని చెప్పబడును.

ii చిత్రము:-రెండు మాత్రలను ఒక కళ గాగొనుదానిని 'చిత్ర'మని చెప్పబడును

iii వార్తికము :- మూడు మాత్రలను ఒక కళగాగొనుదానిని "వార్తిక" మని చెప్పబడును.

iv దక్షిణము :—నాల్గుమాత్రలను ఒక కళగాగొనుదానిని "దక్షిణ"మని చెప్పబడును. మార్గతాళములయొక్క కాలప్రమాణములు ఒకదానికొకటి ద్విగుణీకృతములని స్పష్టమగుటచే పై మార్గచతుష్టయములో మూడవదైన వార్తికము మూడు మాత్రలు ఒక కళగాగొనినందున యీ మార్గచతుష్టయవిధానము సమంజసముగాలేదని స్పష్టపడుచున్నది. అయితే కొన్నిగ్రంథములలో పైనదెలిపిన, దక్షిణ, వార్తిక, చిత్రములను మూటితో, చిత్రతర, చిత్రతమ, అతిచిత్రతమ అను వరి మూడుమార్గములను కూడ జేర్చి మొత్తము ఆఱు మార్గములుగా జెప్పియున్నారు. వీటినే తాళషణ్మార్గములను పేరుతో యిప్పటికాలమున వాడుచున్నందున వాటి మాత్రలు, అక్షరకాలములు మొదలగు వివరముల నీ దిగువను దెలుపుట గమనించునది.

తాళషణ్మార్గములు :— ఇవి మొత్తము 6 అగును. అందు మొదటి 3ను, పల్లవులయందును, రెండవ 3ను, యితర సంగీతరచనలయందును వాడుదురు.

i దక్షిణమార్గము :— ఇది తాళాక్షరమునకు 8 మాత్రలవంతున అనగా $8 \times 4 = 32$ అక్షరకాలములవంతున నడచునదిగానుండును.

ii వార్తికమార్గము :— ఇది తాళాక్షరమునకు 4 మాత్రలవంతున అనగా $4 \times 4 = 16$ అక్షరకాలములవంతున నడచునదిగానుండును.

iii చిత్రమార్గము :— ఇది తాళాక్షరమునకు 2 మాత్రలవంతున అనగా $2 \times 4 = 8$ అక్షరకాలములవంతున నడచునదిగానుండును. పై మూడుమార్గములును ముఖ్యముగా పల్లవులయందు నుపయోగింతురు.

iv చిత్రతరమార్గము :—ఇది తాళాక్షరమునకు 1 మాత్రవంతున అనగా $1 \times 4 = 4$ అక్షరకాలములవంతున నడచునదిగానుండును.

v చిత్రతమమార్గము :— ఇది తాళాక్షరమునకు అర్థమాత్రవంతున అనగా $4 \div 2 = 2$ అక్షరకాలములవంతున నడచునదిగానుండును.

vi అతిచిత్రతమమార్గము :— ఇది తాళాక్షరమునకు $\frac{1}{4}$ మాత్రవంతున అనగా $4 \div 4 = 1$ అక్షరకాలమువంతున నడచునదిగానుండును.

పై మూడుతాళమార్గములును స్వరావళి, జంట, అలంకార, గీత, వర్ణ, పద, కృతి,కీర్తనలవంటి వివిధ సంగీతరచనలు పాడునపుడు ముఖ్యంగా వుపయోగింపబడును. [1 మాత్ర =4 అక్షరకాలములు. 1 కళ =1 అక్షరకాలమని గ్రహింపవగును.]

iii, క్రియ :—ఏదైన ఒకతాళముయొక్క ఆవర్తమునందు, కొట్టుట, విసరుట, ఎంచుట, మొదలగు పనులచే తాళాంగములను జూపెంచుటను 'క్రియ' అని చెప్పబడును. ఇది రెండువిధములు. అవి :1) మార్గక్రియ (2) దేశ్యక్రియ అగును.

1. మార్గక్రియ :—ఇది రెండువిధములు. అవి (1) సశబ్దక్రియ (2) నిశ్శబ్ద క్రియలగును.

(1) సశబ్దక్రియ :—ఎడమ అరచేతిపై కుడిచేతితో శబ్దము కలుగునట్లు కొట్టుటను "సశబ్దక్రియ" అని చెప్పబడును. ఇది 4 విధములు. అవి 1. ధ్రువము. 2. శమ్యము. 3. తాళము. 4. సన్నిపాతములగును.

i. ధ్రువము :—శబ్దపూర్వకమైన చిటికను "ధ్రువము" అని చెప్పబడును.

ii. శమ్యము:—కుడి అరచేతియందు ఎడమచేతితో ఘాతవేయుటను "శమ్య" మని చెప్పబడును.

iii. తాళము :—ఎడమ అరచేతియందు కుడిచేతితో ఘాతవేయుట "తాళ" మని చెప్పబడును.

iv. సన్నిపాతము :—అభిముఖముగా నిలుపబడిన రెండుహస్తములతో సమముగా ఘాతవేయుటను "సన్నిపాత"మని చెప్పబడును. పైన దెలుపబడిన 4 రకముల క్రియలును, సశబ్దమార్గక్రియ లగునని తెలియునది.

2. నిశ్శబ్దక్రియ :—కుడిచేతివ్రేళ్ళను ఎంచుట, క్రిందికి దించుట, లేక విసరుట, చుట్టుట మొదలగు శబ్దరహితమగు క్రియలను "నిశ్శబ్దక్రియ"లని చెప్పబడును. వీటినే కళలని కూడ చెప్పుదురు. ఇవి 4 విధములు. అవి 1. ఆవాపము, 2. నిష్క్రామము, 3. విక్షేపము, 4. ప్రవేశకములగును.

i. ఆవాపము :—ఊర్ధ్వముఖమున పైకెత్తబడిన పతాకహస్తముయొక్క తర్జనీ, మొదలగు నాలుగువ్రేళ్ళను ముడుచుటను "ఆవాప"మని చెప్పబడును.

ii- నిష్క్రామము:—పైన దెలిపిన ముడిచిన 4 వ్రేళ్ళను క్రమముగా విప్పుటను "నిష్క్రామ"మని చెప్పబడును.

iii. విక్షేపము :—పైన చెప్పిన విప్పినహస్తమును వెలుపల కుడిపార్శ్వమునకు విదలించుటను "విక్షేప"మని చెప్పబడును.

iv. ప్రవేశకము :—పైన చెప్పిన విదలించిన హస్తమును అప్రదక్షిణముగా క్రిందివైపు ముందునకు రానిచ్చుటను "ప్రవేశక"మని చెప్పబడును. పై 4 రకముల క్రియలును "నిశ్శబ్దమార్గ క్రియ"లగునని తెలియునది."

(2) దేశ్యక్రియ :—ఇది 8 విధములు. అవి 1. ధ్రువక, 2. సర్పిణి, 3. కృష్ణ, 4. పద్మిని, 5. విసర్జిత, 6. విక్షిప్త, 7. పతాక, 8. పతిత లని చెప్పబడును.

i. ధ్రువక :—సశబ్దముతో కూడిన కుడిహస్తముయొక్క ఘాతను "ధ్రువక" మని చెప్పబడును."

ii. సర్పిణి :—కుడిచేతి పతాక హస్తమును ఎడమవైపునకు చాచుటను "సర్పిణి" అని చెప్పబడును.

iii. కృష్ణ :—పైన జెప్పిన చాచిన హస్తమును కుడిపార్శ్వమునకు తెచ్చుటను "కృష్ణ" అని చెప్పబడును.

iv. పద్మిని :—అరచేతిని క్రిందుగజేసి అధోముఖముగా చేతిని చాచుటను "పద్మిని" అని చెప్పబడును.

v, విసర్జితము :—పైన జెప్పిన అధోముఖ హస్తమును వెలుపలకు విసరుటను "విసర్జితము" లేక "విచ్చు" అని చెప్పబడును.

vi. విక్షిప్త :—పైన చెప్పిన హస్తముయొక్క వ్రేళ్ళను ముడుచుటను "విక్షిప్త"మని చెప్పబడును.

vii. పతాకము :—పతాక హస్తముగా బట్టిన చేతిని మీదికి యెత్తుటను "పతాక"మని చెప్పబడును.

viii. పతిత :—పైన జెప్పిన మీదికెత్తిన హస్తమును క్రిందికి దించుట "పతిత" యని చెప్పబడును. పైన దెలిపిన $4+4+8=16$ ను, మార్గ, దేశ్యక్రియల లోని విభాగములని గ్రహింపదగును.

iv. అంగము :— తాళఅక్షరకాలసంఖ్యను తెలియుటకు సాధనమగు సంజ్ఞా విశేషమును "అంగ"మని చెప్పబడును. ఇవి 6 విధములగును. అవి 1 అనుద్రుతము 2 ద్రుతము 3 లఘువు 4 గురువు 5 ప్లుతము 6 కాకపాదములనబడును. వీటినే షడంగములని చెప్పబడును. వాటి వివరము ఈ క్రింది పథకమున గమనించదగును. పైన దెలుపబడిన 6 అంగములలో మొదటి 3 అంగములగు అనుద్రుత, ద్రుత, లఘువులు మూడు మాత్రమే యీ కాలమున వాడుకలో నున్నవనియు, మిగత 3 అంగములు వాడుకయందు లేవనియు గ్రహింపదగును.

## షడంగములు, వాటిపేర్లు, సంజ్ఞలు, అక్షరకాలములు, క్రియలు, మాత్రలు, తెలుపు పధకము.

| అంగసంఖ్య. | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|---|
| షడంగముల నామములు. | అను ద్రుతము | ద్రుతము | లఘువు | గురువు | ప్లుతము | కాకపాదము |
| అంగసంజ్ఞలు. | ◡ | ○ | । | 8 | 8̇ | + |
| అక్షరకాలములు. | 1 | 2 | 4 | 8 | 12 | 16 |
| క్రియలు. | కొట్టుట. | కొట్టి, విసరుట. | కొట్టి, ఎంచుట. | కొట్టి, ఎంచి, విడచుట. | కొట్టిఎంచి చుట్టి, విడచుట. | సర్పిణి, కృష్ణ పతాక, పతిత ములజేయుట. |
| మాత్రలు. | పాతిక | అర | ఒకటి | రెండు | మూడు | నాలుగు |

పైన తెలిపిన షడంగక్రియల వివరముల నీ దిగువను తెలుపుట గమనించునది.

1. అనుద్రుతక్రియ :—అనగా ఎడమ అరచేతిమీద కుడిచేతితో కొట్టుటను (ధ్రువక) అనుద్రుతక్రియ, లేక ఘాత, లేక తట్టుయని చెప్పబడును.

2. ద్రుతక్రియ :—అనగా పైవిధముగానే కొట్టి (ధ్రువక) పైకి విసరుటను (విసర్జిత) ద్రుతక్రియ అని చెప్పబడును.

3. లఘుక్రియ :—అనగా మొదటివిధమున ఒక అక్షరకాలము కొట్టి (ధ్రువక) చిటికెనవ్రేలు మొదలుగా మూడువ్రేళ్ళను ఎంచుటను (విక్షిప్త) లఘుక్రియ అనబడును. ఇది చతురశ్రజాతియందు చెప్పబడిన దగుటచే నాలుగు అక్షరకాలము లని తెలియదగును. మఱియు జాతినిబట్టి యేర్పడు పంచలఘువులు 3, 4, 5, 7, 9, యిటుల వేరు వేరు అక్షరకాలములు గలవిగా నుండుననియు, అవి లెక్కించునపుడు మొదట ఘాతవేసి తరువాత మిగతఅక్షరకాలములు 2, 3, 4, 6, 8, యిటుల వ్రేళ్ళనెంచుట వలన గల్గుననియు, యీ వ్రేళ్ళనెంచుటనే "విక్షిప్తక్రియ" అని చెప్పబడుననియు గ్రహించునది. మఱియు నీ అయిదు విధములగు లఘువులతో చేరి మఱియొక విధముగా పదివిధములైన లఘువులుగలవు. ఆ 5 టినే మతాంతరపద్ధతిలో దివ్యసంకీర్ణాది పంచజాతి లఘువులని చెప్పబడును. వాటివివరములను ముందు తెలుపుట గమనించునది.

4, గురుక్రియ :—అనగా 1 వ, విధమున కొట్టి (ధృవక) 3 వ్రేళ్ళను యెంచి (విక్షిప్త) కుడిచేతిని 4 అక్షరకాలములు క్రిందికి విడచుటను (పతిత) "గురుక్రియ" అని చెప్పబడును.

5. ప్లుతక్రియ :—అనగా పైవిధముగా కొట్టి (ధ్రువక) 3 వ్రేళ్ళను ఎంచి (విక్షిప్త) కుడిచేతిని ఎడమచేతిచుట్టు 4 అక్షరకాలములు చుట్టి (సర్పిణి) కుడిచేతిని

4 అక్షరకాలముక్రిందికి విడచుట (కృష్ణ)ను "ప్లుతక్రియ" అనబడును. పైన దెలిపిన అయిదు విధములగుక్రియలను "సశబ్దక్రియ"లని చెప్పబడును.

6. కాకపాదక్రియ :—అనగా యిది ఒక నిశ్శబ్ద క్రియయగును. కుడిచేతిని 4 అక్షరకాలములు ఎడమప్రక్కకు కొనివచ్చి (సర్పిణి) పిమ్మట 4 అక్షరకాలములు కుడివంకకు త్రిప్పుకొనివచ్చి (కృష్ణ) తదుపరి ఆ కుడిచేతిని 4 అక్షరకాలములు మీదికెత్తి (పతాకము) అట్లు యెత్తిన కుడిచేతిని 4 అక్షరకాలములు క్రిందికి దించుటను (పతిత) కాకపాదక్రియ అనిచెప్పబడును. దీనినే 'నిశ్శబ్ద చతుర్లఘువు'అని కూడ చెప్పబడును. ఈ కాకపాదము పూర్తిగా నిశ్శబ్దక్రియలచే వేయబడునది గనుక అమంగళకరమని పూర్వాచార్యులు దీనిని వాడుకలో నుండి తొలగించియున్నారు.

నిషిద్ధక్రియ :—ఏదైనా ఒకతాళమును వేయునపుడు వ్రేళ్ళను ఎంచుట, ఉసి (విసర్జితము) వేయుట, మొదలగు శబ్దరహితమైన క్రియలను వేయుటలో కొందరు శబ్దము కలుగునట్లు ఆ క్రియలను గట్టిగా వేయుచుందురు. ఇట్టి క్రియలను "నిషిద్ధక్రియ"లని చెప్పబడును.

షడంగములకు గల విశేషనామములు :—తాళషడంగములకు గల విశేషనామములను యీ దిగువను దెలుపుట గమనించునది.

1 అనుద్రుతము, 2 అర్ధచంద్రము, 3 వ్యంజనము, 4 అను నాసికము, 5 అవ్యక్తము, 6 విరామము అను నీ ఆఱును "అనుద్రుతము"నకు గల పేర్లగును.

1 అర్ధమాత్ర, 2 ద్రుతము, 3 వ్యోమము, 4 బిందుకము, 5 వలయము అను నీ యైదును "ద్రుతము"నకు గల పేర్లగును.

1 మాత్ర, 2 సరళము, 3 హ్రస్వము, 4 కళ అను నీ నాలుగును "లఘువు"నకు గల పేర్లగును.

1 ద్విమాత్రకము, 2 గురువు, 3 వక్రము 4 కోణము, 5 యమళము, 6 దీర్ఘకము అను నీ ఆఱును "గురువు"నకు గల పేర్లగును.

1 సమోద్భవము, 2 ప్లుతము, 3 దీపము 4 త్రియంగము. 5 త్రిమాత్రకము, అను నీ యైదును "ప్లుతము"నకు గల పేర్లగును.

1 కాకపాదము, 2 హంసపాదము, 3 నిశ్శబ్దము, 4 చతుర్లఘువు అను నీనాలుగును 'కాకపాదము'నకు గల పేర్లగునని గ్రహించునది.

పైన దెలిపిన షడంగములుగాక షోడశాంగములను పదునాఱుఅంగములుకూడ గలవు. వాని వివరముల నీక్రింది పథకమున దెలుపుట గమనించునది.

## షోడశాంగములు, వాటిపేర్లు, అంగసంజ్ఞలు, అక్షరకాలముల దెలిపెడి పధకము.

| అంగసంఖ్య | షోడశాంగముల పేర్లు. | అంగసంజ్ఞ | అక్షరకాలము | అంగసంఖ్య | షోడశాంగముల పేర్లు. | అంగసంజ్ఞ | అక్షరకాలము |
|---|---|---|---|---|---|---|---|
| 1 | అనుద్రుతము | ∪ | 1 | 9 | గురు విరామము | ∪ 8 | 9 |
| 2 | ద్రుతము | ○ | 2 | 10 | గురుద్రుతము | ○ 8 | 10 |
| 3 | ద్రుత విరామము | ∪○ | 3 | 11 | గురుద్రుత విరామము | ∪○ 8 | 11 |
| 4 | లఘువు (చతురశ్ర) | ǀ | 4 | 12 | ప్లుతము | 8̇ | 12 |
| 5 | లఘు విరామము | ∪ ǀ | 5 | 13 | ప్లుతవిరామము | ∪ 8̇ | 13 |
| 6 | లఘుద్రుతము | ○ ǀ | 6 | 14 | ప్లుతగ్రుతము | ○ 8̇ | 14 |
| 7 | లఘుగ్రుత విరామం | ∪○ǀ | 7 | 15 | ప్లుతద్రుత విరామము | ∪○ 8̇ | 15 |
| 8 | గురువు | 8 | 8 | 16 | కాకపాదము | + | 16 |

v గ్రహము :—అనగా ఒకసంగీతరచనలో తాళమునుపయోగించి సంగీతమును ప్రారంభించు తావునకు సంస్కృతములో గ్రహమని పేరు. దీనినే అరవములో ఎడుప్పు "అనియు తెనుగులో ఎత్తుట" అనియు చెప్పబడును. [గ్రహాము = గ్రహణము.] ఇది 2 విధములు. అవి 1 సమము 2 విషమములగును.

1 సమము :—అనగా ఏదైన ఒకకీర్తన లేక పాటలోని పల్లవినిగాని, మరియేయితరభాగమును గాని తాళమునందు మొదటి దెబ్బమీద (తాళమును సంతమును ఒకేసారి) ప్రారంభించు తావునకు "సమము" లేక "సమగ్రహాము" లేక "సమ ఎడుప్పు" అని చెప్పబడును.

ఉదా :—నెనరుంచినాను - మాళవిరాగము - ఆదితాళము. (త్యాగరాజకృతి)

2 విషమము :—అనగా కీర్తన లేక పాటయును, తాళమును సమముగా నెత్తక ముందుగాని, లేక వెనుకగాని ప్రారంభించుటను "విషమము" అని చెప్పబడును. ఇది రెండు విధములు. అవి 1 అతీతము. 2 అనాగతము లగును.

i అతీతము :—అనగా యేదైన ఒకపాటలోని పల్లవినిగాని, లేక యే యితర భాగమునుగాని తాళాంత్యమందుగాని లేక తాళము ప్రారంభింపక ముందుగాని (మొదటి ఘాతకుముందు) ప్రారంభించు తావునకు "అతీతము" లేక "అతీత గ్రహాము" లేక "అతీత ఎడుప్పు" అని చెప్పబడును. ఉ॥ కరుణించుట కిదేసమయ- సింధుమందారిరాగము. ఆదితాళము (పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ కృతి)

ii అనాగతము :—ఏదైన ఒక పాట లేక కీర్తనలోని పల్లవినిగాని, లేక యే యితరభాగమునుగాని తాళము ప్రారంభించిన తరువాత (మొదటిఘాత తరువాత) ప్రారంభించు తావునకు 'అనాగతము' అని చెప్పబడును: దీనినే 'అనాగతగ్రహము' లేక 'అనాగతఎడుప్పు' అని కూడ చెప్పుదురు. ఉ॥ ఎంత భాగ్యము. సారంగ రాగము. ఆదితాళము. (త్యాగరాజకృతి.)

vi జాతి :—తాళాంగములలో లఘు సంబంధమైన దానిని "జాతి" అని చెప్పబడును. ఇది 5 విధములు. అవి (1) త్రిశ్రజాతి లఘువు (2) చతురశ్రజాతి లఘువు (3) ఖండజాతి లఘువు (4) మిశ్రజాతి లఘువు 5 సంకీర్ణ జాతి లఘువులగును. ఇవి వరుసగా 3, 4, 5, 7, 9 అక్షరకాలములను గలిగియుండును. ఈ చతురశ్రాది పంచజాతి లఘువులుగాక మరియొక పద్ధతిలో 5 లఘువులు చెప్పబడెను. అవి 1 దివ్యలఘువు 2 సింహలఘువు, 3 వర్ణలఘువు 4 వాద్యలఘువు 5 కర్నాటక లఘువు లగును. ఇవి వరుసగా 6, 8, 10, 12, 16 అక్షరకాలములు గలిగియుండునని గ్రహించదగును.

చతురశ్రజాతి ప్రాముఖ్యము :—చతురశ్రాది పంచజాతులలో చతురశ్ర జాతి (4 అక్షరకాలములు గలది) కామధేనువుయొక్క స్వరూపమగుటచే నిది మిగుల శ్రేష్టమైనదనియు, గనుకనే దీనిలో గీత, వర్ణ, పద, కీర్తనాదులు విశేషముగా రచింప బడెననియు, పూర్వాచార్యులు చెప్పియుండుటచే చతురశ్రజాతి మిక్కిలి ప్రాముఖ్య మైనదని స్పష్టమగుచున్నది. పంచజాతులు యీ క్రింది విధముగా నేర్పడుట గమ నించదగును. త్రిశ్రజాతి 3 అక్షరకాలములును, చతురశ్రజాతి 4 అక్షరకాలములును ఈ రెండును చేరి $3+4=7$ అక్షరకాలములతో మిశ్రజాతియును, త్రిశ్రజాతి, మిశ్ర జాతి రెంటిని కలిపి సగముగా భాగింపబడిన $3+7=10 \div 2=5$ అక్షరకాలములతో ఖండజాతియును, ఖండజాతి, చతురశ్రజాతి, యీ రెండును చేరి $5+4=9$ అక్షర కాలములతో సంకీర్ణజాతియు నేర్పడెనని గ్రహించునది.

vii కళ :—తాళముయొక్క అక్షరకాలములలోని సమాన్తర్భాగములను "కళ"లని చెప్పబడును. ఎటులనగా! ఉ॥ చతురశ్రజాతి లఘువు. దీనికి 4 అక్షర కాలములుండును. అవి అక్షరకాలమొకటింటికి 4 కళలవంతున నడిపిన $4 \times 4=16$ కళలగును. వీటినే కళలని చెప్పబడును. ఈ కళలు, హ్రస్వాక్షర ప్రమాణము నను సరించి లెక్కచేయదగును. ఈ కళలు, అక్షరకాలమునకు 1, 2, 3, 4, 5 యీ విధ ముగా నుండును. ఒక అక్షరకాలము యెన్ని కళలవంతున నడచుచున్నదను విష యము ఆయా రచనల శైలినిబట్టి నిర్ణయింపనగును. శార్ఙదేవుడు తన "రత్నాకర" గ్రంథమున మరియొక పద్ధతిలో 3 విధములగు కళలను పేర్కొని యుండెను.

అని 1 ఏకకళ, 2 ద్వికళ, 3 చతుష్కళ లగును. ఇవి వ రు పలు 1, 2, 4 అక్షరకాలములు గలవియగును. మరియు నివి అనేక భేదములనొం యని త్ర్పుటాది తాళములందుపయోగింపబడుచుండి నటుల తెలియుచున్నది. పైన చెపలను యీకళలయొక్క మార్పునే గతిభేదమనికూడ చెప్పబడును. స

గతి:—అనగా తాళమునకు ఆధారమై, లీనమై, నిర్ణీతసమయములందు కలుగు ధ్వని విశేషమును "గతి"యని చెప్పబడును. ఈ గతులకు గూడ చతురశ్రాదిపంచజాతులవలె పంచ గతి భేదములుండి అక్షరకాలమొకటికి వరుసగా 3, 4, 5, 7, 9 కళలవంతున నడుపుటవలన గతి భేదము కలుగుచున్నదని గ్రహింపదగును. వీటినే త్రిశ్రగతి, చతురశ్రగతి, ఖండగతి, మిశ్రగతి, సంకీర్ణగతి యందురు.

viii లయ:—అనగా గానముతోచేరి తాళము సమముగా నడచుటను "లయ" అని చెప్పబడును. ఇది మూడువిధములుగా నుండును. అవి (1) విళంబలయ. (2) మధ్యలయ (3) ద్రుతలయ లగును. [లయ = ప్రాణము.]

i విళంబలయ:—తాళమున కేర్పడియున్న అక్షరకాలములతో మందగతిగా నడపుటను "విళంబలయ" అని చెప్పబడును. [విళంబ = చౌక] ఉ॥ ఏలావతార మెత్తుకొంటివి. ముఖారిరాగము. ఆదితాళము. ఈ త్యాగరాజకృతిని విళంబలయకు చెందిన ఒక వుదాహరణగా తీసుకొనవచ్చును.

ii మధ్యలయ:—తాళమున కేర్పడియున్న అక్షరకాలములతో విళంబలయకురెట్టింపు వేగముగలిగి సమగతిని నడుపునది 'మధ్యలయ' అని చెప్పబడును. [మధ్య = సమ] ఉ॥ నెనరుంచినాను. మాళవిరాగము. ఆదితాళము. ఈ త్యాగరాజ కృతిని మధ్యలయకు చెందిన ఒక వుదాహరణగా నెంచవచ్చును.

iii ద్రుతలయ:—తాళమున కేర్పడియున్న అక్షరకాలములతో మధ్యలయకు రెట్టింపు వేగము గలిగి త్వరితగతిని నడుపునది "ద్రుతలయ"అని చెప్పబడును. [ద్రుత = వేగ] ఉ॥ రమించువారెవరురా. సుపోషిణిరాగము. ఆదితాళము. త్రిశ్రగతి. ఈ త్యాగరాజకృతిని ద్రుతలయకు చెందిన ఒక వుదాహరణగా నెంచవచ్చును.

పై మూడింటిని కలిపి త్రికాలమని చెప్పుటకలదు. సంగీతరచనలను - వ్రాయునపుడు యీ త్రికాలములను జూపుటలో మొదటికాలమునకు స్వరములక్రింద అడ్డగీత లేకుండును. రెండవకాలమునకు స్వరములక్రింద ఒక అడ్డగీత యుండును. మూడవకాలమునకు స్వరములక్రింద రెండు అడ్డగీతలువుండును. కొందరు యీ అడ్డగీతలను స్వరములపైన వుంచుటకూడా కలదు. అయితే యీ పద్ధతి మాత్రము అభ్యాసకుల కంతగా సులభముగా నుండదనియే చెప్పవచ్చును.

కొందఱు లయ అనునది సశబ్ద, నిశ్శబ్ద క్రియల మధ్యనుండు విశ్రాంతి కాల మే యై,అది విళంబ, మధ్య, ద్రుత లయలుగా నుండి వరుసగా దీర్ఘాక్షర, హ్రస్వాక్షర, అర్ధాక్షర ప్రమాణములను గలిగియుండుననియు చెప్పుదురు.

ix యతి :—అనగా ఒక తాళములో గల అంగములయొక్క వ్యత్యాసమైన చేరికను "యతి" అని చెప్పబడును. శార్ఙ్గదేవుడు యీ యతి 3 విధములని తన "సంగీత రత్నాకర" గ్రంథములో చెప్పియుండిరి. అవి (1) సమయతి (2) స్రోతోవహ యతి (3) గోపుచ్ఛయతియగును. వర్తమాన కాలములో యీ యతులు 6 విధములుగా వాడుకయందున్నవి. గనుక వాటి వివరముల నీక్రింద దెలుపుట గమనించదగును.

1 సమయతి :—అనగా ఏదైన ఒక తాళఆవర్తములో గల అన్ని అంగములు ఒకేరీతిగా యున్నచో నట్టి దానిని "సమయతి" లేక "పిపీలికయతి" అని చెప్పబడును.

ఉ॥ ◡ ◡ ◡ ◡ ◡ ◡. [పిపీలికయతి = చీమలవలె ఒకేవిధముగానుండు యతి] ఇటులనే తక్కిన అంగములు కూడ ఒకేవిధముగానుండునని గ్రహించునది.

2 గోపుచ్ఛయతి :—అనగా ఏదైన ఒకతాళ ఆవర్తములోని అంగములు ఆవుతోకవలె మొదట పెరిగి రాను రాను తగ్గుచూ పోవునది "గోపుచ్ఛయతి" అని చెప్పబడును. ఉ॥ 8 8 । ○ ◡ యీ విధముగా నుండును. ఉ॥ త్యాగరాజ యోగ వైభవము, ఆనందభైరవి రాగము. రూపకతాళములోని శ్రీ ముద్దుస్వామి దీక్షితుల వారి కృతి గోపుచ్ఛయతి గల కృతికి చక్కని వుదాహరణమగును.

3 స్రోతోవహయతి :—అనగా ఏదైన ఒకతాళావర్తములో గల అంగములు నదివలె మొదట కుఱుచగానుండి క్రమముగా పెరిగి పోవునట్టిది "స్రోతోవహాయతి" లేక "స్రోతోగతయతి" యని చెప్పబడును. ఉ॥ ◡ ○ । 8 8 యీవిధముగా నుండును. ఉ॥ శివశక్త్యాది, సకల, తత్వ స్వరూప, ప్రకాశమ్, అను శ్రీముద్దుస్వామిదీక్షితుని కృతి స్రోతోవహాయతి గల కృతికి చక్కని వుదాహరణమగును.

4 డమరుయతి :—అనగా ఏదైన ఒక తాళావర్తములో గల అంగములు "ఉడుక" లేక "హుడుక్క" అను వాద్యమువలె నడుమ కుఱుచగాను రెండు ప్రక్కల పెరిగియు నుండునది "డమరుయతి" లేక "వేదిమధ్యయతి" అని చెప్పబడును. ఉ॥ 8 8 । ○ ◡ ○ । 8 8 యీ విధముగా నుండును.

5 మృదంగయతి :—అనగా మృదంగముయొక్క ఆకారమువలె ఒక తాళ ఆవర్తములో గల అంగములు నడుమ పెరిగి యిరుప్రక్కలను కుఱుచగా నుండునది "మృదంగయతి" లేక "యవమధ్యయతి" యని చెప్పబడును. ఉ॥ ◡ ○ । 8 8 8 । ○ ◡. యీ విధముగా నుండును.

6 విషమయతి :—అనగా ఒక తాళ ఆవర్తములో గల అంగములు పలు విధములై కుఱుచబడియును, పెరిగియును యుండునపుడు "విషమయతి" యని చెప్పబడును. ఉ॥ । ౦ 8 ◡ 8 । 8 ఇటుల పైనదెలిపిన ఆఱువిధములగు యతులను తాళముయొక్క ఆవర్తములలో త్రికాలములందు జూపించుట ప్రాచీన సంప్రదాయమై యున్నది. కొన్ని గ్రంథములలో గురువునకు S గురుతును, ప్లుతమునకు 8 గుఱుతును వుండునని తెలిపియుండుట గమనింపదగును.

X ప్రస్తారము :—అనగా ఒక తాళములో గల అంగములనువాటి అంతర్గత అంగములతో వీలైనన్ని విధములుగా ప్రస్తరించి తాళ భేదములను గల్పించుటను "ప్రస్తార"మని చెప్పబడును. [ప్రస్తారము = విస్తరించి గుణించుట.]

ఉ॥ చతురశ్రజాతి లఘువును తీసికొన్నచో దీనిలో (1) ద్రుతశేఖరము ◡౦, (2) ద్రుతము ౦, (3) అనుద్రుతము ◡, అను 3 అంతర్గత అంగములుండును. వీటితో 8 ప్రస్తారములువచ్చును. అవి (1) ।. (2) ◡౦ ◡. (3) ౦ ౦. (4) ౦ ◡ ◡. (5) ◡ ◡౦. (6) ◡ ౦ ◡. (7) ◡ ◡ ౦. (8) ◡ ◡ ◡ ◡. యగును. ఇదేవిధముగా ద్రుతశేఖరమును తీసికొన్నచో ఈ క్రింది 4 ప్రస్తారములు వచ్చును.

అవి, (1) ◡౦ (2) ౦ ◡. (3) ◡ ౦. (4) ◡ ◡ ◡. యగును.

ఇట్లే యితర అంగములనుకూడ వాటి అంతర్గత అంగములతో ప్రస్తరింపదగును.

షడంగములు యీ క్రింద దెలిపిన 3 రకములగు ప్రస్తారములు కలిగివుండును.

i చతురంగ ప్రస్తారము :—ఇందు 4 అంగములుండును. । 8 8 +.

ii షడంగ ప్రస్తారము :—ఇందు 6 అంగములుండును. ◡ ౦ । 8 8 +.

iii షోడశాంగ ప్రస్తారము :—ఇందు అనుద్రుతమునుండి కాకపాదము వఱకు గల 16 అంగములుండును. ఈ తాళప్రస్తారములను నిర్దిష్టమైన ఒక పద్ధతిలో కనిపెట్టివ్రాసిన లక్షణకారుడు శ్రీ శ్యామశాస్త్రి ఒక్కడే యని తెలియుచున్నది.

ఈ తాళ ప్రస్తారములు ముఖ్యముగా 14 భేదములగుచున్నవి. అవి యేవనగా (1) నష్టము, (2) ఉద్దిష్టము, (3) పాతాళము, (4) మహాపాతాళము, (5) అనుద్రుత మేరువు, (6) ద్రుతమేరువు, (7) ద్రుతశేఖరమేరువు, (8) లఘుమేరువు, (9) గురు మేరువు, (10) ప్లుతమేరువు, (11) కాకపాదమేరువు, (12) సంయోగమేరువు, (13) ఖండప్రస్తారము, (14) యతిప్రస్తారము లగును. వీని వివరములు గ్రంథవిస్తర భీతి చేతను, వాడుకయందు లేని కారణమునను యిందు వ్రాయక వదలినటుల గ్రహించునది. పైన దెలిపిన కాలము, మొదలు ప్రస్తారమువఱకు గల యీ పదిలక్షణములు "తాళదశ ప్రాణము"లగునని యెఱుంగునది.

అనులోమ, విలోమవివరము :— పైనుదహరింపబడిన దశ ప్రాణయుక్తమగు తాళములలో నేదైన నొక తాళమునువేయుచూ, గాత్రమునగాని, జంత్రమునగాని గానముచేయుట రెండు విధములుగా నుండును. అవి (1) అనులోమము (2) విలోమము అని చెప్పబడును. వాని వివరముల నీక్రింద దెలుపుట గమనించునది.

**1.** అనులోమము :— అనగా ఏదైన ఒక తాళమును ప్రథమకాలముగా నడుపుచు, స్వరములు లేక సాహిత్యాక్షరములను నోటితోగాని, వీణ, గోటు మొదలగు వాద్యములందు మీటువలనగాని, ఫిడేలు (వయొలిన్) సారంగ్ మొదలగువాద్యములందు కమాను (Bow) తో వాయించుటవలనగాని త్రికాలము లేక షట్కాలములను పలికించుటను "అనులోమ" మని చెప్పబడును.

**2.** విలోమము :—అనగా ఏదైన స్వరములు లేక సాహిత్యాక్షరములను నోటితోగాని లేక వీణ, గోటు, వంటి వాద్యములందు మీటుటవలనగాని, వయొలిన్, సారంగ్ వంటి వాద్యములందు కమానుతో వాయించుట వలనగాని ప్రథమకాలముగా పలికించుచూ, తాళముయొక్క అక్షరకాలములను వరుసగా త్రికాలముగాని, షట్కాలముగాని నడుపుటను "విలోమ"మని చెప్పబడును. మరియు వేణువు, నాగస్వరము వంటి గాలివాద్యములందు తాళమును ప్రథమకాలముగా నడుపుచూ, స్వరములు లేక సాహిత్యాక్షరములను నోటిగాలితో ఆయావాద్య రంధ్రములద్వారా త్రికాలము లేక షట్కాలముపలికించుట "అనులోమమనియు, నోటి గాలితో ఆయావాద్యములకుగల రంధ్రములద్వారా స్వరములు లేక సాహిత్యాక్షరములను ప్రథమకాలముగా పలికించుచూ తాళముయొక్క అక్షరకాలములను త్రికాలము లేక షట్కా లములను నడుపుటను "విలోమ"మనియు చెప్పబడును.

సప్తతాళములు :—ఇవి 7 రకములుగా నున్నవి. అవి 1 ధ్రువతాళము మఠ్యతాళము 3 రూపకతాళము 4 ఝంపతాళము 5 త్రిపుటతాళము 6 అట తాళము 7 ఏకతాళములగును వీటిని తాళసప్తకమని కూడ చెప్పుదురు. ఈ ధ్రువాది సప్తతాళములను వేయునపుడు వాటికిగల అంగములలో లఘువును చతురశ్రాది పంచ జాతులలో నేదైన నొకదానికి చేర్చిగాని వేయుటకు సాధ్యముగాదు. గనుక ఈ ధ్రువాది సప్తతాళములకు జాతిసంబంధము కలుగునపుడు 7 × 5 = 35 తాళములగు చున్నవి. ఇటుల యేర్పడు 35 తాళములకు 35 శ్రీకరాదినామములను, అంగ సంజ్ఞలను, అక్షరకాలములను నీక్రింది పథకమున దెలుపుట గమనించునది.

## పంచత్రింశతి (35) తాళపథకము.

| తాళసంఖ్య | సప్త తాళముల పేర్లు. | సప్త తాళ అంగ సంజ్ఞలు. | త్రిశ్రజాతి. | | చతురశ్రజాతి. | | ఖండజాతి. | | మిశ్రజాతి. | | సంకీర్ణజాతి. | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | తాళములు. | సంఖ్య | తాళములు. | సంఖ్య | తాళములు. | సంఖ్య | తాళములు. | సంఖ్య | తాళములు. | సంఖ్య |
| 1 | ధృవ | I O I I | వాణి | 11 | శ్రీకర | 14 | ప్రమాణ | 17 | పూర్ణ | 23 | భువన | 29 |
| 2 | మఠ్య | I O I | సార | 8 | సమ | 10 | ఉదయ | 12 | ఉదీర్ణ | 16 | రావ | 20 |
| 3 | రూపక | O I | చక్ర | 5 | పత్తి | 6 | రాజ | 7 | కుల | 9 | బిందు | 11 |
| 4 | ఝంప | I ◡ O | కదంబ | 6 | మధుర | 7 | చణ | 8 | సుర | 10 | కర | 12 |
| 5 | త్రిపుట | I O O | శంఖ | 7 | ఆది | 8 | దుష్కర | 9 | లీల | 11 | భోగ | 13 |
| 6 | అట | I I O O | గుప్త | 10 | లేఖ | 12 | విదళ | 14 | లోయ | 18 | ధీర | 22 |
| 7 | ఏక | I | సుధ | 3 | మాన | 4 | రత | 5 | రాగ | 7 | వసు | 9 |

పైన తెలిపిన 35 తాళములు చతురశ్రాదిపంచగతి భేదములనొందినచో 35 × 5 = 175 రకముల తాళము లగును. సప్తతాళములు చతురశ్ర (మనుష్య) త్రిశ్ర (స్వర్గ) మిశ్ర (హంస) ఖండ (దేశ్య) సంకీర్ణ (చిత్ర) అను, 5 లఘువులును, దివ్య (దివ్యసంకీర్ణ) సింహ (మిశ్రసంకీర్ణ) వర్ణ (దేశ్యసంకీర్ణ) వాద్య (మిశ్రదేశ్యసంకీర్ణ) కర్నాటక (దేశ్యశుద్ధసంకీర్ణ) అను 5 లఘువులతోచేరి మొత్తము 5 + 5 = 10 రకముల లఘువు లగుటచే 7 × 10 = 70 తాళము లగుచున్నవి. ఈ 70 తాళములు చతురశ్రాది పంచగతి భేదమునొందిన 70 × 5 = 350 రకముల తాళము లగును. ఈ విధముగా గతి భేదముచే యేర్పడు నామరహితములైన 175 తాళములుగాని, 350 తాళములుగాని 108 × 5 = 540 తాళములుగాని నవీన కల్పనావిశేషము మాత్రమేనని యెఱుంగునది. ఇటీవల కొందరు 72 మేళకర్తలకువలె, కనకాంగి, రత్నాంగివంటిపేర్లతో 72 తాళములను కనిపెట్టుటకు ప్రయత్నించిరి. పార్శ్వదేవుని సంగీతసమయసార, గ్రంథములోను, నారదుని "సంగీతమకరంద" గ్రంథములోను 101 తాళములను పేర్కొనబడెను. ఇవిగాక సంప్రదాయంగా చెప్పబడుతున్న అష్టోత్తర శతతాళములను 108 తాళములుకూడ గలవు. వీటిలో మొదటి 5 టిని, మార్గతాళము లనబడును. ఈ 108 తాళములు, సూళాది 35 తాళములకంటె అతిపురాతనమైనవగును, వీటిలో కొన్ని తాళములందుగల లఘువులు చతురశ్రజాతికిమాత్రమే సంబంధించినవగును. ఉద్ఘట్ట, దర్పణ, రంగ, క్రీడ, వంటి కొన్నితాళములు అసలు లఘువులేకనే యున్నవి. గనుక 108 తాళములు చతురశ్రాది పంచజాతి లఘుసంబంధము కలిగినచో 108 × 5 = 540 తాళములగునని "సంగీత చంద్రికా" గ్రంథరచయితయగు శ్రీ మాణిక్యముదలియార్ చేసిన ప్రకటన మిక్కిలి అసంగతమైనదగును. కాని 108 తాళములకు చతురశ్రాది పంచగతి సంబంధము కలిగినచో 108 × 5 = 540 రకముల తాళములగునని మాత్రము చెప్పవచ్చును. ఈ 108 తాళములలోకూడ కొన్ని తాళములు అమంగళకరములైన నిశ్శబ్దక్రియాంగములతో కూడియుండుటచే యీ 108 తాళములుకూడ వాడుకయందంతగా లేకనేయున్నవి. కాని అతిప్రాచీనమైన వాటి వివరములను తెలుపుటకై 108 తాళపట్టికనుకూడ యీ క్రింద తెలుపుట గమనించదగును. శార్ఙ్గదేవుడు తన సంగీత రత్నాకరంలో 120 తాళములను పేర్కొని యింకను అనేకతాళము లున్నటుల పేర్కొనెను. 17వ శ. మునకు చెందిన రాగతాళ చింతామణి, అను గ్రంథ రచయిత తన తెలుగు వ్రాతప్రతిగ్రంథములో 124 తాళములు పేర్కొనెను. ఈ విధంగా ప్రాచీనులు అనేకములైన తాళములను పేర్కొనియున్నను, వీటిలో ఆచరణయోగ్యమైనట్టివి, మంగళకరమైనట్టివి సూళాది 35 తాళములు మాత్రమేనని గ్రహించదగును.

ఈ క్రింద తెలుపబడిన పథకములోని 108 తాళముల పేర్లలో గుర్తులుగల 58 వ, తాళము పేరు ఒక మేళకర్తరాగమునకును, 31, 65, 88, 89 వ, తాళముల పేర్లు కొన్ని జన్యరాగములకును, 52 వ, తాళము పేరు ఒక నృత్తభంగిమమునకును, 79 వ, తాళము పేరు ఒక మహారాష్ట్రసంగీతరచనకును, గలిగియుండుట గమనింపదగును.

# అష్టోత్తరశత (108) తాళపధకము. (1-33)

| వరుస నెం. | తాళముల పేర్లు. | అంగసంజ్ఞలు. | | అంగసంఖ్య | మాత్రలు. | అక్షరకాలములు. |
|---|---|---|---|---|---|---|
| 1 | చచ్చత్పుట | 8 8 I 8' | మార్గతాళములు | | | |
| 2 | చాచపుట | 8 I I 8 | | | | |
| 3 | షట్పితాపుత్రిక | 8' I 8 8 I 8' | | | | |
| 4 | సంపద్వేష్టక | 8' 8 8 8 8' | | | | |
| 5 | ఉద్ఘట్ట | 8 8 8 | | | | |
| 6 | ఆది | I | | 1 | 1 | 4 |
| 7 | దర్పణ | o o 8 | | 3 | 3 | 12 |
| 8 | చర్చరి | o o ∪ I o o ∪ I o o ∪ I o o ∪ I o o ∪ I o o ∪ I o o ∪ I o o ∪ I | | 32 | 18 | 72 |
| 9 | సింహలీల | I o o o I | | 5 | $3\frac{1}{2}$ | 14 |
| 10 | కందర్ప | o o I 8 8 | | 5 | 6 | 24 |
| 11 | సింహవిక్రమ | 8 8 8 I 8' I 8 8' | | 8 | 16 | 64 |
| 12 | శ్రీరంగ | I I 8 I 8' | | 5 | 8 | 32 |
| 13 | రతిలీల | I 8 8 I | | 4 | 6 | 24 |
| 14 | రంగ తాళ | o o o o 8 | | 5 | 4 | 16 |
| 15 | పరిక్రమ | I I I 8 8 | | 5 | 7 | 28 |
| 16 | ప్రత్యంగ | 8 8 8 I I | | 5 | 8 | 32 |

| వరుస నెం. | తాళముల పేర్లు. | అంగసంజ్ఞలు. | అంగసంఖ్య | మాత్రలు. | అక్షరకాలములు. |
|---|---|---|---|---|---|
| 17 | గజలీల | I I I I ∪ | 5 | $4\frac{1}{4}$ | 17 |
| 18 | త్రిభిన్న | I 8 8' | 3 | 6 | 24 |
| 19 | వీరవిక్రమ | I o o 8 | 4 | 4 | 16 |
| 20 | హంసలీల | I I ∪ | 3 | $2\frac{1}{4}$ | 9 |
| 21 | వర్ణభిన్న | o o I 8 | 4 | 4 | 16 |
| 22 | రంగద్యోతన | 8 8 8 I 8' | 5 | 10 | 40 |
| 23 | రాజచూడామణి | o o I I I o o I 8 | 9 | 8 | 32 |
| 24 | రాజ తాళ | 8 8' o o 8 I 8' | 7 | 12 | 48 |
| 25 | సింహవిక్రీడిత | I I 8' 8 I 8 8' I 8' | 9 | 17 | 68 |
| 26 | వనమాలి | o o o o I o o 8 | 8 | 6 | 24 |
| 27 | చతురశ్రవర్ణ | 8 8 I o o 8 | 6 | 8 | 32 |
| 28 | త్రయశ్రవర్ణ | I o o I I 8 | 6 | 6 | 24 |
| 29 | మిశ్రవర్ణ | o o o o ∪ o o o o ∪ o o o o ∪ | 15 | $6\frac{3}{4}$ | 27 |
| 30 | రంగప్రదీప | 8 8 I 8 8' | 5 | 10 | 40 |
| 31 | *హంసనాద | I I 8' o o 8 | 6 | 8 | 32 |
| 32 | సింహనాద | I 8 8 I 8 | 5 | 8 | 32 |
| 33 | మల్లికామోద | I I o o o o | 6 | 4 | 16 |

# అష్టోత్తరశత (108) తాళపధకము. (71 - 108)

| వరుస నెం. | తాళముల పేర్లు. | అంగసంజ్ఞలు. | అంగసంఖ్య | మాత్రలు. | అక్షరకాలములు. | వరుస నెం. | తాళముల పేర్లు. | అంగసంజ్ఞలు. | అంగసంఖ్య | మాత్రలు. | అక్షరకాలములు. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 71 | ఏకతాళ | ○ | 1 | $\frac{1}{2}$ | 2 | 91 | కర్ణయతి | ○ ○ ○ ○ | 4 | 2 | 8 |
| 72 | అటతాళ | I ○ ○ I | 4 | 3 | 12 | 92 | యతి | 8 I I I | 4 | 5 | 20 |
| 73 | పూర్ణకంకాల | ○ ○ ○ ○ 8 I | 6 | 5 | 20 | 93 | షట్ తాళ | ○ ○ ○ ○ ○ ○ | 6 | 3 | 12 |
| 74 | ఖండకంకాల | ○ ○ 8 8 | 4 | 5 | 20 | 94 | వర్ధన | ○ ○ I 8' | 4 | 5 | 20 |
| 75 | సమకంకాల | 8 8 I | 3 | 5 | 20 | 95 | వర్ణయతి | I I 8' 8' | 4 | 8 | 32 |
| 76 | విషమకంకాల | I 8 8 | 3 | 5 | 20 | 96 | రాజనారాయణ | ○ ○ I 8 I 8 | 6 | 7 | 28 |
| 77 | చతుస్తాళ | 8 ○ ○ ○ | 4 | $3\frac{1}{2}$ | 14 | 97 | మదన | ○ ○ 8' | 3 | 4 | 16 |
| 78 | డోంబులి | I I ∪ | 3 | $2\frac{1}{4}$ | 9 | 98 | కారిక | ○ ○ ○ ○ ∪ | 5 | $2\frac{1}{4}$ | 9 |
| 79 | *అభంగ | I 8' | 2 | 4 | 16 | 99 | పార్వతీలోచన | ○ ○ I ○ ○ 8 8 I I I I 8 I I | 14 | 15 | 60 |
| 80 | రాయవంకోల | 8 I 8 ○ ○ | 5 | 6 | 24 | 100 | శ్రీనందన | 8 I I 8' | 4 | 7 | 28 |
| 81 | లఘుశేఖర | I ∪ | 2 | $1\frac{1}{4}$ | 5 | 101 | లీల | ○ I 8' | 3 | $4\frac{1}{2}$ | 18 |
| 82 | ప్రతాపశేఖర | 8' ○ ○ ∪ | 4 | $4\frac{1}{4}$ | 17 | 102 | విలోకిత | I 8 ○ ○ 8' | 5 | 7 | 28 |
| 83 | జగఝంప | 8 ○ ○ ○ ∪ | 5 | $3\frac{3}{4}$ | 15 | 103 | లలితప్రియ | I I 8 I I | 5 | 6 | 24 |
| 84 | చతుర్ముఖ | I 8 I 8' | 4 | 7 | 28 | 104 | ఝల్లక | 8 I I | 3 | 4 | 16 |
| 85 | ఝంప | ○ ○ ∪ I | 4 | $2\frac{1}{4}$ | 9 | 105 | జనక | I I I I 8 8 I I 8 | 9 | 12 | 48 |
| 86 | ప్రతిమఠ్య | I I 8 8 I I | 6 | 8 | 32 | 106 | లక్ష్మీశ | ○ ○ I I 8' | 5 | 6 | 24 |
| 87 | గారుగి | ○ ○ ○ ○ ○ ∪ | 6 | $2\frac{3}{4}$ | 11 | 107 | రాగవర్ధన | ○ ○ ∪ ○ 8' | 5 | $4\frac{3}{4}$ | 19 |
| 88 | *వసంత | I I I 8 8 8 | 6 | 9 | 36 | 108 | ఉత్సవ | 8' I | 2 | 4 | 16 |
| 89 | * లలిత | ○ ○ I 8 | 4 | 4 | 16 | | | | | | |
| 90 | రతితాళ | I 8 | 2 | 3 | 12 | | | | | | |

ఆదితాళప్రాముఖ్యము:— ఇది 35 తాళములలో చతురశ్రజాతి త్రిపుటకు గల పేరగును. దీని ప్రాముఖ్యమునకు గల కారణము లేవనగా!

i ఇది శ్రేష్టమైన చతురశ్రజాతిలోనుండి 1 లఘువు 2 ద్రుతములతో మొత్తము 3 అంగములు కలిగి 4 + 2 + 2 = 8 అక్షరకాలములు గలదియగుటచేతను,

ii స్వరసప్తమునకు తారషడ్జముచేర్చిన యేర్పడు స్వరాష్టకమునకును, ఈ ఆదితాళమునకునుగల అక్షరసంఖ్య సరిసంఖ్యయు, సమానసంఖ్యయునగు 8 అంకెయగుటచేతను,

iii ఈ రెండు అంకెలును ఒకదానితో నొకటి శేషములేకుండా భాగింపబడుట చేతను పూర్వాచార్యులు దీనిని శ్రేష్టముగా నెంచి ఆదిలో ప్రథమాభ్యాసమునందలి స్వరావళ్యాదుల నేర్పఱచుటచే నిది "ఆదితాళ"మని చెప్పబడుటకు కారణమైనది.

దేశాది, మధ్యాదితాళ వివరము:—ఇవి తాళప్రకరణమున పేర్కొనబడిన శాస్త్రసమ్మతమగు 35 ప్రాముఖ్యమైన తాళములుగాక వేరు నామములతోను, క్రియలతోను అనగా మధ్య లోపించిన అక్షరకాలములతో వాడబడుచున్న తాళములకుగల పేర్లగును. ఇవి రెండువిధములు. అవి (1) దేశాది (2) మధ్యాదితాళములగును.

i దేశాదితాళము:—ఇది ఒక విసర్జితము మూడు ఘాత (దెబ్బ)లు గలదియగును. ఇది నడచు వేగము సాధారణముగా నెమ్మదిగానుండును. ఈ దేశాదితాళము వేయునపుడు విసర్జితములో 3/4 మాత్ర లేక 3 అక్షరకాలముల వ్యవధి అయిన వెంటనే సంగీతరచన ప్రారంభింపబడును. ఉ॥ 1 భువినిదాసుడ. 2 సరియెవ్వరే. అను శ్రీరంజని రాగములోని రెండు త్యాగరాజకృతులును దేశాదితాళకృతులకు చక్కని వుదాహరణములగును.

ii మధ్యాదితాళము:— ఇదియు ఒక విసర్జితము మూడు ఘాత (దెబ్బ)లు గలదియగును. ఇది నడచు వేగము దేశాదితాళమువలె అంత నెమ్మదిగా నుండదు. కాని కొంచెము వేగముగా నుండును. ఈ మధ్యాదితాళము వేయునపుడు విసర్జితములో 1/2 మాత్ర లేక 2 అక్షరకాలములు వ్యవధి అయిన వెంటనే సంగీతరచన ప్రారంభింపబడును. ఉ॥ రామానీయెద, అను ఖరహరప్రియరాగములోని త్యాగరాజ కృతియు, మేరుసమాన. అను మాయామాళవగౌళరాగములోని త్యాగరాజ కృతియు యీ మధ్యాదితాళ కృతులకు చక్కని వుదాహరణములగును.

చాపుతాళ వివరము:—తాళప్రకరణములో పేర్కొనబడిన శాస్త్ర సమ్మతమగు 35 తాళములుగాక శాస్త్రమునందు చెప్పబడని నామములు, క్రియలు గలిగియుండి సంగీత రచనలయొక్క కాలపరిమాణమును తెలుపు ఒకవిధమగు తాళమును "చాపు" తాళమని చెప్పబడును. ఇది ముఖ్యముగా 4 విధములుగా నున్నవి. అవి 1 త్రిశ్రచాపు. 2 ఖండచాపు 3 మిశ్రచాపు. 4 సంకీర్ణచాపులగును.

i త్రిశ్రచాపు తాళము :—"రెండుఘాతలు గలిగియుండి మొదటిఘాతకు 1 అక్షరకాలము, రెండవఘాతకు 2 అక్షరకాలములు కలిగియుండునది "త్రిశ్రచాపు" అని చెప్పబడును. ఉ॥ స । రి గ॥ రి । గమ॥ యీ విధముగానుండును. ఉ॥ రామచంద్ర నన్నుబ్రోవ-అను ఖమాసురాగములోని కీర్తన యిందుకు ఒక వుదాహరణమగును.

ii ఖండచాపు తాళము :— రెండు ఘాత [దెబ్బ]లు గలిగియుండి మొదటి ఘాతకు 2 అక్షరకాలములును, రెండవఘాతకు 3 అక్షరకాలములును గలిగియుండునది "ఖండచాపు" అని చెప్పబడును. ఉ॥ స రి । స రి గ॥ రి గ । రి గ మ॥ యీ విధముగా నుండును. ఉ॥ "పరిధానమిచ్చితే" అను బిలహరి రాగములోని పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ కృతి యిందుకు ఒక వుదాహరణగా తీసికొనవచ్చును.

iii మిశ్రచాపుతాళము :— రెండు ఘాతలు గలిగియుండి మొదటి ఘాతకు 3 అక్షరకాలములును, రెండవ ఘాతకు 4 అక్షరకాలములును గలది "మిశ్రచాపు" అని చెప్పబడును. ఉ॥ స రి గ । స రి గ మ ॥ రి గ మ । రి గ మ ప ॥ యీ విధముగా నుండును. ఉ॥ నిధి చాలసుఖమా. అను కల్యాణిరాగములోని త్యాగరాజ కృతియు, ఎవరురా నిన్ను, అనుమోహనరాగములోనిత్యాగరాజకృతియు యిందుకు ఒకచక్కని వుదాహరణములగును.

ఈ తాళము వేయుటలో 3 + 4 అక్షరకాలములుగానేగాక 4 + 3 అక్షరకాలములుగా కూడా వేయుటకలదు. ఉ॥ నిన్ను వినాగమరి. అను పూర్వకల్యాణిరాగములోని శ్రీ శ్యామశాస్త్రి కృతిని పాడునపుడు మొదటి 4 అక్షరకాలములలో 2 అక్షరకాలములు తోసి "నిన్ను వినాగమరి" అని ప్రారంభించుగురు. శ్రీ శ్యామశాస్త్రుల వారి రచనలలో కొన్ని యీ రకమునకు చెందియుండుట గమనించదగును.

iv సంకీర్ణ చాపుతాళము :—రెండు ఘాతలు గలిగి మొదటి ఘాతకు 4 అక్షరకాలములును, రెండవ ఘాతకు 5 అక్షరకాలములును గలది "సంకీర్ణచాపు అని చెప్పబడును. ఉ॥ స రి గ మ । స రి గ మ ప ॥ రి గ మ ప । రి గ మ ప ధ॥ యీ విధముగా నుండును.

పైనదెలిపిన 4 విధములగు చాపుతాళములను వేయునపుడు కొందరుసౌకర్యముకొఱకు రెండు ఘాతలు వేయుటకు బదులుగా ఒక విసర్జితము ఒక ఘాతను వేయుట కూడా కలదు. ఏదైన ఒక సంగీత రచనకు దానిపైన "చాపుతాళము" అని మాత్రము వ్రాసియున్నపుడు అది సాధారణముగా "మిశ్రచాపుతాళ"మనే యెంచిపాడదగును.

ధ్రువచాపు తాళము :—ఇది ప్రాచీన కాలములో మిశ్రచాపుతాళమునకు యిచ్చినటువంటి ఒక పేరగును. దీనికిని రెండు ఘాతలుండి మొదటిఘాతకు 3 అక్షరకాలములును, రెండవఘాతకు 4 అక్షరకాలములును గలిగియుండును. అయితే యీ 7 అక్షరకాలములకు పూర్వీకులు । లయ (। ఘాత) 2 గురువులు (2 వ్రేళ్ళు లెక్కించుట) మరల । లయ (। ఘాత) 3 గురువులు (3 వ్రేళ్ళు లెక్కించుట) గాను చెప్పియున్నారు. అనగా । త్రిశ్రలఘువు । చతురశ్రలఘువుగా వేయవలెనని చెప్పియుండిరి. ఉ॥ స రి గ । రి స రి గ॥ రి గ మ । గ రి గ మ॥ ఈ విధముగానుండును.

రూపక చాపుతాళము :—ఇది ప్రాచీనకాలములో త్రిశ్రచాపుతాళమునకు యివ్వబడిన పేరగును. దీనికి 3 అక్షరకాలము లుండును. అయితే దీనిని వేయునపుడు 1 లయ (1 ఘాత) 2 గురువులు (2 వ్రేళ్లు యెంచుట)గా వేయవలెనని చెప్పియుండిరి. త్రిశ్రలఘువునకు సరిపోవు దీనినే పూర్వీకులు "రూపకచాపు" అని చెప్పియుండిరని గ్రహింపదగును. ఉ॥ సరిగ॥ రిగమ॥ యీ విధముగానుండును.

ధ్రువరూపకతాళము:— ఇది ప్రాచీనకాలములో గీతములం దుపయోగింపబడిన ఒక ప్రత్యేక తాళమగును. ప్రాచీన గీతములు సాధారణముగా రెండు ఖండ (భాగ) ములుగా నుండును. అవి పాడునపుడు యీ ధ్రువరూపకతాళము వేయుటలో మొదట రెండు ద్రుతములును, తరువాత రెండు చతురశ్ర లఘువులును, పిమ్మట ఒక ద్రుతము, ఒక చతురశ్ర లఘువును ( O O | | O | ) అనగా 18 అక్షరకాలములు వేసి మొదటి ఖండమును పూర్తి చేయుదురు. ఇదేవిధముగా మరల తాళము వేయుచూ రెండవ ఖండమునుకూడా పూర్తిచేయుదురు. ఒక్కొక్కప్పుడు ఈ తాళముయొక్క చివరి రెండు అంగములగు। ద్రుతము 1 లఘువునకు బదులుగా 2 ఘాతలు 1 విసర్జితము (ఉసి) వేయుటకూడా కలదు. దీనినే పూర్వీకులు ధ్రువరూపకతాళమని చెప్పియుండిరి. ఉ॥ కమలజనారద. అను అరభిరాగములోని ప్రాచీనగీతము ధ్రువరూపక తాళమునకు ఒక చక్కని వుదాహరణమగును.

రూపక ధ్రువతాళము :— ఇది ప్రాచీన త్రిఖండ గీతములం దుపయోగించు ఒక తాళకాల ప్రమాణమగును. దీనిని వేయునవుడు మొదట 3 ఘాతలు 1 విసర్జితము 1 ఘాత 1 విసర్జితమును, తదుపరి 2 ఘాతలును, ( 8 అక్షరకాలములు ) వేయుదురు. దీనినే పూర్వీకులు రూపకో ధ్రువమని చెప్పియుండిరి. ఉ॥ సకల సురాసుర. అను గౌళరాగములోని ప్రాచీన గీతము యీ రూపక ధ్రువతాళమునకు ఒక మంచి వుదాహరణమగును.

రగణ మఠ్యతాళము:— ఇది ప్రాచీన కాలములో సంగీత రచనలందు వుప యోగించు ఒక విధమగు తాళకాల ప్రమాణమగును. దీనికి 1 గురువు 1 చతురశ్ర లఘువు 1 గురువు గలిగి ( 8 + 4 + 8 = 20 అక్షరకాలములు) వుండును. దీనినే పూర్వీకులు రగణమఠ్యమని చెప్పియుండిరి. ఉ॥ రీణాజక్షోణి విక్రమ రిపురే. అను ఝంకారభ్రమరి రాగములోని వెంకటమఖి గీతము యిందుకు ఒక వుదాహరణమగును.

కురుఝంపతాళము :— ఇది ప్రాచీనకాలములో సంగీతరచనలందు వుపయో గింపబడు నొక రకమైన తాళమగును. దీనికి । ద్రుతము । ఖండలఘువు । త్రిశ్రలఘువు గలిగి మొత్తము 10 అక్షరకాలము లుండును. దీనినే పూర్వీకులు "కురుఝంపతాళ" మని చెప్పియుండిరి. ఉ॥ ఝంతధణతకిణ అను అఠాణారాగములోని జక్కిణిదరువు యీ కురుఝంపతాళముగల రచనకు ఒక వుదాహరణమగును.

ఝంపటా తాళము:- ఇది ప్రాచీనలక్షణకారులు, ఆదితాళమునకు యివ్వబడిన పేరగును. అనగా ఇది 35 తాళములలోగల చతురశ్రజాతి త్రిపుటయని తెలియదగును.

శరభానందతాళము :— ఇది శ్రీ శ్యామశాస్త్రిలవారిచే కనిపెట్టబడినట్లుగా చెప్పబడుచున్న ఒక క్లిష్టమైన తాళమగును.

రామానందతాళము :— ఇది శ్రీ రఘునాథనాయకునిచే కనిపెట్టబడినట్లుగా చెప్పబడుచున్న ఒక అపురూపమైన తాళమగును.

ద్వినామతాళములు :— ఈక్రింది 8 తాళములను ద్వినామతాళములని చెప్పబడును. మకరందను, మహానందఅనియు, గజలీలను, జగలీలఅనియు, మత్స్యను, మీగమత్స్యఅనియు, వర్ధనను, రత్నఅనియు, రాజనారాయణను, నారాయణిఅనియు, మదనను, మతంగఅనియు, విలోకితను, విలోప, అనియుకూడ పిలువబడును.

నవసంధితాళములు: — 1. స్రాబ్రము 2. సమ 3. మట్టావన 4. పిరంగిని 5. మదన 6. నవ 7. బాలి 8. కొట్టరి 9. డెంగి అను తాళములను "నవసంధి తాళము" లనబడును.

లఘుశేఖరము :— వైణికులు వీణను వాయించునపుడు చతురశ్రజాతి ధ్రువ తాళము వేయుటలో మొదటి లఘువును ద్రుతమును కలిపి $4+2=6$ అక్షరకాలములను ఒకే మీటులో తెలుపుదురు. తరువాత 2 లఘువులకు 2 సార్లు మీటుదురు. 6 అక్షరకాలములు గల మొదటి మీటునే "లఘుశేఖర"మని చెప్పబడును.

ఉ॥ స రి గ మ గ రి । స రి గ రి । స రి గ మ॥ యీ విధముగా నుండును.

ద్రుతశేఖరము :— ఇది షోడశాంగములగు 16 టిలో, 3వ, దైన ద్రుతవిరామమునకు పూర్వీకు లివ్వబడిన పేరగును, దీనికి అంగసంజ్ఞ ◡̥. అక్షరకాలములు 3.

ఖండము :— ఇది ఖండిక లేక భాగము, లేక ఆవర్తము, లేక 5 అంకెకు వర్తించునట్టి పేరగును.

ఆవర్తము :— ఏదైన ఒక తాళమునకు గల అంగము లన్నిటిని ఒకసారి పూర్తిగా వేయుటను "ఆవర్త"మని చెప్పబడును.

గమనిక :— ఏ తాళమునకైనను కనీసము 2 అక్షరకాలము లుండినగాని అది తాళము కాజాలదు. గనుక అనుద్రుతము ఒక తాళముకాదు. అది ఒక తాళము యొక్క ప్రారంభమునగాని, గురు, ప్లుత, కాకపాదముల వెంటగాని రాదు. కాని అది లఘువుతోగాని లేక ద్రుతముతోగాని వచ్చును. ఇట్లే కాకపాదము ఒక తాళము యొక్క ప్రారంభమునగాని మధ్యనుగాని, గురు, ప్లుతములకు ముందుగాని రాదు. అది ద్రుతము లేక, లఘువు లేక గురువు, లేక ప్లుతముతరువాత వచ్చును. అయితే

ద్రుత, లఘు, గురు, ప్లుతములగు 4 అంగములును, ఒక తాళముయొక్క ప్రారంభములో గాని, మధ్యనుగాని, చివరగాని రావచ్చును. ఏదైన ఒక తాళను వేయునపుడు ప్రేలికి 4 అక్షరకాలములవంతునను, 8 అక్షరకాలములవంతునను వేయుట సరళీక్రమములో వరుసగా 3వ, కాలము, 4వ, కాలముగా చెప్పబడుచున్నను, ప్రాచీనసంప్రదాయజ్ఞులు వాటినే మధ్యమకాలముగను, ద్రుతకాలముగను చెప్పియుండుట గమనించదగును. తాళార్ణవము, పంచతాళేశ్వరము, సప్తతాళేశ్వరమువంటి ప్రాచీనగ్రంథములు తాళములనుగూర్చి ప్రత్యేకముగా వ్రాసియుండుట గమనార్హమగును. [illegible] సప్త తాళేశ్వరమను గ్రంథము శ్రీ పచ్చిమిరియం ఆది అప్పయ్య కుమారుడు [illegible] రచించెనని తెలియుచున్నది.

## మనోధర్మ సంగీతము

మనోధర్మసంగీతము :—దీనినే సామరస్య సంగీతము (Concert music) అని చెప్పబడును. ఇది భారతీయ సంగీతముయొక్క ప్రధానమైన లక్షణమగును. ఇది రెండు విధములు. (1) కల్పిత సంగీతము. ఇది ఇంతకు పూర్వమే రచింపబడిన రచనలను కంఠస్థముచేసి పాడునట్టి లేక వాయించునట్టి సంగీతమగును. (2) మనోధర్మ సంగీతము. ఇది గాయకునికి గల భావనాశక్తిచే, అప్పటికప్పుడు మనస్సుకు తోచినట్లు పాడునట్టి లేక వాయించునట్టి సంగీతమగును. ఇది కచ్చేరీ సంగీతములో అతిముఖ్యమైన భాగము గానుండి మూడవవంతు కాలము వినియోగింపబడును. దీనిని సంగీత విజ్ఞానములోని పరిపక్వతకు చిహ్నముగా నెంచబడును. సంగీతములోని మహోన్నతమైన గమ్య స్థానమును చేరుటకు మనోధర్మ సంగీత మొక ముఖ్యసాధనమగును. గాయకుడు రాగ లక్షణమునందలి జీవస్వరములను, న్యాసస్వరములను, రాగరంజకముగా ప్రదర్శించును. అయితే ఒక గొప్ప నీటి సముదాయములోగల ఒక పెద్ద మంచుగడ్డయొక్క కొలది భాగమే ఆ నీటిపైకి తేలునట్లుగా సుప్రసిద్ధ గాయకుడు తనకుగల అత్యద్భుత మేధాశక్తిలో కొంతభాగమునే కచ్చేరీలో ప్రదర్శింప గలుగుచుండును. అయినను యీ మనోధర్మ సంగీతములో తనకుగల ప్రతిభచే శ్రోతలను ఐహిక జీవితమునుండి మరపించ గలుగుచుండును. సభికులలో యే ఒకరైనను మనఃస్ఫూర్తిగా మెచ్చుకొన్నట్లు కరతాళధ్వనులు చేసినచో తాను చిరకాలము పడిన శ్రమఅంతయు ఫలించినట్లే సంతృప్తి చెందును. భారతీయ సంగీతమును శతాబ్దముల తరబడి సజీవముగా నుంచ గలిగినది యీ మనోధర్మ సంగీతమేయనిన అతిశయోక్తి కాజాలదు. కొన్ని శతాబ్దముల క్రిందట యూరప్‌లోని కొన్ని దేశములలో మనోధర్మ సంగీతము వ్యాప్తిలో నుండెను. కాని నేడు అచ్చటకూడ అది పూర్తిగా క్షీణించిపోయినదనే చెప్పవచ్చును. ప్రపంచములో యిప్పుడు మనోధర్మ సంగీతము, సంగీతకళయొక్క ప్రధాన భాగముగా యున్నది ఒక్క భారతదేశమేయని చెప్పవచ్చును. పశ్చాత్య [illegible]

చీనావంటి దేశములలో నేడు కొంత మనోధర్మ సంగీతము వున్నను, అది మనదేశము నుండి గ్రహించినదేయని చెప్పవచ్చును. రాగభావము యెప్పుడు పుట్టెనో అప్పుడే మనోధర్మ సంగీతముకూడా పుట్టుట జరిగెనని తెలియదగును.

ఈ మనోధర్మ సంగీతం ముఖ్యంగా 5 భాగము లగును. అవి (1) రాగాలాపన. (2) తానమ్ లేక మధ్యమకాలగానం. (3) పల్లవి. (4) సాహిత్య ప్రస్తారము లేక నిరవల్. (5) కల్పన స్వరములగును. వీటిలో రాగాలాపన తాళరహితమైనదగును.

(1) రాగాలాపన:-ఇది మనోధర్మ సంగీతములో మొదటి భాగమునకు చెందును: దీనిలో ముఖ్యముగా 3 భాగములు గలవు. అవి 1 ఆక్షిప్తిక. 2 రాగవర్ధనులు. 3 స్థాయి సంచారములగును. ఆక్షిప్తికనే "ఆయిత్త"మని చెప్పబడును. అక్షిప్తికయనగా రాగమును కొంచెము ముందుకు ఉవ్వుట యగును. ఆయిత్తమనగా రాగము పాడుటకుగల ప్రథమయత్న మగును. రాగాలాపన ముఖ్యముగా 2 విధములగును. అవి యేవనగా,

(i) లక్షణయుక్తమైనది (ii) లక్షణయుక్తమై అన్యరాగమిళితమైనది. ముఖ్యముగా రాగాలాపనచేయునపుడు అన్యరాగసంకరము కలుగనీయక రాగ పవిత్రత (శుద్ధము)ను రాగాలాపనాంతమువఱకు కాపాడుకొనవలెను. (2) తానమ్— దీనికి తాళము నిర్దిష్టముగా లేకపోయినను కొంచెము గతిని కలిగివుండును. (3) పల్లవి. ఇది ఒక క్రమబద్ధమైన తాళమును, పరిమితమైన సంగీతమును కలిగియుండును. (4) సాహిత్య ప్రస్తారము. ఇది ఒక క్రమమైనరాగ, తాళములను కలిగియుండును. (5) కల్పన స్వరములు. వీటికిని క్రమమైనపద్ధతిలో రాగ, తాళములు వుండును. అయితే చివర రెండుకూడ పరిమిత సంగీతమునకు చెందినవిగా చెప్పవచ్చును. వీటిలో మొదటిదైన రాగాలాపన పూర్వకాలములో ఒక విధమైన మొరటుపద్ధతిలో వుంటూవుండెను. కాని శాస్త్రయుక్తమైన దాని యభివృద్ధి ఆధునిక రాగవిధానము కనిపెట్టిన మతంగుని కాలమునుండే ప్రారంభమైనట్లు చెప్పబడుచున్నది. తరువాత, తానమ్, నిరవల్ క్రమంగా ఆమలులోనికి వచ్చినవి. పల్లవిని గురించి "సంగీతరత్నాకరము"వంటి ప్రాచీనగ్రంథములలో నుదహరింపబడినను, అది తరువాత రెండు శతాబ్దములకుగాని సంపూర్ణమైన యభివృద్ధిచెందియుండలేదు. శాస్త్రయుక్తమైనపద్ధతిలో పల్లవి, కల్పన స్వరముల యభివృద్ధి, ప్రాచీన వాగ్గేయ కారుడైన శ్రీ పచ్చిమిరియం ఆది అప్పయ్య కాలమునుండే జరిగినదని చెప్పవచ్చును. రాగాలాపన, ఆలాప, ఆలప్తి అను యీ 3 పదముల అర్థము నొకటే యగును. దీనినే రాగమును విస్తరించుట, లేక రాగ విస్తారమనికూడ చెప్పుదురు. రాగాలాపనకు ముఖ్యముగా తోడి, భైరవి, కాంభోజి, శంకరాభరణము, కల్యాణి వంటి పెద్దరాగములు ప్రధానమగును. రాగాలాపనచేయునపుడు త, ద, రి, న, తోమ్, అను, అక్షరము లుచ్చరించుటయే సంప్రదాయమగును.

తదరినతోమ్ అనగా తత్, రిహా, అనంతం, ఓమ్ అను శబ్దములు కలిసి తదరినతోమ్ యేర్పడినట్లు చెప్పుదురు. రాగాలాపన ఒక గంటకాలము చేయదలచినపుడు యీ క్రింది విధముగా ఆ యా భాగములను విభజించి పాడదగును. । ఆక్షిప్తిక 5 నిమిషములును, 1వ, రాగవర్ధని 10 నిమిషములును, 2వ, రాగవర్ధని 10 నిమిషములును, 3వ, రాగవర్ధని 7 నిమిషములును, 4వ, రాగవర్ధని 5 నిమిషములును, ఆరోహణ, అవరోహణస్థాయిలు 8 నిమిషములును, తానమ్ 15 నిమిషములును ప్రదర్శించుట, రంజకంగాను సంప్రదాయంగాను వుండును. రాగాలాపనలో యీ క్రిందివారు సుప్రసిద్ధులగుదురు. (1) తోడి శీతారామయ్య (2) తోడి సుందరరావు (3) అఠాణా అప్పయ్య (4) శంకరాభరణం నరసయ్య (5) బేగడ సుబ్రహ్మణ్యయ్యర్ (6) నారాయణగౌళ కుప్పయ్యర్‌లును, తానమ్‌లో శ్రీ ఘనం సీనయ్య, ఘనం కృష్ణయ్యర్‌లును, పల్లవిలో పల్లవి శేషయ్య, పల్లవి గోపాలయ్యర్‌లును ముఖ్యులగుదురు. శ్రీ త్యాగరాజు పల్లవిలో అంచెవేసిన చెయ్యి అయినను కృతిరచయితగా ఆయనకుగల మహోన్నతమైన స్థానంలో యింకొకటి పైకి వచ్చుటకు అవకాశం లేకపోయెను. రాగాలాపనవివరము:

(i) ఆక్షిప్తికము :— ఇది రాగాలాపనయొక్క ప్రారంభ భాగమగును. దీనినే ఆయిత్తమనికూడ చెప్పుదురు. ఈ భాగములోని ఆలాపనను మధ్యస్థాయి షడ్జములో ప్రారంభించి మంద్ర, మధ్య, తారస్థాయిలలో రిషభ, గాంధార, మధ్యమ, పంచమస్వరములందు రాగలక్షణమునకును, గాయకుని శక్తికిని తగినట్లుగా నొకసారి సంచరించి తిరిగి మధ్యస్థాయి షడ్జమునకు వచ్చి పూర్తిచేయవలెను. ఇట్టుల త్రిస్థాయిలందు స్వల్పముగా రాగాలాపన చేయుటను, "ఆక్షిప్తిక"మని చెప్పబడును. ఆక్షిప్తిక అనగా కుదింపబడిన లేక సంక్షిప్తపరుపబడిన ఆలాపన, యని అర్థము. కొందరు యీ పద్ధతికి భిన్నముగా యితర స్వరములందు ప్రారంభించుచున్నను ప్రాచీనగాయకులు అవలంబించిన పైపద్ధతులే శాస్త్రయుక్తములగునని తెలియదగును. రాగముయొక్క లక్షణమును సూచించు ఒక చిన్న ఆలాపనయగుటచే దీనిని "రాగసంక్షిప్త"మనికూడ చెప్పవచ్చును.

(ii) రాగవర్ధని :—ఇది రాగాలాపనలోని రెండవ భాగమును, ముఖ్యమైన భాగమునగును. ఇందు నాలుగు భాగములుగా నుండును. ప్రతిభాగమునకును ప్రారంభము లేక ఎడుప్పును, అంత్యము లేక ముక్తాయియును వుండును. ఈ ముక్తాయినే "విదారి" అని కూడ చెప్పుదురు. రాగవర్ధనిలోని నాలుగు భాగముల అంత్యమందును క్రమముగా ఒకటవ, రెండవ, మూడవ, నాల్గవ విదారులు అలంకారములుగా వచ్చుచుండును. ఈ రాగవర్ధనికే "కరణము" అను పేరుకూడ కలదు. ముక్తాయి అనగా ముగించుటనియు, విదారి అనగా చీల్చుటయనియు గ్రహింపదగును.

మొదటిరాగవర్ధని :—ఈ ఆలాపన మధ్యస్థాయి షడ్జములో ప్రారంభించి విశేషముగా మంద్రస్థాయిలో సంచరించుచుతూ, ఆయాస్వరములను సరియైన గమకము

లతోను, మరియు విశేషసంచారములతోను, రక్తిప్రయోగములతోను రాగముయొక్క మనోహరత్వము ప్రకాశించునట్లుగా ఆలాపన చేయవలెను. మరియు బహుత్వస్వరము లనుగాని, అల్పత్వస్వరములనుగాని తెలుచుగా వాడక, ఆలాపనలో చాలవఱకు విళంబకాలముగా నున్నను, మధ్య మధ్యను మధ్యమకాల, ద్రుతకాలములందు కూడ సంచారము చేయదగును. రాగస్వరూపమును చెడగొట్టు సంచారముల నుపయోగింపక, మధ్యమకాల సంచారములతో తారస్థాయి షడ్జమువరకు వెళ్ళి తదుపరి త్వరిత గతితో తిరిగి మధ్యమస్థాయి షడ్జమునకు వచ్చి ముగించుటను, "మొదటిరాగవర్ధని" యని చెప్పబడును.

రెండవ రాగవర్ధని :— ఇదియు . మొదటిరాగవర్ధనివలె ప్రారంభించినను, ముఖ్యముగా మధ్యస్థాయి యందును, తరువాత తారస్థాయి పంచమమువఱకును సంచరించి త్వరితగతిని మధ్యస్థాయి షడ్జమునకు వచ్చి ముగించవలెను. ఇట్టుల చేయుటలో విచిత్రకల్పనలతోను, గమక, వర్ణ, అలంకారములు విలసిల్లునట్లును, రాగము నందంతర్గతమైయున్న సౌందర్యమును స్ఫురించునట్లు సంచరించుటయేగాక, గాయకుని భావనాశక్తికిని, సామర్థ్యమునకును తగినట్లుగా రాగమును ఆలాపించుటను "రెండవ రాగవర్ధని" యని చెప్పబడును.

మూడవ రాగవర్ధని :—ఇదియు రెండవ రాగవర్ధనివలె ప్రారంభించినను సంచారములు ముఖ్యముగా తారస్థాయియందే యుండవలెను. ఈ ఆలాపన మధ్యస్థాయి పంచమమునుండి తారస్థాయి షడ్జమువరకును, అచటనుండి తార పంచమమువరకును క్రమముగా రాగమును సంచరించి తిరిగి మధ్యస్థాయి షడ్జమునకు వచ్చి ముగింపవలెను. రాగవర్ధనియొక్క పైమూడు భాగములును త్రిస్థాయిలంగును వుండును. గనుక ప్రతిభాగమును ఆకర్షణీయముగా నుండునట్లు రాగమును సంచరింపవలెను. దీనినే "మూడవరాగవర్ధని"యని చెప్పబడును.

నాల్గవ రాగవర్ధని :—ఇదియు రెండవ, మూడవ రాగవర్ధనులవలెనే రాగమును సంచరించుచూ, రాగవర్ధనిని చేయుకాలము స్వల్పముగను, మూర్ఛన లేక త్వరితగతిగల సంచారములు విశేషముగను వుండుటయే యీ ఆలాపనయొక్క విశిష్ట లక్షణమగును. అయితే కొందరు రాగవర్ధనిలోని యీ నాల్గుభాగములను ఒక్కొక్కప్పుడు రెండుగా విభజించి రెండు భాగములలోనే 4 రాగవర్ధనులను ముగించుటకూడ కలదు. ఈ 4 రాగవర్ధనుల చేయుటలో మొదటిభాగమును షుమారు 20 నిమిషములు చేసినచో, 2 వ భాగమును 10 నిమిషములును, 3 వ భాగమును 5 నిమిషములును, 4 వ భాగమును 2½ నిమిషములును ఆలాపించుటచే రాగరంజకమును సంప్రదాయమును కలదని గ్రహింపదగును.

iii స్థాయి సంచారము :— ఇది రాగాలాపనలోని అంత్యమైన మూడవ భాగమగును. స్థాయి ఆలాపన అనగా రాగములో యేదైన ఒక స్వరమును స్థాయిగా చేసుకొని రాగమును సంచరించి తిరిగి అదేస్వరమునకు వచ్చి ముగించుటను, స్థాయి స్వరము, లేక స్థాయిసంచారమని చెప్పబడును. ఇది రెండు విధములగును. అవి 1. ఆరోహణస్థాయి సంచారములేక ఆలాపన 2. అవరోహణస్థాయి ఆలాపన యగును.

i ఆరోహణస్థాయి ఆలాపన :— ఈ సంచారము 8 విధములుగా నుండును. ఎటులనగా i మొదట మధ్యస్థాయిషడ్జమును స్థాయిస్వరముగా నుంచుకొని దానికి పైన వున్న స్వరముల నంటక క్రిందిస్థాయిలోని మంద్రషడ్జమువఱకు రెండుసార్లు సంచరించి తిరిగి మధ్యస్థాయిషడ్జమునకు వచ్చి ముగించుటను "మధ్యషడ్జస్థాయి ఆలాపన"మనియు, ii మధ్యస్థాయిరిషభమును స్థాయిస్వరముగానుంచుకొని దానికి పైనుండు స్వరముల నంటక క్రిందనున్న మంద్రరిషభమువఱకు రెండుసార్లు సంచరించి తిరిగి మధ్యస్థాయి రిషభమునకువచ్చి ముగించుటను "మధ్యరిషభస్థాయి ఆలాపన"మనియు, ఇదేవిధముగా మధ్యస్థాయిలోని iii గాంధారమును iv మధ్యమమును v పంచమమును vi దైవతమును vii నిషాదమును viii తారషడ్జమును వరుసగా స్థాయిస్వరములుగా జేసుకొని వాటిపై నుండు స్వరముల నంటక క్రిందస్థాయి అదే స్వరములవఱకు రెండేసిసార్లు సంచారము చేసి తిరిగి బయలుదేరిన అదే స్వరములకు వచ్చి ముగించుట (అనగా పై 8 విధములగు స్థాయిసంచారముల)ను "ఆరోహణస్థాయి సంచార"మని చెప్పబడును. ఇందు స్థాయి స్వరములు క్రమంగా హెచ్చుచుండుటవలననే దీనికి "ఆరోహణస్థాయి ఆలాపన" యను పేరు వచ్చుటకు కారణమైనదని గ్రహించదగును.

2. అవరోహణస్థాయి ఆలాపన :— ఇదియు ఆరోహణస్థాయి ఆలాపనవలె 8 విధములుగా నుండును. దీనిలో స్థాయిస్వరములు అవరోహణముగా నుండుటచేత దీనిని "అవరోహణస్థాయి ఆలాపన"మని చెప్పబడుటకు కారణమైనది. ఎటులనగా! మొదట తారస్థాయిషడ్జమును స్థాయిస్వరముగా నుంచుకొని దానిక్రిందనుండు స్వరముల నంటక పైనవుండు అతితారస్థాయి షడ్జమువఱకు రెండుసార్లు సంచారముచేసి తిరిగి తారస్థాయిషడ్జమునకువచ్చి ముగించుటను "తారషడ్జస్థాయి ఆలాపన" మనియు, ii మధ్యస్థాయి నిషాదమును స్థాయిస్వరముగా జేసుకొని క్రిందిస్వరముల నంటక పైనున్న తారస్థాయినిషాదమువఱకు రెండుసార్లు సంచరించి తిరిగి మధ్యనిషాదమునకు వచ్చి ముగించుటను "మధ్యనిషాదస్థాయిఆలాపన"మనియు ఇదేవిధముగా iii మధ్య స్థాయిదైవతమును. iv మధ్యస్థాయిపంచమమును, v మధ్యస్థాయిమధ్యమమును, vi మధ్యస్థాయిగాంధారమును vii మధ్యస్థాయిరిషభమును, viii మధ్యస్థాయిషడ్జమును స్థాయిస్వరములుగాచేసికొని క్రిందిస్వరముల నంటక పై స్థాయిలోనున్న అదేగకపు

స్వరములవఱకు రెండుసార్లు సంచరించి తిరిగి బయలుదేరిన అదేస్థాయిస్వరములకువచ్చి ముగించుటను "అవరోహణస్థాయిఆలాపన" లేక సంచార "మని చెప్పబడును. ఇటుల అవరోహణస్థాయి సంచారములుచేయునపుడు అచ్చటచ్చట మధ్యమకాల, ద్రుతకాలసంచారములున్నను, ప్రధానముగా విళంబకాలములోనే సంచారము లుండ వలెను. మరియు నిట్లు చేయుటలో వర్జస్వరముల తొలగించియు, ఆరోహణ, అవరోహణముల ననుసరించియు, అల్పత్వ, బహుత్వస్వరములగమనించియు, గమక, వర్ణ, అలంకారాదులచే వినువారి మనస్సును కరగించునట్లు ఆలాపించుటయు సంప్రదాయమగునని తెలియదగును.

మకరిణి ఆలాపన :—రాగాలాపన జేయునపుడు రంజకమైన నొక జీవస్వరమును స్థాయిస్వరముగా జేసుకొని యచట నల్పముగా సంచరించి యేదైన నొక స్వరమున ముగించి తిరిగి ఆలాపనజేసి మొదటిస్థాయి స్వరమునకు వచ్చి ముగించవలెను. ఈ రీతిగా 3 పర్యాయములు ఆలాపించి 4 వ, పర్యాయము మంద్రమునుండి తారము వఱకు ఆలాపించి తిరిగి మధ్య షడ్జమునకు వచ్చి ముగించుటను భరతముని, మకరిణి లేక వర్తని, అని చెప్పియున్నారు. పైనదెలిపిన రాగాలాపన లక్షణములన్నియు అన్ని రాగములకు సాధారణముగా నుండునని గ్రహించునది.

తాయ ఆలాపన :—రాగాలాపనలో యేదైన ఒకస్వరమును స్థాయిగా నుంచుకొని పాడుటను "తాయ"మని చెప్పబడును. ఇదియొక విచిత్రమైన రాగాలాపన పద్ధతియగును. "తాయమనగా ! రాగములందు గ్రహస్వరమును వాది, సంవాదులుగా పాడుటనే" తాయమని చెప్పబడును. ఉ॥ శంకరాభరణ రాగములోని పూర్వాంగమగు "సరిగమ" అను స్వరములకు ఉత్తరాంగమగు "పధనిస" అను స్వరములు సమముగా నుండును. కనుక పంచమమును షడ్జగ్రహముగా జేసుకొని అచటనుండి అదే స్వరస్థానములలో రాగము పాడినపుడు ఆధారశృతికి శంకరాభరణ రాగముగానే యుండి మనకు కల్యాణిరాగముగా వినుపించును. ఇటుల గ్రహస్వరములు వరుసగా ఆయా రాగానుసారముగ నాల్గు స్వరములవరకు ఒక్కొక్క స్వరమును గ్రహస్వరముగా జేసికొని, ఆరోహణ. అవరోహణ క్రమముగా సంచరించి అన్యరాగకళలను జూపించి తిరిగి ఆధారషడ్జమునకు వచ్చి ప్రధానరాగకళలను జూపించి ముగించుటను "తాయ ఆలాపన" మనబడును. ఇది త్రిస్థాయిలందు సంచరింపగలిగినట్టియు, రాగలక్షణములం దనుభవముగల్గినట్టి గాత్రజ్ఞులు పాడదగినను నిపుణులైన జంత్రవాద్యకులుకూడ యిట్టి ఆలాపన నేడు చేయగలుగుచున్నారు. ఈ గ్రహస్వరపద్ధతి ననుసరించి యేర్పడినవే పంచమాంత్య, ధైవతాంత్య, నిషాదాంత్య రాగములని తెలియదగును. శ్రీ సుబ్బరామదీక్షితులు పేర్కొనబడిన, యీ 'తాయ ఆలాపన' పైనదెలిపిన స్థాయి సంచారమునకు సరిపోవునదిగా కనుపడుచున్నది. తాయ, మను పేరుతో ఒక సంగీతరచన కూడ యుండుట గమనించదగును.

సర్వస్వరగ్రహ ఏకరాగము :— ఏదైన ఒకరాగములోగల స్వరములన్నిటిలో యే స్వరమును గ్రహస్వరముగా జేసినను అదేరాగము (మొదటిరాగము) వచ్చునట్టి రాగమును "సర్వస్వరగ్రహ ఏకరాగ" మని చెప్పబడును. ఉ॥ గోప్రియరాగము. ఇది 62 వ, మేళకర్తయగు రిషభప్రియ యొక్క జన్యరాగమగును. దీని ఆరోహణావరోహ

2 3 2 1 2 . . 2 1 2 3 2

ణములు. స రి గ మ ధ ని స – స ని ధ మ గ రి స. ఈ రాగములో ఏస్వరము గ్రహస్వరముచేసినను గోప్రియరాగమే యేర్పడును. ఇట్టి రాగములను యింగ్లీషులో హోల్ టోన్ స్కేలు ( Whole tone scale ) రాగములని చెప్పబడును.

సాక్షరాలప్తి :—రాగాలాపన చేయునపుడు రామ, కృష్ణ, గోవింద, శంకర వంటి అర్ధసహితమైన భగవన్నామాక్షరముల నుచ్చరించుచూ చేయునట్టి రాగాలాపనను "సాక్షరాలప్తి" యని చెప్పబడును.

అనక్షరాలప్తి :—రాగాలాపన చేయునపుడు భగవన్నామాక్షరములుగాక "తదరినతోమ్" వంటి అర్ధరహితమైన యక్షరముల నుచ్చరించుచూ చేయునట్టి రాగాలాపనను "అనక్షరాలప్తి" యని చెప్పబడును.

తానశబ్దోత్పత్తి :— ఈ "తాన" అనుశబ్దము పూర్వము దక్షిణాత్యగానపద్ధతిలోగల "తెన్నా" అను పదమునుండి స్వీకరింపబడి తానముగా సంస్కరింపబడినదగును. "తెన్నా" అను పదమునకు "దక్షిణరాష్ట్రాధిపా" యని అర్థమగును. పూర్వకాలమున దక్షిణభారతదేశంలోగల పాండ్యరాజ్యము నేలునట్టి యొకరాజును అప్పటి గాయకులు స్తోత్రముగా రాగాలాపనలో "తెన్నా" "తెన్నా" యని సంబోధించుచూ పాడుచుండెడివారట. తెన్నా అను యీ పదమే క్రమక్రమముగా ఆర్యజన వ్యవహారములో తానమ్"గా మార్పుచెంది, క్రమేణా "అనంతానంతా" అను భగవన్నామోచ్చారణ సూచకంగా వివరింపబడెను. "తెన్నా" అను యీ రాగాలాపన పద్ధతి షుమారు 600 సంవత్సరములకు ముందే దక్షిణభారతంలో గలదని తెలియుచున్నది. రాగాలాపనలో యీతాన లేక అనంతశబ్దము గాత్రమును శ్రుతిలో చేర్చుటకు ఒక ముఖ్యసాధనంగా కూడా వుపయోగపడునని గ్రహించదగును.

2. తానమ్ :— రాగాలాపనయొక్క తరువాతభాగమును "తానమ్" లేక మధ్యమకాలగానమని చెప్పబడును. విళంబకాలములో రాగాలాపన అయిన తదుపరి పాడబడు యీ తానమ్ యెంతో ఆకర్షణీయంగాను, రసవంతముగాను వుండును. ఇది పాడునపుడు తానమ్, తానంన, తానంనావంటి మాటలు వుపయోగించవలెనేగాని వేరుశబ్దోచ్చారణములు చేయకూడదని పూర్వాచార్యులు జెప్పియుండిరి. తానమ్ పాడునపుడు అకార, అం, కారాదులనుజేర్చి నాభితానముగా ద్రుతకాలములో పాడుటయే సంప్రదాయమగును. అయితే యీ ఆలాపనలో విళంబకాలమే ప్రధానమైనను

యెడ, నెడ, మధ్యమకాల, ద్రుతకాలములలోకూడ ఆలాపించవచ్చును. ఇటుల ద్రుతకాలములో "తానమ్" పాడుటనే "ఘనమ్"అని చెప్పబడును. దీనిలోని సంగీతమును ఆవర్తములుగా లెక్కింప వీలుకానప్పటికిని అది ఒక విధమైన లయతో నేకూడి యుండును. నిపుణులైన గాయకులేమి, వాదకులేమి తానమును త్రికాలములు లేక షట్కాలములుకూడ పాడి, లేక వాయింపగలుగుదురు. ప్రాచీనులైన శ్రీ సత్తనూరు పంజు అయ్యర్ అనువారు మానవ-అశ్వ-గజ-మర్కట-మయూర-కుక్కుట-మండూక-చక్ర తానములనెడి 8 రకముల తానములు పాడెడివారని ప్రతీతిగలదు. తానమ్ పాడుటనే మధ్యమకాలగానమనికూడ చెప్పుదురు. ఆదర్శమైనట్టి 1 గంట రాగాలాపనలో తానమ్‌తోకూడా కలిపి వివిధభాగములకాలము లీ క్రిందివిధముగా నుండవలెను. ఆక్షిప్తికము 5 నిమిషములును, మొదటి రాగవర్ధని 10 నిమిషములును, రెండవ రాగవర్ధని 10 నిమిషములును, మూడవ రాగవర్ధని 7 నిమిషములును, నాల్గవ రాగవర్ధని 5 నిమిషములును, స్థాయిసంచారములు 8 నిమిషములును, తానమ్ 15 నిమిషములును పాడుటగాని, వాయించుటగాని సమంజసముగాను రక్తిగాను వుండును.

(3) పల్లవి :— అనగా పదము, లయ, విన్యాసము అను వర్గత్రయములోని ప్రధానాక్షరముల సంయోగమును "పల్లవి" అని చెప్పబడును. పదము అనగా మాటలు. లయ, అనగా కాలము. విన్యాసమనగా హెచ్చుతగ్గులతో విస్తరించుట యగును. పల్లవిలోగల 'ల్ల, కారము ద్విత్వమగుటచే పల్లవికి 'లయ, ముఖ్యమగుచున్నది. గాయకునియొక్క లేక వాదకునియొక్క పరిపూర్ణజ్ఞానము పల్లవి ప్రదర్శించుటలోనే విశదమగుచుండును. మనోధర్మ సంగీతములోని 5 భాగములలోను పల్లవి ఒక ముఖ్య భాగమగును. ఇది పరిమితసంగీతమునకు చెందును. రాగాలాపనలో విశేషసామర్థ్యము లేకపోయినను, పల్లవిలో అత్యద్భుతమైన ప్రతిభనుచూపగల గాయకు లుండుటకలదు. అట్లే పల్లవి పాడుటలో విశేషసామర్థ్యములేని గాయకులు రాగాలాపనలో అపూర్వమైన ప్రతిభను ప్రదర్శించటంకూడాకలదు. పూర్వము మహారాజులు తమ ఆస్థానములలో ప్రముఖులైన సంగీత విద్వాంసులచే పల్లవిలో పోటీలు జరిపించి గెలిచినవారికి ఘనమైన సన్మానములు చేయుచుండెడివారు. సుప్రసిద్ధ వాగ్గేయకారులైన శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ 108 తాళములలో మిక్కిలి పెద్దదైన "సింహానందన" అను ఆవర్తమునకు 128 అక్షరకాలములుగల ఒక తాళములో అపూర్వమైన ఒక పల్లవిని రచించి ఒక గానసభలో అత్యద్భుతంగా పాడి సభికులచే విశేషమన్ననల నొందినట్లు తెలియుచున్నది. ఈ పల్లవి పాడుట అనేపద్ధతి షుమారు 200 సంవత్సరములకుముందే అమలునందున్నట్లు తెలియుచున్నది. కాని శాస్త్రయుక్తమైన ఒక పద్ధతిని కనిపెట్టినదిమాత్రము 18 వ, శతాబ్దమునకు చెందిన శ్రీ పచ్చిమిరియం ఆది అప్పయ్యా అనే చెప్పవచ్చును. కృతిరచనలు యేర్పడినప్పటినుంచే నిరవల్‌ను, కల్పనస్వరములను అభి

వృద్ధిచేయుటకు గాయకులు ప్రారంభించిరి. దీనినిబట్టి రాగాలాపనయే వీటన్నిటికంటె అతిపురాతనమైనదని స్పష్టపడుచున్నది. పల్లవినిపాడు క్రమమెటు లనగా? 35 తాళము లలోగాని, మరి యే యితర తాళములోగాని పల్లవిని పాడునపుడు దాని ప్రారంభము ఆ తాళముయొక్క అతీత, అనాగత, సమగ్రహములలో నొకదానికి సరిపోవునటుల చూచుకొనవలెను. మరియు పదగర్భము తప్పకుండునట్లును, సాహిత్యాక్షరములు యే యే తావులందు యే అక్షరము లుండవలెనో అవి తప్పకుండునట్లును విచిత్రకల్పనలతో సాహిత్యమును ప్రస్తరించుతూ వరుసగా 1 లేక 2, లేక 4 లేక 8 ఆవర్తములవంతున పల్లవినిపాడి ముగించవలెను. ఇట్లు పాడుటలో గాయకునిశక్తికి తగినట్లును, వచ్చిన సంగతులు రానీయకను, రాగ, తాళ, విధులు తప్పకను, వినువారికి యింపుగా నుండు నట్లును పాడవలెను. ఇట్లు పాడునపుడు మధ్యమకాలములో పాడుచూ, యెడ, నెడ మధ్యమ, ద్రుతకాలములలోపాడుటసమంజసముగానుండును. అయితే అతివిళంబ(చౌక) కాలముగను, అతిద్రుత (దురిత) కాలముగను పాడుటదోషమని ప్రాచీనుల యభిమత మగును. పల్లవియందుగల మాతువు (సాహిత్యము) యే భాషలోనైనా వుండవచ్చును. లేక మణిప్రవాళమువంటి వివిధభాషలలోకూడ నుండవచ్చును. అది దేవతాస్తుతికి చెందియుండుటే సంప్రదాయమగును. కాని యీ కాలములో పల్లవి సాహిత్యము, హాస్యరస, ప్రేమ, ఎత్తిపొడుపులకును, ప్రాపంచకవిషయములకును సంబంధించికూడా యుండుటంకలదు. ఉ|| గానలోలకరుణ. అను తోడిరాగము, ఆదితాళములోని పల్లవి దేవతాస్తుతిగల పల్లవికిని, ఉ|| గక్కున కౌగిటజేర్చి, అను సావేరిరాగము, ఆదితాళ ములోని పల్లవి, శృంగారరసయుతమగు పల్లవికిని వుదాహరణములగును. ఇవి రెండును అనాగతగ్రహపల్లవులకు చెందునని తెలియదగును.

(4) నిరవల్ :—అనగా ఖాళీలు పూర్తిచేయుట అని అర్థము. ఇది ఏదైన పల్లవిలోగాని తదితర సంగీత రచనలోగాని యుండు సాహిత్యమునందలి కొంత భాగ మును తీసుకొని అకార, ఇకార, ఉకారాదులతో రాగ, తాళ, నియమముల ననుస రించి విచిత్రమైన కల్పనలతో ప్రస్తరించుటను తమిళములోనిరవల్ అని చెప్పబడును. దీనినే తెలుగులో సాహిత్య ప్రస్తారమని చెప్పబడును.

(5) కల్పన స్వరములు :—ఇవి ఏదైన ఒక పల్లవిలోగాని, కృతివంటి యితర సంగీతరచనలోగాని కొంత సాహిత్యభాగమును తీసుకొని అందుకు నియమించు కొనిన తాళములో సమగ్రహములోగాని, అనాగతగ్రహములోగాని, అతీతగ్రహము లోగాని స్వరములను కల్పించివేయుటకు గల పేరగును. ఇట్లు వేయునపుడు యీ దిగువ నుదహరింపబడిన ముఖ్యవిషయములను గమనించుట విధియగును! మొదట కల్పన స్వరములను పావు (¼) ఆవర్తములోను, తరువాత అర (½) ఆవర్తములోను తరువాత 1, 2, 4, 8 ఆవర్తములలోను స్వరములను పెంచుచూ ఆయారాగ, తాళవిధుల

ననుసరించి స్వరములను కల్పించిపాడుట, ii మొదట ప్రథమకాలములోను, తదుపరి ద్వితీయకాలములోను, పిమ్మట తృతీయకాలములోను స్వరములను కల్పించి పాడుట. iii త్రిస్థాయిలందును స్వరములను కల్పించి పాడుట. iv న్యాసస్వరము పల్లవి యొక్క ప్రారంభ స్వరముక్రింది స్వరముగ నుండునట్లు పాడుట. v చివరపాడునట్టి ముక్తాయిలు న్యాసస్వరముతో ముగించుట. vi గతిభేదము నొందించి స్వరకల్పన చేయుటయగును. ఉ॥ వాతాపిగణపతిం భజేహమ్ అను కృతిలో "ప్రణవస్వరూప" అనుచోటసమగ్రహములో కల్పనస్వరములువేయుట రంజకముగానుండును. ఉ॥కొలువ మరెగద, అను తోడిరాగకృతిలో "తంబురచేకొని" అనుచోట, అతీతగ్రహములో కల్పనస్వరములు చాల రంజకముగా నుండును. ఉ॥ పక్కల నిలబడి. అనుఖరహర ప్రియరాగకృతిలో "తనువుచే" అనుచోట అనాగతగ్రహములో కల్పనస్వరములు పాడుట యెంతయు రక్తిగా నుండును. మరియు ఉ॥ భజరే రఘువీరం. అను కల్యాణిరాగంలో ఆదితాళమునందుగల అనాగతగ్రహ పల్లవిలోకూడ కల్పనస్వరములు వేయుట యెంతయు రక్తిగానుండును.

పదగర్భము:—ఇందు ప్రథమాంగము, ద్వితీయాంగములు రెండును సమాన భాగములుగానుండును. ఒక్కొక్కప్పుడు సమంగా లేకపోవచ్చును. ఆయాతాళములను బట్టి యీ భేదము యేర్పడును. పల్లవి పాడునప్పుడు తాళము వేయుటలో లఘువును ఒకసారి పూర్తిగా వేసినవెంటనే వేయబడు మొదటి ఘాతయందుండునట్టి సాహిత్యా క్షరమును "పదగర్భ"మని చెప్పబడును. ఉ॥ పాలించుటకు సమయమిదే। న్ను...హ। రే కృష్ణనను॥ అను పల్లవిలో అడ్డగీత గురుతుగల తావును పదగర్భమని చెప్పబడును.

రత్తాయి పల్లవి:—ఇవి మనోహరమైన రెండు స్వతంత్ర పల్లవులతో సామరస్యముగ రచింపబడి, రెండు పదగర్భములను గలిగియుండునట్టి పల్లవికిగల పేరగును. ఇందు మొదటిపల్లవి రెండవ పల్లవిలోని భావమును స్ఫురింపజేయును. ఈ రెండును ఒక్కొక్కప్పుడు విడివిడిగా పాడుటకు కూడ వీలు కలిగియుండును.

స్వరాక్షర పల్లవి:—ఇది పల్లవియొక్క సాహిత్యము స్వరాక్షరము తో కూడినదై ఆస్వరముల పదజాలము సాహిత్యమువలె అర్థము నిచ్చునదిగా నుండు పల్లవికిగల పేరగును. ఉ॥ మోహనరాగములోని <u>సరిగపాగ</u> - ఇచ్చె నే - <u>పా దా పా గ</u> - ఇచ్చెరా. అను పల్లవిలో అడ్డగీటులు గలవి స్వరాక్షరములగును. గనుక ఇది స్వరాక్షర పల్లవికి శాస్త్రయుక్తమైన ఒక ముఖ్య వుదాహరణమగును.

గోపుచ్ఛయతి పల్లవి:—ఇది పల్లవియొక్క సాహిత్యము ఆవుతోకవలె మొదట పెద్దదిగా నుండి పోను పోను తగ్గిపోవునట్టి దానికిగల పేరగును. ఉ॥ సుగుణా నిధి చంద్ర, కులశేఖరేంద్ర, అను సాహిత్యమును సుగుణానిధిచంద్ర - గుణనిధిచంద్ర,

నిధిచంద్ర, చంద్ర అను విధముగ, గోపుచ్ఛయతిగా పల్లవిని విభజించి పాడవచ్చును. ఇది శ్రీ స్వాతితిరునాళ్ మహారాజువారిపై ఆయన గౌరవార్థము రచింపబడిన కాంభోజి రాగములోని ఒక ప్రఖ్యాత పల్లవియగును.

రాగమాలికా పల్లవి :— ఇది ఏదైన ఒక పల్లవిని వివిధరాగములలో దాని తాళవిధుల ననుసరించి పాడునట్టి పల్లవికిగలుగు పేరగును. ఉ॥ శంకరాభరణనై, అను శంకరాభరణము, తోడి, కల్యాణి, దర్బారు రాగములలోగల ఆదితాళపల్లవి యిందుకొక చక్కని వుదాహరణమగును.

తాళమాలికా పల్లవి :— ఇది ఏదైనా ఒక పల్లవిని వివిధతాళములందు పాడుచూ తిరిగి మొదటి పల్లవి తాళమును యెత్తుకొనుచుండు నట్టి పల్లవికిగల పేరగును. ఇట్టి పల్లవులను పాడుటలో శ్రీ వీణ కుప్పయ్యర్ కుమారుడు త్యాగయ్యర్ మిక్కిలి సమర్థుడని ప్రతీతిగలదు.

రాగతాళమాలికా పల్లవి :— ఇది ఏదైనా ఒక పల్లవిని వివిధరాగములలోను, వివిధతాళములందును పాడ వీలుకలిగినట్టి పల్లవికి గలుగు పేరగును. ఇట్టి పల్లవులను పాడుటకు రాగ, తాళ, జ్ఞానములందు మిక్కిలి సామర్థ్యముండవలెను. మరియు ప్రేలికి 16, లేక 32 అక్షరకాలములు నడచునట్టి చౌకకాల పల్లవులను, గతిభేదము కలిగినట్టి క్లిష్టమైన పల్లవులను, అనగా ప్రథమాంగము త్రిశ్రగతిలోను, ద్వితీయాంగము చతురశ్రగతిలోను లేక వేరువేరు గతులలోనుగల పల్లవులను పాడటం మిక్కిలి కష్టసాధ్యముగా నుండును. గనుకనే ఇట్టి పల్లవులు అరుదుగా పాడబడును.

ద్వితాళ పల్లవి :— ఇది ఏదైనా ఒక పల్లవిని దానికి నిర్ణయింపబడిన తాళమునందేగాక మరియొక తాళమునందుకూడా పాడుటకు వీలుకలిగినట్టి పల్లవికిగల పేరగును. ఉ॥ చతురశ్రజాతి రూపకతాళపల్లవిని త్రిశ్రజాతి ఏకతాళములోను, మిశ్రజాతి ఝంపతాళ పల్లవిని ఖండజాతి ఏకతాళములోను పాడుటకు వీలుండును. గనుక యిట్టి పల్లవులు ద్వితాళపల్లవుల రకమునకు చెందినవగును.

అనులోమ పల్లవి :— ఇది ఏదైనా ఒక పల్లవిని పాడునపుడు దాని తాళమును ఒకేవిధముగా వేయుచూ, పల్లవి సాహిత్యమును రెట్టింపు లేక నాలుగు రెట్లు వేగముతో పాడి లేక వాయించునట్టి పల్లవికిగల పేరగును.

ప్రతిలోమ పల్లవి :— ఇది ఏదైనా ఒక పల్లవిని పాడునపుడు ఆపల్లవి యొక్క సాహిత్యమును ఒకేకాలములో పాడుచూ, తాళమును రెట్టింపు లేక నాల్గు రెట్లు వేగముతో నడుపునట్టి పల్లవికిగల పేరగును. ఈ అనులోమ ప్రతిలోమ పల్లవులను పాడుటకు పరిపూర్ణమైన, లయజ్ఞానము, మంచి ఒదుగుగల శారీరము (కంఠము) యుండుట ముఖ్యమగును. ఇట్లు పాడుట చౌకకాల పల్లవులలోనే సాధ్యమగును.

## గీత లక్షణము.

గీతము :— ఇది పల్లవి, అను పల్లవి, చరణములను విభాగములులేని సులభ సంగీతరచనయగును. గీతము అనుమాటకుపాట, అనికూడ అర్థము కలదు. కాని సంగీతములో నొక ప్రత్యేకమగు రచనకే యిది యెక్కువగా వర్తించును. రచన లన్నిటిలోను మిక్కిలి నిరాడంబరమైనవియు, రాగముయొక్క నిరాడంబర మాధుర్యాన్ని గుర్తింపజేయునవియు గీతములగును. ఇందు సంగీతము, లయ, సమానముగా నుండును. మరియు సంగతులుగాని, క్లిష్టపదసమ్మేళనములుగాని వుండవు. ధాతు, వనబడు ప్రతి స్వరమునకును, మాతు, వనబడు ఒక్కొక్క సాహిత్యాక్షరము సాధారణముగా నుండును. ఈ సాహిత్యము దైవస్తోత్రమునకు సంబంధించియుండును. మరియు కొన్ని గీతములలో అర్థములేని అయ్యా- తియ్యా-అయ్యం వోవయ్యా- రేరె- వంటిమాటలు సాహిత్యమునందు మిళితమై వచ్చుచుండును. ప్రథమాభ్యాసమునందుగల స్వరావళి, జంట, అలంకారాదులు పూర్తిచేసినపిదప విద్యార్థి ఈ గీతములనే ముఖ్యముగా నేర్చుకొందురు. సప్తతాళములలోను వాటివిభాగములలోను అనేకగీతములు రచింపబడివున్నవి. శ్రీ త్యాగరాజునకు పూర్వమే చాలామంది రచయితలు గీతములను రచించియుండిరి. ఈ గీతములు ముఖ్యముగా రెండు విధములుగా నున్నవి. అవి 1 సాధారణ గీతములు. 2 లక్షణ గీతములగును. వాటి వివరముల నీక్రింద చెలుపుట గమనించునది.

i సాధారణగీతము :— గీతలక్షణమునందు చెప్పబడిన అన్ని విషయములను గలిగియుండునది "సాధారణగీత"మని చెప్పబడును. దీనినే సామాన్యగీతమనియు, లక్ష్యగీతమనియు, సంచారిగీతమనియు చెప్పుట కలదు. ఇందుగల సాహిత్యము దైవస్తోత్రముగ నుండును. నడక ప్రేలికి ఒక అక్షరకాలముగా నుండును. ఉ॥ శ్రీరామచంద్ర. (భైరవి. చ. ధృవ) అను గీతము యిందుకొక ముఖ్య వుదాహరణమగును. ఈ సాధారణ గీతములు మరియొకపద్ధతిలో 3 విధములుగా నుండును. అవి i పిళ్ళారిగీతములు ii ఘనరాగగీతములు iii రాగమాలికాగీతము లగును.

i పిళ్లారిగీతములు:- విఘ్నేశ్వరుడు, మహేశ్వరుడు, శ్రీ మహావిష్ణువు మొదలగు దైవములను స్తోత్రముచేయుచు శ్రీ పురందరదాసు రచియించిన ఉపోద్ఘాత గీతములను "పిళ్లారిగీతము"లని చెప్పబడును. ఉ॥1 శ్రీగణనాథ. 2 కుందగౌర. 3 కెరెయనీరను. 4 పదుమనాభా. 5 భయసమయదేవ మొదలగు గీతములు యీరకమునకు చెందినవగును.

ii ఘనరాగ గీతములు :—నాట, గౌళ, ఆరభి, శ్రీ, వరాళివంటి ఘనరాగ పంచకమునందు రచింపబడిన గీతములను "ఘనరాగ గీతము"లని చెప్పబడును. ఉ॥ 1 అషరీ కబరీ (నాట) 2 సకల సురాసుర (గౌళ) 3 రేరె శ్రీరామచంద్ర (ఆరభి) 4 మీనాక్షీ జయ కామాక్షీ (శ్రీరాగ) 5 వందే మాధవ (వరాళి) వంటి గీతములీ యీరకమునకు చెందినవగును.

iii రాగమాలికా గీతములు :—గీతలక్షణము ననుసరించి వివిధరాగములలో క్లుప్తముగా రచింపబడిన గీతములను "రాగమాలికా గీతము"లని చెప్పబడును. ఇట్టి గీతములు యీ కాలములో వాడుకయందు లేకున్నవి. పైన తెలిపిన లక్ష్యగీతములను రచించినవారిలో శ్రీ పురందరదాసు, శ్రీ రామామాత్యుడు, శ్రీ పైడాల గురుమూర్తి శాస్త్రి మొదలగువారు ముఖ్యు లగుదురు.

ప్రాచీన లక్ష్యగీతములు :— ఇవి మరియొక పద్ధతిలో రెండు విధములుగా నున్నవి. అవి 1. శుద్ధసూడ 2. ఛాయాలగసూడలగును. సూడఅనునది గీతవాచక మైన దేశీయపదమగును. శాస్త్రనియమంబులుగల ఛాయను పొందినగీతమును శుద్ధసూడ యనబడును. ఛాయాలగపదనికారమే సాలగమగును. ఈ సాలగసూడఅనునది, ధృవ, మఠ్య, ప్రతిమఠ్య, నిస్సారుక, అట్టతాళ, రాసతాళ, ఏకతాళములను 7 భేదములు గలిగియుండును. అందు మొదటిదైన ధృవమనగా! ధాతు, మాతువులతో కూడిన ప్రాచీనగీతములలో కొన్ని రెండు ఖండములుగను, కొన్ని మూడు ఖండములుగను వుండును. వీటిలో మొదటిది ఉద్గ్రాహఖండ మనబడును. దీనిలో మొదటిభాగ మెచ్చట న్యాసముగా నుంచబడునో దానినే ధ్రువమని చెప్పబడును. ఈ ధ్రువము నకుగల భేదములు, వాటి పేర్లు, రసములు, తాళములు మొదలగు లక్షణ ములును, మఠ్యాది మిగత ఆరుతాళముల లక్షణములను గ్రంథవిస్తర భీతిచేతను వాడుకలో లేనందునను నిచట తెలుపనట్టుల గ్రహించి వాటిని "చతుర్దండి ప్రకాశిక" గ్రంథమందు జూడవగును. ఉద్గ్రాహఖండ స్వరములకంటె హెచ్చైన స్వరములు గలది ఆభోగఖండమనబడును. మూడవది ముద్రాఖండమగును. ఉద్గ్రాహఖండ ములో ధ్రువము వెనుక, అంతరియును, పిమ్మట, జావడయును, ఆభోగఖండము, వెనుక అంతరియును, ముద్రాఖండము వెనుక అంతరియును గల్గియుండును. ఇట్టివి త్రిఖండగీతములందు మాత్రమే కనుపడుచున్నవి. శ్రీ వెంకటముఖి యిట్టి గీతములను ధృవాది సప్తతాళములతో, ఝంపటాతాళమును, రగణమఠ్యతాళమును చేర్చి యీ 9 తాళములందే రచింపబడవలెనని చెప్పియున్నారు. ఈ లక్ష్యగీతములందలి సాహిత్యము, సంస్కృతాభాసమైన ప్రాకృతాది భాషాపదములతోను, ఆభోగఖండ సాహిత్యము అర్థరహితమైన అయ్యా, తియ్యా, అంవో ఇయ్యా, రేరె, వంటి పదముల తోను కూడియుండును. ఉ॥ శ్రీ మత్తుహినగిరి తనూభవధనురే, అను శ్రీరంజని రాగములోని శ్రీ వెంకటముఖి గీతము ప్రాచీనలక్ష్యగీతమునకు ఒక వుదాహరణమగును.

అంతరి :—ప్రాచీనగీతములలో ధ్రువ, ఆభోగ, ముద్రాఖండముల వెనుక వుండునట్టి భాగము లేక తావునకు అంతరియని చెప్పబడును.

జావడ :—ప్రాచీనగీతములలోగల అంతరి వెనుక రెండు ఖండములను కలుపు నట్టిభాగము లేక తావునకు "జావడ" అని చెప్పబడును.

(2) లక్షణగీతము :— అనగా దైవస్తోత్రముతో కూడిన సాహిత్యమునకు తోడు, ఆరాగముయొక్క సంపూర్ణలక్షణమును కూడ సాహిత్యమునందు యిమిడ్చి రచింపబడు గీతమును "లక్షణగీత"మని చెప్పబడును. దీనిలో ఆరాగము జన్యరాగ మైనచో దాని జనకరాగమును, భాషాంగరాగమైనచో దాని అన్యస్వరములను, వర్జ, వక్ర, గ్రహ, న్యాస, అంశస్వరములను, ఔడవ, షాడవ, సంపూర్ణముల స్వభావమును రచింపబడియుండును. ప్రస్తుతము అమలునందున్న చాలారాగములలోను, వాడుకలోలేని కొన్నిరాగములలోను లక్షణగీతములురచింపబడియున్నవి. గ్రంథములనుఅచ్చువేయుట తెలియని ప్రాచీనకాలములో గానకళార్థులు ఆయా రాగలక్షణములను సులభముగా జ్ఞప్తి యందుంచుకొనుటకీ లక్షణగీతము లెంతయు సహాయకారిగా నుండెడివి. కాని వర్త మానకాలములో నివి మన సారస్వతవాంఛనుమాత్రము దీర్చగలిగినవిగానున్నవి. ఉ॥ కంసాసుర, 'సహాన, చ.మత్య' (గురుమూర్తిశాస్త్రి) యగును. శ్రీ వెంకటమఖియొక్క రాగాంగ లక్షణగీతములు ఒకప్రత్యేకరకమునకు చెందినవగుటచే వాటిలక్షణమును తెలుసు కొనుట కెంతయు నుత్సాహముగా నుండును. సాధారణముగా యీ లక్షణగీతములు 3 భాగములుగా నుండును. అందు మొదటిభాగము ఆ మేళకర్తరాగము తీసుకొనుస్వర ములజాతిని తెలియపఱచును. రెండవభాగము ఆ మేళకర్తనుండి జనించు ఉపాంగరాగ వర్ణన తెలియపఱచును. మూడవభాగము ఆ మేళకర్తనుండి జనించు భాషాంగరాగ మునుగూర్చి తెలియపఱచును. ఈ లక్షణగీతముల సాహిత్యములందు దెలిపిన ఉపాంగ రాగములలో కొన్ని శ్రీ వెంకటమఖి ఆనంతరము భాషాంగరాగములుగా పరిగణింపబడు టచే వీటిలో కొన్ని దక్షిణభారతంలో నేడు అమలునందు లేకున్నవి. కాని ఉత్తర భారతమునందు మాత్రము వ్యాప్తిలోనున్నవి. ఉ॥ రవికోటితేజ. అను మాయామాళవ గౌళ రాగ, చ. మత్యతాళములోని వెంకటమఖిగీతము యిందుకు ఒక ముఖ్యవుదాహ రణమగును. ఇట్టి లక్షణగీతములు రచించినవారిలో శ్రీ గోవిందదీక్షితులు, శ్రీ వెంకట మఖి మొదలగువారు ముఖ్యులగుదురు.

సూళాదులు :—అనగా ఇవి గీతమునకు దేశ్యపదమైన సూడనుండి స్వీకరింప బడినదగుటచె "సూళాదు" లని చెప్పబడును. ఇవి ఆమరికలోను, లక్షణములోను గీతమును బోలియుండును. ఈ సూళాదులు ప్రసిద్ధాలంకార సప్తతాళములందు ఉద్గ్రాహ, ధృవ, ఆభోగ, ధాతువులతో ఏక కళగానుండి, విళంబ, మధ్య, లయలు గలిగి వర్ణక్రమములతో సాహిత్యరూపమై యుండును. ఉ॥ అచ్యుతానంత. అను, కాశిరామక్రియ రాగ ఝంపతాళములోని పురందరదాసుని రచన యిందుకు వుదా హరణయగును. ఇట్టివి శ్రీపురందరదాసులు మాత్రమే కన్నడములో రచించినట్లు తెలియుచున్నది.

చిట్టతానములు :— వీనినే శ్రీ వెంకటమఖి మొదలగు పూర్వాచార్యులు "కటకము"లని చెప్పియుండిరి. ఇవి ప్రత్యేకముగా వీణావాద్యము నభ్యసించుటకై

వుద్దేశింపబడిన రచనలగును. ఘనరాగపంచకమునందు గల యీ చిట్టతానములు వీణను అభ్యసించు విద్యార్థులకు ఘనరాగపంచకమందలి లక్షణజ్ఞానము సంపాదించుకొనుట కెంతయు విలుగానుండును. ప్రస్తుతము అమలునందున్న ప్రాముఖ్యమైన అనేక రాగము లలో యీ చిట్టతానములుగలవు. వీటిలో రాగాలాపన లక్షణములను జెప్పినటుల ఆయుత్తము ఎత్తుప్పు, ముక్తాయిఎత్తుప్పు, స్థాయి, ఆరోహి- అవరోహి- సంచారి- మకరిణి మొదలగు లక్షణములుకూడ వుండునని తెలియుచున్నది.

## ప్రబంధవివరము.

ప్రబంధము:-సంగీతరచనలలో పూర్వమునుండి అమలులోలేని కొన్ని రచనలు గలవు. వాటిలో కొన్ని యితర నామములతో మార్పుచెంది వాడుకలోనున్నవి. భరతుడు తన నాట్యశాస్త్రములో నాట్యమునకుపయోగించు అనేకరచనలు పేర్కొని ఆకాలములో ధ్రువలు, గీతిలు అను రెండు రచనలు ప్రధానంగా అమలులోనున్నట్లు తెలిపెను. మరియు మాగధి, అర్థమాగధ, సంభావిత, పృథుల, అను 4 గీతిలనుగురించి పేర్కొని యుండెను. మతంగుడు 49 దేశీప్రబంధములను, శార్ఙ్గదేవుడు 75 యితర ప్రబంధములను గురించి పేర్కొనియుండిరి. ప్రబంధమనగా ప్రత్యేకమైన ప్రాచీనరచనకేగాక ప్రతి సంగీతరచనకుకూడా అర్థము నిచ్చును. ప్రత్యేకమైన ప్రబంధములలో 6 అంగములును, 4 ధాతులును వుండును. వాటి వివరముల నీ క్రింద తెలుపుట గమనించునది.

i స్వరము:— అనగా సప్తస్వరములగు సరిగమపధని, లోగల ప్రతి ఒక్కటియును "స్వర"మని చెప్పబడును.

ii బిరుదము:— సంబోధనగా ప్రబంధనాయకుని వుద్దేశించి వాని ధైర్య, శౌర్యాదిగుణములను తెలుపు స్తోత్రపాఠములను "బిరుద"మని చెప్పబడును.

iii పదము:— అనగా మాటలుగలది "పదము"అని చెప్పబడును.

iv తేనకము:— అనగా భాండీరభాషలోగల "తేన" అను శబ్దవికారమును "తేనక"మని చెప్పబడును. ఇది తత్ శబ్దమునకు సంబంధించినదగును. తత్ అనునది నిత్యమంగళస్వరూపమైన పరబ్రహ్మవాచకమగును. ఓం తత్సత్, తత్వమసి, అను మహావాక్యములకు సరిపోవు యీ ప్రబంధము లందలి "తేన" శబ్దమునే "తేనక" మని చెప్పబడుచున్నదని తెలియునది.

v పాటము:—అనగా రుద్రవీణ, శంఖమువంటి వాద్యములలోగలుగు స్వారస్య ధ్వనులను, ఉరోవాద్యమువంటి చర్మవాద్యములలో లక్షణానుసారముగా పలుకునట్టి శబ్దములు లేక జతులను "పాటము" అని చెప్పబడును. [ పాటము = శబ్దము. ]

vi తాళము :— తాళప్రకరణమున జెప్పబడిన లక్షణములతో కూడినది "తాళ"మని చెప్పబడును. పైన దెలుపబడిన 6 అంగములును అవి వచ్చు సంఖ్యనుబట్టి ప్రబంధములను యీ క్రింది 5 విధములుగా విభజించిరి.

i మేదినీజాతిప్రబంధము :— ఇందు పైనదెలిపిన ఆఱు అంగము లుండును. దీనికి ఉ॥ చండశేల. అనునట్టి హంసధ్వనిరాగము, మత్యతాళములోని శ్రీరామ స్వామిదీక్షితుల రచన యిందుకు సరిపోవు ఒక మంచి వుదాహరణమగును.

ii ఆనందినీజాతిప్రబంధము :— దీనికి పైనదెలిపిన 6 అంగములలో తేనకము తప్ప మిగత 5 అంగము లుండును. ఉ॥ తిల్లాన. ధన్యాసిరాగము, ఆదితాళములో శ్రీ పల్లవి శేషయ్యవ్రాసిన రచనయిందుకు సరిపోవు ఒక చక్కని వుదాహరణమగును.

iii దీపినీజాతి ప్రబంధము :—దీనికి పై 6 అంగములలో పాటము, తేనకము తప్ప మిగత 4 అంగములుండును. ఉ॥ విరుబోణి, అను భైరవిరాగము. అటతాళము లోని శ్రీపచ్చిమిరియం ఆది అప్పయ్య వ్రాసిన తానవర్ణము యిందుకు సరిపోవు చక్కని వుదారణమగును.

iv భావినీ జాతిప్రబంధము:—దీనిలో పై 6 అంగములలో పదము, తాళము, స్వరము అను 3 అంగములుండును. ఉ॥ నీమది చల్లగ. అను ఆనందభైరవిరాగము, ఆదితాళములోని శ్రీ మాతృభూతయ్యాయొక్క శ్రీ సుగంధికుంతల లాంబాంకిత కృతి యిందుకు సరిపోవు చక్కనివుదాహరణ మగును.

v తారావళీజాతి ప్రబంధము:—దీనికి పై 6 అంగములలో స్వరము, తాళము, అను 2 అంగములుండును. ఉ॥ సా రి గా పా ధా సా నీ ధా, అను బిలహరిరాగము. ఆదితాళములోని జతిస్వరము యిందుకు సరిపోవు నట్టి చక్కని వుదాహరణమగును. ప్రబంధములలో ఈ క్రింది 4 ధాతులు వుండును. వాటియొక్క వివరము లేమనగా !

i ఉద్గ్రాహము :— ఇది ప్రబంధముయొక్క మొదటిభాగము లేక పల్లవి సరిపోవు ప్రారంభ భాగమగును.

ii ధృవము :—ఇది చరణమునకు సరిపోవు ఒక ముఖ్యమైన భాగమగును.

iii మేళాపకము :—ఇది అనుపల్లవికి పోవు పై రెండింటిని కలుపు నట్టి యొక భాగమగును.

iv ఆభోగము :—ఇది మధ్యమకాల సాహిత్యము లేక కృతియొక్క చిట్ట స్వరమునకు సరిపోవు అంత్యభాగమగును. పై 4 ధాతులలోను ఉద్గ్రాహ, ధృవ ములు ముఖ్యమైన అంగములగును. మేళాపక, ఆభోగములు అంత ముఖ్యమైన అంగ

ములు కావు. ఒక కృతిలో వచ్చు ముఖ్యమైనట్టి, అముఖ్యమైనట్టి అంగములు ఆధునిక సంగీతమునకు మంచి వుదాహరణములగును. ప్రబంధములను మరియొక పద్ధతిలో 3 విధములుగా విభజించిరి. అవి ఏవనగా!

i ద్విధాతు ప్రబంధము:—ఇందు, ఉద్గ్రాహ, ధృవములుండును. ఉ॥ పాహి రామచంద్ర. అను శంకరాభరణరాగము, ఆదితాళములోని త్యాగరాజ దివ్యనామ సంకీర్తన యిందుకు సరిపోవు చక్కని వుదాహరణమగును. దీనికి ఒక పల్లవి ఒక చరణము వుండును.

ii త్రిధాతు ప్రబంధము :—ఇందు, ఉద్గ్రాహ, ధృవ, ఆభోగము లుండును. ఉ॥ సరససామదాన. అను కాపినారాయణిరాగము - ఆదితాళములోని త్యాగరాజ కృతి యిందుకు సరిపోవు చక్కని వుదాహరణమగును. దీనిలో పల్లవి, అను పల్లవి, చరణములుండును.

iii చతుర్ధాతు ప్రబంధము :— ఇందు ఉద్గ్రాహ, మేళాపక, ధృవ, ఆభోగ ములుండును. ఉ॥ అంబానీస్మరణము. అను ఆనందభైరవి రాగములోని కృతి యిందుకు సరిపోవు చక్కని వుదాహరణమగును. దీనిలో పల్లవి. అనుపల్లవి. చరణము, చిట్టస్వరములుండును. ప్రబంధములను మరియొక పద్ధతిలో రెండు విధములుగా విభజించియుండిరి. వాటి వివరముల నీక్రింద దెలుపుట గమనించునది.

i నిర్యుక్తప్రబంధము :— అనగా యిది సూత్రములను లేక ఛందస్సులనుబట్టి రాగ, తాళములను తెలుపుచూ వ్రాయబడిన రచనయగును.

ii అనిర్యుక్తప్రబంధము ;— అనగా యిది సూత్రములను లేక ఛంధస్సులను, అతిక్రమించి రాగ, తాళములను తెలుపకనే వ్రాయబడిన రచనయగును.

శార్ఙ్గదేవుడు ప్రబంధములను మరియొకపద్ధతిలో 3 విధములుగా విభజించిరి. అవి i సూడప్రబంధములు ii అలిక్రమప్రబంధములు iii విప్రకీర్ణప్రబంధములగును. ఈ సూడప్రబంధములో శుద్ధసూడ, సాలగసూడ అను రెండు రకములు గలవు. ఇవి తరువాత వచ్చిన సంగీతరచనల కొకమార్గము నేర్పరచగలైను. శార్ఙ్గదేవుడు గీతిలకుతోడు, ఆక్షిప్తికములు, కపాలములు, కంబళములవంటి యితరరచనలుకూడ పేర్కొనియుండెను. 108 తాళములలోని పేర్లను గలిగిన ప్రబంధములుకూడ కొన్నిగలవు. అవి ఉ॥ చచ్చరీ, హంసలీల, తురగలీల, గజలీల, మొదలగునవి యగును. శ్రీగోపాలనాయకుడు గ్రహస్వర ప్రబంధము, తాళార్ణవము, రాగకదంబకములను 3 రకములైన ప్రబంధముల రచించెను. భూలోకమల్లుడు చాలాప్రబంధములను రచించినట్లు తెలియుచున్నది. ఈ ప్రబంధము లలో యీ క్రింది అనేకరకములు ప్రాచీనకాలములో మిక్కిలి వాడుకలోనుండెను. అవి

i వర్ణము. ఇది వర్ణ, తాళములలో రచింపబడిన ఒక ప్రత్యేక రచనయగును.

ii పంచతాళేశ్వరము ;— అనగా ఇది 5 తాళములలోగల తాళమాలికయగును. ఈ ప్రబంధముయొక్క 5 భాగములును 5 మార్గ తాళములలోనుండునని గ్రహించదగును.

iii శ్రీ విలాసము :— అనగా ఇది 5 రాగములలోను 5 తాళములలోనుగల ఒక రాగ, తాళమాలికయగును.

iv శ్రీరంగప్రబంధము:—అనగా యిది 4 రాగములలోను 4 తాళములలోనుగల ఒక రాగ, తాళమాలికయగును.

v ఉమాతిలకప్రబంధము:—అనగా యిది 3 రాగములలోను 3 తాళములలోను గల ఒక రాగ, తాళమాలికయగును.

vi పంచభంగి, పంచానన:—అనగా యివి 2 రాగములలోను 2 తాళములలోను గల ఒక రాగతాళమాలికలగును.

vii శరభలీల :— అనగా యిది 8 రాగములలోను 8 తాళములలోను గల ఒక రాగతాళమాలికయగును.

viii రాగకదంబకము:—అనగా యిది ఆధునికరాగమాలికకు సరిపోవునట్టి ఒక మనోహరమైన రచనయగును.

ix తాళార్ణవము:—అనగా యిది ఆధునిక తాళమాలికకు సరిపోవురచనయగును.

x స్వరార్థ :— అనగా యిది స్వరాక్షరములతోకూడిన రచనయగును. యిది రెండు రకములుగానుండును. అవి (1) శుద్ధము (2) మిశ్రముయనునవి.

i శుద్ధము :—అనగా రచనయంతయు స్వరాక్షరములతో కూడిన దానికిగల పేరు.

ii మిశ్రము:—అనగా సాహిత్యాక్షరములు అచ్చటచ్చటవుండు దానికిగల పేరు.

కైవార ప్రబంధము :—ఇది ధాతు, మాతులతో కూడిన ప్రాచీనమైన ఒక రచనయగును. ఇందు మొదట పాటవఖండము. పిమ్మట జావడ, తదుపరి ఆలాప ఖండము, ఆ తరువాత ముద్రాఖండములను భాగములుండును. ఇందు మొదటి రెంటి లోను గలమాతు, జతులతోను, వాద్యములతో కూడిన సంఖ్యాశాస్త్రముతోను మిగత ఆలాప, ముద్రాఖండములందలి మాతు, అర్థయుక్తమైన స్తోత్రములతోను కూడి యుండును. నడక తాళాక్షరము ఏకకళగానుండి మధ్య, మధ్య మధ్యమకాలములో కూడనుండును. ఉ॥ తోదిగినాంధిమి ధిమికిట, అను నారాయణగౌళరాగము మఠ్యతాళం లోని శ్రీ వెంకటమఖి రచన యిందుకు వుదాహరణమగును. ఈ రచనలలో కొన్ని వివిధ రాష్ట్రభాషలలో నుండును. ఇట్టివాటిని "విచిత్ర ప్రబంధము"లందురు. ఇట్టి రచనలు

పాటము, తేనకము, తాళములచే నలంకరింపబడును. ఈ ప్రబంధములు మణిప్రవాళము వంటి కీర్తనలకు ఒక మార్గము నేర్పఱచగలిగెనని గమనించదగును.

కఫాయిప్ ప్రబంధము :—ఇది అతి ప్రాచీనమైన ఒక రకమగు దేశీయప్రబంధమునకు గల పేరగును. ఇందు పల్లవి, అనుపల్లవి, చరణములను విభాగము లుండవు. గీతము వలెనుండి ధాతు, మాతువులుండును. సాహిత్యములో కొంతభాగము జతులతోను, కొంతభాగము స్తోత్రములతోను కూడియుండి నడక తాళాక్షరము ఏకకళగా నుండును. ఉ॥ తత్తాధిగితాధై. అను ఘరజురాగము, ఆదితాళములోని రచన యిందుకు ఒక ముఖ్య వుదాహరణమగును.

తాయమ్ :—ఇది రచనలో గీతమును పోలియుండును. ఇందులో పాటము (సోల్కట్టు) లేక జతులు వుండుటయే, దీనియొక్క ప్రత్యేక లక్షణమగును. ఇది అభ్యాస గానమునకు చెందిన రచనయగును. ఇది ముఖ్యముగా వీణవిద్యార్థులువీణయందు మీటు శాస్త్రము నభివృద్ధిపరచుకొనుటకు మిక్కిలి సహాయకారిగా నుండును. శ్రీ పురందరదాసులు, శ్రీ వెంకటమఖి మొదలగువారు యీతాయములను రచించిన వారిలో ముఖ్యులగుదురు. మరియు గీత, ఆలాప, తాయ, ప్రబంధములతో కూడుకొనినట్టిదానిని "చతుర్దండి" యని చెప్పబడునని గ్రహించునది.

తానీకరణము :—ఇవి గీతము లేక ప్రబంధలక్షణమును గలిగినదై యెడ, నెడ విళంబ,మధ్య లయలుగల రచనయగును. ఈ తానీకరణ, గీత, ప్రబంధములను వాయించునపుడు తాళము, పాట సమముగాను, ఏకకళగాను వుండి మొదట మధ్య, తార స్థాయిలందును, తదుపరి మంద్ర, మధ్యస్థాయిలందును రెండుసార్లు వాయించుట సుప్రసిద్ధ వైణికుల సంప్రదాయమగును.

స్వరజతి :— ఇది పల్లవి, అనుపల్లవి, చరణములను విభాగములుగల రచనయగును. ఆయితే కొన్ని స్వరజతులు అనుపల్లవి లేకనే పల్లవి, చరణములను మాత్రమే గలిగి యుండును. ఇవి మిక్కిలి మనోహరమైన రచనలగును. సంగీత అమరికలోను, నడచువేగములోను వర్ణమును బోలియుండును. సాధారణముగా ఇందుగల సాహిత్యము భక్తి, వీర, శృంగారరసములలో నొకదానికి చెందియుండి ఇష్టదైవప్రార్థనగాగాని, లేక ధైర్య, సాహసోపేతమగు నొక వీరగాథకుగాని చెందియుండును. కొన్ని ప్రాచీన స్వరజతులలో అనుపల్లవియొక్క కడపట ముక్తాయిస్వరరూపమైన ధాతులో సగము శబ్దము,సగము స్వరమునుండికడపట తధిగిణతోం, అను జతులు గలిగియుండును. ఇవి పాడునపుడు మొదట చరణములో మొదటి ఆవర్తముయొక్క స్వరసాహిత్యములను,తదుపరిచరణములో, రెండవ, మూడవ, నాల్గవ స్వరసాహిత్యములను, పాడి వెంటనే చరణములో మొదటి ఆవర్తస్వరమున న్యాసము చేసికొని పిదప చరణముయొక్క మిగత

ఆవర్తములను చౌకవర్ణపద్ధతిగా పాడుకొనవలెను. i ఉ॥ కామాక్షీ నీపదయుగమే, అను యదుకులకాంభోజిరాగములోను, ii కామాక్షీ అనుదినము. అను భైరవిరాగ-మిశ్రఏక తాళములోనుగల శ్రీశ్యామశాస్త్రిల స్వరజతులు యిందుకుముఖ్యవుదాహరణములగును. మనోహరమైన యిట్టి స్వరజతులను రచించినవారిలో ముఖ్యులు శ్రీ శ్యామశాస్త్రి, శ్రీ ఆది అప్పయ్య, శ్రీ స్వాతి తిరునాళ్, శ్రీ V. కృష్ణస్వామిభాగవతార్, శ్రీ చిన్నకృష్ణదాసు మొదలగువారగుదురు.

జతిస్వరము :— ఇది శబ్దమువలె నృత్యమున కుపయోగమగు నొకరకమైన సంగీతరచనయగును. దీనిలోని సంగీతము జీవము కలదిగాను, ఆకర్షణీయముగాను వుండును. సంగీత అమరికలోను, నిర్మాణములోను స్వరజతిని పోలినదిగానుండి పల్లవి, అనుపల్లవి, చరణములు గలిగియుండును. కాని, వాటికి సాహిత్యము సాధారణంగా వుండదు. దీనినడక సాధారణముగా తానవర్ణమునుబోలి మధ్యమకాలములోనుండును. దీనినే "స్వరపల్లవి" అనికూడా చెప్పుదురు. ఉ॥ సా, రి గా పా ధా సా నీ ధా- అను ప్రఖ్యాతిగాంచిన బిలహరిరాగ-ఆదితాళంలోని జతిస్వరము యిందు కొక ముఖ్య వుదాహరణమగును. దీనికే యిటీవలయెవరో నొక రచయిత "రాగ వేణుగోపబాల" అను సాహిత్యమునుజతపఱచియుండిరని గమనించదగును.

జతులు :— అనగా, తక, తరి కిట, ణక తధింగిణతోమ్, వంటి తాళప్రత్యయములకుగల పేరగును. ఇట్టిజతులు, ముఖ్యంగా "తిల్లాన"లయందును, శ్రీ నారాయణ తీర్థులవారి శ్రీ కృష్ణలీలాతరంగిణిలోని కొన్నిరచనలందును కనుపడును. ఉ॥ (1) తక ఝుం తకధీం అను సౌరాష్ట్రరాగము, ఏకతాళములోని తిల్లాన (2) తంతంతకిటఝుం అను ఖమాసురాగము, ఆదితాళములోని తిల్లాన యిందుకు చక్కని వుదాహరణములగును.

వర్ణము :— అనగా రాగభావసమన్వితమై, మధురరసపూరితమై, పాండిత్య ప్రతిభగలిగినరచనను వర్ణమని చెప్పబడును. దీనిలో విశేషమైన సంగీత ప్రాముఖ్య ముండును. వర్ణములు రచించుటకు అద్భుతమైనశక్తియు, నైపుణ్యము లవసరమగును. గనుకనే వర్ణరచయితలు బహుకొద్దిమందిమాత్రమే గలరు. ప్రస్తుతము అములులోనున్న వర్ణరచనలు షుమారు 200 కు మించనట్లుగా తెలియుచున్నది. వర్ణములందుగల సాహిత్యము చాల తక్కువగను, అంతగా ప్రాముఖ్యమైనదిగాకను, వుండును. మరియు నీసాహిత్యము భక్తిరసమునకుగాని, శృంగారరసమునకుగాని చెందియుండును. వర్ణము ముఖ్యముగా రెండు భాగములుగానుండును. అవి 1. పూర్వాంగము 2. ఉత్తరాంగములగును. i పూర్వాంగమనగా! పల్లవి, అనుపల్లవి, ముక్తాయిస్వరములతో కూడిన భాగమగును. ii ఉత్తరాంగమనగా! చరణము, చరణస్వరములు లేక ఎత్తుగడ

స్వరములుగల భాగమగును. వర్ణములోగల చరణము నే చిట్టపల్లవిఅనియు, ఉపపల్లవి అనియు, ఎత్తుగడపల్లవిఅనియు చెప్పబడును. వర్ణములను రెండు రకములుగా విభజించియుండిరి. అవి 1. తానవర్ణములు 2. పదవర్ణములగును.

1 తానవర్ణములు :—ఇవి ప్రతిసంగీత విద్యార్థియు కృతులను నేర్చుకొనుటకు ముందు విధిగా నభ్యసింపబడు రచనలగును. సాధారణముగా యీ వర్ణములలో పల్లవి, అనుపల్లవి, చరణములకు మాత్రమే సాహిత్యము వుండును. కాని కొన్ని వర్ణములలో ముక్తాయిస్వరము ఎత్తుగడస్వరములకు కూడా సాహిత్యము వుండుటకద్దు. కాని అట్టి వర్ణములు చాల అరుదుగా నుండును. ఈ సాహిత్యాక్షరములమధ్య అకార, ఇకార, ఉకార, ఎకార, ఒకారములు యిమిడ్చి రచింపబడును. వర్ణమును పాడునపుడు మొదట పూర్వాంగము పాడి పల్లవి యెత్తుకొనవలెను. తరువాత ఉత్తరాంగమును పాడి పల్లవి యెత్తుకొని నిలుపవలెను. ఇట్లు పాడుటలో ప్రతి ఎత్తుగడస్వరము పాడినవెంట నే చరణము పాడవలెను. ఈ తానవర్ణముల నే వాడుకయందు రెండు విధములుగా చెప్పుదురు. అవి i చిన్నవర్ణములు ii పెద్దవర్ణములగును.

i చిన్నవర్ణములు :_ ఇవి ఆది, రూపక, ఝంప, త్రిపుటవంటి తక్కువ అక్షరకాలములుగల చిన్నతాళములందు రచింపబడు వాటికిగల పేరగును. ఉ॥ ఇంత చలముజేసితె, అను బేగడరాగము. ఆదితాళములోని శ్రీ వీణ కుప్పయ్యర్ గారి వర్ణము యీ చిన్న వర్ణములకు ఒక ముఖ్య వుదాహరణమగును.

ii పెద్దవర్ణములు :— ఇవి అటతాళమువంటి యెక్కువ అక్షరకాలములుగల పెద్దతాళములందు రచింపబడిన వాటికిగల పేరగును. ఉ॥ విరుబోణి, అను భైరవిరాగము, ఖండజాతి అటతాళములోని శ్రీ పచ్చిమిరియం ఆదిఅప్పయ్యగారి వర్ణము యీ పెద్ద వర్ణమునకు ఒకముఖ్య వుదాహరణమగును. సంపూర్ణ సాహిత్యముగల చిన్నవర్ణమునకు ఉ॥ నిన్నే కోరి. అనుకానడరాగము ఆదితాళములోని, శ్రీ సారంగపాణియొక్క వర్ణము, పెద్దవర్ణమునకు, ఉ॥ సరసిజనాభ, అను కాంభోజిరాగము, అటతాళములోని శ్రీ స్వాతి తిరునాళ్ వారివర్ణము ముఖ్య వుదాహరణములగును. సుప్రసిద్ధవర్ణ రచయితలలో శ్రీ వీణకుప్పయ్యర్, శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్, శ్రీ తిరువత్తియూరు త్యాగయ్యర్, శ్రీ పచ్చిమిరియం ఆది అప్పయ్య, శ్రీ స్వాతి తిరునాళ్ మహారాజు, శ్రీ రామ్నాడ్ శ్రీనివాసయ్యంగార్, శ్రీ పల్లవి శేషయ్య, శ్రీ పల్లవి గోపాలయ్యర్, శ్రీ మైసూరు సదాశివరావు మొదలగువారు ముఖ్యులగుదురు.

2. పదవర్ణము :—ఇది తాన వర్ణమునకువలె పల్లవి, అనుపల్లవి, చరణము, ఎత్తుగడ స్వరములుండి ప్రత్యేకముగా భరతనాట్యముకొరకు నుద్దేశింపబడిన ఒకవిధమగు

రచనయగును. వీటినే చౌకవర్ణములనికూడ చెప్పుదురు. ఇందు ప్రతిభాగమునకును సాహిత్యము వుండి శృంగారరస ప్రధానముగా నుండును. దీనినడక, విళంబ, మధ్య ద్రుతకాలములతో కూడియుండును. వీటిలో భావములను విశదీకరించుచూ పలు విధములైన అభినయములను చేయుటకు యెంతో అవకాశముండును. అను పల్లవి అంతమందుగల ముక్తాయి జతులతో కూడి విళంబ, మధ్య, ద్రుత కాలముల ను కలిగి యుండును. ఉ॥ నిన్నునమ్మి నాను, అను ఆనందభైరవిరాగము ఆదితాళములోనిరచనయును, "ఎంతనినే దెలుపుదురా" అను ఖమాసురాగము త్రిశ్రజాతి ఏకతాళములోని రచనయును పదవర్ణములకు ముఖ్య వుదాహరణములగును. ఈ కాలములో యిట్టి పదవర్ణములు వాడుకలో అంతగా లేవనే చెప్పవలసియుండును. సుప్రసిద్ధులైన పదవర్ణరచయితలలో ఈ క్రిందివారు ముఖ్యులగుచుదు. ఉ॥ శ్రీ గోవిందసామయ్యా, శ్రీ వడివేలు నట్టువనార్, శ్రీ పల్లవి శేషయ్యా, శ్రీ రామస్వామిశివన్, శ్రీ మైసూరు సదాశివరావు, శ్రీ కుండ్రకుడి కృష్ణయ్యార్, శ్రీ సుబ్బరామ దీక్షితులు, శ్రీ పొన్నయ్యాపిళ్లై మొదలగువారు ముఖ్యులగుదురు.

పదము:— ఇది పల్లవి, అనుపల్లవి, చరణములను విభాగములు గలిగి పాండితీప్రతిభగల యొక విధమగు రచనయగును. దీనినడక నెమ్మదిగాను, ఆకర్షణీయముగానువుండి వినువారి హృదయకుహరములందు గాఢమైన నూతనభావములు రేకెత్తించు సాహిత్యము గలదిగానుండును. మరియు నీ సాహిత్యము గంభీరమైన వేదాంతార్థములతో నిమిడియుండి, శృంగారరసప్రధానమై నాయికా, నాయక లక్షణమునకు సంబంధించియుండును. ఇందుగల ప్రతిభాగమును రాగభావముతో నిండియుండును. అనుపల్లవి, చరణము లందలిసాహిత్యము పల్లవి నందుకొనుటకు తగినట్లుగానుండును. ఇందుఅనుపల్లవిలోగాని, చరణములోగాని నాయకముద్రయుండును. చరణములన్నియు ఒకేధాతుశైలిలోనుండి సాహిత్యమునకును, సంగీతమునకును, సరియైన సామరస్యము తుదవరకు పోషింపబడియుండును. పదములనుపాడునపుడు సాహిత్యములోని శబ్దార్థములను చక్కగానెరిగి, రసానుభవముతో, చౌకముగాను, రంజకముగాను గానముచేయుటయే సంప్రదాయమగును. i ఉ॥ మంచిదినము నేడే. అను ఆనందభైరవిరాగము,త్రిపుటతాళములోని క్షేత్రయ్యపదము, ii అలిగితే భాగ్యమాయె. అను హుసేనిరాగము త్రిపుట తాళములోని క్షేత్రయ్యపదము యిందుకు ముఖ్య వుదాహరణములగును. క్షేత్రయ్య 2,000 పదములవరకు రచించినట్లు తెలియుచున్నది. పదరచయితలలో శ్రీ క్షేత్రయ్యా, ఘనం సీనయ్యా, పరిమళ రంగడు, సారంగపాణి, గోవిందస్వామయ్యా, వైదీశ్వరన్ కోవిల్ సుబ్బరామయ్యార్, మెరట్టూరు వెంకట్రామ శాస్త్రిలు, ఘనం కృష్ణయ్యార్, శ్రీ స్వాతితిరునాళ్ మొదలగువారు ప్రసిద్ధులగుదురు.

జావళి :— ఇది పదమునుబోలియుండు నొకరకమగు సంగీతరచనయగును. ముఖ్యముగా నిది గ్రామ్య గానమునకు సంబంధించినదై మనస్సును ఆకర్షింపజేయునదిగా నుండును. ఇందుగల సంగీతము తేజోవంతముగాను, సాహిత్యము శృంగారరసప్రధానమైనదిగానువుండి నాయికా, నాయకలక్షణమునకు సంబంధించినదిగా నుండును. ముఖ్యముగా వినోదముకొఱకు మాత్రము రచింపబడు యీజావళీలు మధ్యమకాలనడకను గలిగియుండును. i ఉ॥అపమూరూకుంల్లో సైతి. అను బేహాగురాగము చ. ఏకతాళములోని, జావళియు, ii కొమ్మరో వానికెంతబిగువే, అను ఖమాసురాగము, ఆదితాళములోని శ్రీ పట్టాభిరామయ్య జావళియు, యిందుకు ముఖ్యవుదాహరణము లగును. జావళీరచయితలలో శ్రీ ధర్మపురి సుబ్బరాయర్, శ్రీ పట్టాభిరామయ్య శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్, శ్రీ రామ్నాడ్ శ్రీనివాసయ్యంగార్ శ్రీ దాసు శ్రీరాములు మొదలగువారు ముఖ్యులగుదురు.

తిల్లాన :— ఇది అన్యదేశీయమైన "తెరితిల్లాన" నుండి స్వీకరింపబడిన ఒకరకమైన సంగీతరచనయగును. ఇందు సంగీత ప్రాధాన్యము యెక్కువగానుండును. దీనిలోని సంగీతము సజీవముగాను, నడక మధ్యమకాలముగాను వుండును. ఇందు పల్లవి, అనుపల్లవి, చరణములను విభాగములుండును. దీనియందుగల సాహిత్యములో కొంతభాగము జతులతోకూడియుండును. స్వరసాహిత్య జతులతోకూడిన యిట్టి తిల్లానలను భరత నాట్యములందు ప్రదర్శించునపుడు, సాహిత్యభాగమును అభినయముద్వారాను, మిగత జతులుగలభాగమును నృత్యముద్వారాను ప్రదర్శించుదురు. ఉ॥ i "తధింధింత తననం" అను ఫరజురాగము, ఆదితాళములోని తిల్లానయు ii "తంతంతకిట ఝం"అను ఖమాసు రాగము, ఆదితాళములోని తిల్లానయు యిట్టి రచనలకు ముఖ్యవుదాహరణములగును. సుప్రసిద్ధ తిల్లాన రచయితలలో శ్రీస్వాతితిరునాళ్, శ్రీ పల్లవిశేషయ్య, శ్రీపట్నం సుబ్రహ్మణ్యయ్యర్, శ్రీ రామ్నాడ్ శ్రీనివాసయ్యంగార్, శ్రీ అరియకుడి రామానుజయ్యంగార్ మొదలగువారు ముఖ్యులగుదురు.

సంయుతహస్తము :—అభినయము చేయువారు రెండు చేతులను చేర్చి అంగ, భంగిమములనుచూపుచూ అభినయించుటను "సంయుతహస్త"మని చెప్పబడును.

అసంయుతహస్తము :—అభినయము చేయువారు ఒకేచేతితో అంగ, భంగిమములను మాపుచూ అభినయించుటను "అసంయుతహస్త"మని చెప్పబడును.

శబ్దము :–ఇది క్రమమైన సాహిత్యముతోను,జతులతోను కూడియుండు నొక సంగీతరచనయగును. నాట్యముచేయువారు యిందుగల సాహిత్యములోని భావములను, సమయోచితమగు అభినయములద్వారా సభికులకు తెలియజేయుదురు. ఈ శబ్దమును రచన, నృత్తమునకును, అభినయమునకును సంబంధించియుండును. గనుకనే వీటిని భరత

నాట్యములందు విశేషముగ నుపయోగించుచుందురు. ఇందు సాహిత్యమునకుగల ధాతుతో జతిచరణము అనగా "సరసిజాక్షులు" వంటివి ముందుగా పాడబడుటవల్లనే దీనికి శబ్దము 'అను పేరు వచ్చుటకు కారణమైనదని గ్రహించవలెను. ఉ॥ సరసిజాక్షులు.

అలారిప్పు:— ఇది ప్రార్థనావిధానమునకు సంబంధించిన ఒకరకమైన నృత్యసంగీతరచనయగును, ఇందు అంగ, భంగిమలు క్లుప్తముగా చెప్పబడును. సంగీతసామరస్యము యిందు విశేషముగా నుండును. సాహిత్యము జతులతో కూడి నదై, మధ్యమకాలములో నుండును. ఇది నాట్యము చేయువానిని ప్రవేశపెట్టును. ఇట్టి రచనలతో చేయు నాట్యము స్వచ్ఛమైన నృత్తముయొక్క రకమునకు చెందినదిగా చెప్పవచ్చును. ఉ॥ తాం తద్ధింధింనాం. రూపకతాళము.

దరు:—ఇది పద, లక్షణమును బోలియుండు శృంగార రసప్రధానమైన ఒకవిధమగు రచనయగును. దీనినడక మధ్యమకాలములో నుండును. దరులలో కొన్ని ఒకేచరణముతోను, కొన్ని రెండు, మూడు చరణములతోను కూడియుండును. ఉ॥ సారసాగ్రేసర "సరగున" అను నారాయణిరాగము, త్రిశ్రజాతి ఏకతాళము లోని శ్రీ సుబ్బరామదీక్షితుల రచనయు, ii "నీసాటిదైవమెందులేరు" అను శ్రీరంజని రాగము, రూపక తాళములోని శ్రీముద్దుస్వామిదీక్షితుల రచనయు దరులకు చక్కని వుదాహరణములగును.

తిల్లానదరు:—ఇదియు "తిల్లాన"యొక్క లక్షణమునే గలిగియుండి స్వరసాహిత్యములతోను, జతులతోను కూడియుండు నొకవిధమగు రచనయగును. ఇందు పల్లవి, అనుపల్లవి, చరణములను విభాగములు గలిగియుండును. సాహిత్యము దైవస్తోత్రమునకు సంబంధించినదిగా నుండును. ఉ॥ "నాదిరిదాని తోందరిదాని" అను సురటిరాగము, చతురశ్రజాతి ఏకతాళములోని శ్రీ కృష్ణస్వామయ్య రచన తిల్లానదరుకొక ముఖ్య వుదాహరణమగును.

ప్రవేశదరు:—ఇది గేయనాటకములలో సూత్రధారుడు ప్రవేశించు నపుడు పాడునట్టి ఒక రచనయగును. సాధారణముగా యిందుగల పల్లవి, చరణములు, ఒకేధాతుశైలిలో నుండును. ఉ॥ ఎన్నగమనసుకురాని, అను నీలాంబరిరాగము, ఆది తాళములోని త్యాగరాజుని ప్రహ్లాదభక్తవిజయకీర్తన ప్రవేశదరుకు సరిపోవు ఒక చక్కని వుదాహరణమగును.

సంవాదదరు:—ఇది గేయనాటకములలోగాని, తదితరనాటకములందు గాని సంవాద (డైలాగు) రూపముగా నుండునట్టి ఒక ప్రత్యేక రచనయగును. ఉ॥ i ఏమని నెరనమ్మకొందును కృష్ణా ఎందుకింత వాదు "అను సౌరాష్ట్రరాగము చాపు తాళములోని రచనయు, ii ఏమేమొ తెలియక బలికేరు చెలులార నామీద దయలేక"

అను సౌరాష్ట్రరాగము, చాపుతాళములోని త్యాగరాజుని నౌకాచరిత్ర రచనలు సంవాద దరులకు సరిపోవు చక్కని వుదాహరణములగును.

స్వగత దరు :— ఇది గేయనాటకమువంటి రచనలలో ఒకరిని గురించి మరియొకరు చెప్పుచున్నట్లుగా నుండు రచనకుగల పేరగును. ఉ॥ శ్రీగణపతిని సేవింపరారె. అను సౌరాష్ట్రరాగము ఆదితాళములోని త్యాగరాజుని ప్రహ్లాదభక్తవిజయకీర్తన స్వగతదరుకు సరిపోవు ఒక చక్కని వుదాహరణమగును.

జక్కిణ దరు :— ఇది ప్రాచీన రచయితలచే రచింపబడిన ఒక ప్రత్యేక రకమునకు చెందిన రచనయగును. ఇందు పల్లవి, అనుపల్లవి, చరణములుండును. పల్లవి, అనుపల్లవులకుగల మాతు, జతులతోను, చరణమునకుగల మాతు, సాహిత్యము తోను కూడివుండును. దీనినడక అతిచిత్రమైన మార్గమునానుండి అచ్చటచ్చట మధ్యమకాల, ద్రుతకాలములను కలిగియుండును. ఉ॥ ఝంతధణతకిణ. అను అఠాణా రాగము, కురుఝంపతాళములోని రచన జక్కిణదరుకు ఒకచక్కనివుదాహరణమగును.

నిరూపణము :— ఇది హరికథా కాలక్షేపములలోను, భరతనాట్య ప్రదర్శనములలోను ప్రారంభమున ప్రదర్శించునట్టి నొక రకమైన రచనయగును. ఇందు కథాసందర్భము సంక్షిప్తముగా చెప్పబడును.

సంచారి.— ఇది పల్లవి అనుపల్లవి, చరణములను విభాగములుగల నొక రచనయగును. దీనిశైలి సాధారణగీతమును బోలియుండును. ఇది కేవలము స్వరరూపమైన రచనయగును. దీనిలో సాహిత్యము యేమాత్రము వుండదు. ఉ॥ నీ స రి రీ॥ ని స రి మ గ రి గ॥ అను కేదారగౌళరాగము, మిశ్రజాతిఏకతాళములోని రచనయు, ॥ సా । ని స రి మ ॥ గ రి । రి ప మా ॥ అను ధామవతిసంగిణిరాగము, రూపకతాళములోని శ్రీ సుబ్బరామదీక్షితుల రచనలు సంచారులకు చక్కని వుదాహరణములగును.

రాగమాలిక :— అనగా యిది పల్లవి, అనుపల్లవి, చరణములతోగాని, లేక పల్లవి, చరణములతోగాని రచింపబడు నొక మనోహరమైన సంగీతరచనయగును. ఇందుగల పల్లవి చరణములు వివిధరాగములలో రచింపబడుటవల్లనే దీనిని రాగమాలికయనియు, రాగహారమనియు, రాగమాలయనియు చెప్పుటకు కారణమైనది. దీనిలో ప్రతిభాగమునందుగల సాహిత్యమునకును, ఆ యా రాగముల పేర్లకును, ఒక విధమైన అనుబంధముకలిగి అర్థము చెడకుండునట్లు రచింపబడును. మరియు సాహిత్యములందు ఆ యా రాగముల పేర్లను బహునైపుణ్యముగాయిమిడ్చి రచింపబడును. ముఖ్యముగా యిందుగలపల్లవి, అనుపల్లవి, లేక చరణములచివరను ఆ యా రాగములలో తానానుసారముగా చిట్టస్వరములు రచింపబడియుండును. సాధారణముగా రాగమాలికలలోని రాగములసంఖ్య 4, లేక 5, లేక 8 యీ విధముగానుండును. అయితే కొన్ని రాగ

మాలికలలో యీ రాగములసంఖ్య 9, లేక 14, లేక 15, లేక 16 యీ విధముగా వుండటంకూడాకద్దు. సాధారణముగా రాగమాలికలలోని సాహిత్యము భక్తిరసమునకు గాని, లేక శృంగారరసమునకుగాని సంబంధించియుండును. ఈ విధముగా రచింపబడిన రాగమాలికా అంత్యమున నిండు ఆవర్తస్వరములతో గాని, లేక అర్థ ఆవర్తస్వరములతో గాని చిట్టస్వరములు ఆయా రాగములందు అవరోహణ క్రమముగారచింపబడి పల్లవిని యెత్తుకొనునట్లుగానుండును. వీటివలన రాగమాలికకు ఒక ప్రత్యేకమైన సౌందర్యము లేక రంజకము యేర్పడును. i ఉ॥ నిత్యకల్యాణి. అను రూపకతాళములోని శ్రీ సీతా రామారావు రచన, శాస్త్రీయుక్తమైనట్టియు, మిక్కిలి వాడుకలోనున్నట్టి రాగమాలికకు ఒక ముఖ్య వుదాహరణమగును. ii ఉ॥ శ్రీ విశ్వనాథం భజేహం, అను శ్రీ ముద్దుస్వామి దీక్షితుల చతుర్దశరాగమాలిక మనోహరమైనట్టి ఒకప్రసిద్ధ రాగమాలికకు వుదాహరణమగును. ఇట్టి రాగమాలికలు రచించిన వారిలో శ్రీముద్దుస్వామి దీక్షితులు, శ్రీ రామస్వామి దీక్షితులు, శ్రీ సుబ్బరామ దీక్షితులు మొదలగువారు ముఖ్యులగుదురు.

72 మేళ రాగమాలిక:—ఇది 72 మేళకర్తరాగములలో రచింపబడిన ఒకసుదీర్ఘమైన రచనకుగల పేరగును. ఉ॥ కనకాంగ్యారమయాపూజిత, అను శ్రీ మహావైద్యనాథయ్యార్ రచించిన 72 మేళరాగమాలికయిందుకొకముఖ్యవుదాహరణమగును.

రాగాంగ రాగమాలిక:—ఇది ప్రాచీన వాగ్గేయకారులు రాగాంగ రాగములలో రచింపబడిన ఒక ప్రసిద్ధమైన రచనకుగల పేరగును. ఉ॥ ఈ కనకాంబరి నెనయుము. అను ఆదితాళములోని రచన యిందుకొక ముఖ్య వుదాహరణమగును. ఇందుగల ధాతు శ్రీ సుబ్బరామ దీక్షితులును, మాతు శ్రీకృష్ణ కవియును రచించినట్లు తెలియుచున్నది. గనుక దీనిని ద్వివాగ్గేయకారక రచనయని చెప్పవచ్చును.

తాళమాలిక:— రాగమాలికలలో ఆయా సాహిత్యములందు ఆయా రాగముల పేర్లను యిమిడ్చినట్లే, తాళమాలికలలో ఆయా సాహిత్యములందు తాళముల పేర్లను అర్థము చెడకుండునట్లు అతినైపుణ్యముగా యిమిడ్చి రచించుదురు. ఇట్టి వాటిని "తాళమాలిక" లని చెప్పబడును.

రాగతాళమాలిక:— రాగమాలికలలో ఆ యా సాహిత్యములందు రాగముల పేర్లను, తాళమాలికలలో ఆ యా సాహిత్యములందు తాళముల పేర్లను యిమిడ్చి రచించునట్లుగానే కొన్ని రాగమాలికలలో ఆ యా సాహిత్యములందు ఆ యా రాగముల పేర్లను, తాళముల పేర్లను కూడ బహుచమత్కారముగా యిమిడ్చి అర్థము చెడకుండునట్లు రచించుదురు. అట్టి వాటిని 'రాగతాళమాలిక'లని చెప్పబడును. ఉ॥ నాటకాదివిద్యల. అను శ్రీరామస్వామి దీక్షితులు రచించిన 108 రాగతాళమాలిక యిందుకొక ముఖ్యమైన వుదాహరణమగును.

నవరత్న మాలిక:— ఇది 9 రాగములలో 9 భాగములనుగాని లేక 9 రాగములలో 9 కృతులనుగాని రచింపబడినపుడు ఆటిమొత్తము రచనలకు "నవరత్న మాలిక" అనిపేరగును. ఉ॥ శ్రీ మధురమీనాక్షీదేవిపై శ్రీ శ్యామశాస్త్రిలు రచించిన 9 కృతులను, నవవిధభక్తులనుగూర్చి శ్రీ స్వాతితిరునాళ్ మహారాజు (తిరువాన్కూరు) రచించిన 9 కృతులను, తంజావూరు శ్రీ ప్రతాపసింహమహారాజు మహరాష్ట్రభాషలో 9 రాగములందు రచించిన రాగతాళమాలికవంటి రచనలను"నవరత్న మాలిక"లని చెప్పబడును. మరియు "సీసరిలేరనికోరిన" అను త్రిశ్రజాతి ఏకతాళములోని శ్రీ సుబ్బరామ దీక్షితుల రచనకూడ 'నవరత్న మాలిక'కు ఒక ముఖ్యవుదాహరణమగును.

అష్టపది:— ఇదియొక శృంగారరసప్రధానమైన సంగీత రచనయగును. ఈ అష్టపదులు 12వ, శతాబ్దమునకుచెందిన శ్రీ జయదేవకవిచే సంస్కృతమున రచింపబడినవి. ఇందు శైలికఠినముగానుండుటచే సంగీత, సాహిత్యములందు పరిపూర్ణమైన జ్ఞానము గల పండితులుమాత్రమే వీటిని అర్థముచేసుకొని యానందించగలరు. ఈ గ్రంథమునకు "గీత గోవింద"మనిపేరు. ఈ మహాకావ్యమునందు రాధా, కృష్ణుల ప్రేమతత్వమును నాయికా, నాయకసఖులచే పాడబడినట్లు రచింపబడినది. ఇవి 24 అష్టపదులుగా నుండి 12 సర్గలలోనుండును. ఒక్కొక్క రచన 8 పాదములుగానుండుటచేతనే వీటికి "అష్టపది"లనిపేరు వచ్చుటకు కారణమైనది. ఇవి సంగీతరచనలకు ప్రప్రథమమున యేర్పడినవిగా తెలియుచున్నది. ఈ అష్టపదులు పల్లవి, అనుపల్లవి, చరణములుగాగాని లేక పల్లవి, చరణములుగాగాని వుండుటయేగాక చరణములన్నియు నొకే శైలిలోనుండి జయదేవముద్రను కలిగియుండును. ఉ॥ రాసేహరిమిహ. అను ఖమాసురాగము, ఆదితాళములోని రచన యిందుకొకచక్కని వుదాహరణమగును. శ్రీ జయదేవుని యీ గీతగోవిందములోని అష్టపదుల ననుసరించియే యీతని తరువాత శ్రీ వెంకటమఖి (17వ శ.) త్యాగరాజాష్టపదులను, శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి (13 వ, శ.) శివాష్ట పదులను, శ్రీ రామకవి (19వ శ.) రామాష్టపదులను రచించిరని తెలియుచున్నది.

తరంగము:—ఇది యొకభక్తి,శృంగారరసయుతమైన ఉజ్వలరసప్రధానమగు రచనయగును. ఈ రచనలు 16వ, శతాబ్దమునకుచెందిన శ్రీ నారాయణతీర్థయతీంద్రులచే రచింపబడినవి. ఇతని నివాసము ఆంధ్రప్రదేశ్‌లోని కృష్ణాజిల్లా యని కొందరు చెప్పుదురు. ఈ మహానుభావుడు దైవప్రేరితమున శ్రీ కృష్ణుని లీలలను నాయికా, నాయకలక్షణముల ననుసరించి రచించెను. ఈ గ్రంథమునకు "శ్రీ కృష్ణ లీలాతరంగిణి" అనిపేరు గలదు. ఇవి పల్లవి, అనుపల్లవి, చరణములుగల రచనలగును. ఇవి 12 సర్గలలో వ్రాయబడినవి. ఇవి సంస్కృతమున రచింపపడుటచే సంగీత, సాహిత్యజ్ఞానముగల పండితులకు మాత్రమే వీటి యర్థమునుసరిగా గ్రహించుటకుగాని, పాడుటకుగాని వీలగుచున్నది. ఇందుగల అనుపల్లవి చరణములు ఒకేధాతుశైలిగలిగి శ్రీ నారాయణతీర్థముద్రను గలిగి యుండును. వీటిలో నూళాదులనబడు కొన్ని తరంగములు జతులను కలిగియుండుటచే

వీటిని జతులుగల ప్రబంధములని చెప్పబడుచున్నవి. ఈ గ్రంథమునగల ప్రతితరంగము నకు మొదటశ్లోకము, వాక్యమువుండును. అచ్చటచ్చట చూర్ణికలు, సంభాషణలు, దరువులు, ద్విపదలు, చతుష్పదులు మొదలగునవి యుండును. వీటిని ముఖ్యముగా భజన సమాజములందుతెలుచుగా పాడుచుందురు. కాని నేడువీటిని వివిధసంగీత, 'భరత నాట్యప్రదర్శనములందుకూడా విధిగా పాడబడుచున్నవి. ఉ॥ గోపాలమాకలయ సఖిహే' అను శ్రీరాగములోని తరంగము జతులుగల తరంగమున కొక చక్కని వుదాహరణమగును. మరియు "జయ జయ గోకుల బాలా" అను తరంగము, భైరవి, అఠాణా, కాంభోజి, కల్యాణి, సురటి రాగములందు గల యీ తరంగము రాగ మాలికాతరంగమునకు ఒకమంచి వుదాహరణమగును.

కృతి: — ఇది సంగీత మాధుర్యమునకలిగిన ప్రధానమైన భాగములతోకూడిన ఒక ముఖ్యరచనయగును. ఆధునికకాలము నాటిగల సంగీతరచనలలో విశేషభాగము కృతు లని చెప్పుట నిర్వివాదాంశమైన విషయమగును. కొందరు పండితులు కృతి, కీర్తన యివి రెండును సమానమని చెప్పుదురు. కాని సంగీతమునకు విశేషప్రాముఖ్యమునిచ్చు రచన లనే కృతులనిచెప్పుట యెంతయు సమంజసముగానుండును. ఏలననగా! కృతులలోని సంగీతము అనేకమైన సంగతులతోను, గమకములతోను, తదితర శాస్త్రసంబంధమైన సౌందర్యములతోను కూడియుండును. మరియు సాహిత్యము చాలవఱకు తక్కువగా నుండును. కృతికి ముఖ్యముగా 3 అంగములుండును. అవి 1. పల్లవి 2. అనుపల్లవి 3. చరణములగును. ఈ చరణములు 1 గాని లేక అంతకంటె యెక్కువగానివుండును. ఇవిగాక, అముఖ్యాంగములుకూడా కొన్నివుండును. అవి 1. చిట్టస్వరము 2. శొల్‌కట్టు స్వరము 3. స్వరసాహిత్యము 4. స్వరాక్షరము 5. మధ్యమ కాల సాహిత్యము 6. మణిప్రవాళిసాహిత్యములగును. వాటి వివరముల నీక్రింద తెలుపుట గమనించునది.

(1) చిట్టస్వరము :— ఇది కృతిలో అనుపల్లవి తరువాత పాడబడునట్టి రచన యగును. కాని దీనినే చరణాంతమందుకూడ మరల పాడటంకలదు. ఇది 2 లేక 4 లేక యింకను అధికమైన ఆవర్తములతోకూడిన స్వరరచనయగును. సాధారణముగా యిది మధ్యమకాలములోనుండును. ఒకొక్కప్పుడు యీ చిట్టస్వరములను ఆ యా రాగ భావములు చెడకుండునట్లును, తాళము తప్పకుండునట్లును, అనులోమ, విలోమ క్రమములో కూడా పాడటం సంప్రదాయమగును. ఇట్టి చిట్టస్వరములుగల రచనలు,

ఉ॥ 1. రఘువంశ సుధాంబుధిచంద్ర, అను కదనకుతూహల రాగంలోనికృతియును,

2. శృంగారలహరి, అను నీలాంబరిరాగములోని కృతియును,

3. శ్రీ రఘుకులనిధిం, అను హుసేనిరాగములోని కృతియును,

4. కమలాంబాంభజరే, అను కల్యాణిరాగములోని 2వ, నవావర్ణకృతియును శాస్త్రయుక్తమైన చిట్టస్వరములుగల కృతులకు ముఖ్య వుదాహరణములగును.

(2) శోల్కట్టుస్వరము :— ఇదియు చిట్టస్వరముల రకమునకు చెందినట్టి రచనయే యగును. కాని వీటిలో చిట్టస్వరములోనుండు కొన్ని తావులందుగల స్వరములను జతులనుకూడా జతపఱచి రచించుదురు. అట్టి జతులను పాడునప్పుడు వాటి క్రిందగాని పైనగాని యుండు స్వరముల ననుసరించి స్వరములకుబదులుగా జతులు పాడవలసియుండును. ఉ॥ (1) శ్రీ మహాగణపతి రవతుమాం, అను గౌళరాగములోని శ్రీ ముద్దుస్వామిదీక్షితుల కృతిలోను (2) ఆనందనటనప్రకాశమ్, అను కేదారరాగములోని శ్రీ ముద్దుస్వామి దీక్షితులకృతిలోనుగల చిట్టస్వరములందు యిట్టి శోల్కట్టుస్వరము (జతు) లుండుట ముఖ్యముగా గమనించదగును.

(3) స్వరసాహిత్యము :– ఏదైన ఒక కృతిలోని చిట్టస్వరమునకు సరియైన అర్థము నిచ్చు సాహిత్యమును రచింపబడి దాని క్రింద జతపఱచినప్పుడు ఆ రెంటినికలిపి "స్వర సాహిత్య" మని చెప్పబడును. చిట్టస్వరమువలెనే యీ స్వరసాహిత్యమునుకూడ అనుపల్లవి చివరను, ప్రతిచరణముచివరను పాడుదురు. ఉ॥ i కాదమునను — అనునది మరి వేరె దిక్కెవరయ్యా, అను ఆనందభైరవి రాగములోని శ్రీ శ్యామశాస్త్రుల కృతిలోను, ii నిరవధిక సుఖదాయకి అనునది జనని నినువినా, అనురీతి గౌళరాగములోని శ్రీ సుబ్బరాయశాస్త్రి కృతిలోను iii శ్రీ రాధా విబుధార్తిహరా. అనునది వాచామగోచరుండని, అను అఠాణారాగములోని శ్రీ మైసూరు సదాశివరావుకృతిలోను యిట్టి నిరుపమానమైన స్వరసాహిత్యములుండుట గమనించవగును.

4. స్వరాక్షరము :— ఇది పైనచెప్పబడిన స్వరసాహిత్యములోని ఒక ప్రత్యేక రకమునకుగల పేరగును. స్వరసాహిత్యములలో స్వరముల క్రిందనుండు సాహిత్యమునందు అచ్చటచ్చట పైనుండు స్వరములవంటి అక్షరములే సాహిత్యమునందుకూడ రచింపబడి అవిమిగత సాహిత్యమునకు సరిపోవునట్టి అర్థమునిచ్చునట్లుగా రచించుదురు. అట్టివాటిని స్వరాక్షరములుగల రచనలుగా చెప్పబడును. ఇట్టి స్వరాక్షర రచనలు రచించుటకు సంగీత, సాహిత్యములందు విశేషమైన పాండిత్యము వుండవలెను. శ్రీ స్వాతి తిరునాళ్ మైసూరు సదాశివరావు మొదలగువారు ఇట్టి స్వరాక్షరరచయితలలో ముఖ్యులగుదురు.

ఉ॥ సా ని ధా; } ఉ॥ స దా స ని స ని } అను వాచామగోచరుండను కృతి
శ్రీ ని ధా; } స దా శి వ క వి } యిందుకు చక్కని వుదాహరణమగును.

5. మధ్యమకాలసాహిత్యము :— ఇది ఏదైన కృతిలో ధాతు, మాతువులు రెండును యెచ్చట మధ్యమకాలములో రచింపబడునో అట్టి భాగమును "మధ్యమ కాలసాహిత్య"మని చెప్పబడును. దీనిలోని సంగీతము ధారాళముగాను, ఠీవిగాను వుండును. ఈమధ్యమకాలసాహిత్యము అనుపల్లవి చివరను, చరణముచివరనుకూడపాడుదురు. కొన్నికృతులలో చరణమంతయు మధ్యమకాలసాహిత్యములోనే యుండును.

శ్రీ ముద్దుస్వామిదీక్షితులయొక్క కృతులలో అనేకము యిట్టి మధ్యమకాలసాహిత్యము లను గలిగియున్నవి. కృతికి యీ మధ్యమకాలసాహిత్యము ప్రాణసమానమైన భాగ ముగా నెంచబడును. ఉ॥ యోచనకమలలోచన, అనుదర్బారురాగము, ఆదితాళములోని త్యాగరాజునికృతియొక్క చరణము మధ్యమకాలసాహిత్యమునకు ఒక చక్కని వుదా హరణమగును.

6. మణిప్రవాళసాహిత్యము : — అనగా ఏదైనా ఒక కృతిలోని సాహిత్యము నందు అచ్చటచ్చట రెండు, లేక మూడు యితర భాషలతోకూడిన సాహిత్యమును జతపరచి అర్థము చెడకుండునట్లుగా రచింపబడుదానిని "మణిప్రవాళసాహిత్య"మని చెప్పబడును. ఉ॥ వేంకటాచలపతే, అను కాపిరాగములోని శ్రీ స్వాతితిరునాళ్ యొక్క రచన యిందుకొక ముఖ్యవుదాహరణమగును. ఈమణిప్రవాళసాహిత్యకీర్తనలు రచించినవారిలో శ్రీ స్వాతితిరునాళ్ ముఖ్యులుగా తెలియుచున్నది. పైన దెలుప బడినట్టి 6. అంగములను కృతియొక్క, అముఖ్యాంగములు లేక భాగములని చెప్ప వచ్చును. కారణమేమనగా! ఈ అముఖ్యాంగములు లేనంతమాత్రమున కృతికిగల పేరునకుగాని, యితర విషయములకుగాని యెట్టి లోపము కలుగదు. ఇది కేవలము కృతియొక్క పారిభాషిక సౌందర్యమును, రంజకత్వమును పెంపొందించుటకుమాత్రమే వుద్దేశింపబడినట్టి, రచయితయొక్క హృదయపూర్వకమైన ప్రయత్నాఫలితములగును. గనుకనే వీటిని శాస్త్రయుక్తమైన 3 ముఖ్యాంగములకు మిత్రులుగామాత్రమే యెంచ దగును. కృతులు రచించినవారిలో (1) శ్రీ త్యాగరాజు (2) శ్రీ శ్యామ శాస్త్రులు తెలుగు, సంస్కృతములందును, (3) శ్రీ ముద్దుస్వామిదీక్షితులు తెలుగు, సంస్కృతము, తమిళము లందును, (4) శ్రీ స్వాతితిరునాళ్ తెలుగు, సంస్కృతము, తమిళము, మళయాళము, మహారాష్ట్రి హిందూస్థానీలందును, (5) శ్రీ పట్నం సుబ్రహ్మ ణ్యయ్యర్ తెలుగు, తమిళములందును, (6) శ్రీ సుబ్బరాయశాస్త్రి (7) శ్రీ వీణ కుప్ప య్యర్ (8) శ్రీ పల్లవి గోపాలయ్యర్ (9) శ్రీ పల్లవి శేషయ్య (10) శ్రీ మైసూరు సదాశివరావు (11) శ్రీ యల్. ముత్తయ్యభాగవతార్ (12) శ్రీ కె. వాసుదేవాచారియార్ శ్రీ లింగరాజు అరస్ మొదలగువారు తెలుగునందును ప్రసిద్ధమైన కృతులను రచి యించిన వారిలో ముఖ్యు లగుదురు.

కీర్తన :— అనగా! పల్లవి, అనుపల్లవి, చరణములను ముఖ్యాంగములు గలిగి యుండు మాధుర్యమైన రచనను "కీర్తన"అని చెప్పబడును. ఇందుగల సాహిత్యము కేవలము భక్తిరసప్రధానమైయుండును. కృతికివలె కీర్తనకుకూడ పల్లవి, అనుపల్లవి, చరణములు సాధారణముగానుండును. అయితే కొన్నికీర్తనలలో పల్లవి, చరణములు మాత్రమే యుండటం కద్దు, శ్రీ త్యాగరాజుని దివ్యనామ సంకీర్తనలలో చాలవరకు

యీ రకమునకు చెందినవిగానే చెప్పవచ్చును. ఉ॥ మానససంచరరే బ్రహ్మణి, అను సామరాగము, ఆదితాళములోని శ్రీ సదాశివబ్రహ్మేంద్రమువారియొక్క రచన యిందు కొకముఖ్యవుదాహరణమగును. ప్రాచీనమైన కొన్ని కీర్తనలలోచరణము ఒకటిగానేవుండి ఆచరణమునకు 4, లేక 8, లేక 12 ఆవర్తములుగలిగి ధాతుభేదము నొందియుండును. కృతులకంటె కీర్తనలు చాలాపురాతనమైనవి. ఇవి మొట్టమొదట సంస్కృతములో మాత్రమే రచింపబడెను. తరువాత కన్నడభాషలో శ్రీ పురందరదాసు కీర్తనలను (దేవరనామములు) రచించెను. తరువాత అనేకమంది రచయితలు తెలుగు, తమిళ భాషలందు కీర్తనలు రచించియుండిరి. కీర్తనరచయితలలో శ్రీ పురందరదాసు, శ్రీ భద్రాచల రామదాసు, శ్రీ తూము నరసింహదాసు, శ్రీ మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, (అధ్యాత్మ రామాయణకీర్తనలు) శ్రీ అరుణాచలకవిరాయర్, (రామనాటకకీర్తనలు) శ్రీ గోపాల కృష్ణభారతి(నందనార్ చరిత్ర కీర్తనలు) శ్రీ కవికుంజరభారతి (స్కాందపురాణకీర్తనలు, మొదలగువారు సుప్రసిద్ధులగుదురు. కీర్తనలలో నె క్రింది రకములను గమనింపదగును.

ద్విధాతుకీర్తన:—అనగా యేదైన ఒక కీర్తనలోని ప్రతిభాగమును రెండు వేరు, వేరుధాతువులందు క్రమముగా పాడుటకు వీలుగలిగినట్టి రచనను "ద్విధాతు కీర్తన" యని చెప్పబడును. ఉ॥ రఘునందన, అను కేదారగౌళరాగములోని కీర్తన యిందుకొక చక్కని వుదాహరణమగును.

ద్వితాళకీర్తన:—అనగా ఏదైన ఒక కీర్తనను గాని తదితర రచననుగాని దానికి ఏర్పరచిన తాళమునందేగాక మరియొక తాళములోగూడ పాడుటకు వీలుగల రచనను "ద్వితాళకీర్తన"యని చెప్పబడును. (1) ఉ॥ రామచంద్ర నన్ను బ్రోవ, అనెడి ఖమాసురాగములో ఆదితాళమునగల త్రిశ్రగతిలోని కీర్తనను చతురశ్రజాతి రూపక తాళములోకూడ పాడవచ్చును. (2) బిరానవరాలిచ్చి. అను శ్రీ శ్యామశాస్త్రి కృతిని త్రిశ్రజాతి ఏకతాళములోనేగాక చ. రూపకతాళములోను కూడా పాడుటకు వీలుకలదు. గనుక యిట్టి కీర్తనలు "ద్వితాళ కీర్తన"లకు ముఖ్య వుదాహరణములగును.

సమిష్టిచరణప్రబంధము:—అనగా ఏదైన ఒక సంగీత రచనలో లేక కృతిలోని అంగములలో 2 వదైన అనుపల్లవిలోనే చరణమునకు బదులుగా మధ్యమకాల సాహిత్యమును రచింపబడినచో అట్టిదానిని "సమిష్టిచరణ ప్రబంధము లేక కృతియని" చెప్పబడును. ఉ॥ మరకతవల్లీమ్, అను కాంభోజిరాగము, ఆదితాళము లోని శ్రీ ముద్దుస్వామి దీక్షితుల కృతి యీ రకమునకు చెందుట గమనింపదగును.

చతుర్ధాతుప్రబంధము:— ఏదైన ఒక కృతిలో పల్లవి, అనుపల్లవి చరణములుగాక చిట్టస్వరముకూడ నున్నచో యట్టి రచనను "చతుర్ధాతు ప్రబంధ" మని చెప్పబడును. ఉ॥ రఘువంశ సుధాంబుధిచంద్ర. అను కదనకుతూహల రాగము లోని శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ కృతి యిందుకొక చక్కని వుదాహరణమగును.

ద్విబృందగానరచనలు:—అనగా ఇవి ఏదైన ఒక రచనను పాడుటలో గాయకులు రెండు బృందములు (పార్టీలు)గా యేర్పడి గానము చేయుతగిన రచనలకుగల పేరగును. ఉ॥ మంత్రపుష్పము, నామావళులవంటి రచనలు యీ రకమునకు చెందును. వీటినే యింగ్లీషులో ఆంటిఫోని (Antiphony) అని చెప్పబడును.

రాజపోషణతో నేర్పడిన ప్రసిద్ధరచన:– ఇది క్రీ.శ. 1818లో తంజావూరు మహారాజుల వంశీయుడగు శ్రీ తుకారామ్‌సాహేబు అను మహారాష్ట్ర రాజు, శ్రీ లావణి వెంకట్రావుచే తంజావూరు ప్రభు అంకితముగా రచింపబడిన 72 మేళకర్త రాగమాలికయొక్క మహారాష్ట్ర సాహిత్యమునకు వర్ణమెట్టును (స్వరపఱచుట) యేర్పఱచమని శ్రీ మహావైద్యనాథయ్యర్‌ను కోరగా ఆయన వెంటనే ఒకవారములో ఆ 72 మేళకర్త రాగమాలికకు వర్ణమెట్టు నేర్పఱచుటయేగాక దానికి తన స్వంతసాహిత్యముకూడచేర్చి అత్యద్భుతముగా పాడి వినిపించినంగున శ్రీ తుకారామ్ సాహెబ్‌గారు 2000 రూపాయల ఘనసన్మానము నొసంగి గౌరవించిరట. గనుకనే సుప్రసిద్ధమైన యీ రచనను రాజపోషణతో నేర్పడిన ప్రసిద్ధ రచనగా నేటివఱకు చెప్పబడుచున్నది.

ఛందోబద్ధము కాని రచనలు:— ఇవి ఛందస్సులను యనుసరింపకనే రచింపబడునట్టి రచనలకుగల పేరగును. ఉ॥ శ్లోకము, పద్యము, విరుట్టమ్‌వంటి రచనలు యీ తరగతికిచెందును. వీటితో ప్రదర్శింపబడు అభినయము తగిన స్వారస్యము లేక సాధారణముగా నుండును. ఇవి ఒకేరాగములోగాని, లేక రాగమాలికగా అనేకరాగములలోగాని పాడబడుచుండును.

ఛందశ్శాస్త్ర లోపముగల ప్రసిద్ధరచన:—ఇది ఛందశ్శాస్త్రము నతిక్రమించి రచింపబడిన రచనకు వర్తించునదియగును. ఉ॥ పరాకేందువదనా. అను శ్రీ సుబ్బరాయశాస్త్రి కృతిలోని స్వరసాహిత్యము యీ రకమునకు చెందినదిగా చెప్పబడుచున్నది.

సులభ సంగీత రచనలు:— ఇవి పల్లవి, అనుపల్లవి, చరణములను విభాగములుగలిగి శైలి సులభముగానుండునట్టి రచనలకు వర్తించు పేరగును. ఉ॥ ఓరడికీర్తన, ఓరడిపదము, ఓరడిదరువంటి సులభమాధుర్య తమిళ సంగీతరచనలు యీ రకమునకు చెందినవిగా చెప్పబడునని గ్రహించదగును.

నిందాస్తుతి కీర్తనలు:— ఇవి బాహ్యార్థము నిందాస్తుతిగానున్నను, అంతరార్థము స్తోత్రపాఠముగానుండు ఒక రకమైన రచనలకుగల పేరగును. ఉ॥ త్యాగరాజు యిట్టి కీర్తనలు అనేకము రచించియుండుట ముఖ్యముగా గమనించదగును.

దివ్యనామసంకీర్తనలు:— ఇవి పల్లవి, కొన్నిచరణములను గలిగియుండు నొకరకమైన సంగీతరచనలగును. ఇందుగల చరణములన్నియు ఒకేధాతుశైలిలోనుండును.

కొన్నిటిలో పల్లవి, చరణములుకూడా ఒకేధాతుశైలిలోనుండుటకద్దు. సాధారణముగా యీ కీర్తనలు బృందగానములందు పాడబడుచుండును. ఉ॥ i సాహి రామచంద్ర, అను శంకరాభరణరాగములోని త్యాగరాజునిరచనయు ii శ్రీ రఘువర. అను భైరవిరాగము లోని త్యాగరాజునిరచనయు యిందుకు ముఖ్యవుదాహరణములగును.

ఉత్సవసంప్రదాయకీర్తనలు :— ఇవి దివ్యనామ సంకీర్తనలవలెనుండునట్టి ఉత్సవపద్ధతి ననుసరించి ప్రత్యేకముగా వ్రాయబడిన రచనలగును. i ఉ॥ హెచ్చరికగా రార, అను యదుకులకాంభోజిరాగము, ఝంపతాళములోని త్యాగరాజుని రచనయు, ii ఉయ్యాలలూగవయ్య, అను నీలాంబరిరాగము, ఝంపతాళములోని త్యాగరాజుని రచనయు యిందుకు ముఖ్య వుదాహరణములగును. శ్రీ త్యాగరాజు తెలుగులోను, శ్రీ విజయగోపాలుడు సంస్కృతములోను యిట్టి రచనలు అనేకము రచించియుండుట గమనించదగును.

వసంతోత్సవకీర్తనలు :—ఇవి భజనపద్ధతి ననుసరించి దేవునికి వసంతోత్సవము జరుపునపుడు ముఖ్యముగా పాడదగినట్లుగా రచింపబడిన రచనలగును. శ్రీ త్యాగరాజు యిట్టి రచనలు అనేకము రచించియుండుట గమనించునది.

సంక్షేపరామాయణకీర్తనలు ;— ఇవి సంక్షిప్తమైన రామాయణ కథాసందర్భము ననుసరించి ప్రత్యేకముగా శ్రీ త్యాగరాజునిచే రచింపబడిన ముఖ్యరచనలగును.

మానసపూజకీర్తన :— ఇది శ్రీ త్యాగరాజుని ప్రియశిష్యు డనదగిన శ్రీ వీణ కుప్పయ్యర్ చే రచింపబడిన ఒక ప్రత్యేకరకమైన సంగీతరచన యగును.

అధ్యాత్మరామాయణకీర్తనలు :— ఇవి క్రీ. శ. 1730 _ 1780 కాలమునకు చెందిన శ్రీ మునిపల్లె సుబ్రహ్మణ్యకవిచే రచింపబడిన ప్రసిద్ధకీర్తనలగును. అద్వైత మతము నిరూపించునట్టి మాధుర్యమైనకీర్తనలతోకూడిన యీ గ్రంథమును "అధ్యాత్మ రామాయణ"మని చెప్పబడును. ఇందుగల కీర్తనలు పల్లవి, అనుపల్లవి, చరణములతోకూడి యుండును. ఈ కీర్తనలందు శ్రీరామ పరతత్త్వమును శివుడు పార్వతికి చెప్పినట్లుగా అభివర్ణింపబడెను. ఈ గ్రంథము ఆరు కాండలుగానుండి యుద్ధకాండతో ముగియును. కవి యీ గ్రంథమును భక్తితో శ్రీ తిరుపతి వేంకటేశ్వరునికి అంకిత మిచ్చియుండుట గమనించదగిన విషయమగును. ఈ కీర్తనలు సాధారణముగా భజన కాలక్షేపము లందును,భక్తిరంజని వంటి కార్యక్రమములందును ముఖ్యముగా పాడబడుచుండును. ఉ॥ వినవే పల్లవ మృదుచరణ, అను ఆనంద భైరవిరాగము, త్రిపుట తాళములోనికీర్తన యీఅధ్యాత్మరామాయణకీర్తనల కొక మంచివుదాహరణమగును

నామావళులు :— ఇవి పవిత్ర సంగీత రచనలకు చెందునట్టి ఒక రకమైన రచనలగును. భక్తిరస ప్రధానమైన యీ రచనలను ముఖ్యముగా బృందగానములందు ప్రదర్శించుదురు. ఇవి 1 లేక 2 లేక 4 ఆవర్తనములుగానుండి చివరను పౌండరీకము పాడుటకు తగినట్లుగానుండును. వీటివలెనే శ్లోకములు, చూర్ణికలు, దండకములు, అష్టకములు, మంగళములవంటి రచనలుకూడ పవిత్ర సంగీత రచనలకు చెందినవగును.

తేవారములు :— ఇవి తమిళములోగల ఒక ప్రత్యేకతరగతికి చెందిన రచనలగును. ఇవి అతిప్రాచీనమైన రచనలకు చెందును. ఉ॥ (1) పిత్తాపిరై శూడి, అను సురటిరాగము, రూపకతాళములోని శ్రీ సుందరమూర్తిస్వాములరచనయు, ఉ॥ (2) తోడుడైయ శెవియన్, అను నాటరాగము, రూపకతాళములోని శ్రీ తిరుజ్ఞాన సంబంధస్వాములరచనయు, ఉ॥ (3) మాదర్పిరై కణ్ణియానై. అను దేవ గాంధారి రాగము, రూపకతాళములోని శ్రీ తిరునావుక్కరశుస్వాములరచనయు యీ తేవారములకు ముఖ్యవుదాహరణములగును.

తిరుప్పుగళ్ :— ఇవి తమిళరచనలలో మిక్కిలి ప్రసిద్ధమైన రచనలగును. వీటిని సాధారణముగా, భజన కాలక్షేపములందును సంగీత కచ్చేరీలందునుకూడ పాడబడును. ఉ॥ i ఏఱుమయిల్ ఏఱివిళై, అనునది మోహనరాగము, ఝంపతాళములోను, ii నాదవిందుకలాదీ నమోనమ, అనునది కురంజిరాగము, ఆదితాళములోనుగల శ్రీ అరుణగిరి నాథరుల రచనలు తిరుప్పుగళ్ లకు ముఖ్యవుదాహరణములగును.

తిరువరుట్పా :— ఇది తమిళములోగల నొక ప్రత్యేకరకమునకుచెందిన రచనయగును. వీటిని తమిళదేశములో సాధారణముగా ఎక్కువమంది పాడుచుందురు. ఉ॥ మాట్రటైయాద, అను సురటిరాగము మిశ్రచాపుతాళములోని శ్రీ రామలింగస్వాములవారిరచన తిరువరుట్పాకు ఒక ముఖ్యవుదాహరణమగును.

తిరువాచకము :— ఇదియు తమిళభాషలోగల నొక ముఖ్యరచనయగును. ఉ॥ ముత్తినెటి యఱియాద, అను ఆరభిరాగము, ఆదితాళములోని శ్రీ మాణిక్కవాచకస్వాములవారిరచన తిరువాచకమునకు ఒక ముఖ్యవుదాహరణమగును.

తిరువాయ్ మొళి :— ఇదియు తమిళములోగల నొక రకమగు ప్రసిద్ధరచనయగును. ఉ॥ పచ్చైమా మలై పోల్ మేని. అను నీలాంబరిరాగము, ఆదితాళములోని రచన తిరువాయ్ మొళికు ఒక ముఖ్యవుదాహరణమగును.

దేవరనామములు :— ఇవి కన్నడభాషలో శ్రీ పురందరదాసులవారు రచించిన సుప్రసిద్ధరచనలగును. వీటినే దాసరపదగళు, అని కన్నడభాషలో చెప్పుదురు. వీటిలో పల్లవి, అనుపల్లవి, చరణములను విభాగములుండును. భక్తిరసప్రధానమైన యీ రచ

నలు షుమారు 4,75,000 వరకు గలవని శ్రీ పురందరదాసులవారే తన రచనలలో నొక దానియందు పేర్కొనియుండెను. ఈ రచనలు నేడు దక్షిణభారతమంతటను, సంగీత కచ్చేరీలలోను, భజన కాలక్షేపములలోను, హరికథా కాలక్షేపములలోను తఱచుగా పాడబడుచున్నవి. మరియు వీటి శైలికూడ చాలాసులభమై రంజకముగా నుండును. గనుక సామాన్యులుకూడ వీటిని పాడగలుగుచుందురు. ఉ॥ హరినారాయణ. అను కేదార రాగము, ఆదితాళములోని రచన యిందు కొక ముఖ్యవుదాహరణమగును.

పవిత్రసంగీతము :— ఇది కచ్చేరీ సంగీతముకంటె అతి పురాతనమైనదగును. మన సామవేదము అతిపురాతనకాలమునకుచెందిన పవిత్ర సంగీతరచనయగును. గను కనే దీనిని వైదికగానమని చెప్పబడును. ఇది అప్లైడ్ సంగీతములోని ఒక ముఖ్య భాగమగును. మిగతభాగములు, నృత్యసంగీతము, కాలక్షేపసంగీతము, యక్షగాన సంగీతము, గేయనాటక (ఆపెరా) సంగీతములగును. అప్లైడ్ సంగీతమనగా ? ఇందు సాహిత్యము ప్రధానముగాను,సంగీతము సాహిత్యములోని భావములను చక్కగా ప్రద ర్శించుట కుపయోగించు సాధనముగానుయుండుటచే అన్ని సంగీతరచనలకువర్తించును. ఈ రచనలలోని సంగీతము నిరాడంబరముగాను, క్లిష్టమైన సంచారములుగాని, సంగ తులుగాని లేనిదిగాను, యుండి ఒకటిన్నరస్థాయిలో రచింపబడి, అముఖ్యాంగము లేమియు లేనివిగానుండును. మరియు నిందు కీర్తనమొదలు సామాన్యజనులు పాడునట్టి తదితర సంగీతరచనలవరకు యుండును. ఇవి విళంబ, మధ్యమకాలములందు పాడదగి యుండును. ఉ॥ జయదేవుని అష్టపదులు. తోడయమంగళము, తేవారములవంటి రచనలు అనేకము యీ పవిత్రసంగీతమునకు చేరిన రచనలగును.

కళాసంగీతము :—ఇది సంగీతమునకు మిగుల ప్రాధాన్యమిచ్చి ప్రదర్శింపబడు కచ్చేరీ సంగీతమునకుగల పేరగును. దీనినే లౌకికగానమని కూడ చెప్పబడును. ఇంగ్లీషులో దీనిని ఆర్ట్ మ్యూజిక్ ( Art Music ) అని చెప్పబడును.

గ్రామ్యసంగీతము :—ఇది గ్రామ్యగానమునకు సంబంధించిన లలితసంగీతము నకుగల పేరగును ఉ॥ జానపదగేయములవంటి రచనలు యీ తరగతికి చెందును.దీనినే ఇంగ్లీషులో ఫోక్ మ్యూజిక్ ( Folk Music ) అని చెప్పబడును.

నృత్యసంగీతము:—ఇది నృత్యమున కనుగుణముగా ప్రదర్శింపబడు సంగీతమునకు గల పేరగును. ఇట్టి సంగీతమును మనము ముఖ్యముగా భరతనాట్యములందు విన వచ్చును. దీనినే ఇంగ్లీషులో డాన్సు మ్యూజిక్ (Dance Music) అని చెప్పబడును.

గేయనాటక సంగీతము :—ఇది వీధినాటకముల కనుగుణంగా ప్రదర్శింపబడు సంగీతమునకుగల పేరగును. ఉ॥ శ్రీ అరుణాచల కవిరాయర్ వ్రాసిన "రామనాట కము" లోను శ్రీ త్యాగరాజు రచించిన "నౌకాచరిత్రము"లోను యిట్టి సంగీతమును మనము సాధారణముగా వినవచ్చును.

మార్షల్ సంగీతము :—ఇది యుద్ధరంగములలో సైనికులకు ధైర్య, వీరోత్సాహములు కలిగించుటకు పాడబడునట్టి ఒకరకమైన సంగీతమునకుగల ఇంగ్లీషు పేరగును.

## ఛందస్సు.

సంగీత రచన యనగా రాగతాళముల ననుసరించి నిర్ణీతకాలములో పాడుటకు తగినట్లుగా రచింపబడు రచనయగును. ఇందు సాధారణముగా స్వరము, సాహిత్యము నుండును. ఒక్కొక్కప్పుడు సాహిత్యము లేక, కేవలము స్వరరూపముగానే యుండును. అట్టి రచనను జతిస్వరమనిగాని లేక సంచారి యనిగాని చెప్పబడును. స్వర సాహిత్యము గల రచనలను కృతియనిగాని, కీర్తనయనిగాని మరి యితర రచనయనిగాని చెప్పబడును. ఇట్టి రచనలను సంగీత సామరస్యము కొఱకు ఒక క్రమమైన పద్ధతిలో యతి, ప్రాసలు మొదలగునవి యేర్పఱచి రచించుదురు. అట్టివాటి వివరములను తెలుసుకొనుటకు ముందుగా పాదము అనగా అర్థము తెలసికొనుట ముఖ్య అవసరమగును.

పాదము :—అనగా ఒక పద్యములోగల ఒక పఙ్క్తి (పద్యములో 4 వ వంతు)కిగాని, ఒక సంగీత రచనలో గల ఒక సంపూర్ణ ఆవర్తమునకుగాని లేక పఙ్క్తికిగాని "పాదము"అని చెప్పబడును. ఒక ఆదితాళ రచనలోని ఒక పాదములోని సాహిత్యము సంగీతములో ఒక తాళ ఆవర్తమునకుగాని లేక రెండు ఆవర్తములకుగాని సరిపోవును. రూపక, త్రిపుట, చాపుతాళ రచనలలోని ఒక పాదము సాధారణముగా 4 ఆవర్తములకుగాని ఒక్కొక్కప్పుడు రెండు అవర్తములకుగాని సరిపోవును. i ఉ॥ మరియాదగాదుర. అను శంకరాభరణరాగములోని శ్రీ త్యాగరాజుని కృతిలో గల ఒక పాదములోనిసాహిత్యము ఒక ఆదితాళఆవర్తమునకు సరిపోవును. మరియు, ii ఉ॥ మా జానకిచెట్టబట్టగ-మహరాజువైతివి. అను కాంభోజిరాగ, ఆదితాళకృతిలోని ఒక పాదము 2 తాళావర్తములకు సరిపోవును. iii ఉ॥ రామ నన్ను బ్రోవరా ప్రేమతో లోకాభి. అను హరికాంభోజిరాగ, రూపకతాళకృతిలోని ఒక పాదము 4 ఆవర్తములకు సరిపోవును. iv ఉ॥ ఎందుకుదయరాదురా శ్రీరామచంద్రనీ. అను తోడిరాగము, త్రిపుటతాళకృతిలోని ఒకపాదము నాలుగు తాళావర్తములకును, v ఉ॥ ఎవరురా నిన్నువినాగతిమాకు, అను మోహనరాగము, చాపుతాళము కృతిలోని ఒక పాదము 4 తాళావర్తములకును సరిపోవును. ఇట్లే ఝంప, అటతాళములలోని కృతులలో ఒక పాదము రెండు ఆవర్తములకు సరిపోవును. ఉ॥ మున్ను రావణ (తోడి) శ్రీహరిపాదతీర్థమే (శంకరాభరణము) వంటి కృతులు యిందుకు ముఖ్యవుదాహరణములగును.

యతి :— ఏదైన ఒక సంగీతరచనలోగాని యితర రచనలోగాని ఆవర్తమునకు గల ప్రథమాక్షరములు సమానముగానున్నచో అట్టివాటిని యతిఅక్షరము లందురు.

i ఉ॥ వాతాపిగణపతింభజేహం. వారణాస్యం వరప్రదం శ్రీ. ii రఘునాయకా- నీపాదయుగ- రా జీవముల నేవిడజాల శ్రీ. అను హంసధ్వనిరాగ, ఆదితాళకృతుల లోని గుర్తులుగల వా - వా, లును ర - రా,లును యతి అక్షరములని చెప్పబడును.

ప్రాస :— ఏదైన ఒక సంగీత రచనలో గాని, లేక పద్యములోగాని ఒక పాదములోని రెండవయక్షరము సమానముగానున్నచో వాటిని ప్రాస లేక ప్రాసాక్షరములని చెప్పబడును. ఇటులవుండునట్టి ద్వితీయాక్షరప్రాసలను తమిళ్ళములో "ఎదుకై" అని చెప్పుదురు. ఉ॥ మనసా ఎటులోర్తునే నా - మనవి చేకొనవే ఓ॥ అను మలయ మారుతరాగకృతిలోని గుర్తుగల "న"లు ప్రాసాక్షరములగును. శ్రీ ముద్దుస్వామి దీక్షితులరచనలలోను, శ్రీ నారాయణతీర్థుల తరంగములలోను యిట్టి ప్రాసాక్షరములను మనము చూడవచ్చును.

ప్రాసయతి :— ఒక సంగీతరచనలో విరామము తరువాత వచ్చు రెండవ అక్షరము పాదముయొక్క రెండవ అక్షరముతో సమానముగానున్నచో దానిని ప్రాసయతి యని చెప్పబడును. ఇట్టినాటిలో పాదమునందలి రెండు భాగములు రెండు ప్రత్యేకపాదములుగా కనుపడుచుండును. ఉ॥ సనాతనా పరమపావనా - ఘనాఘనవర్ణ కమలాసన, అను ఫలమంజరిరాగ, ఆదితాళకృతిలోని గుర్తుగల "నా" అక్షరములు ప్రాసయతులగును. ఇట్టి రచనలలో యతి ముఖ్యముకాదని గ్రహించునది.

సమయతిప్రాస :— ఒక సంగీత రచనలో యతి, ప్రాసలు రెండును సమానముగానున్నచో అట్టివాటిని "సమయతి ప్రాసాక్షరము" లనబడును, ఉ॥ ఎందుకు పెద్దలవలె బుద్ధియ్యవు - ఎందు బోదునయ్య రామయ్య, అను శంకరాభరణరాగ కృతిలోని యతిప్రాసలు యీ రకమునకు చెందును.

అంత్యప్రాస :— ఏదైన సంగీతరచనలోని చరణము లేక ఒక పాదముయొక్క అంత్యాక్షరములు సమానముగానున్నచో అట్టివాటిని అంత్యప్రాస అని చెప్పబడును. ఉ॥ శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతిస్వామియొక్క శివాష్టపదులలోను, శ్రీ జయదేవుని గీత గోవింద అష్టపదులలోను, శ్రీ సదాశివ బ్రహ్మేంద్రముయొక్క కీర్తనలలోను మనోహరమైన అంత్యప్రాసలుండుట గమనించదగును.

అనుప్రాస :—ఏదైన ఒక సంగీత రచనలోని ఒక రకమైన అక్షరములనుగాని, మాటలనుగాని, మరల మరల ఉపయోగించుటను "అనుప్రాస"యని చెప్పబడును. i ఉ॥ అక్షయలింగవిభో. అను శ్రీ ముద్దుస్వామి దీక్షితులయొక్క శంకరాభరణరాగకృతిలోని అనుపల్లవి యందుగల దక్షశిక్షణ, దక్షతరసుర, అను భాగమును, ii వనజాసన, అను శ్రీరాగములోని శ్రీ సుబ్బరామదీక్షితుల కృతిచరణమును యిందుకు వుదాహరణగా

తీసికొనవచ్చును. ఇది, అంత్యప్రాసకు, ద్వితీయాక్షరప్రాసలకు యితరమైనదగును. మరియు నిది రచనలోనిసాహిత్యమునకు అలంకారము నిచ్చును.

అనుబంధము :— 18వ శతాబ్దమునకు చెందిన సంగీతరచయితలు వారు రచించిన కొన్ని తానవర్ణములకు చివర రచింపబడిన ఒక ప్రత్యేకరచనకు "అనుబంధము"అని చెప్పబడును. అట్టి అనుబంధములలోని సాహిత్యములందు యతులనుకూడ చేర్చి యుండెడివారు. ఇట్టి అనుబంధములుగల తానవర్ణములను పాడునపుడు మొదట పల్లవి, అనుపల్లవి, ముక్తాయిస్వరమును, తదుపరి చరణము, ఎత్తుగడ స్వరములను వరుసగాపాడిన తరువాత మరల చరణముపాడి అనుబంధమును ప్రారంభించవలెను.

i ఉ॥ విరుబోణి నిన్నేకోరి, అను శ్రీ పచ్చిమిరియం ఆది అప్పయ్యాగారి భైరవిరాగ, అటతాళవర్ణము చివరనుండు "చిరుచెమటలు" అనెడి అనుబంధము యిందుకు ముఖ్యవుదాహరణమగును. ii 'సాధించెనే' అనుకీర్తనయందు చివరభాగముననుండు 'సద్భక్తుల' అనెడి అనుబంధమును నేటికిని ప్రసిద్ధముగా పాడుచుండుటయే దీనికి ముఖ్యతార్కాణమగును. ఇట్టి అనుబంధములు రచించినవారిలో శ్రీ పచ్చిమిరియం ఆది అప్పయ్య, శ్రీ వెంకటసుబ్బయ్య, శ్రీ త్యాగరాజు, శ్రీ ముద్దుస్వామి దీక్షితులు ముఖ్యులగుదురు.

ఆదిలక్షణగ్రంథము :— ప్రాచీనమైనట్టియు, నాట్య, సంగీతముల రెంటిని గురించి వ్రాయబడినట్టియు గ్రంథమగు భరతుని "నాట్యశాస్త్రమును" "ఆదిలక్షణ గ్రంథ"మని చెప్పబడును.

సంగీతమునుగూర్చి వ్రాయబడిన అతి ప్రాచీనగ్రంథములు :— ఇవి అతి ప్రాచీనమై, తమిళ భాషలో సంగీతమునుగూర్చికూడా వ్రాయబడినట్టి "తొలి కాప్పియమ్" "శిలప్పధికారమ్" వంటి గ్రంథములకు గల పేరగును. ఇవి 2000 సం॥కు ముందే యుండినటుల తెలియుచున్నది.

తులజాజీ సంగీత సారామృతగ్రంథ విశేషము :—ఈ గ్రంథమునందు షుమారు 50 వరకు రాగచరిత్రలు వ్రాయబడియుండుటచే ప్రాచీనరాగలక్షణములకు సంబంధించిన విశేషములను తెలుసుకొనుట కెంతయు వీలుగానుండుటే యీగ్రంథవిశేషమగును.

రాజపోషణచే నేర్పడిన ప్రసిద్ధ సంగీత గ్రంథములు :— ఇవి శ్రీ ఎట్టయపుర సంస్థానాధీశ్వరులయొక్క విశేషమైన ద్రవ్యసహాయమున శ్రీ సుబ్బరామదీక్షితులవారిచే బహుప్రయాసతో రచింపబడి ప్రకటింపబడిన "సంగీత సంప్రదాయప్రదర్శిని" అను గ్రంథ సంపుటములు యీ తరగతికి చెందినవగును.

మోహనరాగమునకుగల ప్రాచీననామము :—ప్రాచీనకాలములోగల సంగీతరచయితలేమి, లక్షణకారులేమి, గాయకులేమి—యిప్పటి మోహనరాగమును ఆ కాలమున

"రేగుప్తిరాగ"మని చెప్పెడివారు. గనుకనే ప్రాచీనసంగీత గ్రంథములలో మోహన రాగము పేరు లేకపోవుటకు కారణమైనదని గ్రహించునది.

భైరవిరాగ మభివృద్ధిజెందినవిధము :— షడ్జగ్రామమునుండి యేర్పడిన యీ భైరవిరాగమును ప్రాచీన వాగ్గేయకారులు ఆరోహణములో ఖరహరప్రియ నిషాదమును, అవరోహణములో నఠభైరవి నిషాదమును ప్రయోగించి దానికి ఒకప్రత్యేకమైన రంజకత్వమునుకలుగునట్లు అభివృద్ధిచేసిరి. ఇదే యీ భైరవిరాగ మభివృద్ధి చెందిన విధమగును.

20 వ, శతాబ్దపు సంగీత కాన్ఫరెన్సుల ప్రయోజనము :—(1) ప్రముఖ సంగీత విద్వాంసు లందరు నొకచోట సమావేశమై, ప్రాచీన,నవీన రాగలక్షణములను చర్చించి ఆచరణయోగ్యమైనట్టియు, సంప్రదాయమైనట్టి రాగలక్షణములను నిర్ణయించుట. (2) ప్రాచీనమైనట్టియు, ప్రస్తుతము వాడుకలో లేనట్టి వివిధసంగీతరచనలను బహిర్గత మొనర్చుటవంటి అనేకప్రయోజనములు కలుగుచున్నవి.

భాండీర భాష :—ఇది సంస్కృతములో ఒకరకమైనట్టి ప్రాకృతభాషకు చెందినపేరగును. i ఉ॥లంబోదర లకుమికరా. అను పిళ్లారి గీతములోని అడ్డగీత గురుతు గల "కు" అను అక్షరమును, ఉ॥ ii వరవీణా మృదుపాణీ, అను మోహనరాగ గీతములోని వనరుహలోచనురాణి, సరసీజాసను జననీ "అను అడ్డగీతలు గురుతుగల "ను" అను అక్షరములును యీ భాండీరభాషకు చెందినవిగా గ్రహింపదగును.

భారతీయ నొటేషన్:—సంగీతరచనలను గ్రంథములందు చూచి చదువుటకు వీలుగాసాహిత్యము (మాతువు) నకు పైన రాగ, తాళవిధుల ననుసరించి స్వరములను సరియైన వర్ణమెట్టులో వ్రాయునట్టి పద్ధతికి "భారతీయ నొటేషన్ అనియు" లేక సరిగమ, నొటేషన్, అనియు చెప్పబడును.

యూరపియన్ నొటేషన్ :—పాశ్చాత్యదేశములలో వారి సంగీతరచనలను గ్రంథములందు చూచి చదువుటకు మనసంగీతరచనలకువలె, స్వరములను వ్రాయు పద్ధతిలేక, 5 అడ్డగీతలను యేర్పఱచి వాటిమధ్యను, యేర్పఱచునట్టి గుండ్రని చుక్కల ద్వారానే వివిధసంగీతరచనలను ఆయాశైలులలో పాడగలుగునట్లు చేయుదురు. అట్టి పద్ధతికే " యూరపియన్ నొటేషన్ ".అనిచెప్పబడును.

టైమ్‌సిగ్నల్ ( Time signal ) :—మనకర్నాటక సంగీతములోని రచనలను ఒకశైలిలో పాడుటకు వీలుగా వాటిపైన రాగ, తాళములను వ్రాయబడినట్లుగానే పాశ్చాత్యసంగీతరచనలపైన ఆయా స్వరములకుగల వేపనసంఖ్యలచే నేర్పడు కొన్ని రకములైన భిన్నములను వేయబడియుండును. ఇట్లు వేయబడు పద్ధతికే ఇంగ్లీషుభాషలో "టైమ్ సిగ్నల్" అనిచెప్పబడును.

రెపర్‌ట్వార్ (Repertoire) :— సుప్రసిద్ధులగు గాయకులుగాని, వాద్యబృందములుగాని, నటబృందములుగాని, వారు సంగీతకచ్చేరీలలోగాని తదితర ప్రదర్శనములలోగాని ప్రదర్శించుటకు నేర్పఱచుకొను గేయములయొక్క వరుస క్రమ విధానమునకు ఫ్రెంచిభాషలో "రెపర్‌ట్వార్" అని చెప్పబడును.

టైమిస్టు (Timeist) :—తాళజ్ఞానమునందు నిర్దిష్టమైన జ్ఞానము గలిగినట్టి కళాకారుని "టైమిస్టు" అని చెప్పబడును.

మ్యూజికల్ ఫామ్స్ (Musical forms) :—సంగీతములో గల వివిధరచనల యొక్క రీతులను ఇంగ్లీషుభాషలో "మ్యూజికల్ ఫామ్స్" అని చెప్పబడును.

ఇన్‌వర్స్‌లా (Inverse law) :— ఏదైన ఒక తంతివాద్యములో తంతి యొక్క పొడవు యెక్కువ చేసి మీటినచో ఆ తంతియొక్క వేపనసంఖ్య తగ్గి ధ్వని కూడతగ్గును. అదే తంతిని దాని పొడవును తగ్గించి మీటినచో ఆ తంతియొక్క వేపన సంఖ్య హెచ్చి ధ్వనికూడ హెచ్చును. ఈ విధానమునకే ఇంగ్లీషుభాషలో "ఇన్‌వర్స్‌లా" అని చెప్పబడును.

## వాగ్గేయకారలక్షణము.

వాగ్గేయకారకుడు :— శ్లో॥ వాఙ్మాతురుచ్యతే గేయం - ధాతురిత్యభిధీయతే । వాచం గేయంచ కురుతే - యస్సవాగ్గేయకారకః॥ అను ప్రమాణమున మాతుయనబడు సాహిత్యమునందును, ధాతుయనబడు స్వరరూపమైన వర్ణమెట్టు నందును రచించు నేర్పుగలిగి రంజకముగా గానముచేయు గాయకుని "వాగ్గేయకారకు"డని చెప్పబడును. ఇట్టి వాగ్గేయకారకులను 3 తరగతులుగా విభజింపబడుటను, వాటివివరములను యీ దిగువ నుదహరించుట గమనించదగును.

i. ఉత్తమ వాగ్గేయకారకుడు :— అనగా! సుశబ్ద, అపశబ్దములను దెలియదగిన వ్యాకరణమును, అమరకోశాది నిఘంటువులను, అనుష్టుప్ మొదలగు ఛందస్సులను, ఉపమాద్యలంకారములను, శృంగారాది నవరసములను, విభావాది భావంబులను, సంగీతాది లలితకళలను, తౌర్యత్రికంబులను చక్కగా గుర్తెఱింగి, సుశారీరముగలిగి, విళంబ, మధ్య, ద్రుతలయలను, చచ్చత్పుటాది తాళవిధులను గమనించి, నూతనవిషయగ్రహణలో ప్రజ్ఞావిశేషము, ప్రబంధరచనయందు ప్రౌఢిమ, గీత, వర్ణ, ప్రబంధ, పద, కృతి, కీర్తనాదులను రచించు సామర్థ్యము, మంద్ర, మధ్య, తారములనెడి త్రిస్థాయిలందు గమకవ్యాపకముతో రాగాలాపన, రోష, ద్వేషముల పరిత్యాగము, సరసత్వము, ఉచితజ్ఞత, చిత్తైకాగ్రత మొదలగు సలక్షణములు గల గాయకుని "ఉత్తమవాగ్గేయకారకు"డని చెప్పబడును.

ii. మధ్యమవాగ్గేయకారకుడు :— అనగా! ధాతురచనయందు యెక్కువ నేర్పును, మాతురచనయందు తక్కువ నేర్పునుగలవాడును, ధాతు, మాతువులందు నేర్పుగలిగియున్నను ప్రబంధరచనయందు ప్రౌఢిమలేనట్టి గాయకుని "మధ్యమవాగ్గేయకారకు"డని చెప్పబడును.

iii. అధమవాగ్గేయకారకుడు :—అనగా! మాతురచనలో మిక్కిలి రమ్యమైన భావముల నిముడ్చు నేర్పును, ధాతురచనయందు మాంద్యమును గల గాయకుని "అధమవాగ్గేయకారకు"డని చెప్పబడును. పైన దెలిపిన 3 తరగతులే గాక గాయకులయొక్క గానకళా నైపుణ్యము, తదితర ఉత్తమలక్షణములనుబట్టి, యీక్రింద దెలిపిన 5 తరగతులుగా విభజించుట గమనించునది.

(1) అన్యులకు సంగీతము నేర్పువానిని 'శిక్షకు, డనియు' (2) ఇతరుల గాన పద్ధతిని యనుసరించువానిని "అనుకారు"డనియు, (3) రసంబుల నెరిగి గానము చేయువానిని 'రసికు, డనియు, (4) వినువారి మనస్సును రంజింపచేయువానిని 'రంజకు' డనియు, (5) గానము నతిశయముగా జేయువానిని 'భావుకు' డనియు, చెప్ప బడెను. మరియు గానముచేయునపుడు అందు పాల్గొను గాయకులసంఖ్యనుబట్టి యీ క్రింది 3 తరగతులుగా విభజింపబడుట దెలియునది. (1) ఒక్కడుగా నుండి గానము చేయువానిని ఏకలు, డనియు, (2) మరియొకరితో చేరి గానముచేయు వానిని యమళు, డనియు, (3) అనేకులతోచేరి గానముచేయు వానిని "బృందకు"డనియు చెప్ప బడెను. మరియు సంగీతరచయితలకు గల వేరువేరు రచనా సామర్థ్యములనుబట్టి ఈక్రింది 3 తరగతులుగా విభజించి చెప్పబడుట గమనింపదగును. (1) కధాకవిని శ్రేష్టుడనియు, (2)వర్ణనాకవిని మధ్యముడనియు, (3)అన్యులధాతువునందు మాతువును జేర్చువానిని, కుట్టికారు, (అధమాధము) డనియు చెప్పియుండుట గమనించునది.

ఉభయకారుడు:—అనగా! ధాతు, మాతువుల రెంటిలోను ప్రతిభావంత ముగా రచించు నేర్పుగల వాగ్గేయకారుని "ఉభయకారు" డని చెప్పబడును. ఉ|| త్యాగరాజ, దీక్షిత, శ్యామశాస్త్రిలు ఈతరగతికి చెందినవారిలో అగ్రగణ్యులగుదురు.

గాంధర్వుడు :— అనగా! మార్గ, దేశీ, సంగీతముల రెంటియందును ప్రతిభగలిగి, రంజకముగా ప్రదర్శించగల గాయకుని "గాంధర్వు"డని చెప్పబడును. [ గాంధర్వుడు అనగా ఉత్తమగాయకుడని అర్థము. ]

సర్వాది :—అనగా ఒక్కమార్గ సంగీతమునందే ప్రతిభగలిగి గానముచేయు నట్టి గాయకుని "సర్వాది"యని చెప్పబడును.

గంధర్వవేదము :—సంగీతమును గూర్చి తెలుపునట్టి వైదికసంబంధమైన గ్రంథశాఖకు "గంధర్వవేద"మని చెప్పబడును. ఇది ఉపవేదములగు నాల్గింటిలో

మొదటిదగును. మిగత మూడింటిలోను రెండవది ఆయుర్వేదము, మూడవది ధనుర్వేదము, నాల్గవది అర్థశాస్త్రమునగును.

గాయన్యా లక్షణము :—మంచిరూపము, మంచిశారీరము (మనోహరమైన కంఠధ్వని) మంచియౌవనము, గానమునందు మంచిసమర్థత, చతురప్రాగల్భ్యము, చతురక్రియ లందత్యధిక ప్రేమ మొదలగు సలక్షణములను గలిగియున్న యువతీమణులను ''గాయన్యా''లని చెప్పబడును.

సుశారీర లక్షణము:- త్రిస్థాయిలందు అనాయాసముగా రాగసంచారము, మాధుర్యము, శక్తి, గంభీరము, మార్దవము, ఘనత, స్నిగ్ధతలను గలిగి వినువారి మనస్సును రంజింపజేయునట్టి కంఠధ్వనిని ''సుశారీర''మని చెప్పబడును. ఇట్టి సుశారీరము జన్మాంతర పుణ్యవిశేషమువల్ల మాత్రమే లభించునని తెలియదగును.

కుశారీర లక్షణము :— శ్రుతిలో చేరనట్టియు, శక్తిలేనట్టియు, ఇంపులేనట్టియు, స్వరహీనమైనట్టియు, కాకసదృశధ్వనిగలినట్టియు, స్థానభ్రష్టమగునట్టియు, కృశించినట్టియు, కఠినమైనట్టి శారీరమును (కంఠధ్వనిని) ''కుశారీర''మని చెప్పబడును.

గాయకదోషములు :- ఈక్రింద నుదహరింపబడిన 25 రకములగు గాయకదోషములలో ఆయా దోషములతో గానముచేయు గాయకులను ఆయా పేర్లతో పిలువబడుట నీక్రిగువ తెలుపుటను గమనించదగును.

(1) దంతములను కఱచుకొని పాడువానిని సందష్టుడనియు, (2) విరసమగు నధికధ్వనితో పాడువానిని ఉద్ఘృష్టుడనియు, (3) సీత్కారముతో ఉస్ అనుచూ పాడువానిని సూత్కారి అనియు, (4) భయముతో పాడువానిని భీతుడనియు, (5) సందేహముతో పాడువానిని శంకితుడనియు, (6) శరీరకంపముతో పాడువానిని కంపితుడనియు, (7) నోరుతెఱచుకొని భయపెట్టినట్లు పాడువానిని కరాళుడనియు, (8) హెచ్చు, తగ్గులుగల స్వరములతో పాడువానిని వికలుడనియు, (9) కాకము వలె క్రూరధ్వనితో పాడువానిని కాకియనియు, (10) తాళమును విడచి పాడువానిని వితాలుడనియు, (11) ఒంటెవలె గళమును పైకెత్తుకొని పాడువానిని కరభుడనియు, (12) మేకవలె నెమఱువేయుచూ పాడువానిని ఉద్భటుడనియు, (13) గొంతుచుట్టు నరములను కనుపఱచుచూ పాడువానిని ఝొంబకుడనియు, (14) బుగ్గలను వుబ్బునట్లు చేసి పాడువానిని తుంబకుడనియు, (15) గొంతును వక్రముగచేసి పాడువానిని వక్రుడనియు, (16) కరాద్యవయవచేష్టలతో పాడువానిని ప్రసారుడనియు, (17) నేత్రములను మూసుకొని పాడువానిని వినిమీలకుడనియు, (18) విరసమగు ముఖచేష్టలతో పాడువానిని విరసుడనియు, (19) స్వరశుద్ధము లేక పాడువానిని అపస్వరుడనియు, (20) గద్గదస్వరముతో మాతువు నుచ్చరించుట తెలియక పాడువానిని

అవ్యక్తుడనియు, (21) త్రిస్థాయిలను విడచి పాడువానిని స్థానభ్రష్టుడనియు, (22) గానపద్ధతులవ్యవస్థల నెఱుంగక తోచినట్లుగా పాడువానిని అవ్యవస్థితుడనియు, (23) రాగలక్షణముల నెఱుంగక ఒకదానితో నొకటి చేర్చి పాడువానిని మిశ్రకుడనియు, (24) గమకవ్యవస్థల నెఱుంగక పాడువానిని, అనవధానుడనియు, (25) అనునాసిక ధ్వనితో గానము చేయువానిని అనునాసికుడనియు చెప్పబడునని గ్రహించునది.

## సంగీతరచనల యందు దుపయోగించు వివిధముద్రలు.

సంగీతరచనలలో నీక్రింద తెలుపబడిన 12 రకములగుముద్రలను వుపయోగించు దురు. వీటినే ద్వాదశముద్రలని కూడ చెప్పబడును. వాటి వివరముల నీక్రింద తెలుపుటను గమనించునది.

(1) వాగ్గేయకారముద్ర :—ఇది ఏదైన ఒక సంగీతరచనయొక్క సాహిత్యమునందు వాగ్గేయకారుని పేరును యిమిడ్చి అర్థము చెడకుండునట్లుగా రచింపబడునట్టి దానికిగల పేరగును. ఇట్టి ముద్ర ముఖ్యముగా రెండువిధములుగా నుండును. అవి i స్వనామముద్ర ii అన్య (యితర) నామముద్రలగును.

i స్వనామముద్ర :— అనగా! ఒక సంగీతరచయిత, తనరచనలలో తన పేరును ముద్రగా సాహిత్యమునం దిమిడ్చి అర్థయుక్తముగా రచించునపుడు అట్టిది "స్వనామముద్ర" యని చెప్పబడును. ఉ॥ శ్రీ జయదేవకవి, జయదేవముద్రను, శ్రీ నారాయణతీర్థులు, నారాయణతీర్థముద్రను, శ్రీ త్యాగరాజు, త్యాగరాజముద్రను, శ్రీ శ్యామశాస్త్రి, శ్యామకృష్ణముద్రను, శ్రీ మైసూరు సదాశివరావు, సదాశివ ముద్రను, శ్రీ రామ్నాడ్ శ్రీనివాస అయ్యంగార్ శ్రీనివాసముద్రను యేర్పఱచి రచించుటచే యిట్టి రచనలు స్వనామముద్రగల రచనలకు చెందునని గ్రహించునది.

ii అన్యనామముద్ర :— అనగా ! ఒక సంగీతరచయిత తనరచనలందు అన్యుల లేక యితరుల పేర్లను సాహిత్యమునం దిమిడ్చి రచించునపుడు అట్టి ముద్రను "అన్యనామముద్ర"యని చెప్పబడును. ఉ॥ శ్రీ ముద్దుస్వామిదీక్షితులు గురుగుహ ముద్రను, శ్రీ సుబ్బరాయశాస్త్రి కుమారముద్రను, శ్రీ అనయ్య ఉమాదాస ముద్రను, శ్రీ వీణకుప్పయ్యర్ గోపాలదాసముద్రను, శ్రీ రామస్వామిశివన్, గుహ దాసముద్రను, శ్రీ సదాశివబ్రహ్మేంద్రము హంస, లేక పరమహంసముద్రను, యేర్పఱచుట యిందుకు ముఖ్యవుదాహరణములగును. మరియు పైన దెలిపినవారే గాక, శ్రీ శేషయ్యంగార్, కోసలముద్రను, శ్రీ సారంగపాణి, వేణుగోపాలముద్రను, శ్రీసభాపతిఅయ్యర్ రాజగోపాలముద్రను, శ్రీఘనంసీనయ్య, మన్నారురంగముద్రను, శ్రీ పల్లవిగోపాలయ్యర్, వెంకటముద్రను, శ్రీ వీరభద్రయ్య, ప్రతాపరామముద్రను,

శ్రీ దురైస్వామిఅయ్యర్ సుబ్రహ్మణ్యముద్రను, శ్రీ కరిగిరిరావు నరశింహ్వాముద్రను, యేర్పఱచి రచించుటచే నివి అన్నియు అన్యనామముద్ర గలరచనలకు చెందినవని తెలియదగును.

(2) ఆచార్యముద్ర:—ఇది ఒక సంగీతరచయిత తన రచనలందు ఆచార్యుల (గురువు) పేరును సాహిత్యమునందు యిమిడ్చి రచించినపుడు అట్టిముద్రను "ఆచార్యముద్ర" యని చెప్పబడును. ఉ॥ i "గానవిద్యాధురంధర వెంకటసుబ్బార్యగురో" అనుముద్రను శ్రీ పైడాల గురుమూర్తిశాస్త్రి తన రచనయగు నాటరాగములోని సప్త తాళ గీతమునందును, ii శ్రీ గురుగుహస్వామి, అనుగురుముద్రను శ్రీ పొన్నయ్యపిళ్లె తన రచనయగు "మాయాతీత" అను మాయామాళవగౌళ రాగకృతిలోను, ఏర్పఱచుటచే నివి రెండును "ఆచార్యముద్ర"లు గల రచనలకు ముఖ్య వుదాహరణము లగును.

(3) రాగముద్ర:—ఇది ఒక సంగీతరచయిత తన రచనలందు రాగము పేరును సాహిత్యమునందుయిమిడ్చి అర్థము చెడకుండునట్లు రచించినపుడు అట్టి ముద్రను "రాగముద్ర" యని చెప్పబడును. ఉ॥ i కంసాసురఖండన జయరే. అను సహాన రాగములోని శ్రీ గురుమూర్తిశాస్త్రియొక్క లక్షణగీతమునందును, ii కామాక్షీ అనుదినము, అను భైరవిరాగములోని శ్రీశ్యామశాస్త్రుల స్వరజతియందును, iii మోహన రామా, అను మోహనరాగములోని శ్రీ త్యాగరాజుని కృతియందును, iv నిత్య కల్యాణి, అను శ్రీ సీతారామారావు రాగమాలికయందును, v శ్రీ విశ్వనాథం భజేహం, అను శ్రీ ముద్దుస్వామి దీక్షితుల చతుర్దశరాగమాలికలోను, తదితర అనేక రచనలయందును, vi శ్రీమహావైద్యనాథయ్యర్ యొక్క 72 మేళరాగమాలికయందును, vii శ్రీ కోటీశ్వరయ్యర్ (1869–1938) యొక్క 72 మేళరాగకృతులయందును, viii శ్రీ గోపాలకృష్ణ భారతి తమిళరచనలయందును, ix శ్రీ ఘనం కృష్ణయ్యర్ తమిళ రచనలయందును యిట్టి రాగముద్రలుండుట గమనించదగును.

(4) తాళముద్ర;—ఇది ఒక సంగీతరచయిత తనరచనయందు తాళము పేరు సాహిత్యమునం దిమిడ్చి అర్థము చెడకుండునట్లుగా రచించినపుడు అట్టి దానిని తాళముద్రయని చెప్పబడును. ముఖ్యముగా యిట్టి ముద్రలు తాళమాలికలయందును, రాగ, తాళమాలికలయందును వుండును. ఉ॥ నాటకాదివిద్యల బలుమేటివధూటి యారా యిది ధృవముగా. అను శ్రీరామస్వామిదీక్షితుల 108 రాగతాళమాలికలో రాగముద్రలేగాక, యిట్టి తాళముద్రలుకూడ మనకు అనేకము కనబడును.

(5) రాజముద్ర:— ఇది ఒక సంగీతరచయిత తాను రచనలను రచించుటకు తోడ్పడునట్టి పోషకులగు జమీందారులయొక్కగాని, లేక రాజులయొక్కగాని పేర్లను సాహిత్యమునందిమిడ్చి రచించినపుడు అట్టిముద్రను "రాజముద్ర" యని చెప్ప

బడును. ఉ॥ "వెంకటకృష్ణ" అనుముద్రను శ్రీ రామస్వామి దీక్షితులు తన 108 రాగ తాళమాలికలో (శ్రీ మణలి వెంకటకృష్ణ (చిన్నయ్య) ముదలియార్ పేరును) పేర్కొనుటచే యిది "రాజముద్ర"కు ఒక ముఖ్యవుదాహరణమగును. మరియు కొన్ని తిల్లానల యందుకూడ యిట్టి రాజముద్రలు వుండుట గమనించవగును.

(6) వంశముద్ర:—ఇది సంగీతరచయితలు తమరచనలయందు వంశము లేక ఇంటిపేరును సాహిత్యమునం దిమిడ్చి రచించినపుడు అట్టి ముద్రను వంశముద్ర యని చెప్పబడును. ఉ॥ కాకర్ల వంశాగ్రణి. అనువిధముగా త్యాగరాజువంశము పేరును త్యాగరాజుని ప్రియశిష్యుడగు శ్రీ వాలాజాపేట సుప్పయ్యా వేంకటరమణ భాగవతులు తనగురువుపై రచించిన మంగళాష్టకములో పేర్కొనుటచే యిది వంశ ముద్రకు ఒకముఖ్య వుదాహరణమగును. ఒక్కొక్కప్పుడు యిట్టివంశముద్రకు బదులుగా ఆత్మీయులగు తండ్రిపేరును ముద్రగానుంచుట కూడ జరుగును. ఉ॥ రామ బ్రహ్మతనయుడౌ. అనువిధముగా శ్రీ త్యాగరాజు తనరచనయగు "దొరకునా యిటువంటి సేవ"అను బిలహరి రాగములోని కృతిలో తండ్రిపేరు పేర్కొనుట యీ రకమైన ముద్రకు ఒక ముఖ్యవుదాహరణ మగును.

(7) ప్రబంధముద్ర:— ఇది సంగీతరచయితలు తమరచనలందు ప్రబంధము లేక రచనయొక్క పేరును ముద్రగా నుంచునపుడు అట్టి దానిని "ప్రబంధముద్ర"యని చెప్పబడును. ఉ॥ శతరాగ రత్నమాలిక. అనుముద్రను త్యాగరాజా i ఏలావతార మెత్తుకొంటివి. (ముఖారి) ii రాగరత్నమాలికచే (రీతిగౌళ) అను తన కృతులయందు ప్రబంధముద్రలను యేర్పఱచుట యిందుకు ముఖ్య వుదాహరణము లగును. మరియు శ్రీ పల్లవి శేషయ్య తనరచనయైన ధన్యాసిరాగములోని ఒక "తిల్లాన"యందు కూడ యిట్టి ప్రబంధముద్రను యేర్పఱచుట గమనించవగును.

(8) నాయకముద్ర:—ఇది సంగీతరచయితలు తమ రచనలందు గల సాహిత్యమునందు నాయకుని పేరు యిమిడ్చి రచించునపుడు అట్టి దానిని "నాయకముద్ర" అని చెప్పబడును. ముఖ్యముగా యిట్టి ముద్రలు శృంగారరస ప్రధానమైన పదముల వంటి రచనలందుండును. ఉ॥ మువ్వగోపాల. అనుముద్ర అలిగితే భాగ్యమాయె. అను హుసేనిరాగము, త్రిపుటతాళములోని క్షేత్రయ్యపదము(?) నుండుట గమనించ దగును. ఇదే విధముగా శ్రీ మువ్వలూరు సభాపతిఅయ్యర్, రాజగోపాలముద్రను, శ్రీసారంగపాణి వేణుగోపాలముద్రను, శ్రీఘనం కృష్ణయ్యర్ మన్నారురంగముద్రను, శ్రీ వైదీశ్వరన్ కోవిల్ సుబ్బరామయ్యర్, ముత్తుకుమారవంటి నాయకముద్రల నేర్పఱచి రచించుట యిందుకు ముఖ్యవుదాహరణములగును.

(9) స్థల లేక క్షేత్ర ముద్ర:— ఇది సంగీతరచయితలు తమ రచనలందు పుణ్యస్థలము లేక క్షేత్రముయొక్క పేరును సాహిత్యమునందు అర్థము చెడకుండునట్లు

యిమిడ్చి, రచించినపుడు అట్టిముద్రను క్షేత్రముద్రయని చెప్పబడును. తేవారములు, తిరువాచకమ్, తిరుప్పుగళ్ వంటి రచనలందు యిట్టి క్షేత్రముద్రలుండుట మనము చూడ వచ్చును. కొన్నిరచనలలో యీ క్షేత్రముద్రతో వైత్యముద్రను కూడ కలిపి రచింప బడును. ఉ॥ కోవూరు సుందరేశ. అనుముద్ర శ్రీ త్యాగరాజుని కోవూరు పంచరత్న కృతులలో గలదు. తిరువత్తియూర్ పంచరత్నకృతులలోకూడ యిట్టిముద్రలుండుట ముఖ్యముగా గమనించదగును. ఇంతేగాక శ్రీ ముద్దుస్వామిదీక్షితుల పంచలింగస్థల కృతులలోను, శ్రీ వీణకుప్పయ్యార్ కాళహస్తీశ పంచరత్నకృతులలోను, శ్రీ శ్యామ శాస్త్రులు మధుర మీనాక్షీదేవిపై రచించిన నవరత్నమాలికా కృతులలోను, శ్రీవిద్యల నారాయణస్వామి కృతులలోను యిట్టి క్షేత్ర, వైత్యముద్రలు కలిసియుండుట యిందుకు ముఖ్య వుదాహరణములగును.

(10) బిరుదముద్ర :— ఇది సంగీతరచయితలు తమరచనలందు సుప్రసిద్ధ గాయకులకుగాని, లేక రచయితలకుగాని, లేక లక్షణకారులకుగాని యొసగబడిన బిరుదములను తమ రచనలందలి సాహిత్యముతో జతపఱచి అర్థము చెడకుండునట్లు రచించినపుడు అట్టిముద్రలను బిరుదముద్రలని చెప్పబడును.

(11) లక్షణగ్రంథముద్ర :— ఇది సంగీతరచయితలు తమరచనలందు యేదైన ఒకలక్షణ గ్రంథముపేరును సాహిత్యమునందిమిడ్చి అర్థముచెడకుండు నట్లుగా రచించినపుడు అట్టి ముద్రను "లక్షణగ్రంథముద్ర"యని చెప్పబడును. ఉ॥ స్వరార్ణవము. అనుముద్రను శ్రీ త్యాగరాజు తన రచనయగు "స్వరరాగసుధారస" అను శంకరాభరణరాగ కృతిచివరచరణములో చేర్పఱచుట లక్షణముద్ర కొక ముఖ్య వుదాహరణమగును. స్వరార్ణవ మనునది త్యాగరాజునికి శ్రీ నారదమహర్షి చే యొసగ బడిన ఒక అపూర్వమైన సంగీతలక్షణగ్రంథము పేరని గ్రహించునది.

(12) సంవత్సరముద్ర :—ఇది సంగీతరచయితలు తమరచనలందు ప్రభవాది తెలుగుసంవత్సరములయొక్క పేర్లను సాహిత్యమునందు అర్థము చెడకుండునట్లుగా నిమిడ్చి రచించినపుడు అట్టి ముద్రలకు "సంవత్సరముద్ర"లని చెప్పబడును.ఉ॥తంజా వూరునేలిన శ్రీ శరభో (1800–1832) రాజాంకితముగా రచింపబడినటువంటి "శర భేంద్రభూపాల కురవంజి నాటకము"అనే తమిళ నృత్యనాటికలోని ఒక రచనయందు ఆరచయిత ప్రభవాది 60 తెలుగుసంవత్సరములలో 19 పేర్లను ముద్రలుగా నుంచుట, సంవత్సరముద్రలకు ముఖ్యవుదాహరణములగును. అట్టిముద్రలను వరుసక్రమంలో యీ దిగువను దెలుపుట గమనించునది. 1. ప్రభవ, 2. ప్రజోత్పత్తి, 3. ఈశ్వర, 4. ప్రమాది 5. చిత్రభాను, 6. సర్వజిత్తు, 7. విరోధి, 8. వికృతి, 9. విజయ, 10. జయ, 11. మన్మథ, 12. క్రోధి, 13. కీలక, 14. పరీధావి, 15. ఆనంద, 16. కాళయుక్తి,

17. దుర్మతి, 18. దుందుభి, 19. అక్షయ అనుముద్రలగును. ఈ 19న్ను, శ్రీ శరభోజి యొక్క పరిపాలనకాలములో ఒక ప్రత్యేకమైన విశిష్టత నొందిన సంవత్సరము లగుటచే వాటిని ముద్రలుగానుంచి రచించుటకు కారణమైన దని గ్రహింపవగును.

స్వ గ్రా మ ము ద్ర :— ఇది సంగీతరచయితలు తాము రచించెడి గేయము లందలి సాహిత్యములో స్వగ్రామము పేరు అర్థము చెడకుండునట్లు యిమిడ్చి రచించి నపుడు అట్టి పేరును స్వగ్రామముద్రయని చెప్పబడును. ఉ॥ i గర్భపురీశ, అను ముద్ర శ్రీ కరూరు, దక్షిణామూర్తి, మరియు దేవుడయ్యర్ కృతులలోను, ii ధర్మ పురీశ, అనుముద్ర. శ్రీ ధర్మపురి సుబ్బరాయర్ జావళీలలోను iii తాళవధీశ, అను ముద్ర, శ్రీ పట్టాభిరామయ్య జావళీలలోను, iv హరికేశపురనివాస, అనుద్రను శ్రీ యల్. ముత్తయ్య భాగవతార్ కృతులలోను యుండుట గమనించవగును. సంగీతరచనలు లేక ప్రబంధముల యందుపయోగించు ముద్రలయొక్క సంఖ్యను బట్టి వాటిని యీక్రింద దెలిపిన 4 రకములుగా విభజించుట గమనించునది.

(1) ఏ క ము ద్ర ప్ర బం ధ ము :— ఇది ఒకసంగీతరచనలో యేదైన నొక ముద్రను మాత్రమే నుపయోగించి రచించినపుడు అట్టి రచనను "ఏకముద్ర ప్రబంధ"మని చెప్పబడును. ఉ॥ బ్రోవభారమా. అను బహుదారిరాగము, ఆది తాళములోని శ్రీ త్యాగరాజుకృతిలో "త్యాగరాజనుత" అనువాగ్గేయకారముద్ర ఒక్కటే యుండుటచే నిది ఏకముద్ర ప్రబంధమునకు ఒక ముఖ్యవుదాహరణమగును.

(2) ద్వి ము ద్ర ప్ర బం ధ ము :—ఇది ఒక సంగీతరచనలో రెండురకములగు ముద్రలను వుపయోగించి రచింపబడినపుడు అట్టి రచనను "ద్విముద్ర ప్రబంధ"మని చెప్పబడును. ఉ॥ i నిత్యకల్యాణి. అనురూపకతాళములోని శ్రీ సీతారామరావు రాగమాలికలో సీతారామ అను వాగ్గేయకారముద్రయును, కల్యాణి మొదలగు రాగముద్రలునుయుండుటచే నిది "ద్విముద్ర ప్రబంధము"నకు చక్కని వుదాహరణ మగును. ii ఉ॥ కంసాసురఖండనజనురే - అను సహానరాగము, చతురశ్ర జాతి మఠ్యతాళములోని శ్రీ పైడాల గురుమూర్తిశాస్త్రియొక్క లక్షణగీతములో కూడ "గురుమూర్తే" అను స్వనామ వాగ్గేయకారముద్రయును, సహానరాగం, అను రాగ ముద్రయు నుండుటచే నిది ద్విముద్ర ప్రబంధమునకు ఒకచక్కని వుదాహరణ మగునని గ్రహింపదగును.

(3) త్రి ము ద్ర ప్ర బం ధ ము :—ఇది ఏదైన ఒక సంగీతరచనలో మూడు రకములగు ముద్రలనుపయోగించి రచింపబడినపుడు అట్టిరచనను "త్రిముద్ర ప్రబంధ" మని చెప్పబడును. ఉ॥ చింతయ మా కందమూలకందం, అను శ్రీ ముద్దుస్వామి దీక్షితులయొక్క భైరవిరాగములోని కృతిలో కంచి, అను క్షేత్రముద్రయును, భైరవి,

అను రాగముద్రయును, గురుగుహ అను అన్యనామ వాగ్గేయకారముద్రయును. యుండుటచే నిది త్రిముద్ర ప్రబంధమున కొక చక్కని వుదాహరణమగును.

(4) చతుర్ముద్ర ప్రబంధము :—ఇది ఏదైన ఒక సంగీతరచనలో నాలుగు రకములగు ముద్రల నుపయోగించి రచింపబడినపుడు అట్టి రచనను "చతుర్ముద్ర ప్రబంధ"మని చెప్పబడును. ఉ॥ శ్రీ విశ్వనాథం భజేహం, అను శ్రీ ముద్దుస్వామి దీక్షితుల చతుర్దశ రాగమాలికలో చతుర్దశ భువనరూప రాగమాలిక అను ప్రబంధ ముద్రయును, సంసారాబ్ధి అను రాగముద్రయును, గురుగుహ అను వాగ్గేయకార ముద్రయును, వైద్యలింగ భూపాల అనుపోషకుని ముద్రయును వుండుటచే నిది చతుర్ముద్ర ప్రబంధమున కొక చక్కని వుదాహరణమగును. పైన దెలిపిన. ద్విముద్ర, త్రిముద్ర, చతుర్ముద్ర ప్రబంధముల నే బహుముద్ర ప్రబంధములని కూడ చెప్పదగును.

సంగీతరచయితలు తమరచనలం దుపయోగించు ముద్రలయొక్క సంఖ్యను బట్టి వారిని యీక్రింది 4 తరగతులకు చెందిన వారుగా చెప్పబడును.

1. ఏకముద్రాకారుడు :—ఇది ఒక సంగీతరచయిత తనరచనలందు ఒకే ముద్రనుపయోగించి రచించినపుడు అట్టి రచయితను "ఏకముద్రాకారు"డని చెప్ప బడును. ఉ॥ త్యాగరాజు, త్యాగరాజముద్రయును, ముద్దుస్వామి దీక్షితులు, గురు గుహముద్రయును, శ్యామశాస్త్రులు, శ్యామకృష్ణముద్రయును, అనయ్య, ఉమాదాస ముద్రయును,సుబ్బరాయశాస్త్రి, కుమారముద్రయును, వీణకుప్పయ్యర్,గోపాలదాస ముద్రయును, గురుమూర్తిశాస్త్రి, గురుమూర్తిముద్రయు చేర్చుటచే రచించుటచే యిట్టి వారిని ఏకముద్రాకారులుగా చెప్పబడును.

2. ద్విముద్రాకారుడు :—ఇది ఒక సంగీతరచయిత తనరచనలందు ఏవైన రెండురకముల ముద్రల నుపయోగించి రచించినపుడు అట్టి రచయితను "ద్విముద్రా కారు"డని చెప్పబడును. i ఉ॥ గోపాలకృష్ణ భారతి. ఇతడు తనరచనలందు గోపాలకృష్ణ, బాలకృష్ణ యను రెండువిధములగు ముద్రలను వుపయోగించి యుండుటచే యిట్టి రచయితను "ద్విముద్రాకారు"డని చెప్పబడును. మరియు పర్యాయముద్రాకారుడనియు చెప్పదగును. ii రామదాసు. ఇతడు తనరచనలందు, స్వనామముద్రగా రామదాస అనియు, అన్యనామముద్రగా భద్రాచల అనియు చేర్కొనుటచే యితనిని ద్విముద్రాకారుడుగా కూడ చెప్పదగును.

3. త్రిముద్రాకారుడు :—ఇది ఒక సంగీతరచయిత తనరచనలందు మూడు రకముల ముద్రల నుపయోగించి రచించినపుడు అట్టి రచయితను 'త్రిముద్రాకారు'డని చెప్పబడును. ఉ॥ సుందరమూర్తినాయనార్. ఇతడు తన తమిళరచనలయందు, సంది

యారూరన్, అరూరన్, ఊరన్, అనెడి మూడు రకముల ముద్రల నుపయోగించుటచే యిట్టి రచయితను "త్రిముద్రాకారు"డని చెప్పబడును. ii శ్రీ ఘనం కృష్ణయ్యర్. ఇతడు తనరచనలందు, వేలవ, ముత్తుకుమార, మురగ, అను మూడురకముల ముద్రల నుపయోగించుటచే యితనిని కూడ త్రిముద్రాకారుడుగా చెప్పదగును.

4. చతుర్ముద్రాకారుడు :- ఇది ఒక సంగీత రచయిత తన రచనలందు నాలుగు విధములగు ముద్రల నుపయోగించి రచించునపుడు అట్టి రచయితను "చతుర్ముద్రాకారు" డని చెప్పబడును. i ఉ॥ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్. ఇతడు తన రచనలందు శ్రీ వేంకటేశ, ఆదివెంకటేశ, శ్రీ వరద వేంకటేశ, వరద వేంకటేశ్వర, అను నాల్గు విధములగు ముద్రల నేర్పరచుటచేత యిట్టి రచయితను చతుర్ముద్రాకారుడని చెప్పబడును. ii ఉ॥ కంచి వెంకటాద్రిస్వామి. ఇతడు తనరచనలందు వారణశైల, పంజరాద్రి, దంతిగిరి, కరిగిరి, అను నాల్గురకములముద్రల నుపయోగించుటచే యితనినికూడ "చతుర్ముద్రాకారు"నికి చెందిన రచయితగా చెప్పదగును.

పర్యాయముద్రాకారుడు :—ఇది ఒక సంగీతరచయిత తనరచనలందు ప్రధానముగా యేర్పఱచుకొనిన ముద్ర నేగాక, అదే అర్థమిచ్చునట్టి మరికొన్ని యితర ముద్రలతోకూడ రచించినపుడు అట్టి రచయితను "పర్యాయ ముద్రాకారు"డని చెప్పబడును. ఉ॥ స్వాతి తిరునాళ్. (తిరువాన్కూరు మహారాజు) ఇతడు తనరచనలందు ప్రధానముగా నేర్పఱచుకొనిన 1. పద్మనాభముద్ర నే గాక పర్యాయముద్రలుగా 2. అబ్జనాభ, 3. అంబుజనాభ, 4. కంజనాభ, 5. కమలనాభ 6. జలజనాభ, 7. జలరుహనాభ, 8. నళిననాభ, 9. పంకజనాభ, 10. వనజనాభ, 11. వారిజనాభ, 12. సరసిజనాభ, 13. సరసీరుహనాభ, 14. సరోజనాభ, 15, సారసనాభ, వంటి వివిధముద్రల నుపయోగించుటచే యీయనను పర్యాయముద్రాకారుడని చెప్పబడును.

బహుముద్రాకారుడు :—ఇది ఒక సంగీతరచయిత, తనరచనలందు రెండు లేక అంతకంటెయెక్కువ ముద్రలతో రచించునపుడు అట్టి రచయితను "బహుముద్రాకారు"డని చెప్పబడును. ఉ॥ భద్రాచలరామదాసు. ఇతడు తనరచనలందు రామదాస, భద్రాచల, భద్రాచలవాస, భద్రాద్రి, భద్రశైల, భద్రగిరి, భద్రగిరీశుడు. వంటి అనేకముద్రల నుపయోగించుటచే యితనిని "బహుముద్రాకారు"డని చెప్పబడును.

సంగీత త్రిమూర్తులగు శ్రీ త్యాగరాజ, ముద్దుస్వామి దీక్షిత. శ్యామశాస్త్రిలు రచించిన కృతుల యందుగల త్యాగరాజ, గురుగుహ, శ్యామకృష్ణ అనెడి ముద్రలలోని వివిధరకములను, వాటిరచనలను, రాగతాళముల నీక్రింద తెలుపుట గమనింపదగును.

| ఏకముద్రలోని రకములు — | రచనలు. | రాగములు. | తాళములు. |
|---|---|---|---|
| త్యాగరాజ వినుత | రామనన్నుబ్రోవరా | హరికాంభోజి | రూపకం |
| త్యాగరాజ సన్నుత | సుజన జీవన | ఖమాసు | ,, |
| త్యాగరాజ వందిత | నామొఱలను | ఆరభి | దేశాది |
| త్యాగరాజ వంద్య | నిన్నే నెరనమ్మి | పంతువరాళి | రూపకం |
| త్యాగరాజ పూజిత | నేనెందువెదకుదురా | కర్నాటకబ్యాగ్ | ఆది |
| త్యాగరాజ హృద్ధామ | నిన్నుబాసియెట్లు | బలహంస | ,, |
| త్యాగరాజహృదాలయ | పాహిరామచంద్ర | శంకరాభరణం | ,, |
| త్యాగరాజకులవిభూష | రామనీసమాన | ఖరహరప్రియ | రూపకం |
| త్యాగరాజవరద | మోహనరామా | మోహన | ఆది |
| త్యాగరాజ పరిపాల . | మాజానకిచెట్టబట్టగ | కాంభోజి | ,, |
| త్యాగరాజపాలం | నాదతను మనిశం | చిత్తరంజని | ,, |
| త్యాగరాజ చిత్తహితుడు | ఉండేదిరాముడొకడు | హరికాంభోజి | రూపకం |
| త్యాగరాజరక్షక | రామాభిరామ | దర్బారు | చాపు |
| త్యాగరాజసేవితాయ | నమోనమోరాఘవాయ | దేశ్యతోడి | త్రిశ్ర-ఏక |
| త్యాగరాజ హృద్భాంతం | భజరేభజమానస | కన్నడ | చాపు |
| త్యాగరాజహృత్సదన | ఫణిపతిశాయి | ఝుంకారధ్వని | ఆది |
| త్యాగరాజహృదాబ్జసుభృంగ | ఏపాపముజేసితి | అఠాణా | త్రిపుట |
| త్యాగరాజహృద్భూషణ | ఓరంగశాయి | కాంభోజి | ఆది |
| త్యాగరాజ మానససరోజ | రామానిన్నేనమ్మి | హుసేని | ,, |
| త్యాగరాజ పోషకుడు | ఏరాముని నమ్మితినో | వకుళాభరణం | త్రిపుట |
| త్యాగరాజ హృదయాకార | వందనమురఘునందన | సహాన | ఆది |
| త్యాగరాజ హృద్వారిజమిత్ర | చల్లగనాతో బల్కుమి | వేగవాహిని | ,, |
| త్యాగరాజ ఖేదహర | ఏట్లాదొరికితివో | వసంత | ,, |
| త్యాగరాజ కులపావన | రామారఘుకుల | కాపి | రూపకం |
| త్యాగరాజ స్వాంతసదన | సర్వాంతర్యామి | భైరవి | ఆది |
| త్యాగరాజ వరహృదయనివాస | శంభోమహాదేవ | పంతువరాళి | రూపకం |
| త్యాగరాజ రిపుజలదసమీర | మామవసతతం | జగన్మోహిని | ఆది |
| త్యాగరాజ గేయమా | శ్రీరామపాదమా | అమృతవాహిని | ,, |

| | | | |
|---|---|---|---|
| త్యాగరాజ హృత్సంచార | సుందరతరదేహం | పంతువరాళి | ఆది |
| త్యాగరాజ సఖుడు | శృంగారించుకొని | సురటి | ,, |
| త్యాగరాజ గిరీశ | మాకేలరావిచారము | రవిచంద్రిక | ,, |
| త్యాగరాజ సార్వభౌమ | లోకావనచతుర | బేగడ | ,, |
| త్యాగరాజ హృదయ కుముద జలధర | శరణుశరణనుచు | మధ్యమావతి | ,, |
| త్యాగరాజ కరార్చిత | దాశరథే నీఋణము | తోడి | ,, |
| త్యాగరాజ ప్రేమావతార | చేసినదెల్ల మరచితివో | ,, | ,, |
| త్యాగరాజ సుముఖుడ | కొలువమరెగద | ,, | ,, |
| త్యాగరాజ భాగధేయ | నినువినాసుఖము | ,, | రూపకం |
| త్యాగరాజ నాథాప్రమేయ | నీభక్తిభాగ్యసుధా | జయమనోహరి | ,, |
| త్యాగరాజ పక్ష | ఏవిధములనైన | కల్యాణి | ఆది |
| త్యాగరాజ నాయకాయ | నమోనమోరాఘవాయ | దేశ్యతోడి | త్రి.లఘువు |
| త్యాగరాజ కృతపూజ | రామశ్రీరామ | వరాళి | ఆది |
| త్యాగరాజ సులభుడ | వద్దనుండేదే | వరాళి | చాపు |
| త్యాగరాజ ధరసుగుణ | పాలయశ్రీరఘు | దేవగాంధారి | ఆది |
| త్యాగరాజ భాగ్యమా | రానిదిరాదు | మణిరంగు | ,, |
| త్యాగరాజార్చిత | మేరుసమాన | మాయామాళవగౌళ | ,, |
| త్యాగరాజాప్త | నెనరుంచినాను | మాళవి | ,, |
| త్యాగరాజాధి వినుత | శ్రీరామ జయ రామ | మధ్యమావతి | ఝంప |
| త్యాగరాజామరపూజిత | వినతాసుతవాహన | జయంతసేన | దేశాది |
| త్యాగరాజుని జిహ్వపై | ఊరకేగల్గునా | సహాన | చాపు |
| త్యాగరాజేశ | దాశరథేదయా | కోకిలప్రియ | దేశాది |
| త్యాగరాజనుతె | నన్నుగన్నతల్లి | సింధుకన్నడ | దేశాది |
| త్యాగరాజ రక్షకి | కన్నతల్లి నీవు | సావేరి | ,, |
| త్యాగరాజ మనోహరి | దారిని తెలుసుకొంటి | శుద్ధసావేరి | ,, |
| త్యాగరాజ భాగ్యదాయకి | మహితప్రవృద్ధ | కాంభోజి | చాపు |
| త్యాగరాజ మానససదనే | లలితేశ్రీప్రవృద్ధ | భైరవి | ఆది |
| త్యాగరాజ హృచ్చారి | అంబనిను నమ్మితి | ఆరభి | ఝంప |
| త్యాగరాజుని మిత్రు | అమ్మరావమ్మ | కల్యాణి | ,, |
| త్యాగరాజుని కులశరణ్యే | అమ్మధర్మసంవర్ధని | అఠాణా | ఆది |
| త్యాగరాజుని హృదయ సరోజవాసిని | వినాయకునివలెను | మధ్యమావతి | ,, |

| | | | |
|---|---|---|---|
| గురుగుహాగ్రజ | శ్రీమహాగణపతి | గౌళ | త్రిపుట |
| గురుగుహనుత | బాలగోపాల | భైరవి | ఆది |
| గురుగుహహిత | శ్రీవేణుగోపాల | కురంజి | మి.ఝంప |
| గురుగుహమిత్ర | మామవపట్టాభి | మణిరంగు | మి.ఏక |
| గురుగుహమహిత | శ్రీరాజగోపాల | సావేరి | చాపు |
| గురుగుహతాత | అక్షయలింగవిభో | శంకరాభరణం | ,, |
| గురుగుహతార | శ్రీగురుగుహతార | శుద్ధసావేరి | రూపకం |
| గురుగుహరూపం | మానసగురు | ఆనందభైరవి | ఆది |
| గురుగుహతోషిత | వాతాపిగణపతిం | హంసధ్వని | ,, |
| గురుగుహముదిత | రంగనాయకంభావయే | నాయకి | ,, |
| గురుగుహసోదర | శ్రీమూలాధార | శ్రీరాగము | ,, |
| గురుగుహమానసోల్లాస | హాటకేశ్వర | బిలహరి | త్రిశ్ర-ఏక |
| గురుగుహతోషం | శ్రీరామం రవికులాబ్ధి | నారాయణగౌళ | ఆది |
| గురుగుహపూజితం | నీలకంఠంభజేహం | కేదారగౌళ | రూపకం |
| గురుగుహవిహరంతం | రామచంద్రభావయామి | వసంత | ,, |
| గురుగుహరంజని | కంజదళాయతాక్షి | కమలామనోహరి | ఆది |
| గురుగుహసహాయే | కామాక్షీవరలక్ష్మి | బిలహరి | ,, |
| గురుగుహజననీ | ధర్మసంవర్ధని | మధ్యమావతి | రూపకం |
| గురుగుహోదయే | మాయేత్వంయాహి | తరంగిణి | ఆది |
| గురుగుహవిశ్వాసిని | మహాలక్ష్మికరుణా | మాధవమనోహరి | ,, |
| శ్యామకృష్ణపూజితే | ధయానిధే (వర్ణము) | బేగడ | ,, |
| శ్యామకృష్ణనుత | పాలించుకామాక్షీ | మధ్యమావతి | ,, |
| శ్యామకృష్ణజననీ | మాయమ్మనను | నాటకురంజి | ,, |
| శ్యామకృష్ణపరిపాలిని | సరియెవ్వరమ్మ | భైరవి | ఖం.ఝంప |
| శ్యామకృష్ణసహోదరి | నిన్నేనమ్మినాను | తోడి | త్రిపుట |
| శ్యామకృష్ణసద్వరదే | పాహిశ్రీగిరిరాజ | ఆనందభైరవి | రూపకం |
| శ్యామకృష్ణసోదరి | బిరానవరాలిచ్చి | కల్యాణి | త్రిశ్ర-ఏక |
| శ్యామకృష్ణహృదయాంబుజ | బ్రోవసమయము | పున్నాగవరాళి | ఆది |

ప్రహ్లాద భక్తవిజయము :- ఇది శ్రీ త్యాగరాజుచే రచింపబడిన 5 అంకముల గేయనాటకము. భక్తిరసప్రధానమైన ఈ ప్రబంధము పద్యములు, శ్లోకములు, కీర్తనలు, వచనములతో కూడి యుండును. కథాసందర్భము. శ్రీహరిభక్తుడైన

ప్రహ్లాదుని, తండ్రియగు హిరణ్యకశిపుడు నాగపాశబద్ధుని జేయించి సముద్రమున పడవేయించగా, సముద్రమహారాజు ఆ బాలునిరక్షించి గరుడునిచే నాగపాశబంధ విమోచనుని జేయించుట. నారదుడు ప్రహ్లాదునికి దర్శనమిచ్చి యుపదేశించుట. మహా భక్తుడైన ప్రహ్లాదునికి శ్రీ మహావిష్ణువు లక్ష్మీసమేతుడై వచ్చి దర్శనమొసగి అతని పూజలందుకొని ధన్యునిజేయుట. యిందుగల ముఖ్యచరిత్రాంశమగును.

నౌకాచరిత్రము :— ఇది శ్రీ త్యాగరాజునిచే రచింపబడిన గేయనాటకము. భక్తి శృంగార రసపూరితమైన నీ ప్రబంధము పద్యములు, కీర్తనలు, వచనములు, ద్విపదలతో కూడియుండును. కథాసందర్భము శ్రీ కృష్ణపరమాత్మ గోపికల నుద్ధరింప నౌకాక్రీడ సలుపుట. యౌవన మదాంధకారులైన గోపికలు ఆ మహానందములో తమ సౌందర్యమునకు గర్వించి బ్రహ్మేంద్రాదులను సయితము నిందించుచూ తమ మనో రథముదీర్ప కృష్ణుని వేడుట. శ్రీకృష్ణపరమాత్మ వారి గర్వమణంచదలచి సంకల్ప మాత్రమున భయంకరమైన నొక తుపాను కల్పించి నీటిలో మునిగిపోనున్న ఆ ఓడ రంధ్రమును మూయుటకై గోపికలను వివస్త్రలను జేయించుట. లజ్జతో వారు శరణాగతులుకాగా వారిని రక్షించి దరికి జేర్చుట-యిందుగల ముఖ్యచరిత్రాంశమగును.

## ధ్వనులు – వాటి లక్షణములు.

ధ్వనులు ( Sounds ) :—ఇవి ముఖ్యముగా రెండువిధములుగా నుండును. వాటినే (1) సంగీతధ్వనులనియు, (2) చప్పుడుధ్వనులనియు చెప్పబడును. సంగీత ధ్వనులనగా ! ఏదైన ఒక తంతివాద్యమునుగాని, లేక గాలివాద్యమునుగాని, గంటను గాని వాయించినపుడు యేర్పడునట్టి ధ్వనులగును. చప్పుడు ధ్వనులనగా ! ఒక పలక లేక రూళ్ళకర్ర, క్రిందపడినపుడుగాని, ఒక మేజాపై కొట్టినపుడుగాని యేర్పడునట్టి ధ్వనులగును. అయితే యీరెండు ధ్వనులలోను, సంగీతధ్వనులందు గలుగు కంపనములు చివరవరకు ఒకే రీతిగానుండును. చప్పుడు ధ్వనులందు గలుగు కంపనములు చివర వరకు ఒకేరీతిగానుండవు. ఇదే యీరెండు ధ్వనులందు గల ముఖ్యభేదమగును.

స్థాయి ( Pitch ) :—అనగా ! ఏదైనా ఒకస్వరముకంటె మరియొకస్వరము "తీవ్రత"ను పొందియున్నచో అట్టిస్వరము, మొదటిస్వరముకంటె యెక్కువ స్థాయిలో నున్నదని చెప్పబడును. ఉ॥ ఒకషడ్జస్వరమును తీసికొన్నచో దానికంటె రిషభస్వరముయొక్క ధ్వని యెక్కువగా నుండును. ఇటుల ధ్వని యెక్కువని చెప్పుటనే స్థాయి యెక్కువ అనిచెప్పబడును.

తీవ్రత (Intensity) అనగా! ఘనత్వము లేక గంభీరధ్వనియగును. ఎట్టులనగా! ఏదైన ఒక తంతివాద్యమును శ్రుతిచేసి గట్టిగా మీటినపుడు ధ్వనియెక్కువగును.

నెమ్మదిగా మీటినపుడు ధ్వని తక్కువగను వినపడును. ఇటుల వినపడు ధ్వనియొక్క తారతమ్యమునకే ధ్వని తీవ్రత (ఇన్ టెన్ సిటీ) యని చెప్పబడును. అయితే యీ ధ్వని తీవ్రత కొన్ని ప్రత్యేక అంశములపై ఆధారపడియుండుట కలదు. ఉ॥ ఏదైన ఒక దేవతావుత్సవములోగాని, లేక ఒక పెండ్లి వూరేగింపులోగాని నాగస్వరము వాయించునపుడు అది దగ్గఱగానున్నపుడును, ప్రశాంతమైన వాతావరణములో నున్నపుడును, ఆ ధ్వని గంభీరముగా వినిపించును. అదే నాగస్వరము దూరములోనున్నపుడును, వాతావరణము గందరగోళముగా నున్నప్పుడును అదేధ్వని తక్కువగా వినిపించును. గనుకనే ధ్వనియొక్క తీవ్రత ఆ యా వాతావరణపరిస్థితులపైనను, అది వుండు దూరముపైనను ఆధారపడియుండునని చెప్పుటకు కారణమైనదని గ్రహించదగును.

ధ్వనిభేదము (Timbre) :— అనగా ! ఒకేశ్రుతికి సరిచేయబడిన వివిధ సంగీత వాద్యములందుగల ధ్వనిభేదమును తెలుపు గుణమునకే ధ్వనిభేదము లేక స్వరభేదమని చెప్పబడును. దీనినే ఇంగ్లీషులో "టాంబర్" అని చెప్పుదురు. ఉ॥ వీణ, గోటు, వయొలిన్, సారంగి, సితార్, ఎస్రాజ్, దిల్ రుబా వంటి తంతివాద్యములనుగాని, ఫ్లూట్, క్లారియోనెట్, నాగస్వరము, షహనాయ్‌వంటి గాలివాద్యములనుగాని ఒకే శ్రుతిలోనుండునట్లు శ్రుతిచేయబడి విడివిడిగా వాయించినచో ఆ యా ధ్వనులందు గలభేదము మనకు స్పష్టంగానే తెలియును. అంతేగాక ఆ వాద్యములను మనము చూడకపోయినను ఆధ్వనులు యేయే వాద్యములకుచెందినవోకూడ మనము సులభంగానే చెప్పవచ్చును. ఈవిధంగా ఒకేశ్రుతిలోనుండునట్టి ధ్వనులలోగల భేదమునకే "ధ్వని భేదము" లేక "స్వరభేద" మని చెప్పబడును.

ప్రతిధ్వని (Echo) :— అనగా ! మనము ఏదైన ఒక పెద్దహాలులో గట్టిగా అఱచినచో వెంటనే అదేమాట మనకు వినిపించును. అట్టి ధ్వనినే "ప్రతిధ్వని" అని చెప్పబడును. ఉ॥ ఏదైన ఒక ప్రదేశములో పెద్దధ్వని యేర్పడినపుడు వెంటనే దాని అలలు అన్నివైపుల వ్యాప్తిచెందును. అట్లు వ్యాప్తిచెందు అలలకు యేదైన ఒక నున్నటిప్రదేశము అడ్డుతగిలినచో ఆ అలలు వెంటనే వెనుకకు మరలిపోవును. అటుల వెనుకకు మరలిపోవునపుడు గలుగు ధ్వనినే "ప్రతిధ్వని" లేక "మారుమ్రోత" యని చెప్పబడును. సాధారణముగా యిట్టి ప్రతిధ్వనులు పెద్దపెద్ద దేవాలయములందును, రాతితోకట్టబడిన పెద్ద భవనములందును, పర్వతప్రాంతములందును మనకు వినపడును. మరియు కొన్ని గానమందిరములందుకూడ యిట్టి ప్రతిధ్వనులు వినుపించుచుండును, గనుకనే అట్టి చోటులందు జరుగు సంగీతసభలు యీప్రతిధ్వనిచే రక్తికట్టక గాయకునికి నిరుత్సాహము, సభికులకు విసుగు జనించును. మరియు నిట్టి గానమంది రములలో కచ్చేరీలు చేయుటచే ప్రసిద్ధగాయకులకు సయితము క్రమక్రమంగా పేరు

ప్రతిష్టలు అంతరించుటకు కారణమగు చుండును. గనుక సంగీత, నృత్య, నాటక ప్రదర్శనముల కొఱకు నిర్మింపబడు మందిరములను యీదిగువదెలిపిన వివిధ పద్ధతులలో నిర్మించుట యెంతయు నుపయుక్తముగా నుండును.

i సంగీత, నృత్య, నాటక ప్రదర్శనములు జరుగునపుడు మందిరములోని అన్ని భాగములకును ఒకేవిధముగా ధ్వనివినపడునట్లు చేయుట.

ii ధ్వనిని మందిరము యొక్క బయటికి యేమాత్రము పోకుండునట్లుగా గోడలన్నిటికి తగినన్ని శబ్దపోషకముల నమర్చుట.

iii మందిరమును యేర్పఱచునపుడు అది దీర్ఘచతురస్రముగా నుండునట్లును, పైకప్పు యెక్కువఎత్తు లేకుండునట్లును నిర్మించుట.

iv గోడలకు లోపలిభాగమున మార్బుల్ పేపరు (ఊలను,ఎయిర్ టెంపరు ప్లాస్టర్‌తో అంటించినది.) తో తయారుచేయబడిన అట్టల నమర్చుట,వంటి ఆధునికమైన యేర్పాటులతో గానమందిరముల నిర్మించుట యెంతయు నుపయుక్తముగా నుండును. ఇట్లు కళామందిరములను మొదటనే ఆధునిక పద్ధతులతో నిర్మించుటను ఇంగ్లీషులో ప్రివెంటివ్ అకౌస్టిక్స్ (Preventive acoustics) అని చెప్పబడును. ఇటుల మొదటనే సరియైన పద్ధతిలో నిర్మించక తరువాత దానిని మార్పులు చేయుటను క్యూరేటివ్ అకౌస్టిక్స్ (Curative acoustics, అని చెప్పబడును.

మేళకట్టు :—పైనదెలిపినటుల ఆధునికపద్ధతులలో నిర్మించిన మందిరములందు జరుపు సంగీత, నృత్య, నాటక ప్రదర్శనములు సులభముగా రక్తికట్టుచుండును. ఇటుల రక్తికట్టుటనే " మేళకట్టు " అని చెప్పబడును.

నాదగుణము లేక స్వయంభూధ్వని (Resonance) :— ఏదైన ఒకధ్వని యెక్కువగాగాని,తక్కువగాగాని వినపడుటకు దానికిగల కొన్ని ప్రత్యేకపరిస్థితులే కారణమగుచుండును. ఉ॥ ఒక తీగెను దాని రెండువైపుకొనలను రెండు చెక్కలకు బిగించి మీటినపుడు దానిధ్వని తక్కువగా వినపడును. అదేతీగెయొక్క రెండుకొనలను మూత తెరువబడిన రెండు ఖాళీపెట్టెలకు బిగించి మీటినపుడు ఆధ్వని మొదట వినపడిన ధ్వనికంటె గంభీరముగా వినపడును. ఇట్లు వినపడుటకు కారణమేమనగా! మొదట మీటబడిన తంతి,గాలి నిలువయుండుటకు వీలులేనట్టి రెండు విడి చెక్కలకు బిగించి యుండుటచే దానిని మీటినపుడు ఆధ్వనిని యెక్కువ చేయునట్టిగాలి యచట లేనందున

ఆధ్వని తక్కువగావినపడును. అదేతంతిని మూతలు తెరువబడిన రెండు పెట్టెలకు బిగించి యట్టి దానిని మీటినపుడు ఆ తంతి కదలి, ఆ కదలికచే పెట్టెలు కంపించి, ఆ కంపనముల వలన పెట్టెలలోని గాలి కంపించి, తంతియొక్క ధ్వనిని ద్విగుణీకృతము చేయబడినందున ఆధ్వని గంభీరముగా వినపడుటకు కారణమగును. ఈ సూత్రమునకే "నాదగుణము" అని చెప్పబడును. మన సంగీతవాద్యములగు వీణ, గోటు, వంటి వాద్యములకు కుండను, దండిని, గుండ్రని సొరకాయబుఱ్ఱను, తంబురకు కుండను, వయొలిన్‌కు బ్రిడ్జికి యిరుప్రక్కల రెండు S వంటి రంధ్రములనువుంచుటకు యిదే కారణమగును.

సహాయ కంపనములు (Sympathetic Vibrations) :— అనగా! వీణ, గోటు,సారంగి వంటి వాద్యములలో ప్రధానతంత్రులక్రింద వేయబడు సహాయతంత్రులలో పలుకు సూక్ష్మధ్వనులను "సహాయకంపనము"లని చెప్పబడును. ఉ॥ వీణలోని సారణి లేక మధ్య షడ్జమును మీటినచో వెంటనే దాని క్రిందనుండు సహాయతంతి కంపించి మొదటి షడ్జస్వరము ధ్వనివంటిదే యింకొకధ్వని సూక్ష్మముగావినిపించును. ఇదేవిధముగా మిగత స్వరములను పలికించునపుడు కూడా అదేశ్రుతులలోగల యీ సహాయతంత్రులు కంపించి అట్టివే యింకొకధ్వనులు వినుపించును. ఇటుల వినిపించు సూక్ష్మధ్వనులనే "సహాయకంపనము" లని చెప్పబడును. వీటివలన అసలువాద్యమునందు ధ్వనిమాధుర్యము పెంపొంది వినుటకెంతయు రంజకముగాను, ఆకర్షణీయముగాను వుండును.

## రికార్డింగు.

రికార్డింగు (Recording):—అనగా! ప్రసిద్ధగాయకులయొక్కగాని, వాదకులయొక్కగాని సంగీతమును యెన్నిసార్లు అయినను వినుటకు వీలుగా మైనపు పళ్లెములను తయారుచేయుటను "రికార్డింగు" అని చెప్పబడును. ఇట్టి రికార్డులను తయారుచేయునపుడు మొదట ఏమాత్రము శబ్దము వెలుపలకు పోవీలులేని ఒకగదిలో మైక్రోఫోన్ యంత్రము వుంచబడును. దానిముందు గాయకుడుగాని, వాదకుడుగాని కూర్చొని సంగీతమును ప్రదర్శించునపుడు ఆ సంగీతధ్వని ఆ గదిలోని గాలిని తరంగములవలె కదల్చును. ఆ తరంగములు మైక్రోఫోన్‌లోని పలుచని యంత్రభాగమును కదలించుటచే ఆచలనము విద్యుచ్ఛక్తిద్వారా యింకొకగదిలో నమర్చబడిన వేరొకయంత్రముయొక్క చివరకు వెళ్లును. అచ్చట ఒక మైనపు పళ్లెమునకు సూదివంటి పరికరము తగులునట్లు అమర్చబడి యుండును. యీ విద్యుచ్ఛక్తి ప్రసారమువలన ఆ మైనపు పళ్లెరము చలించి తిరుగునపుడు సూదియొక్కరాపిడిచే గలుగు ధ్వనియును మొదట

మైక్రోఫోనుముందు పాడిన సంగీతము వినిపించును. ఈ మైనపు పళ్లెమును సరిగా తయారుచేయబడినపిదప దీనిని "నెగెటివ్" గా పెట్టుకొని మరికొన్ని రికార్డులను కూడ తయారు చేయుదురు.

గ్రామొఫోన్ (Gramophone):—మనకు రేడియోయంత్రములు రాకముందు పైన దెలిపిన రికార్డులను యీ గ్రామొఫోన్ యంత్రసహాయమువల్లనే మనము యితరుల సంగీతాన్ని వినగలుగుచుండెడివారము. కాని వర్తమానకాలములో రేడియో యంత్రములు విరివిగా ప్రచారములోనికి వచ్చుటచే గ్రామొఫోన్ రికార్డులయొక్క వుపయోగము చాలావఱకు తగ్గిపోవటం జరిగినది. కాని నేటికిని యివి రేడియోలందును, సినిమాలందును, కాఫీహోటళ్లయందును, రేడియో ప్రసారములేని కాలములో వాడుట కుపయోగపడుచునేయున్నవి. ముఖ్యంగా, యీ గ్రామొఫోను, రికార్డులు, సుప్రసిద్ధులైన ప్రాచీన, నవీన, సంగీత విద్వాంసులయొక్క సంప్రదాయసిద్ధమైన రచనలను కంఠస్థముచేయుటకును, వారి మనోధర్మ సంగీత విధానమును గ్రహించుటకును విద్యార్థులకు మాత్రము కొంతవరకు నుపయోగపడుచున్నవని చెప్పవచ్చును.

## ఆకాశవాణి.

బ్రాడ్ కాస్టింగ్ (Broadcasting) :—అనగా! తీగెలు అవసరములేకనే ఒకచోటినుండి పలుచోట్లకు రేడియోయంత్రముద్వారా వార్తలు, సంగీతములు, నాటకములు, కథలు, ఉపన్యాసములు మొదలగు వివిధ కార్యక్రమములను ప్రసారము చేయబడు విధానమును "బ్రాడ్ కాస్టింగ్" అని చెప్పబడును. దీనినే తీగెలు లేని "టెలిఫోన్" విధానమని కూడ చెప్పవచ్చును. దీనిలో ధ్వని తరంగములు విద్యుత్ (రేడియో) తరంగముల రూపమున, ప్రపంచమంతటను వ్యాపించియుండు ఈథరు (Ether) అనెడి యానముగుండా వెలుతురుతో సమానమైన వేగము (1 సెకండుకు 1,86,000 మైళ్లు) తో ప్రయాణముచేయును. ఇవి స్వభావమునందు ధ్వనితరంగములవంటివేయైనను వాటికంటె దీర్ఘమైనవగును. ఈథరు అనగా! ప్రపంచమంతటను వ్యాప్తిచెంది, ప్రతిపదార్థమునందును ప్రవేశింప శక్తిగలిగి, బరువుగాని, స్వరూపముగాని లేనట్టి యానము ఈథరు అని చెప్పబడును. విద్యుత్తరంగములు యీ యానమునందు, నీటి ఉపరిభాగమున పోవు జల తరంగములవలె వ్యాప్తిచెందును. ఎటులనగా? ఉ॥ ఒకబాలుడు ఒకచెఱువుయొక్క మధ్యభాగమునకు రాళ్ళి నీటిలో త్రోలుచుండిన ఒక కఱ్ఱముక్కనస్తు క్రిందికి, పైకి నొక్కుచున్నచో,

వెంటనే అనీటిలో ఒకవిధమైన అలజడి జనించును. అప్పుడు ఆకట్టముక్క వద్దనుండి నీటితరంగములు వలయాకారములో ఒకదానివెనుక నొకటి అతివేగముగా తీరమువైపు నకుపోవుచుండును. ఇటుల తరంగములు అతివేగముగా పోవునపుడు వాటియొక్క కంపనపురేటు హెచ్చుగాను, తరంగ దైర్ఘ్యము (Wave length) తక్కువగాను వుండును. తరంగములు ఒకదానివెనుకనొకటి నెమ్మదిగాపోవునపుడు వాటికంపనపురేటు తక్కువగాను, తరంగ దైర్ఘ్యము హెచ్చుగాను వుండును. తరంగ దైర్ఘ్యమనగా! జలోపరి భాగమున పోవు జలతరంగములయొక్క ఉన్నతమైన రెండువరుసబిందువుల మధ్యగలదూరమగును. అనగా క్రింది పటములోని C — C మధ్యగలదూరమునే తరంగ దైర్ఘ్యమని చెప్పబడును.




పటములో చూపిన C.లు, ఉచ్చబిందువులనియు, T.లు నీచబిందువులనియు తెలియదగును. సాధారణముగా రేడియో ప్రసారము (బ్రాడ్ కాస్టు) చేయుటలో మూడు విధములైన తరంగదైర్ఘ్యములను వుపయోగించుచుందురు. వాటిలో రేడియో స్టేషనులందు 10- 120 మీటర్ల దైర్ఘ్యముగల హ్రస్వతరంగములను, 200 - 500 మీటర్ల దైర్ఘ్యముగల మధ్యమతరంగములను వుపయోగించుదురు. 500 మీటర్ల దైర్ఘ్యము నకుపైగల దీర్ఘతరంగములనుతక్కువదూరమునకు ప్రసారముచేయు లోకల్ బ్రాడ్ కాస్టులందువుపయోగించుదురు. హ్రస్వతరంగములకు చాలాదూరము చొచ్చుకొనిపోవు శక్తియుండును. గనుకనే దూరపు ప్రసారములను హ్రస్వతరంగములపైన పంపుచుందురు. సాధారణముగా మైక్రోఫోను యెదుట సంగీతమును పాడి లేక వాయించునపుడు అది అచ్చట హెచ్చు, తగ్గులుగల విద్యుత్ప్రవాహముగమారును. ఆ హెచ్చు తగ్గులుగల ప్రవాహముయొక్క బలము, సంగీతమునందలి కంపనపురేటుకు యనుగుణ్యముగా నుండును. ఈ హెచ్చుతగ్గు ప్రవాహములు, విస్తారకము (Amplifier) అనెడి సాధనముచే వృద్ధిచేయబడి ప్రేషకమునందు జనించు విద్యుత్తరంగములను క్రమతి (Modulate) చేయును. అట్లు క్రమతిచేయబడిన తరంగముల కంపనపురేటు అచట పాడునట్టి సంగీతముయొక్క కంపనపురేటుకు సమానముగానుండును. ఈ విధముగా క్రమతిచేయబడిన తరంగములు ప్రేషణాలయమునందలి ఆకాశతంతి ( Aerial ) చే అన్నివైపులకు వెలుతురుతో సమానమైన వేగముతో ప్రసారముచేయబడును. గ్రాహకాలయమునందలి ఆకాశతంతికి యీ ప్రసరించు రేడియోతరంగములు తగిలినపుడు దానిలో, విద్యుత్ప్రకంపనములను కలుగజేయును. అనగా ఆ ఆకాశతంతిలోని

వోల్టేజిలో హెచ్చుతగ్గులు కలుగును. ఈ ప్రకంపనములు చాల హెచ్చు కంపనపు రేటు (అనగా సెకండుకు షుమారు ఒక మిలియను) గలవిగానుండును. ఇట్టి కంపన పరిమితిగల ప్రకంపనములకు, టెలిఫోను గ్రాహకము పనిచేయదు. మరియు అందులోని "డయాఫ్రమ్" కూడా అంత హెచ్చురేటులో కంపింపజాలదు. గనుకనే ఆ ప్రకంపనములను మొదట శ్రుతిచేసి అనగా ఒకేదిక్కునకుపోవు పరివర్తనముల (Alternations) ను మాత్రమే మిగిల్చి, వ్యతిరేకదిక్కులలో పోవువానిని ఖండించి, వాటిని గ్రాహకములోనికి పంపుదురు. ఈ బ్రాడ్‌కాస్టు విధానము క్రొత్తగా కని పెట్టినరోజులలో స్ఫటికము (Crystal) సహాయమున గ్రాహకమునందీ తరంగములు శ్రుతిచేయబడుచుండెడివి. కాని ఇప్పుడా స్ఫటికమునకు బదులు వాల్వు (Valve) అను సాధనము నుపయోగింపబడుచున్నది. వాల్వుయొక్క లోపలిభాగమును శూన్య ప్రదేశము (Vacum) గా చేయబడి విద్యుత్సహాయముతో వేడిచేయుబడిన కేసరము (Filament) నొకటి యచ్చట సమర్చబడియుండును. ఇది చూచుటకు సాధారణమైన "ఎలక్ట్రిక్" దీపమువలెనుండును. కాని అంతర్నిర్మాణమునందు మాత్రము వ్యత్యాసముగానే యుండును. ఈ వాల్వు ఒకే దిక్కునకుపోవు పరివర్తనములను మాత్రము తనలోనుండి ప్రవహింపజేసి, వ్యతిరేకదిక్కులందు ప్రవహించు తరంగ భాగములను నిరోధించును. అందుచేదీనిని "వాల్వు" లేక "కవాటము" అని చెప్పబడును. ప్రేషకములోని మైక్రోఫోనుయెదుట నుత్పత్తియగు ధ్వనితరంగముల కనురూపముగల ప్రకంపనములను యీ వాల్వు గ్రాహకములోనికి పంపును. అందుచే గ్రాహకమునందు మొదటిధ్వనివంటి ధ్వని వుత్పత్తియగుచుండును. వాల్వునందు యిట్లు శ్రుతిచేయబడి, టెలిఫోనులోనికి పోవునట్టి తరంగములు సాధారణముగా ఒకటి లేక రెండు వాల్వులచే ఉపచయము (Magnified) చేయబడి ధ్వనిప్రవర్ధని (Loudspeaker) లోనికి పంపబడును. ఈ ధ్వని ప్రవర్ధని, నిర్మాణమునందొక పెద్ద టెలిఫోనువలె నుండును.

గ్రాహకమును శ్రుతిచేయుట :— ఒక్కొక్క ప్రేషణాలయమునుండి వేరు వేరు తరంగదైర్ఘ్యములలో ప్రసారములు జరుగుచుండును. తంత్రీరహితగ్రాహకము నందు మనకు అవసరమగు తరంగదైర్ఘ్యములను గ్రహించు సాధనమువుండును. ఈ సాధనమునందు ఒక సర్పిలము (Coil) ను, మార్పుచెందెడి గుణము (Variable) గల ఒక విద్యుత్సంక్షేపకము (condenser) ను, వుండును. ఈ కండెన్సరుయొక్క నాబ్ (knob) ను, కుడివైపునకుగాని, ఎడమవైపునకుగాని త్రిప్పినచో దానిలో కదలెడు రేకుల (నాలుల) యొక్క స్థానములుమారి వేరు వేరు తరంగదైర్ఘ్యములకు మేళవించబడును.

వాల్వు (valve):— సాధారణముగా మనయిండ్లలోనుండు రేడియో సెట్టులు చాలావరకు తంత్రీ రహిత గ్రాహకములేయగును. వీటిలో "వాల్వు" అతిముఖ్యమైన భాగముగానుండును. లోపల శూన్యప్రదేశమైన యీవాల్వు గొట్టమువల్లనే, నవీన రేడియోలన్నియును, పనిచేయగలుగుచున్నవి. విద్యుత్ప్రకంపనములను ఉత్పత్తి (generate) చేయుటయు, శుద్ధి(Rectify,)చేయుటయు, విస్తరింప(amplify) చేయుటయు, యీ వాల్వు యొక్క సహజ లక్షణములగును. మరియు యీవాల్వు విద్యుత్ప్రవాహమందుగలుగు అతిసూక్ష్మమైన మార్పులను కూడా ఉపచయము (magnify) చేయగలదు. కనుకనే రేడియోలందేగాక రేడియో గ్రామఫోనులయందును, టాకీలలోని ధ్వనిజనకసాధనము (talkie sound system)ల యందుగల విస్తారకము (ampli fier) లందును, యిదిముఖ్యభాగముగా నుండును. ఈవిధముగా వాల్వుచేయు పనులు అత్యద్భుతములుగా నుండుటవల్లనే దీనిని రేడియో ప్రపంచమునందు అల్లావుద్దీన్ యొక్క "ఇంద్రజాలదీపము (Aladdin wonderful lamp) గా పరిగణించుటకు కారణమైనదని గ్రహింపదగును.

## సంగీతవాద్యములు – వాటి విభజన.

సంగీతవాద్యములు:—అనగా సంగీతమును ప్రదర్శించునపుడు వుపయోగించు వివిధ సంగీత పరికరములను లేక వాద్యములను, సంగీతవాద్యములని చెప్పబడును. అట్టివాద్యములను ముఖ్యముగా 4 విధములుగావిభజించిరి. అవి (1) తంత్రీసాధని (2) రంధ్రసాధని (3) చర్మసాధని (4) లోహసాధని యగును. అయితే వీటిలో మొదటి రెండురకములును ప్రత్యేకముగా సంగీతమునే ప్రదర్శింపగలవి యగుటచే "సంగీతవాద్యములు"గను, మిగత రెండురకములును కేవలము లయకు సంబంధించినవి యగుటచే "లయవాద్యములు"గను పరిగణించుటకు కారణమైనది.

(i) తంత్రీసాధని:—ఇది వివిధ తంతివాద్యములకు సంబంధించి చెప్పబడునట్టి పేరగును. ఇవి మూడు రకములుగా నుండును. అవి (1) కమాను లేక విల్లు (Bow) తో తంత్రులమీద రాపిడిచేయుటవలన ధ్వని జనించువాద్యములగును. ఉ॥ వయొలిన్ (ఫిడేలు) ii సారంగి iii దిల్‌రుబా iv బాలసరస్వతి లేక తావూజ్ (మయూరి) v ఎస్రాజ్ మొదలగునవి. (2) తంత్రులను కుడిచేతి వ్రేళ్ళతో మీటుటవలన ధ్వని జనించు వాద్యములగును. ఉ॥ i వీణ ii రుద్రవీణ iii గోటు iv సితార్ v స్వరబత్ vi సరోడ్ (Sarode) vii గిటార్ (Guitar) viii మాండోలిన్

ix హార్ప్ మొదలగునవి. (3) తంత్రులను ఒకచిన్న పరికరముతోగాని లేక రెండు సన్నని గట్టి పుల్లలతోగాని కొట్టుటవలన ధ్వని జనించు వాద్యములగును. ఉ॥ i పియానోఫోర్టు ii స్వరమండల్ (శత తంత్రీవీణ) iii గెత్తు మొదలగు వాద్యము లగును. మరియు పైన తెలిపిన తంత్రీసాధనికే చెందిన తంబుర, సితార్ వంటి శ్రుతి. వాద్యములు మీటుటవలనను, గెత్తు, జలతరంగిణి వంటి లయవాద్యములు కొట్టుటవల నను ధ్వని జనించునని తెలియదగును.

కమాను లేక విల్లు సహాయమునగాని, వ్రేళ్ళతో మీటుటవలనగాని వాయింపబడు తంత్రీవాద్యములు మరియొకవిధముగా మూడు రకములగును. అవి (1) ఎడమ చేతి వ్రేళ్ళు ఆనుకొనుటకు తగిన చదునయిన నల్లటిబల్ల (ఫింగర్ బోర్డు) గలిగి దాని పైనుండు తంత్రులను వ్రేళ్ళతో నదిమి వాయింపబడు వాద్యములగును. ఉ॥ i వయొలిన్ ( Violin ) ii సరోడ్ ( Sarode ) మొదలగునవి. (2) ఎడమచేతివ్రేళ్ళు ఆనుకొనేందుకు మెట్లుగలిగి ఆ మెట్లపైనుండు తంత్రులను వ్రేళ్ళతో నదిమి లాగుచూ వాయింపబడు వాద్యములగును. ఉ॥ i వీణ ii సితార్ iii తావూజ్ మొదలగునవి. (3) చదునయిన ఫింగర్‌బోర్డుగాని, మెట్లుగాని లేక, ఒకచిన్న పిడి వంటి గుండ్రని కొయ్యముక్కతో తంత్రులను అదిమి లాగుచూ వాయింపబడు వాద్యములగును. ఉ॥ గోటు మొదలగు వాద్యములు యీ రకమునకు చెందును. ఈవిధముగా శాస్త్రీయమైన కర్ణాటక, హిందూస్థానీ సంగీతములం దుపయోగించు పైన దెలిపిన తంత్రివాద్యములేగాక జానపద సంగీతము ( Flock Music ) నం దుప యోగించు మరికొన్ని తంత్రివాద్యములుగూడ మన భారతదేశమునందు గలవు. అట్టి వాటిలో ముఖ్యముగా i చిక్కవీణ (మైసూరు) ii చోంకా (మహారాష్ట్రము) iii రాజసెంగిబాణా (మధ్యప్రదేశ్) iv ఖమక్ (బెంగాల్) v దుంధునావా (ఉత్తరప్రదేశ్) vi ధడ్‌సారంగి (పంజాబ్) వంటి తంత్రి వాద్యములు పేర్కొనదగిన వగును.

(2) రంధ్రసాధని:— ఇది వివిధగాలివాద్యములకు సంబంధించునట్టి పేరగును. ఇవి ముఖ్యముగా మూడు రకములుగా విభజింపబడెను. అవి i ఒక యంత్రసహాయమున గాలి నుత్పత్తిచేయు కీ బోర్డుగల పియానోవంటి వాద్యములును, ii ఒకరకమైన గాలితిత్తుల సహాయమున ధ్వని జనించు హార్మోనియమువంటి వాద్యములును, iii వ్రేళ్ళు ఆనుకొనేందుకు రంధ్రములుండి వాదకుడు గాలిని ఊదుటవలన ధ్వని జనించు వేణువు ( Flute ) వంటి వాద్యములును యీ రకమునకు చెందినవై యీ

న్నవి. అయితే పై మూడవరకమును తిరిగి రెండు విధములుగా విభజించుట జరిగెను అవి i ధ్వనినిచ్చు పీకెవంటి ఆకులు లేక నాలుకలతోగాని, లేక తదితర సాధనములతో గాని గాలిని ఊదుచూ ధ్వని జనింపజేయు దక్షిణభారత దేశపు నాగస్వరము, ముఖవీణ షహనాయ్ వంటి వాద్యములును, ii వ్రేళ్ళు ఆనుకొనేందుకు రంధ్రములుండి నోటితో వక్త్రరంధ్రముగుండా గాలినిపూదుటవలన ధ్వనిజనించుపిల్లనగ్రోవి(Flute) వంటి వాద్యములును యీ రకమునను చెందినవగును. శాస్త్రీయ సంగీతమునందుప యోగించు పైన తెలిపిన వివిధ గాలివాద్యములేగాక గ్రామ్య సంగీతమునం దుపయో గించు మరికొన్ని గాలివాద్యములుగూడ మన భారత దేశమునందు గలవు. అట్టివాటిలో ముఖ్యముగా 1 బన్‌సూరి, 2 అల్‌ఘోజా, 3 అయర్‌కుపల్ (తమిళనాడు) 4 బూంగా (మధ్యప్రదేశ్) 5 మగుడి(ఆంధ్రప్రదేశ్‌లోని పాములవాని నాగస్వరము) 6 కొమరాతి (అస్సామ్) 7 నాగసెరమ్ (హైదరాబాదు) 8 నఫీరి (ఉత్తరప్రదేశ్) వంటి కొన్ని గాలి వాద్యములు గలవు. అంతేగాక వ్రేళ్ళు ఆనుకొనే రంధ్రములు లేకను, వాదకుడు పూదు నట్టి గాలి నపేక్షించకను ధ్వని జనింపజేయు వాద్యములుగూడ మరికొన్ని యీ రక మునకు చెందినవై యుండుట గమనించదగును.

చర్మసాధని:–ఇది చర్మ సంబంధమైన వివిధ వాద్యములకు చెందునట్టి పేరగును. వీటిలో అనేక రకములు గలవు. కాని వాటిలో చాలావఱకు కాలము (లయ) ను సూచించుట కేర్పడిన వాద్యములనే చెప్పవచ్చును. అవి (1) నగారా, భేరీవంటి వాద్యములు మత సంబంధమగు ఉత్సవములందును, యుద్ధ సమయములందును వాయింపబడును. (2) కేవలము లయను సూచించుటేగాక గాయకుని పాటనుగూడ ననుకరించుచూ వాయింపబడునట్టి మృదంగము, డోలు, (తవిల్) తబ్లా మరియు బాయా, డోలక్, కంజీరావంటి శాస్త్రీయసంగీతమునం దుపయోగించు ముఖ్యవాద్యములే గాక ఢోలక్ (పంజాబ్) ఢోలకీ, ఖోల్, పఖావాజ్ (ఉ. భా) మద్దలమ్ (మలబారు) శుద్ధమద్దలమ్, డమరు, ఉడుక్కు, ఉడాల్, డవండై, డఫ్, తాషా, నగారా, (ఆంధ్ర) చెండా (మలబారు) డఫ్‌రీ (పంజాబ్) జగాటె (మైసూరు) వీరవండాయ్ పాంబాయి, తిమిలా, ఎడక్కా (మలబారు) తంబట్టమ్, కుండలమ్ వంటి ఆయాప్రదేశ ములందుగల గ్రామ్యసంగీతమునకు వుపయోగించు వాద్యములుకూడ మన భారతదేశము నం దనేకము గలవని గ్రహింప దగును.

సంఘట్టన వాద్యములు:—చేతులతో తట్టుటవలన ధ్వని జనించు వివిధ చర్మ వాద్యములను సంఘట్టన వాద్యములని చెప్పబడును. ఉ॥ మృదంగము, డోలు(తవిల్) కంజీరా, తబ్లా మరియు బాయా, డోలక్, ఘటం, ఖోల్ మొదలగునవి యీరకము నకు చెందిన వాద్యములగును.

**అవనద్ధకుతపము:-** ఇది చర్మసంబంధమైన సంగీతవాద్యములయొక్క సమ్మేళనమునకు గల పేరగును. ఉ॥ మృదంగము, డోలు, డోలక్, కంజీరా, తబలా, ఖోల్ వంటి వాద్యములయొక్క సమ్మేళనము యిందుకు చక్కని వుదాహరణమగును. నేడు ఆల్ ఇండియా రేడియో వివిధకేంద్రములందు అప్పుడప్పుడు ప్రదర్శింపబడు లయభాగము, లేక తాళ వాద్య కచ్చేరీలు యీ రకమునకు చెందినవగును.

**లోహసాధని:-** ఇది లోహసంబంధమైన వివిధ వాద్యములకు చెందునట్టి పేరగును. ముఖ్యముగా నీ రకమునకు చెందిన వాద్యములు కేవలము లయను సూచించుటకేర్పడినవగును. ఉ॥ (1) జాల్రా. దీనిని హరికథాకాలక్షేపములందును, భజనకాలక్షేపములందును విధిగా నుపయోగించుచుందురు. (2) బ్రహ్మతాళము. ఇది దేవతా వుత్సవములందును, మతసంబంధమైన వుత్సవములందును వుపయోగించడంకద్దు. మరియు ఘోర్ తాళ్, చింటా, మంజీరా, కర్ తాళ్, చిప్లా, ఘుంగ్రూ, చెంగ్లా వంటి పలురకముల లోహవాద్యములను కూడ జానపదసంగీతమందు సాధారణంగా వుపయోగింపబడు చుండును. ఈ లోహసాధనికే చెందిన 'జలతరంగిణి' అను వాద్యము శాస్త్రీయసంగీతము ప్రదర్శించుటకును, యీ రకమునకు చెందిన "గోంగ్" అను వాద్యము సంగీత ప్రదర్శనములందు లయవాద్యముగా ప్రదర్శించుటకును వుపయోగింపబడును. ఈ లోహసాధనికే చెందిన "స్వరదము" లేక ట్యూనింగ్ ఫోర్క్ (Tuning Fork) అను పరికరము గాయకులు తంబురను గాని, తదితర తంతి, చర్మ, లోహవాద్యములను గాని శ్రుతిచేయునపుడు హార్మోనియము లేకనే తమకు కావలసిన శ్రుతులను తెలిసికొనుటకు దీనిని వుపయోగింతురు. ఇది శ్రుతిగాయకునివద్దను, వాదకునివద్దను కూడా వుండుట యెంతైనా అవసరమగును.

పైన తెలుపబడిన 4 రకముల వాద్యములను వాటివుపయోగమునుబట్టి మరియొక పద్ధతిలో యీక్రింది 3 తరగతులుగా విభజించుటగమనించునది. అవి i శ్రుతివాద్యములు. ii సంగీతవాద్యములు. iii లయవాద్యములగును. వాటివివరములేమనగా!

i శ్రుతివాద్యములు:— అనగా! కేవలము శ్రుతికి మాత్రమే వుపయోగింపబడు వాద్యములను "శ్రుతివాద్యము" లని చెప్పబడును. (1) ఉ॥ "తంబుర, ఏక్తార్ వంటి వాద్యములగును. ఇవి తంతివాద్యరకమునకు చెందును. (2) హార్మోనియము, ఒత్తు, తుంతిణె, వంటి వాద్యములగును. ఇవి గాలివాద్యరకమునకు చెందును. (3) స్వరదము. (Tuning Fork) ఇది శ్రుతివాద్యము కాకపోయినను శ్రుతులను తెలుసుకొనుట కుపయోగింపబడు నొకరకమైన లోహపరికరమగును. వీటిలో తంబుర, హార్మోనియము, ఒత్తు,

వంటివాద్యములు కర్ణాటక, హిందుస్థానీ సంగీతప్రదర్శనములందు శ్రుతికిముఖ్యంగా వుపయోగింపబడును.

ii సంగీతవాద్యములు:— అనగా! కేవలము సంగీతమును శాస్త్రయుక్తముగా ప్రదర్శించగల వాద్యములను "సంగీతవాద్యము" లని చెప్పబడును. ఉ॥ వీణ, గోటు, వయొలిన్, వంటి తంతివాద్యములును, వేణువు, నాగస్వరము, క్లారియోనెట్ వంటి గాలి వాద్యములును, జలతరంగిణివంటి లోహవాద్యమును కర్ణాటకసంగీతము ప్రదర్శించుటకు ముఖ్యంగా నుపయోగింపబడును. సారంగి, సితార్, సరోడ్, దిల్‌రుబా, ఎస్రాజ్, మయూరి, స్వరమండల్, వంటి తంతివాద్యములును, సహనాయ్, ముఖవీణ, వంటి గాలివాద్యములును, హిందూస్థానీ సంగీతమును ప్రదర్శించుటకు ముఖ్యంగా నుపయోగింపబడును.

iii లయవాద్యములు:— అనగా! కేవలము లయను సూచించునట్టి వాద్యములను "లయవాద్యములు" లేక "తాళవాద్యము" లని చెప్పబడును. ఉ॥ మృదంగము, కంజీరా, ఢోలు, ఢోలక్ వంటి చర్మవాద్యములును, గొట్టువంటి తంతివాద్యమును, మోర్సింగ్ వంటి లోహవాద్యమును, ఘటంవంటి మృణ్మయవాద్యమును కర్ణాటకసంగీతమునందు ముఖ్యంగా నుపయోగించుదురు. తబలా అండ్ బాయా, డోలక్, వంటి చర్మవాద్యములను హిందూస్థానీ సంగీతమునందును, ఖోల్ వంటి చర్మవాద్యమును మహారాష్ట్రీ భజనలందును, జాల్‌రా, చిప్లావంటి లోహవాద్యములను హరికథాకాలక్షేపములందును, భజన కాలక్షేపములందును వుపయోగించుదురు. సాధారణంగా పైమూడురకముల వాద్యములనుకూడ సంగీతవాద్యములుగానే చెప్పటంకలదు.

## సంగీత వాద్యముల పుట్టుక.

లోగడ తెలిపిన తంతి, గాలి, చర్మ, లోహవాద్యములలో తంతి, గాలిసంబంధమైన వాద్యములకంటె చర్మ, లోహ, సంబంధమైన వాద్యములు మిక్కిలి పురాతనకాలమునకుచెందినవిగను, తంతి, గాలివాద్యములు మానవచరిత్రతరువాతఘట్టములలో అమలుకు వచ్చినవిగాను తెలియుచున్నది. అయితే మానవుడు చర్మసంబంధమైన వాద్యములలో ఉన్నతమైన వాద్యములను కనిపెట్టకపూర్వమే అనేకరకములగు గాలివాద్యములను, గాలివాద్యములలో ఉన్నతమైనవాద్యమును కనిపెట్టకపూర్వమే అనేకరకములగు తంతి వాద్యములను కనిపెట్టినట్లు మాత్రము మనకు రూఢిగా తెలియుచున్నది. ఈ విధముగా అతి ప్రాచీన కాలమునుండి క్రమక్రమంగా సృష్టింపబడిన యీనానావిధరకముల వాద్య

ములను వాటినిర్మాణములోగల భేదమునుబట్టి రెండుటుల విభజించినది యీ క్రింద దెలుపుట గమనించునది.

(1) చర్మసంబంధమైన వాద్యములు:—ఇందు తంబట్టమ్, కంజీరావంటి అనాచ్ఛాదితమైన ఒకేవైపు చర్మపు మూతగల వాద్యములును, (ii) కుండలతోను, కొయ్యలతోను చేయబడి ఒకేవైపు చర్మపు మూతగలవాద్యములును, (iii) ఢోలు, ఢోలక్, ఢోలకీవంటి రెండువైపుల చర్మపుమూతలుగల వాద్యములును, (iv) మృదంగము,తబ్లా, డ బాయావంటి ఆరోహణ, అవరోహణములనుకూడ తెలుపునట్టి రెండువైపుల చర్మపు మూతలుగల వాద్యములును యీ రకమునకు చెందును.

(2) లోహసంబంధమైన వాద్యములు:— ఇందు స్టోన్‌గాంగ్సును, జాల్‌రా చిప్లా, బ్రహ్మతాళంవంటి వాద్యములును యీ రకమునకు చెందును.

(3) వాయుసంబంధమైన వాద్యములు:—ఇందు వ్రేళ్లు ఆనుకొనే రంధ్రములు లేకనే వాయింపబడు హారన్, కొంబు, వంటినిడుపైన వాద్యములును, ii గొట్టపువైపుల వంటి వాద్యములును, iii గొట్ట ఆర్గన్ పైప్, అండ్‌రీడ్‌డల్సి నెుర్‌వంటి వాద్యములును, iv వ్రేళ్లు ఆనుకొనే రంధ్రములు కొన్ని మాత్రమే యుండునట్టి వాద్యములును, v 7 లేక 8 రంధ్రములు గలిగి నోటితో గాని పూదుచూ వాయింపబడు పిల్లనగ్రోవివంటి సంగీతవాద్యములును, vi నోటిలో ఆకును (పీకె)వుంచుకొని పూదుచూ వాయింపబడు నాగస్వరము, షెహనాయివంటి వాద్యములును, vii ఒకేవాద్యములో ఒకేసమయమున శ్రుతియును, సంగీతమును ప్రదర్శింప వీలుగల "మగుడి"(పాములవాని నాగస్వరము) వంటి వాద్యములును, రెండువాద్యములుగల జలక్ట్రొహార్మోనియమ్, వంటి వాద్యములును viii కీ బోర్డును, లోపల రీడ్సులుగలిగిన హార్మోనియము, ఆర్గన్, పియానోవంటి వాద్యములును యీరకమునకు చెందినవగును. వీటిలో viii వ, రకమునకు చెందిన వాద్యములు యూరపియన్ సంప్రదాయమునననుసరించి సృష్టింపబడిన వాద్యములనిగ్రహింపదగును.

(4) తంత్రీ సంబంధమైన వాద్యములు:— వీటిలో విల్లు (Bow) తో వాయింపబడు వాద్యములకంటె వ్రేళ్ళతో మీటి వాయింపబడు తంతివాద్యములే ముందుగా సృష్టింపబడినవగును. ఉ॥ తంబుర, ఏక్తార్, తుంతిని, బ్రాస్ట్రింగ్, పినాక, అండ్ హార్ప్, స్వరమండల్, మహానాటకవీణ,(గోటువాద్యము)చలనముగల్గిన మెట్లుగలవీణ, చలనములేని మెట్లుగలవీణ, రుద్రవీణ, సరస్వతి వీణలవంటి వాద్యములును, కమాను లేక విల్లు (Bow) తో వాయింపబడు వయొలిన్, సారంగి, ఎస్రాజ్ వంటి వాద్యములును, యీరకమునకు చెందినవగును, వైవిధముగా భారతదేశములోగల సంగీత

వాద్యములను అనేకరకములుగా విభజించియున్నను వాటిని వుపయోగించు విధమును బట్టి కూడ రెండురకములుగా విభజించడమైనది. అవి 1. కర్నాటక సంగీతవాద్యములు 2. హిందూస్థానీ సంగీతవాద్యములగును. వీటి వివరములను పటసహితముగా నీక్రింద తెలుపుట గమనించదగును.

## (1) వీణావాద్య వివరము.



వీణావాద్యము:— సంగీతవాద్యము లన్నిటిలోను మిగుల ప్రసిద్ధమైనట్టియు పవిత్రమైనట్టి వాద్యము " వీణ " యని చెప్పుట కెట్టిసందేహములేదు. ఇది విద్యాధిష్టాన దేవతయగు సరస్వతీదేవి యభ్యసించిన సంగీతవాద్యమగుటచే దీని జన్మస్థానము స్వర్గ మని చెప్పదగును. మరియు దేవలోకమున నారదాది మహర్షులు నయితము పవిత్రమైన నీ వీణావాద్యము నభ్యసించియే ఆనందసుధను గ్రోలియుండుట పురాణప్రసిద్ధమగు విషయ మగును. నారదుడు త్రిలోకసంచారి యగుటచే నీ వీణా వాద్యమును భూలోకమునకు గూడ తీసికొనివచ్చి యున్నందున నచ్చటి ఋషులును, తదితర మహనీయులును వీణా వాద్యమునందుగల మనోహరమైన సంగీతమాధుర్యమును గ్రహించి దానిని యభ్యసింప దొడగిరి. గనుకనే వీణను అతిపురాతనకాలమునుండియు హైందవుల ప్రసిద్ధతంతివాద్య ముగా పరిగణింపబడుటకు కారణమైనది. మరియునిది మానవశరీరమును పూర్తిగాననుస రించి సృష్టింపబడిన వాద్యమగుటచే మానవగాత్రమును చక్కగా ననుక రించగలశక్తి గలదై కర్నాటక సంగీతమును తని (సోలో) గాను, ప్రక్కవాద్యముగాను కూడ ప్రదర్శింప గలుగుచున్నది. పైన దెలుపబడిన వివిధకారణములచేతను, వాద్యము లన్నిటిలోను ప్రప్రథమమున సృష్టింపబడినదగుటచేతను, వీణను, వాద్యములకు మాతయని చెప్పుటకు కారణమైనదని గ్రహింపదగును.

i వీణలలో పలురకములుగలవు. వాటిలో కొన్ని ఉత్తర భారతదేశమునందును, మరికొన్ని దక్షిణభారతదేశమునందును వుపయోగింపబడుచున్నవి. ఉత్తరభారతములో నుపయోగింపబడు వీణలు షుమారు 4 అడుగుల పొడవుగల వెదురుకఱ్ఱతో

చేయబడి, దానిమీద మెట్లు అమర్చబడియుండును. గనుక నీ వెదురుకఱ్ఱయే దానికి వ్రేళ్లు ఆనుకొను చదునైనబల్ల (Finger board) గా నుపయోగపడుచుండును. దీనికి రెండువైపులను గల రెండు పెట్టెలవంటి గుండ్రనిబుఱ్ఱలు వీణనిలుచుటకు ఆధారభూతముగా నుండుటయేగాక గంభీరమైన ధ్వనినిచ్చుటకుగూడ సహాయపడుచుండును. ఈ రకమైన వీణలను సుతారు, మహావీణ, రబాబ్, అని చెప్పబడును.

ii ఆకారములోను, ధ్వనిమాధుర్యములోను, దక్షిణ భారతదేశములో నుపయోగించు నట్టి వీణలు అత్యుత్తమమైనవని చెప్పవచ్చును. ఇవిసాధారణముగా పనస కఱ్ఱ, లేక జాక్‌వుడ్ (jock wood)వంటి కఱ్ఱలలో తయారుచేయుదురు. ఎక్కువ ధ్వనినిచ్చుటకై దీనిలో పేర్చబడుచున్నట్టి పెట్టెవలెయుండు భాగమును "కుండ" అనిచెప్పబడును. ఇది ఒక పెద్ద బంతిలో సగమువంతు సైజు వుండును. దీనిలోతు 9అంగుళములనుండి 10½అంగుళములవరకుయుండును. కుండయొక్కలోతును, దానికైవాలము యెంత ఎక్కువగా నుండునో ఆవీణయొక్క ధ్వనికూడ అంతగంభీరముగానుండును. కుండయొక్క తెరచియుండు పైభాగమును అదే ఆకారముగల చదునైన చెక్కతో మూయబడి బిగింపబడును. ఈ కుండయొక్కవ్యాసము ఆయావీణలయొక్క సైజునుబట్టి 9½అంగుళముల నుండి 13 అంగుళములవరకు నుండును. దీనిని దండమనబడు వ్రేళ్లు ఆనుకొనుటకేర్పఱచిన ఒకచదునైన పొడుగాటి బల్లతో జతపఱచి యీ రెంటినీ, సర్పముఖాకృతిగానుండెడి. "యాళి" యొక్క కంఠమునకు జతచేసి బిగింతురు. అట్లుతయారుచేయబడిన దండముపైన వరుసగా ఉక్కుతో ప్రత్యేకముగా తయారుచేయబడిన 24 కడ్డీలను మెట్లు లేక యిండ్లుగా యేర్పడునట్లు మైనముతో బిగించి ఆయాస్వరముల కొలతలకుతగినట్లు సరిచేయుదురు ఈ మెట్లకు పైననాలుగు తంత్రులను, ప్రక్కన మూడు తంత్రులను వేయుదురు. గనుక ఒక్కొక్క తంతికి 24 యిండ్లవంతున పై 4 తంత్రులకు 4 × 24 = 96 యిండ్లు యేర్పడి ఒక్కొక్క యింటిలో ఒక్కొక్క స్వరము పలుకుచుండును.

iii ఈ తంత్రులు పురుషగాత్రములకు, స్త్రీగాత్రములకు,తగినట్లుగా వేరు వేరు నంబర్లుగలవైయుండును.అనగా తక్కువ శ్రుతిచేయు వీణలకువేయుసప్త తంత్రులలో, 22 24, 28, 30 నంబర్లుగలవి మీదితంత్రులకును, 31, 32 33 నంబర్లుగలవి ప్రక్క(తాళ) తంత్రులకును సాధారణముగా నుపయోగింతురు. ఇదేవిధముగా హెచ్చుశ్రుతిచేయునట్టి వీణలకువేయుసప్తతంత్రులలో 24, 26 30, 32, నంబర్లుగలవిమీదితంత్రులకును,33, 34, 36 నంబర్లుగలవి ప్రక్క (తాళ) తంత్రులకును సాధారణముగా నుపయోగించుచుందురు.

iv ఇటుల 7తంత్రులను వేయునపుడు యీ 7 తంత్రులనుకుండలియందు గలమూలాధారమునందు ముడివేసి,మీదినాలుగుతంత్రులను పీటు, దండము మీదుగా యాళియొక్క కంఠమునకిరుప్రక్కలనుండు 4 బిరడాలకును, ప్రక్క మూడుతంత్రులను పీటుప్రక్కన అర్ధచంద్రాకారముగనుండు లోహపుపీటు మీదుగా దండము ప్రక్కనుండు 3 బిరడాలకును చుట్టబిగించి కావలసిన శ్రుతికి సరిచేయుదురు. ముఖ్యముగా వీణయొక్క రెండవ చివరకంఠముక్రింద గుండ్రనిసొరకాయబుర్రనొకటి అమర్చుదురు. అదివీణను సరియైన పట్టములో నుంచునట్లు చేయుటకేగాక ధ్వనిమాధుర్యమును పెంపొందించుటకు కూడ నుపయోగపడును.

v పైన తెలుపబడినవీణయొక్క సప్తతంత్రులను శ్రుతిచేయునపుడు మీది తంత్రులు 4 టిని పైనుండి క్రిందికివరుసగా 1వ తంతిని అనుమంద్రపంచమముగను, 2 వ, తంతిని మంద్రషడ్జముగను, 3 వ, తంతిని మంద్రపంచమముగను, 4, వ తంతిని మధ్యషడ్జము (సారణి) గను యుండునట్లు శ్రుతిచేయవలెను. తరువాత ప్రక్క (తాళ) తంత్రులను శ్రుతిచేయునపుడు 5వ, తంతిని 4 వ, తంతివలె మధ్యషడ్జముగను, 6 వ, తంతిని మధ్యపంచమముగను,7వ తంతిని తారషడ్జముగను శ్రుతిచేయవలెను.ఇటులతంత్రులను శ్రుతిచేసినపిదప 1వ అనుమంద్రపంచమతంతిలోని అయిదవ యింటిలో బలుకు నాదమును,రెండవ మంద్రషడ్జ తంతియొక్క నాదమును సమానముగా నుండునట్లును, 2వ మంద్రషడ్జ తంతిలోని 7వ యింటిలో బలుకు నాదమును,3వ, మంద్రపంచమ తంతియొక్క నాదమును, సమానముగానుండునట్లును, 3వ, మంద్రపంచమతంతిలోని 5 వ యింటిలో బలుకు నాదమును, 4 వ మధ్యషడ్జము (సారణి) తంతి యొక్క నాదమును సమానముగానుండునట్లును సరిచూచుకొనవలెను. మరియు 1వ,అనుమంద్రపంచమ తంతిలోని 12 వ,యింటిలో బలుకు నాదమును, 3 వ, మంద్రపంచమ తంతియొక్క నాదము ఒకేవిధముగాను, 2 వ, మంద్రషడ్జములోని 12 వ, యింటిలో బలుకు నాదమును, 4 వ మధ్యషడ్జమ తంతియొక్క నాదమును ఒకేవిధముగాను వుండునట్లు సరిచూచుకొనవలెను. ఇటుల మీది తంత్రులను సరిచూచుకొనునపుడు ఆయా ధ్వనులు సమానముగా లేనిచో ఆ వీణయొక్క మెట్లు సరియైన మేళములో బిగింపబడలేదని గ్రహించి మేళము సరిచేసికొనవలెను. మరియు 1 వ, తంతిని 3వ, తంతిని వరుసగా మీటినపుడును, 2 వ తంతిని, 4 వ, తంతిని వరుసగా మీటినపుడును, ఆ రెండు నాదములును క్రింది స్థాయి పైస్థాయిలలోనుండి, ఒకదానితో నొకటి కలిసి ఒకేనాదముగానుండునట్లు సరిచూచుకొనవలెను.

vi వీణశ్రుతిని నిర్ణయించుటలో ఆయావీణలయొక్క పరిమాణముల ననుసరించియును, మీటెడి తంత్రులను స్థూలత్వముగా వ్రేళ్ళచే నొక్కుటకు తగినట్లుగను శ్రుతిని

నిర్ణయించుకొని మొదట 4 వ తంతిని మధ్యమస్థాయిగా శ్రుతిచేసి, దాని ననుసరించి మిగత 3, 2, 1 తంత్రులను. తదుపరి, 5, 6, 7 తాళతంత్రులను శ్రుతిచేయుట వీణయొక్క సంప్రదాయమగును.

vii వీణను వాయించునపుడు యీ క్రింది విధముగా వ్రేళ్ళను నుపయోగించవలెను. 1 కుడిచేతివ్రేళ్ళను తంత్రులను మీటుటకును, 2 ఎడమచేతివ్రేళ్ళను ఆయా స్థాయిలలోని ఆయా స్వరములకు తగినట్లు మెట్లపైగల తంత్రుల నదుముటకు నుపయోగింపవలెను. ఈ విధముగా రెండు చేతుల వ్రేళ్ళకును, ఒకదానికొకటి వదలని సంబంధము యుండుటచేతనే మిగత వాద్యములకంటె నీ వీణా వాద్యమునందు విశేష గమకములు పలుకుటకు కారణమైనది.

viii వీణను వాయించునపుడు కుడిచేతిని యీ క్రింద తెలుపబడిన విధముగా నుపయోగింపవలెను.

(1) కుడిచేతి మణికట్టును కుండయొక్క ఎడమప్రక్క పైభాగమున అనగా 24వ మెట్టుకును, పీటు (బ్రిడ్జి)కును మధ్యగా ఆనించియుండవలెను.

(2) కుడిచేతియొక్క బొటనవ్రేలును కుండయొక్క ఎడమప్రక్క క్రిందిభాగమున ఆనించి చేతికి ఆధారముగా నుండవలెను.

(3) మిగత మూడు వ్రేళ్ళను మీది తంత్రుల పైభాగమున వంచియుండవలెను.

(4) చిటికెనవ్రేలును ప్రక్క (తాళ) తంత్రుల క్రిందుగా వంచియుండవలెను.

ix వీణను వాయించునపుడు యీ క్రింద దెలిపిన పనిముట్లను వుపయోగించవలెను.

(1) కుడిచేతివ్రేళ్ళకు బలముగల గోళ్లున్నచో ముఖ్యముగా వాటినే వుపయోగించవలెను.

(2) గోళ్లులేనిచో వెండి లేక దంతము, లేక ఉక్కుతో చేయబడిన గోళ్ళను వ్రేళ్ళకు తొడిగి వాటినే వుపయోగించవలెను.

(3) చూపుడువ్రేలును, నడిమివ్రేలును మీది తంత్రులను మీటుట కుపయోగించవలెను.

(4) ఉంగరపువ్రేలును మాత్రము దేనికిని వుపయోగింపరాదు.

(5) చిటికెనవ్రేలును ప్రక్క తంత్రులను మీటుట కుపయోగించవలెను.

ఈ వీణను మీటుటయందుగల పలురకములను వాటిపేర్లతో సహా క్రింద తెలుపుట గమనించునది.

1. విడిగా పడు మీటును "గోటుమీటు" అనియును,

2. చూపుడువ్రేలుతో మీదినుండి క్రిందికి పోవునట్టి మీటును "లోమీటు" అనియును,

3. క్రిందినుండి మీదికి పోవునట్టి మీటును "వెలిమీటు" అనియును,

4. చూపుడు, నడిమివ్రేళ్ళ రెంటితో వడిగా మీటుటను "కత్తిరిమీటు" అనియును,

5. చూపుడు,నడిమివ్రేళ్ళను మార్చి,మార్చిమీటుటను "తోడుమీటు" అనియును,

6. త్రిశ్రజాతిలో మూడవ అక్షరమును నడిమివ్రేలితో మీటుటను "తడమీటు" అనియును,

7. చూపుడువ్రేలిచే మీటినపుడు యేర్పడిన స్వరమును నడిమివ్రేలిచే తాకి ధ్వనిని అడ్డగించి, అట్లు అడ్డగింపబడిన నాదము, తిరిగి వెంటనే పలుకునట్టుల నడిమి వ్రేలిచే మీటుటను "అడ్డమీటు" అనియును,

8. తంత్రులపై సంపూర్ణ బలుకు నాదము గంభీరముగా యుండునట్టుల గట్టిగా మీటుటను "దొడ్డమీటు" అనియును,

9. నాదము సూక్ష్మముగా యుండునట్టుల మీటుటను "సన్నమీటు" అనియును,

10. సంగీతరచనలను వాయించునపుడు సాహిత్యాక్షరములేని తావులందు వేసెడి మీటును "అబద్ధపుమీటు" అనియును,

11. మీది నాలుగు తంత్రులను రంజనముకై చూపుడు, నడిమి, ఉంగరపు వ్రేళ్ళతో ఒకేసారి మీటుటను "కూటమీటు" అనియును,

12. మీది తంత్రులలో మధ్యమషడ్జ, మంద్రపంచమతంత్రులను కొన్ని సందర్భములలో రంజనముకొరకై విడివిడిగా మీటుటను "విడిమీటు" అనియును,

13. ప్రక్కతంత్రులను చిటికెనవ్రేలిచే క్రిందినుండి మీదికి కొట్టినట్లుగా మీటుటను "ప్రక్కమీటు" అనియును, చెప్పబడును.

పైన తెలిపిన వివిధ మీటులలోను తాళములో ఘాతపడెడితావులందు మీది తంత్రులపై వేయునట్టి "లో మీటును" ప్రక్కతంత్రులపై వేయునట్టి చిటికెనవ్రేలు మీటును, సమముగా ఏకకాలములో నుండవలెను. అయితే కొన్ని సమయములలో

ఘాతలయందు, లోమీటుగాని, ప్రక్కమీటుగాని యేదో ఒకటిమాత్రమే పడు చుండును. మరియు ఆలాపన సమయములందు సమయోచితముగా "ప్రక్కమీటు" మీటుటయును కలదు. లోమీటు, ప్రక్కమీటు, తపశాటులేక వడిగా మీటుట అలవడుటకుమునుపు, ఎడమచేతి సాధకమును మొదలుపెట్టకూడదని గ్రహించునది.

xi వీణవాయించునపుడు ఎడమచేతిని ఉపయోగించువిధము నిక్రింద గమనించునది.

1. ఎడమచేతిని వీణాదండముక్రిందుగా పైకిదీసి వ్రేళ్ళను మెట్లపైనుండు తంత్రులపై వంపుగా నిలిపియుంచవలెను.

2. ఎడమచేతి బొటనవ్రేలిని, వీలునుసరించి దండమును కానించుకొనవలెను.

3. వ్రేళ్ళను తంత్రులపైనుంచి మీటునపుడు ఆయాస్వరముల ననుసరించి మెట్లయందు చూపుడు, నడిమివ్రేళ్ళతో తంత్రుల నదిమి లాగుచుండవలెను.

4. మిగత ఉంగరపు, చిటికెనవ్రేళ్ళను తంత్రులపై నంటుకొనకుండునట్లుంచ వలెను.

5. కొన్ని సమయములందు మీటు తంత్రులకు పంచమషడ్జ, మంద్రపంచమ, మంద్రషడ్జ, అనుమంద్రపంచమములను ఎడమచేతివ్రేళ్ళ నుపయోగించకనే కుడిచేతి వ్రేళ్ళతో మీటుటవలననే పలికింపవచ్చును.

ఇటులపైనదెలుపబడిన వీణావాద్యముయొక్క నియమములను అభ్యాసకులు చక్కగా గ్రహించి గమకలక్షణమున జెప్పబడిన పదునైదు గమకములను సమయానుకూలముగ నుపయోగింపుచు మొదట స్వరావళ్యాది అలంకారములను, తదుపరి గీత, వర్ణ, కృతి. కీర్తన, పద, జావళ్యాదులను, తదుపరి గాయకుని శక్తి ననుసరించి రాగము, తానము, పల్లవి, నిరవల్, కల్పన స్వరములను, భావయుక్తముగ నుండునట్లు యభ్యసింపవలెను.

1-. వీణయొక్క వివిధ భాగముల వివరము:- యోగశాస్త్రము ననుసరించి చెప్పబడిన వీణయొక్క కుండలి మొదలు శిరస్సువరకుగల భాగమును ఆధారములు (Nerve centres-ఆయువుపట్లు) గా భాగింపబడుట నిక్రింద తెలుపుట గమనించు నది. అన్ని తంత్రులు ముడివేయుచోటును "మూలాధార" మనియు, పీట (Bridge) అమర్చబడిన చోటును "స్వాధిష్ఠాన" మనియు, 4వ, మెట్టు అమర్చబడినచోటును "మణిపూర" మనియు, 19వ, మెట్టు అమర్చబడినచోటు "అనాహత" మనియు,

12వ, మెట్టును అమర్చబడినచోటును "విశుద్ధ" అనియు, 7వ, మెట్టును అమర్చబడిన చోటును "ఆజ్ఞాయ" అనియు చెప్పబడును. ఈ 6 అధారములను ఒక్కొక్కదానికి గల 12,000 నాళములద్వారా 12,000×6=72,000 రాగములను సృష్టింపగల శక్తిగలది యగునని ప్రాచీనులు చేసిన వీణా వాద్యముయొక్క శరీరవర్ణనవలన స్పష్టపడుచున్నది.

వీణా వాద్యమభివృద్ధిని గురించిన పూర్వ, వర్తమాన చరిత్రాంశయము:- భారత దేశమున వీణావాద్యమునకు తగినంత ప్రోత్సాహము లేనందున క్రమక్రమంగా దాని యభివృద్ధి క్షీణించుట జరిగెను. ఇందుకు ముఖ్యకారణము మోక్షసాధనమైనదిగా విఖ్యాతిగాంచిన యీ వీణవాద్యమునందు విశేష ప్రావీణ్యము సంపాదించుటకు తగిన పట్టుదల, కార్యదీక్ష, బుద్ధికుశలత చాలమందికి లేకపోవుటవల్లను, ప్రజాభాహాళ్యము దీని యభివృద్ధికి తగిన ఆదరణ యొసంగకపోవుటవల్లను క్షీణించుటజరిగెను. కాని క్రమంగా మైసూరు, తిరువాన్కూరు, విజయనగరంవంటి సంస్థానాధిపతుల ఆదరాభిమానములవల్లను, యిటీవల ముఖ్యంగా మన కేంద్రప్రభుత్వమువారి ప్రోత్సాహమువల్లను వీణావాద్యము మరల తన పూర్వపుఔన్నత్యము నొందగలిగి అనేకులీ వాద్యమునందు ప్రావీణ్యమునొందుటకు కారణమైనదని తెలియదగును. వీణలలోని రకములు :

1 ఏకరాగ మేళవీణ:- ఇది పూర్వకాలములో వాడబడిన వీణకుగల పేరగును. దీనిలో ఒక రాగమును మాత్రమే ప్రదర్శించుటకు తగిన మెట్లుండును. రాగమును మార్చినపుడెల్ల యిందుగల మెట్లనుకూడ ఆయా రాగస్వరములకు తగినట్లు ముందుకుగాని, వెనుకకుగాని లాగి మేళమును సరిచేసి వాయించెడివారు. గనుకనే దీనిని "ఏకరాగ మేళవీణ" యని పిలువబడెను. దీనికివ్యతిరేకమైనది "సర్వరాగ మేళవీణ" యగును.

2 సర్వరాగ మేళవీణ:- ఇది వర్తమానకాలములో నందరిచేతను వాడబడునట్టి వీణకుగల పేరగును. దీనిని రామామాత్యుడు కనిపెట్టెనని తెలియుచున్నది. ఏకరాగ మేళ వీణలోవలె దీనిలోకూడా రాగముమార్చినపుడెల్లను మెట్లను మార్చుకోనవసరము లేదు. అన్ని రాగములను ప్రదర్శించుటకు వీలుగా యెక్కువమెట్లు యిందు బిగింపబడి యుండును. గనుకనే దీనిని "సర్వరాగ మేళవీణ " యని చెప్పుటకు కారణమైనది. దీనికి వ్యతిరేకమైది "ఏకరాగ మేళవీణ" యగును.

3 మధ్య మేళవీణ:- ఇది సర్వరాగ మేళవీణవంటి వీణకు గల పేరగును. అయితే దీనికీపేరు వచ్చుటకొక ప్రత్యేకకారణముకూడ గలదు. సాధారణముగా వీణలోగల మీటుతంత్రులు నాల్గింటిని క్రిందినుండి పైకి మధ్యమషడ్జ, మంద్రపంచమ, మంద్రషడ్జ

అనుమంద్రపంచమ స్వరములుగా శ్రుతిచేయుదురు. ఈ విధంగా శ్రుతిచేసిన నాల్గు తంత్రులను పైనుండి క్రిందికి మీటినచో ప-స-ప-స అను స్వరములగును. వీటికి పై తంతిని మధ్యమముగా నెంచిన స-మ-సమ, అను స్వరములకు సమానములగును. ఈ కారణమువల్లనే దీనిని ఒక పద్ధతిలో "మధ్యమేళవీణ" యనిచెప్పుటకు కారణమైనది.

4 అచ్యుతరాజేంద్ర మేళవీణ:- ఇది రామామాత్యునిచే కనిపెట్టబడిన రొక రకమైన వీణకుగల పేరగును. ఈ విషయము "స్వరమేళకళానిధి"యను గ్రంథములోకూడ చెప్పబడెను. దీనిలోని మీదితంత్రుల నాల్గింటిని క్రిందినుండి పైకి (1) మంద్ర పంచమ (2) మంద్రషడ్జ (3) అనుమంద్ర పంచమ (4) అనుమంద్రషడ్జ స్వరములకును, ప్రక్క తంత్రులు మూడింటిని పైనుండి క్రిందికి (5) మంద్రషడ్జ (6) మంద్రపంచమ (7) మధ్యషడ్జ స్వరములకును శ్రుతిచేయబడినట్లు తెలియుచున్నది. రామామాత్యుడు (శ్రీ) అచ్యుతరాజేంద్రుని ఆస్థానమందుండి ఆయన ప్రోత్సాహమువల్లనే యీ వీణను కనిపెట్టియుండుటచే దీనికి "అచ్యుతరాజేంద్ర మేళవీణ" యని పేరువచ్చుటకు కారణమైనదని గ్రహించునది.

5 చలవీణ:- ఇది నాట్యశాస్త్రమను ఆదిలక్షణగ్రంథమునకు కర్తయైన భరతునిచే కనిపెట్టబడిన రెండు వీణలలో మొదటి వీణకుగల పేరగును. భరతుడు ఒక స్థాయిలో 22 శ్రుతులుండునని ప్రయోగదృష్టాంతరములద్వారా నిరూపించుటకు దీనిని వుపయోగించెనని తెలియుచున్నది.

6 ధృవవీణ:- ఇదియు భరతాచార్యునిచే కనిపెట్టబడిన పైరెండు వీణలలో రెండవ వీణకుగల పేరగును. భరతుడు ఒక స్థాయిలో 22శ్రుతులుండునని ప్రయోగదృష్టాంతరములద్వారా నిరూపించుటకు యీ రెండవ వీణనుకూడ వుపయోగించెనని తెలియుచున్నది.

## గోటువాద్య వివరము.



గోటువాద్యము :— ఇది సాధారణముగా చూచుటకు ఆకారమునందును, తదితరమైన యన్ని విషయములందును [illegible]

ఇత్యాది వాద్యవిభాగములో తంత్రీ వాద్యమునకు చేరిన మీటువాద్యమై యున్నది. దీనినే "మహానాటకవీణ" యని కూడ చెప్పుదురు.

i గోటువాద్యమునకును వీణావాద్యమునకును స్వరూపములో వ్యత్యాసమంతగా లేకపోయినను వీణయందువలె స్వరస్థానముల నిరూపించుటకు కమర్చబడిన మెట్లుమాత్ర మీగోటువాద్యమునందుండవు. ఇదియొక్కటే ఈరెండు వాద్యములకుగల ముఖ్యమైన వ్యత్యాసము. ఈ కారణమువల్లనే వయొలిన్ (ఫిడేలు) యందువలె అభ్యాసకులే దీనిలో స్వర స్థానముల నిర్ణయించుకొనుచూ వాద్యమొనర్పవలసి యున్నది. గనుకనే గోటువాద్యము మిగత వాద్యములకంటె మిక్కిలి కష్టసాధ్యమైనదియు, తగినంత గంభీర మైన ధ్వని విశేషముగల వాద్యమనియు చెప్పబడుచున్నది.

ii తంత్రుల వివరము:— ఈ గోటువాద్యమున ముఖ్యముగా 7 తంత్రులుండును. వాటిలో పై 4న్నూ మీటుతంత్రులనియు, క్రింది మూడున్నూ ప్రక్క తంత్రులనియు చెప్పబడును.

iii మీటు తంత్రులను శ్రుతిచేయు విధము:— పైనుండి 1వ, తంతిని అనుమంద్ర పంచమముగను, 2వ, తంతిని మంద్రషడ్జముగను, 3వ, తంతిని మంద్రపంచమముగను 4వ, తంతిని మధ్యషడ్జముగను శ్రుతి చేయవలెను.

iv ప్రక్కతంత్రులను శ్రుతిచేయు విధము:— 5వ, తంతిని, మధ్యషడ్జముగను, 6వ, తంతిని మధ్యపంచమముగను, 7వ, తంతిని తారషడ్జముగను శ్రుతి చేయవలెను.

v కుడిచేతి యభ్యాసము:— వీణావాద్యమునందువలె గోటువాద్యమునందు కూడ కుడిచేతి వ్రేళ్ళను తంత్రులనుమీటుటకు కుపయోగించవలెను. అందు ముఖ్యముగా చూపుడు, నడిమి వ్రేళ్ళతో ఆయా స్వరముల ననుసరించి మీటుతంత్రులను మీటుచూ వాద్యమొనర్పవలెను. ఉంగరపు వ్రేలితో దీర్ఘాక్షరములు పలికించునపుడు మీటుతంత్రుల నన్నిటి నొకేసారి మీటవలెను. అట్లు చేయుటవలన వాద్యమునందు ఆధార శ్రుతి యిమిడి యున్నటుల వినిపించుటయేగాక గంభీరముగను, రంజకముగను యుండును. చిటికెన వ్రేలుతో ఆయా తాళములందు గల ఘాతలు పడుచోట్ల మీటి తాళము యొక్క కాలప్రమాణమును దెలుపవలెను.

vi ఎడమచేతి యభ్యాసము:— గోటువాద్యమున వీణయందువలె ఎడమచేతి వ్రేళ్ళ నుపయోగింపక షుమారు 2 లేక 2½ అంగుళముల పొడవును, షుమారు 1½ అంగుళము వ్యాసముగల రూళ్ళకఱ్ఱవంటి కొయ్యముక్కను ఎడమచేతి బొటన

చూపుడు, నడిమి వ్రేళ్ళతో పట్టుకొని దానిని తంత్రులపై నంటియుండునటుల యుంచి ఆయా రాగముల ననుసరించి స్వరస్థానము లేర్పఱచుకొనుచు వాద్య మొనర్పవలెను. ఈ గోటువాద్యమును గుఱించిన తదితర విషయములన్నియు వీణావాద్య వివరమునందు తెలుపబడిన వివరములగుటచే మిగత వివరములన్నిటిని మరల నిచట తెలుపబడ లేదని గ్రహించునది.

## వయొలిన్ వాద్య వివరము.




**i** వయొలిన్ (Violin) వాద్యము :— ఇది వాద్యవిభాగములలో తంత్రీ వాద్యములో చేరినదైయున్నది. ఇయ్యది పాశ్చాత్త్యులచే కనిపెట్టబడిన వాద్యమైనను కర్నాటక సంగీతము నామూలాగ్రముగను, లక్ష్య, లక్షణ యుక్తముగను ప్రదర్శించుట కనువగువాద్యమగుటచే నిదియొక ప్రాముఖ్యమైనసంగీతవాద్యముగా నేడుభారతదేశమంతటను పరిగణింపబడుచున్నది. ఇందుగల ముఖ్యవిశేష మేమనగా ! ఇయ్యది కర్నాటక సంగీతమునేగాక, హిందూస్థానీ, పాశ్చాత్త్య సంగీతములనుగూడ తనిగా (సోలో) కచ్చేరి చేయుట కర్హత గల్గియున్నది. మఱియు నిదిగాత్రగానమునకే గాక తదితర ముఖ్యమైన సంగీతవాద్యము లన్నిటికిని ప్రక్క వాద్యముగా కూడ నుపయోగింపదగిన వాద్యముగానుండుటచే నిది తంత్రీవాద్యములలో మిగుల శ్రేష్ఠమగు సంగీతవాద్యముగా పరిగణింపదగియున్నది.

**ii** వయొలిన్ యొక్క పరిమాణముల వివరము:— ఇది ముఖ్యముగా 3 విధములుగా నుండును. అవి యేవనగా ! (1) నిండు సైజుగలవి (2) ముప్పాతిక ¾ సైజుగలవి (3) ½ సైజుగలవి. ఇవిగాక ⅞ సైజుగలవికూడ నుండును. ఇవి అభ్యాసకుల వయస్సు లేక శరీర పరిమాణమును బట్టి ఆయా సైజుగల వయొలినులను నిర్ణయించి యుపయోగింపబడు చుండును.

iii వయొలిన్‌యొక్క వివిధభాగముల వివరము:— వయొలిన్ యొక్క పలువిధములగు భాగములను పటమునందుగల A, మొదలు L. వఱకుగల గుర్తులతోను, పేర్లతోను యీక్రిందివాని తెలుపబడుట గమనించునది.

" A " గుర్తుగల భాగమును తల లేక (స్క్రోల్)(Scroll) అనియు, " B B " గుర్తుగల భాగములను చెవులు (Pegs) అనియు "C" గుర్తుగలభాగమును మెడ (Neck) అనియు, " D " గుర్తుగల భాగమును వ్రేళ్ళు అనుకొనే చదునైనబల్ల (Finger board) అనియు, " E " గుర్తుగల భాగమును పీటలేక (బ్రిడ్జి) (Bridge) అనియు, "F, F" గుర్తుగల భాగములను ధ్వని నిచ్చురంధ్రములు (f-Holes) అనియు, " G " గుర్తుగల భాగమును తోకముక్క (tail piece) అనియు "H" గుర్తుగలభాగముబట్టన్ (button) 'అనియు (i, గుర్తుగలభాగమును నట్ "nut" అనియు "J" గుర్తుక్రిందనున్న 4న్నూ తంత్రులుఅనియు K.K. గుర్తుగలభాగమును అర్ధచంద్రాకారముగల ధ్వనినిచ్చు బల్ల లేకగర్భము అనియు, L' L- గుర్తుగల భాగములనువంపులు (Ribs) అనియు, అడుగుభాగమును, వెనుకభాగము (The back) అనియు చెప్పబడును.

(iv) విల్లుయొక్క వివిధభాగములవివరము:- పటమునందుగల విల్లు (Bow) యొక్క పలువిధములగు భాగములపేర్లను నీ క్రిందగమనించునది. "A. A." గుర్తులుగల భాగమునుకఱ్ఱ (Stick) అనియు "B" గుర్తుగలభాగమును నట్ (Nut)అనియు "C" గుర్తుగలభాగమును సీల (Screw)అనియు, "D" గుర్తుగలభాగమును వెంట్రుకలు (Heir) అనియు "E" గుర్తుగలభాగమును తల (Head)అనియుచెప్పబడును.

v తంత్రులవివరము:— వయొలిన్ (ఫిడేలు)కు 4తంత్రులుండును. క్రిందినుండి 1వ తంతిని "మంద్రషడ్జమనియు 2వ, తంతిని "తగ్గుపంచమము" లేక మంద్రపంచమమనియు, 3వ, తంతిని మధ్యషడ్జములేక సారణియనియు 4వ, తంతిని మధ్యపంచమమనియు చెప్పబడును.

vi తంత్రులనుతయారుచేయువిధము:— మంద్రషడ్జమమగు 1వ, తంతిని పట్టు లేక నరము లేక ఉక్కుతీగమీద జల్తారుచుట్టి తయారుచేయుదురు. ఈ మూటిలోను పట్టుమీద జల్తారుచుట్టినతంతిరే మిగుల శ్రేష్టముగా నుండును.

2వ, 3 వ, తంత్రులను నరము లేకఉక్కుతీగమీద జల్తారుచుట్టి తయారుచేయుదురు. వీటిలో రెండవ తగ్గుపంచమతంతికంటె మూడవ మధ్యషడ్జమ తంతి సన్నగాను,4వ, తంతి

కేతలను తక్కువతంతిగానుండును. పైనాల్గురకముల తంత్రులను వుపయోగించునపుడు తక్కువ శ్రుతిచేయునపుడు యెక్కువ మందముగలతంత్రులను హెచ్చు శ్రుతిచేయునపుడు తక్కువ మందముగల తంత్రులను వుపయోగించవలెను. అట్లుచేయుటలో ప్రేళ్ళు తంత్రులపై నొక్కుటలోగల అనుకూలమును బట్టికూడా తంత్రులను నిర్ణయించవలెను.

vii తంత్రులనువేయువిధము:— వయోలిన్‌యందుగల తంత్రులనువేయునపుడు తంత్రులయొక్క ఒకకొననుపటమునందుగల "C" గురుతులోని మెటయందుగల రంధ్రములందుగాని, వానికి జతపరచిన 4స్ట్రింగ్ అడ్జస్టరులందుగాని దూర్చిముడివేసి రెండవ కొనను 'E' గురుతుగల పీట (బ్రిడ్జి) మీదుగా B–B గురుతులందుగల చెవుల (బిరడాల)కు చుట్టి బిగించవలెను.

viii తంత్రులను శ్రుతిచేయువిధము:— వయొలిన్‌కుగల నాల్గుతంత్రులలో పైనుండి 3 వ, తంతిని ఆధారశ్రుతియగు మధ్యమషడ్జముగను, 4వ, తక్కుతంతిని మధ్యపంచమముగను, 2వ,తంతిని మంద్రపంచమముగను, 1వ,తంతినిమంద్రషడ్జముగను వరుసగాశ్రుతిచేయవలయును. ఇటులచేయబడుశ్రుతినిపంచమశ్రుతియని చెప్పబడును.

ix శ్రుతిచేయుటలోగల భేదము:— వయొలిన్ తంత్రులను శ్రుతిచేయుట రెండు విధములుగానుండును. అవి 1 పంచమశ్రుతి, 2 మధ్యమశ్రుతి యగును.

(1) పంచమశ్రుతి:- ఇదిమంద్రషడ్జ, మంద్రపంచమ, మధ్యషడ్జ, మధ్యపంచమములుగా తంత్రులను శ్రుతిచేయబడును. ఇదిసాధారణముగా పురుషగాత్ర సంగీతములందు చేయబడుచుండును.

(2) మధ్యమశ్రుతి:- ఇదిపైనదెలిపిన పంచమశ్రుతిలోగల నాల్గుతంత్రులలో పైనుండి 2వ, 4వ, తంత్రులనుఅనగామంద్రపంచమ, మధ్యపంచమస్వరములను 1పూర్ణశ్రుతిని తగ్గించినచో అనగా శుద్ధమధ్యమములుగా చేయబడినచో ఆశ్రుతిని మధ్యమశ్రుతియని చెప్పబడును. ఇది స్త్రీ గాత్రసంగీతములందు వుపయోగించుదురు. అయితే గాయకుల,గాయనుల గాత్రధర్మమును బట్టియు, రాగములందుగల పంచమాంత్య, ధైవతాంత్య, నిషాదాంత్యభేదములనుబట్టియుకొన్ని సందర్భములలో పురుషులకుమధ్యమశ్రుతి చేసియును, స్త్రీలకు పంచమశ్రుతిచేసియును వాయించటం కద్దు.

* తంత్రులను శ్రుతిచేయుటయందుగల నియమములు :—

వయొలిన్ యొక్క తంత్రులను శ్రుతిచేయుటలో గాయకులగాత్రధర్మమును, తంత్రులయొక్క బలము ననుసరించి పంచమశ్రుతిలో సాధారణముగా 1 మొదలు 4½ లేక 5 శ్రుతివరకు చేయవచ్చును. అంతకంటె హెచ్చుగా శ్రుతిచేయవలసి యున్నప్పుడు మధ్యమశ్రుతిచేయుట విధియగును.

( xi ) వాద్యమునందు ఉపయోగించు సాధనములు:— వయొలిన్ వాద్యమునకు ఉపవిల్లు (Bow) అను సాధనమును వుపయోగించవలెను. ఈవిల్లును ఒక నిడుపాటి చావగల కఱ్ఱను గుండ్రముగాను, సన్నముగాను చేసి దానికి గుఱ్ఱపువెంట్రుకలనమర్చి తయారుచేయుదురు. ఈ వెంట్రుకలను కఠినముచేయుటకు రోజిన్ ( Rosin ) అను సీమగుగ్గిలము నుపయోగించవలెను.

( xii ) కుడిచేతియభ్యాసము:— పైన తెలుపబడిన విల్లుయొక్క మొదటికొనను కుడిచేతితో పట్టుకొని తంత్రులమీద వెంట్రుకలంటియుండునటులవిల్లునుంచి ముందుకు వెనుకకు లాగుచు ధ్వని జనింపచేయవలెను.

( xiii ) ఎడమచేతి యభ్యాసము:— ఎడమచేతిని వ్రేళ్ళుఆనుకొనునట్టి బల్ల (Finger Board) క్రిందినుండి కుడివైపుగా పైకిదీసి చూపుడు, నడిమి, ఉంగరపు చిటికెనవ్రేళ్ళను తంత్రులపై వంచి నిలుపవలెను. బొటనవ్రేలునుమాత్రము ఎడమప్రక్కనేయుంచి ఫింగర్‌బోర్డు నంటియుంచవలెను. మిగత 4 వ్రేళ్ళను ఆయాస్వరస్థానములను వ్రేళ్ళు సహజముగా నందుకొనగలుగునటుల సాధారణముగా చూపుడువ్రేలితో రిషభ, ధైవతములను, నడిమివ్రేలుతో గాంధార, నిషాదములను, ఉంగరపువ్రేలుతో మధ్యమ, షడ్జములను, చిటికెనవ్రేలుతో పంచమ, మీది రిషభములను బలుకునట్లు నడుముచు వాయింపవలెను. కొన్నిసమయములందు వ్రేళ్ళను సమయోచితముగ మార్చి నుపయోగించుకొన దగును.

ఇటుల స్వరములను బలికించుటలో పంచమశ్రుతియందుంచునపుడు మంద్రషడ్జ, మంద్రపంచమ, మధ్యషడ్జ, మ ధ్య పం చ మ ము ల ను ఎడమచేతి వ్రేళ్ళను తంత్రులపై నడుమకనే కేవలము విల్లు సహాయముతోనే స్వరములను బ లి కిం ప వచ్చును.

(xiv) రెండుచేతులకుగల యనుబంధము:— ఎడమచేతి వ్రేళ్ళతో తంత్రులనడుముటయును, కుడిచేతితో విల్లును(Bow) ముందుకు వెనుకకు త్రిప్పుటయును, సమముగా

నుండి ఆయాస్వరములు నడచుగతిని, ఆయాకాలములననుసరించి రెండుచేతులనుబట్టి వాని కొకటి యనుబంధముగా నుండవలెను.

VX వయొలిన్ అభ్యసించునపుడు గమనింపదగుముఖ్యాంశములు:- పైనతెలిపిన వాద్యలక్షణములను చక్కగాగ్రహించి అనులోమ, విలోమక్రమముగా వట్యాలములందుగాని, తనీసముత్రికాలములందుగాని స్వరావళ్యాదిఅలంకారములవఱకు ఆయా గమకలక్షణముల ననుసరించి యభ్యసింపవలెను. తరువాత గీత, వర్ణ, కృతి, కీర్తనాదుల నభ్యసించునపుడు స్వరభాగమునకు అక్షరమునకొకసారి విల్లునుపయోగించుచును, సాహిత్యభాగమునకు ఆయా సందర్భానుసారముగ ఒకటిలేక రెండు లేక అంతకెక్కువ అక్షరములవరకు నొకసారి విల్లునుపయోగించుచు ఆయాతాళ, జాతి, కాలనియమములందుగల పలువిధములగుమార్పులకు తగినట్లు విల్లునుపయోగించుచు వాద్యమభ్యసింపవలెను మరియు నిందుగల సూక్ష్మరహస్యములనింకను దెలియగోరు వారీ వాద్యమునందారితేరిన సుప్రసిద్ధ విద్వాంసులవద్ద దెలిసికొనుటయెంతయు నవసరముగానుండును.

## xvi సప్తతంత్రుల వయొలిన్ వాద్య వివరము.

ఇటీవల కొందరు వయొలినుకు 7 తంత్రులనువేసి వాద్యమొనర్చుచున్నారు. ఇదియొక నవీనకల్పనా విశేషమని చెప్పకతప్పదు. ఈ 7 తంత్రుల నుపయోగించుపద్ధతి యెటులనగా! వయొలినుకుగలముఖ్యమగు 4తంత్రులలో పైనుండి 2వ, 3వ 4వ, తంత్రుల నొక్కొక్కదానికి అదే రకముతంతిని మరియొకటిజేర్చి (=) యీబ్రాకెట్ లో చూపినటుల జంటగా నుండునట్లు తంత్రులను వేయవలెను. అప్పుడుమొత్తము 1+2+2+2=7తంత్రులగును. ఇట్టి7 తంత్రులుగలవాటిని సప్తతంత్రులుగలవయొలినులందురు. ఈ 7తంత్రులను శ్రుతిచేయునపుడు 1వ, తంతిని మంద్రషడ్జముగను, 2వ, జంటతంత్రులలోనొకటి మంద్రపంచమముగను, రెండవది అనుమంద్రపంచమముగను, 3వ, జంట తంత్రులలోనొకటిమధ్యషడ్జముగను, రెండవదిమంద్రషడ్జముగను, శ్రుతిచేయవలెను. ఇటులసప్తతంత్రులు వేయుటలోగల విశేషమేమనగా! ఏకతంతియందు బలుకు నాదము కంటెజంటతంత్రులయందు బలుకునాదము రెట్టింపై వినుటకు గంభీరముగానుండును. ఇదియొక్కటే సప్తతంత్రులు వేయుటలోగలవిశేషము. కాని కర్ణాటక సంగీతమునకు ఏకతంతినాదమే స్పష్టముగాను, సంప్రదాయముగాను, శాస్త్రసమ్మతముగాను, వినుటకింపుగాను యుండుటచే మనదేశమందలి సుప్రసిద్ధవయొలినిష్టులలో చాలామంది వారి వయొలినులకు 4 తంత్రులనుమాత్రమే వుపయోగించి వాయించుటకు కారణమైనదని గ్రహించునది.

## సారంగివాద్య వివరము.

సారంగివాద్యము:- భారతదేశమునందుగల అసంఖ్యాకములగు సంగీతవాద్యములలో కొన్ని బహుళప్రచారములో నుండుటవల్లను, మరికొన్ని ఉన్నతమైన సంగీత సామరస్యమును కలిగి యుండుటచేతను







మిక్కిలి ప్రాముఖ్యములోనికి వచ్చెను. సారంగి వాద్యముకూడ పైనతెలిపిన రెండు కారణముల చేతనే ప్రాముఖ్యమునకు వచ్చెను. దీనిని హిందూదేశపు ఫిడేలు అనికూడా చెప్పవచ్చును. ఇయ్యది దక్షిణమున కన్యాకుమారి మొదలు ఉత్తరమున కాశ్మీరువరకు వ్యాప్తిగాంచియున్నప్పటికి ముఖ్యముగా ఉత్తరహిందూస్థానమందుమాత్రం ప్రతి సంగీత, నాటక ప్రదర్శనములలోను దీనిని విధిగానుపయోగించుచుందురు. కాని నేడు దక్షిణ భారతదేశమందలి సినిమా స్టూడియోలన్నింటి యందును, ఆల్ ఇండియా రేడియోస్టేషను లన్నింటి యందునుకూడ యీవాద్యమును విధిగానుపయోగించుచున్నారు. దీని స్వరము సున్నితముగాను, మనోహరముగాను యుండి వయోలా (viola) స్వరమును బోలియుండును. వర్తమానకాలములో సాధారణముగా యీవాద్యమునందు హిందూస్థానీ సంగీతమునే ప్రదర్శింపగలుగుచున్నను పూర్వకాలమున కొందరీవాద్యమునందు కర్నాటకసంగీతమును కూడ జయప్రదముగా ప్రదర్శించి యున్నటుల తెలియుచున్నది.

సారంగికిగల ముఖ్యతంత్రుల వివరము:- దీనికిముఖ్యముగా మూడుదళసరియైన గట్ (gut) లేకనరముతో చేయబడినతంత్రులుండును. ఒక్కొక్కప్పుడు నాలుగవతంతి గూడ జతచేయబడినప్పటికిని పై 3 తంత్రులుమాత్రమే నీవాద్యమొనర్చుట కుపయోగింపబడును. మరియు యీనాలుగేగాక మరికొన్ని అదనపు తంత్రులుగూడనుండును.

సారంగికిగల అదనపుతంత్రులవివరము:- పై 1, 2 ముఖ్యతంత్రులమధ్య రెండుత్తడితంత్రులును, వాటిక్రింద 15 సన్నని ఉక్కుతంత్రులును, 3వ, తంతిప్రక్కన 8 ఉత్త

తితంత్రులును, వాటిక్రింద 12 సన్నని ఉక్కుతంత్రులునువుండి మొత్తము 6+8+15+12=41 అదనపుతంత్రులును, యీవాద్యమునందు ధ్వని సామరస్యమునుకల్గించుటకు నుపయోగపడుచుండును. కొన్నిటిలో నీఅదనపుతంత్రులు 15 మాత్రమే వుండవచ్చును.

iv సారంగివాద్యమును తయారుచేయువిధము:- మొదట ఒకకొయ్యను తొలచి గర్భమును తయారుచేయుదురు. ఆ గర్భముయొక్క పైభాగమును చర్మముతో మూయుదురు. ఆ తరువాత దానికి కావలసిన తంత్రులను జతచేయుదురు.

v సారంగిని వుపయోగించువిధము:- కమాను(Bow = విల్లు)తో వాయింపబడు యితరవాద్యములవలెనే సారంగినికూడ నిలువుగాపట్టుకొని వాయించుదురు. ఈ వాద్యమునందు నిపుణులగుటకుమిక్కిలి బుద్ధికుశలతయు, అధికపట్టుదలయు నవసరము. మానువ్యమునందును, మార్దవమునందును, మిక్కిలిశ్రేష్ఠమైన యీ వాద్యము దక్షిణభారతదేశములో విశేషప్రచారములో లేకుండుట ఆశ్చర్యకరవిషయముగును. కాని యిటీవల మనదేశములోకూడ కొందఱు యీ వాద్యకులను తెలుచుగా నభ్యసించుట, కళ్ళుచేలు జరిపించుట తటస్థించుచున్నది. గనుక ముందువచ్చుటకూడ నీవాద్యము కొంతవఱకు అభివృద్ధియగుట కవకాశము గలదని చెప్పవచ్చును. బెంగాలులో "సరిందా" అనువాద్యముకూడ యిదేవిధముగానుండును. కాని దానిపైనగభాగము భారీగానుండి చూచుటకు మిగుల వింతగా నుండును.

vi తంత్రులు వేయువిధము:- సారంగివాద్యమునకు ముఖ్యమైన 1, 2, 3,తంత్రులయొక్క ఒకకొనను A గురుతువద్ద ముడివైచి రెండవచివరను B C గుఱుతులుగల బ్రిడ్జి (Brige) లమీదుగా కుడివైపునగల పైబిరడాలకు 1, 2, తంత్రులను, ఎడమవైపు బిరడాకు 3, వ తంతియును, చుట్టిబిగించుదురు. ఈ 3 తంత్రుల మధ్యనుండు 14 యిత్తడి తంత్రులను కూడ A గురుతువద్దనే ముడివైచి B, C D, గుర్తుగల బ్రిడ్జీల మీదుగా సారంగి చివరభాగమునగల E గుర్తువద్దనుండు బిరడాలకు చుట్టి బిగింతురు. ఇదేరీతిని క్రిందివరుసలోనుండు 27 తంత్రులను A గురుతువద్దముడివైచి B గురుతుగల బ్రిడ్జి క్రిందివరుసలోనుండు రంధ్రములనుండి సారంగిపైగల G గురుతుక్రిందనుండు రంధ్రములగుండా క్రిందికితీసి ఎడమ ప్రక్కన F గురుతువద్దనుండు బిరడాలకు చుట్టి బిగించుదురు.

vii శ్రుతిచేయు విధము:- శ్రుతిచేయునపుడు 1 వ తంతిని ఆధారశ్రుతియగు మధ్యమషడ్జముగను, 2 వ, తంతిని మంద్ర పంచమముగను 3 వ, తంతిని మంద్రషడ్జముగను శ్రుతిచేయుదురు, ఈ 3 తంత్రులమధ్య నుండు 14 యిత్తడి తంత్రులను ఆధా

రాగ ఆరోహణావరోహణ స్వరముల ననుసరించియును, వానిక్రిందనుండు 27 ఉపతంత్రులను అయా రాగ ఆరోహణావరోహణ స్వరముల శుద్ధ, వికృతిభేదముల ననుసరించియును శ్రుతిచేయుదురు. ఈ 41 తంత్రులును వాద్యమునందు సమయానుకూలముగ ఆయాస్వరములకు తగిన ప్రతిధ్వనిని యిచ్చుటవలన వినుట కెంతో మనోహరముగా నుండుటచే దాని ధ్వని మాధుర్యంగాను గంభీరముగాను నుండును.

viii సారంగిని వాయించు విధము:- దీనిని వయొలిన్ వలెగాక నిలువుగా మోకాలుపైకి వుంచు[illegible], తంబురవలె పడియుండ నిలిపియుంచి వాయించుదురు. కుడి చేతితో కమ్మి నందుకొని ఆయా స్థానస్వరముల ననుసరించి ఆయా తంత్రులమీద సమయానుకూలముగ రాపిడి చేయుదురు. వీణ, గోటు, వయొలిన్ వాద్యములందువలెగాక సారంగిలో ఎడమచేతి చూపుడు, నడిమివ్రేళ్ళ గోళ్ళమీది భాగమును తంత్రిప్రక్క నంటియుంచి ఆయా స్వరముల హెచ్చుతగ్గులను బట్టి ముందు వెనుకకు లాగుచు సారంగివాద్యమును వాయించుదురని గ్రహించునది.

## సితార్ వాద్య వివరము.

సితార్ వాద్యము:- ఉత్తర భారతదేశములో విశేష ప్రచారములోనున్న హిందూస్థానీ సంగీత వాద్యములలో "సితార్" ఒక ముఖ్య వాద్యముగా పరిగణింపదగును. ఇది వాద్య విభాగములో తంతివాద్య రకమునకు చెందును. దీని ధ్వని సున్నితముగాను మనోహరముగాను యుండుటచే శాస్త్రీయ హిందూస్థానీ సంగీత కచ్చేరీలందేగాక లలితకళ, లలిత సంగీతములందును, నాట్యప్రదర్శనములందుకూడ దీనిని వుపయోగించటం కద్దు. దీనిలో ముఖ్యమైన తంత్రులు 4 వుండును. ఇవి సంగీతమును ప్రదర్శించుట కుపయోగపడును. ఇవిగాక యింకను 14 సహాయ తంత్రులుండి వాద్యమునందు ప్రధానమైన ఆయాస్వరములకు ప్రతిధ్వనినిచ్చుటకుపయోగపడుచుండును. సితార్‌లో 20 మెట్లుండును. అవిఆయారాగ స్వరములకనుగుణముగా స్వరస్థానముల నేర్పరచుటకైకదల్చుటకు వీలుగానుండును. వాదకుడు తాను ప్రదర్శింపబోవు రాగముయొక్క స్వరముల కను గుణముగా మెట్లను ముందుకుగాని, వెనుకకుగాని లాగి సర్దుబాటుచేసుకొనుట ద్వారా స్వరస్థానముల నిర్ణయించుకొని ప్రదర్శించును. "ఎస్రాజ్" వాద్యమునందువలె దీనిలో కూడ తంత్రులనమర్చి కావలసిన శ్రుతికి సరిచేసికొని కుడిచేతివ్రేళ్ళతో మీటుచూ, ఎడమచేతివ్రేళ్ళతో తంత్రుల నదుముచూ వాద్య మొనస్తురు.

## సరోద్ వాద్య వివరము.

సరోద్ వాద్యము:- ఇదియును ఉత్తర భారతదేశంలో విశేషంగా నుపయోగించు హిందూస్థానీ సంగీత వాద్యములకు చెందిన తంతివాద్యమగును. దీనికి సితార్ వాద్యము

వాద్యము వినుటకెంతయు యిష్టముగా నుండును. ఇందుకు ముఖ్యకారణము దీని ఆకారమునకు తగినట్లుగా దీని ధ్వనికూడ మిక్కిలి సున్నితముగాను, మనోహరముగాను వుండుటేయగును. సితార్ వాద్యమునందువలె దీనిలోకూడ ఆయా రాగస్వరములకు తగినట్లుగా మెట్లను కదల్చుటకు వీలుండును. ఆమెట్లపైన ప్రధానమైన తంత్రులు వేయ బడును. మరియు సారంగిలోవలె యీ "సయూరి"లోకూడ ప్రతిధ్వనినిచ్చు అవసపు సహాయ తంత్రులుకూడవుండి వాద్యమునందు సామరస్యమును కలిగించుచుండును. కను కనే దీనినిసితార్, సారంగి వాద్యముల కలయిక వాద్యముగా చెప్పుటకు కారణమైనది.

## దిల్‌రుబావాద్య వివరము.

దిల్‌రుబావాద్యము:- హిందూస్థానీ సంగీతమునందుపయోగించు తంతివాద్యములలో "దిల్‌రుబా"నుకూడ నొక ముఖ్య వాద్యముగా చెప్పవచ్చును. ఉత్తర భారతదేశంలో నీ వాద్యము మిగుల ప్రచారమునందుగలదు. ఈవాద్యము మాధుర్యమైనట్టియు, గంభీర మైనట్టియు ధ్వని గలిగినదగుటచే తనిగా (సోలో) ప్రదర్శించుటకుకూడ మిగుల తగి యున్నది. సుప్రసిద్ధులైన దిల్‌రుబావాద్యకులు దీనిని ప్రదర్శించునపుడు వినుట కెంతయు రంజకముగా నుండును. ఇది మీటు వాద్యమునకు చెందిన తంతివాద్యమగును.

## తంబురవాద్య వివరము.

తంబురవాద్యము:- ప్రాచీన కాలము నుండియు భారతీయ సంగీతములగు కర్నా టక, హిందూస్థానీ సంగీతముల రెంటికిని ముఖ్యంగా నుపయోగించు "శ్రుతి" వాద్య ములలో "తంబుర" అతిప్రధానమైనదియు, విశిష్టమైనదియుగా చెప్పదగును. ఇది తంతి వాద్యరకమునకు చెందును. శ్రుతినిప్రదర్శింపజేయుట కుపయోగింపబడుటచే దీనిని "డ్రోన్" అని చెప్పుదురు. తంబుర శ్రుతి జీవముగలదిగా నుండుటచే ప్రతి సంగీత ప్రదర్శనమునందును దీనినే వుపయోగించడం జరుగుచున్నది. తంబురను సరిగా శ్రుతి చేయుటకుగాని, మీటుటకుగానితగినఅనుభవము, శ్రుతిజ్ఞానము యవసరము. కనుకనే నేటికిని కొందరు గాయకులు తంబురను సరిగా శ్రుతిచేయుటకుగాని, మీటుటకుగాని తగిన యనుభవమును గడింపజాలకున్నారు.

తంబురలోని రకములు:— ఇవి ముఖ్యముగా రెండు రకములుగా నున్నవి. (1) దక్షిణదేశపు తంబురలు (2) ఉత్తరదేశపు తంబురలు. తంబురలను తయారుచేయు కట్టెలుయేవనగా (1) దక్షిణ దేశపు తంబురలను ముఖ్యంగా పనసకట్టెతో తయారుచేయు

ఉండును. ఇందుకుముఖ్యకారణముపనసకఱ్ఱనుకోతో స్థముగనుంచుటచేధ్వనియెల్లప్పుడునుఒకే విధముగాను,గంభీరముగానువుండును.ఒక్కొక్కప్పుడుపిగినకఱ్ఱ కూడ వుపయోగింతురు అయితే పీటు (బ్రిడ్జి)కును, చిరడాలకుమాత్రము దంతపుకఱ్ఱగాని, బ్లాక్‌వుడ్‌గాని వుపయోగింతురు. (2) ఉత్తరదేశపుతంబురలలో కూడ దండము వగైరాలను పనసకఱ్ఱతోనేచేసినప్పటికిని కుండమాత్రము సొరకాయ బుఱ్ఱతోనే తయారుచేయుదురు. గనుక యీ తంబురలుగంభీరమైన ధ్వనిని కలిగియుండును.

తంత్రుల వివరము:— తంబురకు ముఖ్యముగా 4 తంత్రులుండును. వాటిలో మూడు ఉక్కు తంత్రులుగను, ఒకటి యిత్తడి తంతిగాను వుండును.

సప్తతంత్రులతంబుర:- పూర్వవాగ్గేయకారుడైన "షట్కాలగోవిందమారార్" అను వారి తంబురకు 7 తంత్రులుండి, అందు 3 తంత్రులు మంద్ర పంచమములుగాను, 3 తంత్రులు మధ్యషడ్జములుగాను, ఒక తంతి మంద్ర షడ్జముగాను శ్రుతి చేయబడినట్లు చెప్పుదురు. కాని అట్టి తంబురలు యీ కాలములో నెచ్చటను కనుపడుటలేదు.

తంత్రులనువేయువిధము:-తంబురకుగల 4 తంత్రులయొక్క ఒకకొనను పీటువెనుక భాగమున ముడివేసి రెండవకొనను పీటుమీదుగా పైనుండుచిరడాలకు చుట్టి బిగింతురు.

శ్రుతిచేయువిధము:- ఇది రెండువిధములుగాను వుండును. 1. పంచమశ్రుతి. 2. మధ్యమశ్రుతి యగును.

పంచమశ్రుతిచేయు విధము:- తంబురకుగల 4 తంత్రులలో మొదట 2, వ 3 వ, తంత్రులను మధ్యషడ్జములుగాను 1 వ, తంతిని మంద్రపంచమముగాను 4 వ తంతిని మంద్రషడ్జముగాను శ్రుతిచేయుదురు. దీనినే పంచమశ్రుతియని చెప్పబడును.

మధ్యమశ్రుతిచేయువిధము:- పైనదెలిపిన పంచమశ్రుతియందుగల1 వ, తంతియగు మంద్రపంచమమును, మంద్ర మధ్యమముగా శ్రుతిచేసినచో అట్టిదానిని మధ్యమశ్రుతి యని చెప్పబడును.

శ్రుతిచేయుటలో గమనింపదగు విషయములు:- తంత్రులయొక్క బలము ననుసరించి తంబురలో 1 మొదలు 4½ లేక 5 శ్రుతివరకు శ్రుతిచేయవచ్చును. కాని అంతకు మించి హెచ్చు శ్రుతిచేయుట ముఖ్యముగా తంత్రులుతెగుటకు కారణమగును.

శ్రుతివేయువిధము:- తంబురకుగల 4 తంత్రులను మీటునప్పుడు కుడిచేతి మణికట్టును కుండపైన ఆనించి మధ్యవ్రేలితో 1వ, మంద్రపంచమమును, చూపుడువ్రేలితో 2 వ, 3 వ, తంత్రులగు మధ్య షడ్జములను, 4 వ, మంద్ర షడ్జమును మీటుచూ శ్రుతి

వేయవలెను. అట్లు మీటుటలో [illegible] శ్రుతిగాను, ధ్వనిజీవముతో పలుకునట్లుగాను శ్రుతి మారకుండునట్లుగాను, గాత్రసంగీతమునకు గాని, లేక వాద్యసంగీతమునకు గాని అనుకూలముగా నుండునట్లుగా మీటవలెను.

జీవాళి నుపయోగించువిధము:- తంబురను సరిగా శ్రుతిచేసిన తరువాత కొంచెము పులస్ గాని, లేక కంబళిసీమగాని తీసికొని దానిని పీటకును తంత్రులకును మధ్యగా కూర్చి ఎడమచేతితో ముందువైపునకు లాగుచు కుడిచేతితో ఆ తంత్రిని మీటుచుండవలెను. అట్లు చేయుటలో నియుక్తస్థానములోనికి జీవాళి వచ్చునప్పుడు తంత్రిలో స్వయంభూస్వర మేర్పడి అది ఆధారశ్రుతిలో శ్రేష్ఠమైనట్టి జీవముగల ధ్వనిగా నుండును.

ఈవిధముగా 4 తంత్రులకు జీవాళిని నుపయోగించినపుడు ఆ శ్రుతి గంభీరముతో కూడిన జీవముగలదై వినుటకు రంజకముగా నుండుటయేగాక పాడుటకు ఉత్సాహముగా కూడ నుండును.

ఏక్ తార్:- అతి ప్రాచీన కాలంలో శ్రుతికి "ఏక్ తార్" ను నుపయోగించెడి వారు. దీనిలో ఒకే తంత్రి యుండును. ఆ తంత్రిని ఆధారశ్రుతియగు మధ్యషడ్జముగా శ్రుతి చేసి పాడుచుండెడివారు. ఈ కాలములో సాధారణంగా దీనిని సాధువులు మాత్రమే ఉపయోగిస్తూ భక్తి గేయములు, తత్వగేయములు పాడుచుందురు.

ఏక్ తార్ తయారుచేయు విధము:- ఒక గుండ్రని గుండిన సొరకాయబుఱ్ఱకు పై మూయు 2 లేక 2½ అంగుళముల వెడల్పుగల [illegible] మూర్చి, బిగించి ఒక వెదురుకర్రయొక్క ఒక కొనను క్రిందిభాగమున ముడివేసి [illegible] పైభాగమున బిరడాను బిగించి కావలసిన శ్రుతికి బిగించి సరిచేయుదురు.

స్వరదము:— (Tuning Fork) ఇది శ్రుతివాద్యము కాకపోయినను కొన్ని నిశ్చితమైన శ్రుతులను తెలుపునట్టి ఒక లోహ పరికరమగును. దీనిలో సాధారణముగా 1 మొదలు ౭ లేక ౭½ వరకు శ్రుతులను తెలుపునట్టి గీతలుండును. ఆ గీతలపైన కదల్చుటకు వీలుగల ఒక ముల్లుండును. ఆ ముల్లును మనకు కావలసిన శ్రుతికి తగినట్లు ఆయా గీతలమీదకు ముల్లును లాగి కొట్టినచో మనము నిర్ణయించుకొనిన శ్రుతి వినపడును. గాయకులుగాని, వాదకులు గాని, హార్మోనియము లేకనే దీని సహాయముతో తంబురను గాని లేక తదితర తంతి, చర్మవాద్యములనుగాని కావలసిన శ్రుతి చేసుకొనుటకు ఇది ఎంతయు నుపయోగపడును. కనుక గాయకులుగాని వాదకులుగాని యీ ట్యూనింగ్ ఫోర్క్ ను వుంచుకొనుట ఎంతయు అవసరమగును.

## వేణువాద్య వివరము.

(i) వేణువుయొక్క ప్రాచీనత :— సంగీతమును ప్రదర్శించుట కుపకరించు వాద్యము లన్నిటి (Musical Instruments)లో నాళములు(రంధ్రములు)గల వాద్యములు మిక్కిలి పురాతనమైనవని చెప్పవచ్చును. ప్రాచీన సంగీత గ్రంథములన్నిటిలోను యీ నాళములుగల వాద్యములు బహువిధములుగా నుండి వాడుకయందున్నట్లును, అందును ముఖ్యంగా వేణువు (Flute) సమస్త జాతులవారి ఆమోదమును బడసినట్లును దెలుపబడెను. అయితే పూర్వకాలంలో నీ వేణువు, అనేక రూపములతోను, అనేక పేర్లతోను వ్యవహరింపబడుచుండెను. కాని వీటిలో ముఖ్యంగా ప్రాచీన గ్రంథము లన్నిటిలోను పేర్కొనబడిన "వంశము" అనునదియును, బృందావనములోని గోపికలను సంతృప్తులుగా నొనర్చిన శ్రీకృష్ణభగవానుని "మురళీ" అనునదియును వేరువేరు జాతులకు చెందిన వేణువులని తెలియుచున్నది.

(ii) వేణువుయొక్క ధ్వనిని కనుగొనిన విధము :— వేణువునుండి ధ్వని యెటుల జనించునదియును, దానిని సంగీతమున కెటుల నుపయోగించునదియును మానవునికి మొదట స్ఫురించుట నిజంగా ఆశ్చర్యకరమైన విషయమగును. జీవితమున కవసరమగు వస్తువులను సేకరించుటకై మానవుడు అడవులందు దిరుగునప్పుడు అచ్చటగల వెదురుపొదలలోని గొట్టములనుండి జనించు శ్రావ్యమగు ధ్వనిని వినుట జరిగెను. అట్టి ధ్వని వెదురుగొట్టములందు తుమ్మెదలు మొదలైన పురుగులు వాటికి కావలసిన ఆహారము నిమిత్తమై తొలచిన రంధ్రములనుండి గాలి తీవ్రముగా ప్రసరించుటచే యేర్పడియుండునని అతడు తన సూక్ష్మదృష్టివలన గ్రహించగలిగెను.

(iii) వేణువు నుత్పత్తిచేసిన విధము :— వెదురునందు ధ్వని పుట్టుటను కనుగొనిన పిమ్మట మానవుడు వెదురుగొట్టములందు గాని, లేక తత్సమానమైన యితర గొట్టములందు గాని రంధ్రములను పొడిచి అందు గాలిని ప్రసరింపజేయుటవలన గానయోగ్యమైన ధ్వనిని జనింపజేయవచ్చునని తెలిసికొనెను. గనుక మొట్టమొదట, కొన్ని రంధ్రములతో గొట్టమును తయారుచేసి కొన్ని స్వరములను, తరువాత సప్త రంధ్రములతో గొట్టమును తయారుచేసి సప్త స్వరములను పలికించు నుపాయమును కనిపెట్టియుండెను. ఈ యేడు రంధ్రములను కుడివైపునుండి ఎడమవైపునగల వక్త్రరంధ్రమువైపు వరుసగా తెఱచుటచే సప్త స్వరములయొక్క ఆరోహణ క్రమమును, ఇట్లే ఎడమవైపునుండి కుడివైపునకు ఒక్కొక్క రంధ్రమును మూయుటచే అవరోహణ

క్రమమును యేర్పడుట జరిగెను. ఈ విధముగా క్రమక్రమముగా చేసిన పరిశోధనల వలన ఒక స్థాయిలోని శ్రుతి భేదములను కనుగొనెను. మేళకర్త రాగలక్షణములను గ్రహించిన పిమ్మట మానవుడు వక్త్ర రంధ్రము (Mouth hole) నుండి వ్రేలిరంధ్రములవఱకుగల యంతరములను (Distances) నిర్ధారణ చేయుటకు ప్రయత్నించెను. అందువలన వేర్వేరైన స్థాయిల ననుసరించి వేర్వేరు విధములగు వేణువు లుత్పత్తి చేయుట యవసరమయ్యెను. కాని అప్పటివఱకు వ్రేలిరంధ్రములను కొద్దిగా తెఱచుటచే కోమల స్వరములను(Minor tones)బలికించు విధమును మాత్రము తెలిసికొనుట జరిగియుండలేదు.

A B C D E F G H I J K



ఇది 163 వ, పుటలో పేర్కొనిన అసలు వేణువు సైజులో ⅓ వ, వంతు యుండును.

(iv) వేణువులో స్వరభేదములను కనుగొనిన విధము :— కోమల స్వరములను బలికించుట తెలిసికొనిన తరువాత కొంతకాలమునకు మానవుడు రాగములయొక్క మార్పు ననుసరించి వేణువుయొక్క గొట్టములనుగూడ మార్చుట శ్రమదాయకమని తోచి ఒకే గొట్టమునందు రంధ్రములను కొద్దిగా మూయుటచే స్వరభేదములను పలికించు విధమును కనుగొనెను. ఆ తరువాత మంద్రస్థాయి స్వరములను బలికించుటకు 8వ, రంధ్రముకూడ యవసరమని స్ఫురించినందున గొట్టమునకు 8వ, రంధ్ర మేర్పఱచుటయేగాక 2½ స్థాయిలలో స్వరములను బలికించుటకై వ్రేళ్ళ నుపయోగించు విధముకూడ తెలుసుకొనబడెను.

(v) వేణువు పటములో A నుండి K వఱకుగల గుఱుతుల వివరము :-పై వేణువు పటములో "A" గుర్తుగలది మూయబడిన చివర భాగమగును. "B" గుర్తుగలది ఊదునట్టి రంధ్ర (Mouth hole) మగును. "C" గుర్తుగలది 1వ, వ్రేలును "D" గుర్తుగలది 2 వ వ్రేలును, "E" గుర్తుగలది 3 వ, వ్రేలును, "F" గుర్తుగలది 4 వ, వ్రేలును, "G" గుర్తుగలది 5వ, వ్రేలును, "H" గుర్తుగలది 6వ, వ్రేలును, "I" గుర్తుగలది 7వ, వ్రేలును, "J" గుర్తుగలది 8వ వ్రేలును యుంచునట్టి రంధ్రములగును. "K" గుర్తుగలది తెఱచియున్న చివరభాగములోని రంధ్రమగునని గ్రహింపదగును.

(vi) వేణువుయొక్క వివిధరకములు :— వేణువు జాతికిచెందిన వాద్యములలో పలురకములు గలవు. వాటిలో కొన్ని నోటితోను, కొన్ని ముక్కుతోను వూదుటచే పలికింపబడునవిగా నున్నవి. హిందూస్థానీ "గళోదనము" వాయునట్టి

“శ్రాగి” అను వాద్యము రెండవ రకమునకు సంబంధించిన వేణువగును. సంగీత రత్నాకర గ్రంథకారుడైన శ్రీశార్ఙ్గదేవుడు ఆ కాలములో వాడుకలోనున్న వివిధములగు వేణువులను గూర్చి పేర్కొనియుండెను. వాటిలో ఒక్కొక్క దానికొక వక్త్ర రంధ్రము (Mouth hole) న్నూ, సంఖ్యాభేదముగల కొన్ని వ్రేలిరంధ్రము లున్నటుల పేర్కొనెను. అవి యేవనగా (1) వంశము. (2) పావము. (3) పావికా. (4) మురళీ. (5) మధుకరీ. (6) కాహళము (7) తుండకినీ. (8) చుక్కా. (9) శృంగము. (10) శంఖము. అనునవి యగును. ఇప్పటికాలమున వాడబడుచున్న వేణువు (Flute) పైన దెలిపిన పట్టికయందుగల 1వ, దైన “వంశము”నకు చాలవరకు సరిపోవునని గ్రహించదగును.

(vii) వేణువుయొక్క పరిమాణ వివరము :— శార్ఙ్గదేవుడు తన కాలమునందు వేణువులో వక్త్ర రంధ్రమునుండి వ్రేలిరంధ్రమువరకు గల యంతరములను సూచించి అనేక భేదాభిప్రాయము లుండినట్లు పేర్కొనెను. మరియు వేణువుయొక్క లోపలి వ్యాసము (Diameter) షుమారు 1 అంగుళ ముండవలెననియు, వ్రేలిరంధ్రములు మొత్తము 8 వుండవలెననియు, ప్రతి వ్రేలిరంధ్రముయొక్క సైజు బదరీ(రేగు)విత్తనము చొరబడునంత ప్రమాణ ముండవలెననియు కూడ తన గ్రంథములో పేర్కొనెను.

(viii) శిలప్పాధికార గ్రంథములో పేర్కొనిన వేణువు కొలతలు :— అతి ప్రాచీన ద్రావిడ గ్రంథమగు “శిలప్పాధికారము”లో వేణువుయొక్క కొలతలను యీ క్రిందివిధముగా తెలుపబడెను. వేణువుపొడవు 20 అంగుళములుగను, మందము లేక పరిధి (Circumference) 4½ అంగుళములుగను, వ్రేలిరంధ్రముయొక్క కైవారము వడ్లగింజ ప్రమాణముగను, యుండి అట్టి వేణువు వంకరలేకను, రెండువైపుల గణుపులు లేకను, ఎడమవైపు రంధ్రమును లక్కతోగాని, మరి యేయితర పదార్థముతోగాని మూసియుండును, దానికిని వక్త్రరంధ్రమునకుగల దూరము 2 అంగుళములుగను, వక్త్రరంధ్రమునుండి వ్రేలిరంధ్రమునకుగల దూరము 7 అంగుళములుగను, 8వ, రంధ్రమునకును, దాని ప్రక్కనుండు చివరభాగమునకును గల దూరము 2 అంగుళములుగను యుండి ఈమధ్య ప్రదేశములోనుండు 8 వ్రేలిరంధ్రములును ఒకేవరుసలో జూటిగా నుండవలెనని పేర్కొనబడెను. మరియు నిటుల తయారుచేయబడిన వేణువునందు సహజముగా “హరికాంభోజిరాగము” జనించుననియు చెప్పబడెను. కాని వ్రేలి రంధ్రముల నుపయోగించు విధానము మాత్రము (Fingering) పై గ్రంథములలో పేర్కొనబడిన విధమునకును, యిప్పటి కాలములో వాడుచున్న పద్ధతికిని కొంత

వ్యత్యాసముగలదు. అయితే సప్త రంధ్రములను ఎడమచేతి 3 వ్రేళ్ళతోను కుడిచేతి 4 వ్రేళ్లతోను మూయుపద్ధతి మాత్రము "శిలప్పాధికారము" అను గ్రంథములోను, తదితర సంగీత గ్రంథములలోను ఒకే విధముగా పేర్కొనబడినటుల గ్రహించదగును.

(ix) వేణువును తయారుచేయుట కుపయోగించు వస్తువులు :— (1) వైణవ (వెదురు) (2) కేదార (యజ్ఞస్తంభమున కుపయోగించుకఱ్ఱ) (3) దంతము (4) శ్రీగంధపు చెక్క (5) చందనపుకఱ్ఱ (6) రక్తచందనపుకఱ్ఱ (7) ఇనుము (8) కంచు (9) వెండి (10) స్వర్ణము మొదలగునవి యగును. అయితే పైవాటిలో వెదురు అన్నిటికంటె శ్రేష్ఠమైనదగును. ఇందుకు ముఖ్యకారణము వెదురులోనుండి వచ్చు ధ్వనియొక్క ప్రాశస్త్యమును, ప్రతిధ్వని యిచ్చు దానిలోని స్వభావమును యగునని గ్రహించునది.

(x) వేణువుగొట్టమున కుండవలసిన లక్షణములు:— ఏవనగా?

(1) వెదురుగొట్టము సూటిగానుండి వంకరగాని, గణుపులుగాని, గుంటలుగాని, బుడుపులుగాని లేకుండవలెను.

(2) వెదురుగొట్టము మిక్కిలి పాతదిగాకను, క్రొత్తదిగాకను యుండవలెను.

(3) వెదురు అడవిలో నున్నప్పుడు గాలికి యిటు అటు కదలనిదిగా నుండవలెను.

(4) తుమ్మెదలు మొదలైన పురుగులు రంధ్రములు పొడవనిదిగా నుండవలెను.

(5) అట్టి వెదురుపండినదై, కనీసము ఒక సంవత్సరమైన నీడలో నుండి యెండ తగలనిదై యుండవలెను. అయితే కొందరు సరియైన గొట్టములు దొరకనందున ఒక్కొక్కప్పుడు గణుపులుగల గొట్టములనుకూడ వాడుట జరుగుచుండును.

(xi) వేణువుయొక్క ధ్వనిపోలిక వివరము :— సంగీత వాద్యములలో మానవుని కంఠధ్వనికి అనేకవిధముల సరిపోల్చదగిన వాద్యము "వేణువని" చెప్పవచ్చును. కారణమేమనగా! ఈ రెంటిలోను 2½ స్థాయిలు మాత్రమే పలుకుచుండుటయును, ఒక్కొక్క పర్యాయము ఒక స్వరము మాత్రమే పలుకుటయును, మరియు జంట స్వరములు పలికించు విధానముకూడ రెంటిలోను ఒక్కటిగా నుండుటయు నగును.

(xii) వేణువు నభ్యసించు క్రమము :— (1) వేణువులోని వక్త్ర రంధ్రము (Mouth hole) యొక్క అంచును క్రింది పెదవికి ఆనించుటయును (2) వేణువును రెండు చేతుల వ్రేళ్ళతో పట్టుకొని మట్టముగా నుంచుటయును, (3) వ్రేలిరంధ్రములలో మొదటి మూడు రంధ్రములను ఎడమచేతి 1, 2, 3 వ్రేళ్ళతోను, 4, 5, 6, 7 రంధ్రములను కుడిచేతి 1, 2, 3, 4 వ్రేళ్ళతోను మూయుటకును, తెఱచుటకు సిద్ధముగా

ఉంచుకొనుట మొదలగునవి వేణువాద్యము నభ్యసించుటలోగల ముఖ్యవిధులని తెలియదగును. వ్రేలిరంధ్రములు కుడిచేతివైపుననుండులాగున వేణువును పెదవికిచేర్చి పట్టుకొనవలెను. ఇటుల వేణువును పెదవికి ఆనించి వక్త్ర రంధ్రములోనికి నోటితో గాలిని పూదుటచే వేణువునందు సుశ్రావ్యమైన ధ్వని యేర్పడుచున్నది. ఈ ధ్వని కలిగిన పిదప వ్రేళ్ళతో రంధ్రములను మూయుట, తెఱచుటవలన వివిధములగు స్వరములీ దిగువను తెలిపిన విధమున యేర్పడుట గమనించదగును.

(xiii) వేణువునందు సప్తస్వరములను పలికించు విధము :— ఎట్లనగా?

[1] స — అనెడి స్వరము మొదటి 1, 2 రంధ్రములను మూసి నోటితో గాలి నూదుటచేతను,

[2] రి—అనెడి స్వరము 1వ, రంధ్రమునుమూసి నోటితోగాలి నూదుటచేతను

[3] గ — అనెడి స్వరము అన్ని రంధ్రములను తెఱచి నోటితో గాలి నూదుటచేతను,

[4] మ — అనెడి స్వరము మొదటి రంధ్రమును తెఱచి మిగిలిన రంధ్రము లన్నిటిని మూసి నోటితో గాలి నూదుటచేతను,

[5] ప — అనెడి స్వరము మొదటి 5 రంధ్రములను మూసి నోటితో గాలి నూదుటచేతను,

[6] ధ — అనెడి స్వరము మొదటి 4 రంధ్రములను మూసి నోటితో గాలి నూదుటచేతను

[7] ని — అనెడి స్వరము మొదటి 3 రంధ్రములను మూసి నోటితో గాలి నూదుటచేతను పలుకింపబడుచున్నవి.

అయితే తారషడ్జము మాత్రము పైన తెలిపిన మధ్యషడ్జమువలెనే మొదటి 1, 2 రంధ్రములను మూసి నోటితో దార్ఢ్యముగా, గాలిని పూదుటచేతనే పలికింపవచ్చునని గ్రహించదగును. ఇదేవిధముగా తారస్థాయిలో స, రి, గ, మ వఱకును, మధ్యస్థాయి స్వరములనువలెనే ఆయా రంధ్రములను మూసి దార్ఢ్యముగా, గాలి నూదుటచేత పలికింపవచ్చును. పైవిధముగా అతిస్వల్పముగా గాలి నూదుటచేత మంద్రస్థాయిలోని స్వరములను పలికింపవచ్చును. మొదటి రంధ్రముల ధ్వనిని షడ్జముగా భావించుటచేత మొత్తముమీద వేణువులో 2½ స్థాయిలందు స్వరములను పలికించవచ్చును. కనుక యీ పద్ధతియే మిగుల వుత్తమమైనదని స్పష్టపడుచున్నది. మంద్రస్థాయి విషయ

మును పలికించునప్పుడు 4వ రంధ్రమును ఎడమచేతి చిటికెన వ్రేలుతో మూసి, 5, 6, 7, 8 రంధ్రములను కుడిచేతి 4 వ్రేళ్ళతో మూసి గాలి నూదినచో యేర్పడును. మంద్ర షడ్జమును పలికించునప్పుడు మంద్రరిషభమువలెనే రంధ్రములను మూసి వేణువును లోనికి త్రిప్పుకొని బహుస్వల్పముగా, గాలి నూదిన యేర్పడును. ఇటుల స్వరములను పలికించునప్పుడు సరియైన వేణువునందు అప్రయత్నముగా "హరి కాంభోజిరాగము" స్వరూపమునని గ్రహించునది.

(xiv) తారస్థాయి పంచమము పలికించు విధము :— తారస్థాయి పంచమమును పలికించుట మాత్రము అనుభవమువలన సాధింపవలసినదే కాని దానిని ఒక క్రమపద్ధతికి లోబడి పలికించటం జరుగుటలేదు. ఇందుకు ముఖ్యకారణమేమనగా అయా వేణువుల గొట్టముల ననుసరించి, ఒక్కొక్క గొట్టమునందు ఒక్కొక్క విధముగా వాయించుటచేతనే అది పలికింపబడుట యీ దిగువను తెలుపుట గమనించునది. [1] కొన్ని గొట్టములలో తారషడ్జమువలె మొదటి రెండు రంధ్రములను ఎడమచేతి 1, 2 వ్రేళ్ళతో మూసి అతిదార్ఢ్యముగా నూదుటచేతనే తారస్థాయి పంచమము పలికింపబడుచున్నది. [2] కొన్ని గొట్టములలో మధ్యస్థాయి పంచమమువలె మొదటి అయిదు రంధ్రములను మూసి అతి దార్ఢ్యముగా నూదుటచేతనే తారపంచమము పలికింపబడుచున్నది. [3] మరికొన్ని గొట్టములలో మధ్యస్థాయి నిషాదమువలె మొదటి మూడు రంధ్రములను మూసి అతి దార్ఢ్యముగా నూదుటచేతనే తారస్థాయి పలికింపబడుచున్నది. ఈ విధంగా పలికింపబడుటకు కారణము గొట్టములయొక్క వ్యాసము, కైవారము, వక్త్రరంధ్రమునకు దాని ప్రక్క చివరకుగల దూరము, మొదలగు వాటియందుగల వ్యత్యాసములవల్లనే గలుగుచున్నదని తెలియదగును.

(xv) జంటస్వరముల నభ్యసించు విధము :— జంటస్వరములనగా ఒకే స్వరమును రెండుసార్లుగాని, ఎక్కువ పర్యాయములుగాని వెంట వెంట పలికించుటను, జంట స్వరములు లేక జంటవరుసలని చెప్పబడును. ఉ॥ సస— రిరిరి – గగగగ — మమమమమ మొదలగునవి. ఈ జంటస్వరములను పలికించు నైపుణ్యము వేణువాద్యమున కత్యంతా వశ్యకమగును. నోటినుండి వూదుగాలిని నిలిపి, నిలిపి యూదుటచేత జంటస్వరములను పలికింపవచ్చును. కాని ఈ పద్ధతి అంత మంచిదిగాదు. ఈ జంటస్వరములను స్పష్టంగాను, రంజకంగాను పలికించుట వ్రేళ్ల నుపయోగించు అభ్యాసమువల్లనే సాధింపవలయును. అయితే యిది కొంచెము కష్టమైనపని గనుక మొదట గాలి నూదుటచే పలికించి క్రమ క్రమంగా వ్రేళ్ళను వుపయోగించుట ద్వారానే పలికించవచ్చును. అనగా "స స" అనుస్వరములను ప్రథమమున "స స" యన్ని ఒకసారి వూది పలికించి

నిలిపి, మరల "స" యని పూదవలెను.ఆ తరువాత వ్రేళ్లతో పలికించవలెను. వ్రేళ్లతో పలికించుటలో యీ క్రింది విషయములు గమనించవలెను.

"స స" యని పలికించుటలో "స" స్వరమును పలికించి 8వ రంధ్రమును ఎడమచేతి 8వ వ్రేలితో ఒక్కమారు హఠాత్తుగా మూసి వెంటనే తెఱచినయెడల రెండు "స" స్వరములకు మధ్య బహుస్వల్పకాలములో "ని" స్వరము పలుకునట్లుం డును. కాని అది అతిస్వల్పకాలము వినపడుటచే పలికియు, పలకనట్లుండును. గనుక "ని" అనునది శబ్దించిన విషయము చెవికి తెలియదు. ఈ కారణమున "స" అను స్వరము ఒక ముహూర్తకాలము ఆగి మరల శబ్దించినటుల వినపడును. ఇదేవిధముగా తక్కిన జంటస్వరములుకూడ నభ్యసింపదగును. అయితే యిట్లు చేయుటలో కొన్ని ముఖ్య విషయములనుకూడ గమనింపవలెను.

[1] స్వల్పకాలము పలికినట్లుండు మధ్యస్వరమును ఒక్కొక్కప్పుడు రంధ్రమును పూర్తిగా మూయక వెంటనే వ్రేలితో కొట్టుటవల్లనే పలికింపవచ్చును. [2] అటుల కొట్టుటలో రంధ్రమును పూర్తిగా మూయరాదు. [3] రంధ్రముయొక్క అంచును మాత్రము వ్రేలితో తాకి చివాలున వ్రేలినియెత్తి వేయవలెను. ఏయే జంటస్వరముల నెట్లు పలికింపవలసినది యీ క్రింద దెలుపుట గమనించతగును.

స స — మొదట షడ్జమును బలికించి తదుపరి ఎడమచేతి 8వ వ్రేలితో 8వ వ్రేలి రంధ్రముయొక్క అంచును చివాలున తాకి వ్రేలిని యెత్తవలెను.

రి రి — మొదట రిషభమును పలికించి తరువాత రెండవ వ్రేలి రంధ్రముయొక్క అంచును ఎడమచేతి రెండవ వ్రేలితో కొట్టి యెత్తివేయవలెను.

గ గ — మొదట గాంధారమును బలికించి తరువాత మొదటివ్రేలి రంధ్రపు టంచును మొదటి ఎడమచేతివ్రేలితో చివాలున కొట్టి యెత్తివేయవలెను.

మ మ — మొదట మధ్యమమును పలికించి తరువాత మూడవ రంధ్రమును ఎడమచేతి మూడవవ్రేలితో వెంటనేమూసి యెత్తివేయవలెను.

ప ప — మొదట పంచమమును బలికించి తరువాత ఆఱవ రంధ్రపు టంచును కుడిచేతి మూడవవ్రేలితో వెంటనే కొట్టి యెత్తివేయవలెను.

ధ ధ — మొదట ధైవతమును బలికించి తదుపరి అయిదవ వ్రేలి రంధ్రపు టంచును కుడిచేతి రెండవవ్రేలితో చివాలున కొట్టి యెత్తివేయవలెను.

ని ని — మొదట నిషాదమును బలికించి తరువాత 4వ, ౹వేలిరంధ్రపు టంచును కుడిచేతి మొదటి౹వేలుతో చివాలున కొట్టి యెత్తివేయవలెను. తారస్థాయిలోని స్వరములనుకూడ నిదేరీతిని పలికించవలెను.

(xvi) శుద్ధ వికృతి స్వరముల వివరము :— సప్తస్వరములలో షడ్జ, పంచమములు తప్ప మిగతఅయిదు స్వరములు ధ్వనియందు భేదమునొంది ద్వివిధము లగుచున్నవి. అవి కర్నాటక సంగీతము నందొక రీతిగను, హిందూస్తానీ సంగీతమునందొక రీతిగను, పాశ్చాత్య సంగీతము నందొక రీతిగను పేర్లను గలిగియుండుట నీ క్రింద గమనించవలెను.

| కర్నాటక సంగీతమందలి పేర్లు. | హిందూస్థానీ సంగీతమందలి పేర్లు. | పాశ్చాత్య సంగీతమందలి పేర్లు |
|---|---|---|
| 1. షడ్జము | ... షడ్జము | ... C |
| 2. శుద్ధరిషభము | ... కోమల రిషభము | ... D Flat |
| 3. చతుశ్రుతి రిషభము | ... తీవ్రరిషభము | ... D |
| 4. సాధారణ గాంధారము | ... కోమల గాంధారము | ... E Flat |
| 5. అంతర గాంధారము | ... తీవ్ర గాంధారము | ... E |
| 6. శుద్ధ మధ్యమము | ... కోమల మధ్యమము | ... F |
| 7. ప్రతిమధ్యమము | ... తీవ్రమధ్యమము | ... F Sharp |
| 8. పంచమము | ... పంచమము | ... G |
| 9. శుద్ధ ధైవతము | ... కోమల ధైవతము | ... A Flat |
| 10. చతుశ్రుతి ధైవతము | ... తీవ్రధైవతము | ... A |
| 11. కైశికీ నిషాదము | ... కోమలనిషాదము | ... B Flat |
| 12. కాకలీ నిషాదము | ... తీవ్రనిషాదము | ... B |

[xvii] ద్వాదశ స్వరములను పలికించు విధము :— పైన దెలిపిన 12 స్వరములలో చ—రి, అం—గాం, శు—మ, చ—ధై, కై—నిషాదస్వరములను పలికించు విధమును యిదివరకే చెప్పబడెను. ఎటులనగా? వేణువునందు రంధ్రములను పూర్తిగా మూయుట లేక తెరచుటవలన సహజముగా "హరి కాంభోజి రాగము" యేర్పడుచున్నదని తెలుపబడెను. గనుక యిప్పుడు శుద్ధస్వరములను పలికించు విధముకూడ ఇంకా క్రింద తెలుపుటను గమనించునది.

(1) స—రి, ను మొదటి వ్రేలిరంధ్రమును మూసి రెండవ రంధ్రమును కొద్దిగా తెఱచియుంచి వూదుటవల్లను,

(2) సా—గాం, ను మొదటి వ్రేలిరంధ్రమును కొద్దిగామూసి యూదుటవల్లను,

(3) ప్ర—మ, ను మొదటి 3 రంధ్రములను మూసి 4వ, రంధ్రమును కొద్దిగా తెఱచి యూదుటవల్లను,

(4) స—ధై, ను మొదటి 4 రంధ్రములను మూసి 5వ, రంధ్రమును కొద్దిగా తెఱచియూదుటవల్లను,

(5) కా—ని, ను మొదటి రెండు రంధ్రములను మూసి 3వ, రంధ్రమునుకొద్దిగా తెఱచి యూదుటవల్లను పలికింపవచ్చును.

మరియు ష—రి, శు—గాం, ష—ధై, శు—నిషాదస్వరములను పలికించుటకు వేణువాద్యమునందు తగిన ప్రావీణ్యము కల్గిన తరువాత గాలి నూదుట, సర్దుబాటు ( **Adjustment** ) చేయుటవల్లనే సాధింపదగును.

**(xviii)** వేణువునందు గమకములు పలికించువిధము :— వేణువునందు యీ క్రింద దెలుపబడిన 3 విధములగు యభ్యాసములచేత గమకములు పలికింపవచ్చును.

(1) వేణువు నూదునప్పుడు ముఖమునుపైకి యెత్తుట చేతగాని, క్రిందికి వాల్చుటచేత గాని గమకములు పలికింపవచ్చును. ఇందువలన గొట్టములోనికి ప్రవేశించుగాలి యొక్క పరిమాణము (**Quantity**) మారును. మరియు ఊదునట్టి వక్త్రరంధ్రము యొక్క వైశాల్యముకూడా మారును.

(2) వ్రేళ్ళతో రంధ్రములను మూయుటలో చివాఱలను మూయక క్రమేణా మూయుట వల్లకూడా గమకములు పలికింపవచ్చును.

(3) ఊదునట్టిగాలి తేలికగా నూదుట, లేక గట్టిగా నూదుటవలన కూడా గమకములు పలికింప వచ్చును.

**(xix)** తుత్తుకారము వ్రేలిదెబ్బల వివరము :— ఈ వ్రేలిదెబ్బలు మధ్యమ, త్రికాల సంగతులు పలికించుటయందత్యావశ్యకమగును. వీటి రహస్యము జంట స్వరముల అభ్యాసమువల్లనే తెలియదగును. తుత్తుకారమనగా ఒక్కొక్క స్వరమును పలికించుటకు గాలిని నాలుకతో వక్త్రరంధ్రములోనికి నెట్టివేయుటయగును. తుత్తుకారము బహుశీఘ్రముగా పట్టవలెను. లేనియెడల గాలియొక్క వేగమువలన ధ్వనిచాల కఠినముగా వినవచ్చును.

(xx) వేణు వాద్యమునందు ముఖ్యముగా గమనింపదగు విషయములు :—

(1) గాలిని వూదుటలో సమానత్వము, సావధానము గలిగియుండవలెను. అనగా గాలిని ఎక్కువపోతగాని, తక్కువపోతగాని, పోయక నిలకడగా యుండునట్లు పోతపోయవలెను.

(2) ధ్వని హీనముగాగాని, కఠినముగాగాని, ప్రతిధ్వనించునట్లుగాని, వణుకుచున్నట్లుగాని యుండరాదు.

(3) గాలిని పోతపోయునప్పుడు స్వాభావికముగా నుండవలెనేగాని యెక్కువ ప్రయత్నము చేసినట్లుండరాదు.

(4) వేణువాదకునికి గాత్రపాట యందుకూడాకొంతవరకు అభ్యాసముండి తీరవలెను.

(5) వ్రేళ్ళను వాడుటలో చక్కని ప్రావీణ్యము సంపాదింపవలెను.

(6) రాగములను వాయించునపుడు రాగస్వరూపము నిర్దుష్టముగా నుండవలెను.

(7) గాలినూదుటలో బుస యేమాత్రము లేకుండునట్లు అభ్యాసము చేయవలెను.

(xxi) వేణువుయొక్క శాస్త్రము:— వేణువుయొక్క శ్రుతి, ధ్వనిసాంద్రత, (Intensity) ధ్వని స్వభావము, (Quality of note) యీక్రిందివాటిపై ఆధారపడి యుండుట గమనింపదగును.

(1) వేణువును తయారుచేయు కఱ్ఱ, లేక యితర లోహ పదార్థముపైనను,

(2) అట్టికఱ్ఱ లేక పదార్థముయొక్క మందము, బరువు (Density)ల పైనను,

(3) గొట్టముయొక్క గర్భము (Bore) నూటిగానుండి హెచ్చుతగ్గులు లేకుండుట (Uniform) పైనను,

(4) గొట్టముయొక్క కైవారము (Cross section) పైనను,

(5) వక్త్రరంధ్రమునకును, వ్రేలి రంధ్రమునకునుగల దూరముపైనను,

(6) నోటితో వూదునట్టి గాలియొక్క తీవ్రతపైనను,

(7) వక్త్రరంధ్ర యొక్క వైశాల్యముపైనను,

(8) వేలి రంధ్రములను పూర్తిగా మూయుటపైనను, లేక పార్శ్వపు మూతవంటివాటిపైనను ఆధారపడియుండును. ఈ ఆధారపడుట యేవిధముగా నుండునది దిక్రింద దెలుపుట గమనించునది.

(1) వేణువును కొయ్య, వెదురు, దంతము, గాజు మొదలగువాటితో చేయబడును. కాని అవి అన్నియు ఒకే శ్రుతిలో నుండునట్లు తయారుచేయబడినను వాటి ధ్వనులందు ఒక విధమైనతేడా వినపడును. ఉ॥ పిల్లనగ్రోవి, నాగస్వరము యీ రెండును ఒకే శ్రుతిలోనున్నను, ధ్వనియందు యెటుల తేడా వుండునో, అటే విధముగా వేణువును తయారుచేయబడిన పదార్థములనుబట్టి కూడా యీ తేడాలు వుండును.

(2) పదార్థము లావుగను, బరువుగనుయున్నచో ధ్వని సాంద్రముగాను, గంభీరముగానువుండును. పదార్థము సన్నదైనయెడల ధ్వని కీచుగానుండును.

(3) వేణువు గొట్టముయొక్క గర్భము నూటిగా లేనియెడల అనగా కైవార మెచ్చుట కొలిచినను ఒకేరీతిగా లేనియెడల ధ్వనికూడా ఒకేతీరుగా నుండదు.

(4) ఈ గర్భము ( Bore ) యొక్క వైశాల్యము యెక్కువైన యెడల ధ్వనిమంద్రము ( Deep ) గాను, తక్కువైనయెడల ధ్వని కీచుగానువుండును.

(5) వేణువులో జనించు ధ్వనియొక్క శ్రుతి, వక్త్రరంధ్రమునుండి వ్రేలిరంధ్రము వఱకుగల దూరము యెక్కువైనకొలది శ్రుతి తక్కువగను, దూరము తక్కువైన కొలది శ్రుతి యెక్కువగను వుండును.

(6) వేణువులో నూదబడునట్టిగాలి యొక్క బలము ( Force ) ను బట్టి శ్రుతియును, ధ్వనియొక్క ఆధిక్యత ( Intensity ) యును మారుచుండును.

(7) వక్త్రరంధ్రముయొక్క వైశాల్యము హెచ్చినకొలది శ్రుతికూడా హెచ్చుచుండును.

(8) మొదటి వ్రేలి రంధ్రము యొక్క వైశాల్యము యెక్కువైనచో శ్రుతికూడా హెచ్చును. వైశాల్యము తక్కువైనచో శ్రుతికూడా తగ్గును. గనుక వేణువు నభ్యసింపగోరు ప్రతివారును పై విషయములన్నియు గ్రహించి మొదట స్వరావళ్యాది కృతుల పర్యంతమును, తదుపరి, రాగ, తాన, పల్లవి, నిరవల్, స్వర కల్పనలను చక్కగా నభ్యసించినచో వేణువాద్యమునందు చక్కని పాండిత్యము లభించుట కవకాశముండును. ఇదే వేణువాద్యమును గురించిన సంక్షిప్తమైన ముఖ్య వివరణయని తెలిదయగును.



## నాగస్వరవాద్య వివరము.

( i ) నాగస్వరము :— దక్షిణ ఇండియాలో సర్వసాధారణముగా అన్ని ప్రాంతములందును ప్రదర్శింపబడు గాలివాద్యములలో "నాగస్వరము" మిగుల ప్రధానమైనదని చెప్పవచ్చును. అచ్చట అన్ని కులములవారును తమ శుభకార్యములందు విధిగా నీ వాద్యము నేర్పఱచుకొందురు. కొందరు అశుభకార్యము లందుకూడా దీనిని వుపయోగించుకొనటంకద్దు. దీనిధ్వని గంభీరముగాను, మాధుర్యముగాను వుండును. గనుకనే వేలకొలది జనసమూహములుండు దేవతా వుత్సవములందును, పెండ్లి వూరేగింపులందును, మతసంబంధమైన వుత్సవములందును దీనిని విధిగా నుపయోగించటం జరుగుచున్నది. దీని ఆకారము సుంద్రముగను, కోణాకారముగను వుండి క్రిందికి పోవుకొలది పెద్దదిగానుండు సొక్కెడికెళపు గొట్టమునుపోలివుండును,

(ii) నాగస్వరము తయారుచేయు విధము :— దీనిని షుమారు 2 లేక 2½ అడుగుల పొడవుగల చందనపు కఱ్ఱతో తయారు చేయుదురు. దీని అడుగుభాగమున లోహపు గంట ఆకారముగా కఱ్ఱతో తయారుచేయుదురు. కొన్నిటిలో అసలు లోహముతో చేయబడిన గంటనే అమర్చుటంకలదు. ఇట్లే పైభాగమునకూడా లోహపు కంఠము ఆకారమువలె కఱ్ఱతో తయారుచేయుదురు. అయితే పూర్తిగా లోహముతోనే చేయబడు నాగస్వరములు కూడ యుండును. కాని అవి చాలా అరుదుగా నుండును. దీనికి సాధారణముగా 12 రంధ్రములుండును. వాదకుడు యీ 12 రంధ్రములలో పైనుండు 7 రంధ్రములను మాత్రమే మూయుచూ, తెఱచుచూనుండును. మిగతా 5 రంధ్రములను తనకు కావలసిన ఆధారశ్రుతిని సరిచేసుకొనుటకై మైనముతో మూసివేయుచుండును. ఆయా స్వరములకు గల విశ్రాంతులననుసరించి తగిన కొలతలతో యీ రంధ్రము లేర్పఱచుదురు.

(iii) ఉపయోగించు సాధనములు :— నాగస్వరముయొక్క పైభాగమున నుండు కంఠమునకు గెల్లుతో చేయబడిన ఆకు (పీకె)ను జతచేసి వాయించుదురు. ఈ ఆకులు సాధారణముగా 3 లేక 4 కలిపి కంఠమునకు వ్రేలాడగట్టుదురు. ఈ ఆకులు పిల్లలూదుకునే తాటియాకు పీకెలవలెనుండి ముక్కోణాకారముగా నుండును. ఈ ఆకులకుగల రంధ్రములను సరిచేసి సరియైన ధ్వని పలికించుటకు 2 లేక 3 దంతపుసూదులను గాని, లోహపుసూదులనుగాని కంఠమునకు వ్రేలాడకట్టుదురు. ఈ విధముగా ప్రతి నాగస్వరముయొక్క కంఠమునకును అదనముగా కొన్ని ఆకులను, కొన్ని సూదులను విధిగా వ్రేలాడకట్టుచుందురు.

(iv) నాగస్వరమునకుగల ప్రాముఖ్యము :— (1) ఇది మానవ గాత్రధర్మమునను కరించి కర్నాటక సంగీతమును వివిధ గమకములతో ప్రదర్శింపగలదియగును. (2) ఎంతదూరమునకైనను స్పష్టంగా వినపడునంత ధ్వని గాంభీర్యము గలదియగును. (3) భారతదేశమంతటను గల వివిధకులములవారి కుపయోగపడునట్టి మంగళకరమైన వాద్యమగును. ఈకారణముచేతనేయీ వాద్యము భారతదేశమంతటను విశేష ప్రచారములో నుండుటకు కారణమైనది. అయితే యీ వాద్యమునందు ప్రావీణ్యము సంపాదించుట మిగుల కష్టసాధ్యమైన విషయమగును. ఏలననగా! వేణువులోవలె దీనిలోని రంధ్రములను వ్రేళ్ళతో కొంతమూయుట, తెఱచుట జరిగినను, దానివల్లనే కోమల స్వరములుగాని, తీవ్రస్వరములుగాని పలుకుటలేదు. నాగస్వరముయొక్క గొట్టము లోనికి నోటితో ఆకు (పీకె) ద్వారా ప్రవేశపెట్టబడు గాలియొక్క బలము, లేక వేగమును సరిచేసికొనుటవల్లనే పై స్వరములు పలికింపబడుచున్నవి, ఇదిచాలా కష్టమైన

విషయమగును. గనుకనే యీ వాద్యమునందు ప్రావీణ్యము సంపాదించుటకు విశేష కాలము పట్టుచుండును. మరియు వేణువులోవలె దీనిలో నోటితో వక్త్ర రంధ్రము గుండా గాలినివూదక, కంఠమునకుతోడుగు ఆకుద్వారా నేగాలినివూదబడును. గనుకనే వేణువులోవలె దీనిలో వూదబడుగాలి వృధాయగుట లేదు. దీనిలో 2½ స్థాయిలవరకు స్వరములు లేక సంగీతమును ప్రదర్శింపవచ్చును.

(v) నాగస్వరములోని రకములు :— దీనిలో ముఖ్యముగా రెండు రకములు గలవు. అవి (1) బరి (2) తిమిరి అనునవి. బరి అనునది కొంచెము పెద్దదిగా నుండును. దీనిని నిపుణులైన వాదకులు మాత్రమే వుపయోగింతురు. తిమిరి అనునది కొంచెము చిన్నదిగానుండును. దీనిని సాధారణముగా సామాన్యులు వుపయోగింతురు. దక్షిణఇండియాలో నాగస్వర వాద్యమును "నాగస్వరముబ్యాండు" లేక తంజావూరు బ్యాండు అని చెప్పుదురు. దీనినే తమిళములో "పెరియ మేళమ్" అని చెప్పబడును. దీనిలో సాధారణముగా ఆఱుగురు వాదకులుందురు. వారిలో మొదటివాడు నాయకుడై ప్రధానవాదకుడుగానుండును. రెండవవాడు నాయకునకు సహాయవాదకుడుగా నుండును. మూడవవాడును, నాల్గవవాడును డోలు (తవిల్) వాయించువారుగా నుందురు. అయిదవవాడు తాళము వేయువాడుగానుండును. ఆఱవవాడు శ్రుతి (ఒత్తు) వేయువాడుగా నుండును. అయితే ఒక్కొక్కప్పుడు యీ మేళములో 4గురు వాదకులుమాత్రమేవుండి వారిలో మొదటివాడు నాగస్వరమును, రెండవవాడు డోలును, మూడవవాడు తాళమును, నాల్గవవాడు శ్రుతిని వాయించువారుగా నుందురు. కొన్ని మేళములలో శంఖమునుకూడ వాయించుటకొక వాదకుడుండి డోలుకు జతగా జతులును, మోరాలును, ముక్తాయిలునువాయించుచుండును. జతులు అనగా తాళము ననుసరించిపలికించు తక, తరి, కిట, ణక, ఝుణు, ధిమి, తధిమ్గిణతోమ్ వంటి తాళప్రత్యయములగును. దక్షిణాపథంలో నీ డోలు వాద్యమునొకగొప్ప కళగా నెంచబడును. ఇదినాగస్వర వాద్యమునకు వన్నెతెచ్చు నొక ముఖ్యాంగమగును. గనుకనే అచ్చట దీనికిని నాగస్వరవాద్యమునకును మిగుల ప్రోత్సాహము, ఆదరణ, గౌరవముకలదు. కాబట్టి అచ్చట నీ వాద్యము సర్వతోముఖంగా నభివృద్ధి చెందుటకు కారణమైనది.

(vi) నాగస్వరము నభ్యసించువారు :— దక్షిణ ఇండియాలో కొన్ని ప్రత్యేక కులములకు చెందినవారే యీ వాద్యము నభ్యసించుటజరుగుచున్నది. పూర్వకాలము నుండియు వారికీవిద్య కులవిద్యగా వచ్చుచున్నది. అట్టివారికి దేవాలయములందును సంస్థానములందును, మఠములందును, వంశపారంపర్యముగా వచ్చుచున్నవుద్యోగము

లను, వారిసేవకు తగిన ప్రతిఫలముగా గ్రామములను (భూములను) ఇచ్చియుండుట జరిగియుండెను. ఇది యెంతయు విశేషమగును.

## ఒత్తు వాద్య వివరము.


ఒత్తు వాద్యము.

(i) ఒత్తు వాద్యము :— ఒత్తు అనగా నాగస్వర మేళము లేక తంజావూరు బ్యాండు నందుపయోగించు శ్రుతివాద్యమునకుగల పేరగును. ఇది ఆకారములోను, తదితర అన్ని విషయములలోను నాగస్వరవాద్యమును పోలియుండును. కాని నాగస్వరము కంటె కొంచెము పొడవుగా నుండును.దీని అడుగుభాగమునకు పైన నాలుగు లేక అయిదు రంధ్రములుండును. ఈ రంధ్రములను నాగస్వర వాద్యముయొక్క ఆధారశ్రుతికి తగినట్లు పూర్తిగాగాని, కొంత వఱకుగాని మైనముతో మూసి సరిచేయుదురు. ఇది భారతదేశము నందే కనిపెట్టబడినది, లేనిది నిర్ధారణగా చెప్పవీలులేకున్నను, శ్రుతి వేయుపద్ధతిమాత్రము పూర్వకాలమునుండియు భారతదేశములో కలదని చెప్పవచ్చును. ముఖ్యంగా యీ వాద్యములో గాలిపోత వల్లనే శ్రుతి పలుకుచున్నను, ఆ శ్రుతి ఎడతెగకుండా పలుకుటకు తగినట్లుగా గాలిని వూదుటేయిందుగల ప్రత్యేక విశేషమగును.

## క్లారియోనెట్ వాద్య వివరము.

(i) క్లారియోనెట్ వాద్యము:— గాలివాద్యరకమునకు చెందిన సంగీత వాద్యములలో "క్లారియోనెట్,, ను ఒకముఖ్యవాద్యంగా చెప్పవచ్చును.ఇది యూరపియన్ సంప్రదాయము ననుసరించి నిర్మించబడిన వాద్యమైనను,కర్నాటక,హిందూస్థానీ సంగీతముల గెంటిని ఆమూలాగ్రముగాను, తని (సోలో)గాను, ప్రక్కవాద్యముగాను ప్రదర్శింప గల శక్తివంతమైన వాద్యమగును.మనోహరమైనట్టియు,గంభీరమైనట్టియు దీనికిగలధ్వని మాధుర్యమువల్లనే యిది భారతీయ సంగీతజ్ఞులచే నాకర్షింపబడి అనాదిగా మనదేశములో భరతనాట్యమునందుపయోగించు ముఖవీణ (సన్నాయి)కు బదులుగా దీని నుపయోగించుటకు కారణమైనది. ఈ విధంగా నృత్త, నాట్య ప్రదర్శనములందేగాక వాద్య సమ్మేళనములందును, బ్యాండుమేళములందుకూడ దీనిని ఒక ప్రధానవాద్యముగా పరిగణించి నేడు వుపయోగించటం జరుగుచున్నది.

(ii) నిర్మాణములోని విశిష్టత :— ఈ వాద్యములో మిగతవాద్యముల కంటె కొన్ని ప్రత్యేక విశిష్టలక్షణములుండుట గమనించదగిన విషయములగును, అవి

ఏవనగా ? (1) ఈవాద్యములో 3½స్థాయిలవరకు ప్రదర్శింపవీలుండుట. (2) ఆధునికమైన దీనిలోనిచెవుల ( Keeys ) నిర్మాణము, వాదకుడు అప్పటికప్పుడు యేశ్రుతిలోనైనను ప్రదర్శించుటకు వీలుండుట (3) ఈ విధంగా శ్రుతిని వెంటనే మార్చుకొనుటకనుకూలముగా నీ వాద్యమును 3 భాగములుగ విభజించుటకును,కలుపుటకును వీలుగా నిర్మాణము చేయబడుట మొదలగునవి దీనియందలి ప్రత్యేక విశిష్ట లక్షణములగును.

(iii) భారతదేశంలో ప్రవేశపెట్టబడిన విధము :— చాలాకాలము క్రిందట ఒక ప్రముఖ యూరపియన్ క్లారియోనెట్ వాదకుడు దీనిని దక్షిణభారతమునకు తెచ్చి ప్రదర్శించగా అప్పటి సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు దీనిని విని యీవాద్యములోని ధ్వని మాధుర్యమును, అప్పటికప్పుడు యేశ్రుతిలోనైనను త్రిస్థాయిలందు ప్రదర్శించుటకుగల వీలు మొదలగు విశిష్టలక్షణముల కెంతేయు మెచ్చుకొనుటజరిగెను.ఆతరువాత శ్రీమహాదేవనట్టువనార్ దీనినిచక్కగా నేర్చుకొని మొట్టమొదట చిన్న మేళమునందు ప్రవేశపెట్టెను. ఆతరువాత క్రమక్రమముగా వ్యాప్తిలోనికివచ్చి నేడు యావద్భారతమంతటను దీనిని వుపయోగించటం జరుగుతున్నది.కర్నాటక సంగీతమును శక్తివంతముగా ప్రదర్శించగల క్లారియోనెట్ వాదకులు నేడు దక్షిణాపథంలో యెందరోగలరు. అట్టివారిలో శ్రీ A. K. C. నటరాజన్ ఒక సుప్రసిద్ధ విద్వాంసుడగును.

## ముఖవీణ వాద్యవివరము.


ముఖవీణ.

(i) ముఖవీణ వాద్యము:— ఇది నాగస్వర వాద్యతరకమునకు చెందిన ఒక చిన్న పరికరమునకుగల పేరగును. దీనికిని నాగస్వరమునకు పోలికయున్నను యిది దానిలో సగము మాత్రమే యుండును. వీణకును దీనికిని యెట్టిపోలిక లేకపోయినను, దీనికి ముఖవీణయను పేరు వచ్చుటకు దీని ధ్వని వీణానాదమువలె మనోహరముగానుండుటే ముఖ్యకారణము కావచ్చును.ఈ వాద్యమును ఉత్తర భారతంలో విశేషంగా వాడుదురు.

(ii) ముఖవీణ ఉపయోగము :— పూర్వకాలములో నీ ముఖవీణను చిన్న మేళము (భరతనాట్యము) అందు విధిగా నుపయోగించుచుండెడివారు. కాని యిటీవల దీనికి బదులుగా పాశ్చాత్య సంప్రదాయమునకు చెందిన "క్లారియోనెట్" వాద్యమునుపయోగించుటజరుగుచున్నది. మరియు దక్షిణభారతంలోగల అనేక పుణ్యక్షేత్రములలోని వైష్ణవ, శైవ ఆలయములందు కొన్నిప్రత్యేక సమయములలో నీముఖవీణను విధిగావాయింత

టం నేటికిని జరుగుచున్నది. దీనికి శ్రుతివాద్యముగా గొట్టములతో నిర్మించబడిన చర్మపు తిత్తులుగల వాద్యమును, లయవాద్యముగా మృదంగవాద్యము, నుపయోగించటంకద్దు. అయితే కొన్నిసమయములలో మృదంగమునకు బదులు "ఢంకీ" అనెడి మరియొక విధమైనడోలు వాద్యమునుకూడ వుపయోగించటంకద్దు. సాధారణముగా నీ వాద్యమునందు గ్రామ్య సంగీతమునకు సంబంధించిన పలురకములగు జానపదగేయములను ప్రదర్శింతురు. నిపుణులైన ముఖవీణవాదకులు యీ వాద్యమును ప్రదర్శించునపుడు దూరమునుండి వినుటకెంతో రంజకముగానుండును. భారతదేశంలో గృహ, మత, సాంఘిక, స్వాగత, వీడ్కోలు, శుభ, అశుభములందును, దేవతావుత్సవములందును, పెండ్లివూరేగింపులందుకూడ నీ వాద్యమునుపయోగించుట పరిపాటిగా జరుగుచుండును. అయితే ఆయాసందర్భములకనుగుణమైన సంగీతాన్నే వారు ప్రదర్శించటం కద్దు.

(iii) నిర్మాణములోని వివరములు :— ఈ ముఖవీణవాద్యము ఆకారములోను, పరిమాణములోను, ధ్వనిలోను, రంధ్రములలోను, కొలతలలోను, వూదుటకుపయోగించు సాధనములలోను, స్వరములను పలికించు వివిధపద్ధతులు మొదలగు అన్ని విషయములలోను యించుమించుగా మననాగస్వరవాద్యమునే పోలియుండునని గ్రహింపదగును.

## షహనాయ్ వాద్య వివరము.


షహనాయ్.

(i) షహనాయ్ వాద్యము :— హిందూస్థానీ సంగీతమునకనిగాను, శాస్త్రయుక్తముగాను ప్రదర్శింపగల గాలివాద్యములలో "షహనాయ్"ని ఒక ముఖ్యవాద్యంగా చెప్పవచ్చును. ఇది నాగస్వరవాద్యరకమునకు చెందును. ఆకారములో నాగస్వరమును పోలియున్నను, దీనిగొట్టముయొక్క వ్యాసము ( Diameter ) నాగస్వరగొట్టమువ్యాసముకన్న పెద్దదిగను, పొడువుతక్కువగను వుండును, ఈ వాద్యమునకు క్రిందిభాగమున ప్రత్యేకంగా లోహపుగంటగాని, చుట్లుగాని వుండవు. అవిగొట్టముతో కలిపి చందనపు కఱ్ఱలోనే తయారుచేయుదురు. పైభాగమునగల రంధ్రమునకు ఆకు (నాలుకను) జతచేయుదురు. దీని ధ్వని మనోహరంగాను, తగినంత గంభీరముగాను వుండును.

(ii) ఉపయోగించు విధము :— ఈ వాద్యమును సాధారణముగా మహమ్మదీయులు వాయించుచుందురు. వారు వారి వివాహములయందును, పండుగలందును, మత సంబంధమైన వూరేగింపులందును ముఖ్యంగా దీనిని వాయించుచుందురు. ఉత్తరభారతంలో

సుప్రసిద్ధులగు షహనాయ్ వాదకులెందరోగలరు. అట్టివారిలో ఉస్తాద్ శ్రీ బిస్మిల్లా ఖాన్ మొదలగువారు సుప్రసిద్ధులగుదురు.

(iii) తదితర ముఖ్యవిషయములు :— ఈ షహనాయ్‌వాద్యము ఆకారము లోను, వుపయోగించు ఆకులు, నూగులు మొదలగు సాధనములలోను, రంధ్రములను మూయుట, తెఱచుట, వివిధస్వరములను పలికించుట మొదలగు అన్ని విషయముల లోను యిది నాగస్వరము, ముఖవీణ వాద్యములను బోలివుండునని గ్రహించునది.



జలతరంగిణి వాద్యవివరము.

(i) జలతరంగిణి వాద్యము :— "జలతరంగ్" మనగా నీటి కెరటము అర్థము. ఇదిఒక విధమైన పింగాణీ మట్టితో తయారుచేయబడిన గిన్నెలతో వాయించు వాద్యమగును. ఇది తంత్రీ వాద్యములగు వీణ, వయొలిన్, గోటు, సారంగి వాద్యముల వలెను, గాలివాద్యములగు వేణువు, నాగస్వరము, షహనాయ్ వాద్యములవలెను వివిధగమకములతో ప్రదర్శింపగల ప్రముఖవాద్యము కాకపోయినను, కర్ణాటక సంగీతమును, శాస్త్రయుక్తముగా, తనిగాను, వాద్య సమ్మేళనమందును ప్రదర్శింపగల వాద్యముగా పరిగణింపబడుచున్నది, ఇందుకు ముఖ్యకారణము ఆకర్షణీయమైన దీని ధ్వని మాధుర్యమేయగును.

(ii) తయారుచేయువిధము :— ఈ వాద్యమును పింగాణీమట్టితో తయారు చేయుదురు. ఇందు మొత్తము 18 గిన్నెలుండును. ఇవి స్ఫుటమైనవిగాను, మాధుర్యమైనధ్వని గలవిగానుండునట్లు యేర్పఱచుకొందురు. వాదకుడు యీ 18 గిన్నెలలో 15గిన్నెలను తనముందు అర్ధచంద్రాకారముగ నమర్చుకొనును. మిగత 3 గిన్నెలను 15 గిన్నెలలో 3-4, 7-8, 11-12 గిన్నెలకు పైభాగమున దగ్గరగానుంచును. ఈగిన్నెలు ఎడమవైపునుండి కుడివైపుకు పోవుకొలదివాటిధ్వనులు హెచ్చుగా నుండుటకు తగినట్లు మొదటి గిన్నెకంటె మిగిలిగిన్నెలయొక్క సైజు క్రమముగా తగ్గియుండును.

(iii) శ్రుతిచేయు విధము :— పైన తెలిపిన 18 గిన్నెలను పుల్లతో కొట్టినచో వాటిధ్వనులు వివిధరకములుగా నుండును. గనుక వాదకుడు దీనిని వాయించుటకు ముందు ఆధారశ్రుతి కనుగుణముగా తానుప్రదర్శింపబోవు రాగముయొక్క స్వరముల ధ్వనులకు తగినట్లు గిన్నెలందు నీరుపోసి వాటిశ్రుతులను సరిచేయును.

(iv) నీరుపోయుటవలన గలుగు ప్రయోజనము :— వాదకుడు జలతరంగిణి గిన్నెలలో నీరుపోయుట, తీయుటవలన ముఖ్యంగా మూడువిధములగు ప్రయోజనము కలుగును. (1) ఆయారాగస్వరములకు తగినట్లు గిన్నెలధ్వనులను హెచ్చించుటకుగాని తగ్గించుటకుగాని వీలుకలుగును. (2) ఆయారాగస్వరముల ధ్వనులను కొలదికాలము నిలిపియుంచుటకు వీలుకలుగును. (3) గిన్నెలను కొట్టుటకుపయోగించు గుండ్రని వెదురు పుల్లలను గిన్నెలందుగల నీటి ఉపరిభాగమున తాకించుటచే కొంతవఱకు గమకములు కూడ పలికించుటకు వీలుకలుగును.

(v) వాద్యమొనర్చు విధము :— దీనిలో సాధారణంగా 2స్థాయిల వరకు ప్రదర్శింపవచ్చును. వాదకుడు దీనిని వాయించునపుడు ఒకేచేతిని వుపయోగించిన దురితకాలములో తాళానుసారముగ ప్రదర్శింపవీలుండదు. గనుక రెండుచేతులతో రెండు వెదురుపుల్లలను పట్టుకొని గిన్నెలను కొట్టుచూ త్రికాలములందుకూడ సంగీతము ప్రదర్శించును. ఇట్లుచేయుటలో రాగముమార్చినపుడెల్లను ఆయా రాగశ్రుతులకనుగుణంగా గిన్నెలలోనినీటిని తగ్గించిగాని, హెచ్చించిగాని శ్రుతులను సరిచేసి వాద్యమొనర్చునని గ్రహించునది.

## మగుడివాద్య వివరము.

(i) మగుడివాద్యము:— ఇది రెండు గాలి వాద్యములను ఒకే వాద్యమునందు ఒకేసమయములో ప్రదర్శింప వీలుగల వాద్యమగును. దీనినే తెలుగులో పాములవాని నాగస్వరమనియు, సంస్కృతములో "భుజంగస్వర" మనియు, తమిళములో 'మగుడి' అనియు చెప్పబడును. ఆంధ్రప్రదేశ్ లో పాములవాండ్రు పాములను పట్టుకొనునపుడును, వాటిని ఆడించునపుడును దీనిని ముఖ్యంగా వాయించుదురు. సాధారణంగా యీ వాద్యములో మోడిపాట మొదలగు జానపద గేయములను వాయించుదురు.

(ii) తయారుచేయు విధము:— కూజా ఆకారమున నుండు యెండిన సొరకాయ బుఱ్ఱకు రంధ్రము తొలిచి దానిక్రింది భాగమున పిల్లనగ్రోవివంటి సన్నని రెండు వెదురు గొట్టములకు రంధ్రములు పొడిచి వాటిని జతచేసి అమర్చుదురు. పాములవాడు పైభాగమున నుండు రంధ్రముగుండా గాలిని వూదుచూ క్రింది భాగమున నుండు జంట పిల్లనగ్రోవుల రంధ్రములను మూయుచూ తెరచుచూ వాయించును.

(iii) దీనిలోని విశేషము:— వాదకుడు దీనిలో ఏదైన జానపద గేయాన్ని వాయించునపుడు, అదే సమయములో ఆధారశ్రుతికూడ వినిపించుటకు తగిన వీలుండును. గనుక యీ వాద్యము వినుట కెంతయు రంజకముగా నుండును. ఈ విధంగా రెండు వాద్యములు ఒకే వాద్యములో ఒకే సమయములో పలికింప వీలుగల వాద్యములను ఇంగ్లీషు భాషలో "కాంపౌండ్ విండ్ ఇన్‌స్ట్రుమెంట్సు" అని చెప్పుదురు.

## జలక్ట్రోమోనియమ్ వాద్య వివరము.

(i) జలక్ట్రోమోనియమ్ (Jalactromoniam) :— ఇదియును వైరకమునకు చెందిన వాద్యమేయగును. దీనిని యిటీవల మద్రాసులో ఒక ప్రముఖ మెకానిస్టు కనిపెట్టినటుల తెలియుచున్నది. దీనిలోకూడ రెండు వాద్యములను ఒకే సమయములో ప్రదర్శింప వీలుకలదు.

(ii) తయారు చేయబడిన విధము:—ఇది చూచుటకు హైపుమిషనువలె నుండును. దీని లోపల భాగమున "పియానో" యందువలె రీడ్సులుండి వాటిపైన జలతరంగిణిలో వలె గిన్నెలుండును. ఆగిన్నెలను కొట్టుటకు ఒక కడ్డీవంటి లోహ పరికరముండును.

(iii) వాద్య మొనర్చు విధము:— వాదకుడు దీనిపై గల మెట్లను ఆయారాగ స్వరముల ననుసరించి అదిమినపుడు వెంటనే లోపల నుండు రీడ్సుల నుండి ఫీయానో ధ్వనులును, వాటిపై నుండు పింగాణీ గిన్నెలు కొట్టబడుటచే జలతరంగిణి ధ్వనులును ఒకేరకమైనవి పలుకుటచే వినుట కెంతయు రంజకముగా నుండును. అయితే ఒక్కొక్కప్పుడు దీనిలోని పియానోధ్వనులను పలుకకుండాచేసి కేవలము జలతరంగిణి ధ్వనులను మాత్రమే పలికించుచూ సంగీతమును ప్రదర్శించుటకు కూడ యిందు వీలుండును. గనుక దీనినికూడ ఇంగ్లీషుభాషలో "కాంపౌండ్ విండ్ ఇన్‌స్ట్రుమెంటు" అని చెప్పబడును.

## మృదంగవాద్య వివరము.



మృదంగము.

(i) మృదంగ వాద్య ప్రాచీనత:— సర్వ జనోపయోగకర మైనట్టియు, ఆకర్షణీయ మైనట్టి యీ మృదంగ వాద్యమును మొదట దేవతాపురుషుడే సృష్టించెనని తెలియుచున్నది. ఎటులనగా! త్రిపురాసుర సంహారమైన పిదప మహాదేవుడు జయసూచకముగా నొనర్చిన నాట్యములో హంగు చేయుటకు బ్రహ్మయే దీనిని సృష్టించెననియు, ఆసందర్భములో గణేశుడు మొదట్టి దీనిని వాయించెననియు పురాణ ప్రసిద్ధముగా చెప్పబడును.

(ii) మృదంగవాద్య విశిష్టత:— భారతదేశము నందుగల చర్మ వాద్యములలో మిక్కిలి ప్రాముఖ్యమైనట్టియు, శాస్త్రయుక్తమైనట్టి వాద్యము మృదంగ మనుట కెట్టి సందేహములేదు. దక్షిణ భారతంలో జరుగు సంగీత కచ్చేరీ లందును, హరికథా కాలక్షేపములందును, భజన కాలక్షేపములందును, వీధి నాటకములందును తప్పనిసరిగా దీనిని వుపయోగించుటే యిందుకు ముఖ్యనిదర్శన మగును. దీనిలో నైపుణ్యము, పాండిత్యము సంపాదించుట మిగుల కష్టసాధ్యమైన విషయ మగును, సుప్రసిద్ధులైన మృదంగ విద్వాంసులు సంగీత సభలందు ప్రక్కవాద్యము నందును, తని ఆవర్తము నందును ప్రదర్శించు జతులును, మోరాలును, ముక్తాయిలును తాళబద్ధమై వారి పాండిత్య ప్రతిభను చాటుచుండును. గనుక కర్నాటక సంగీతకచ్చేరీలలో మృదంగమునకు గల స్థానము అత్యున్నతమైన దని చెప్పదగును.

(iii) మృదంగ శబ్దోత్పత్తి:— మృదంగ మనగా? మృత్ + అంగము = మృదంగము. గనుక మట్టితో చేయబడిన అవయవమని అర్థము. బహుశా ప్రాచీన కాలములో నీ మృదంగమున కాధారమైన గుల్ల (కఱ్ఱడొల్ల) ను మట్టితో తయారు చేయబడుటచేతనే దీనికి మృదంగ మను పేరు వచ్చియుండవచ్చును. అయితే కాలక్రమమున మానవుని బుద్ధి వికసించుటచే ధ్వని మాధుర్యము, గంభీరములకొరకై మట్టితో చేయబడు గుల్లను కఱ్ఱతో చేయటం ప్రారంభమై యుండవచ్చును.

(iv) మృదంగమును తయారుచేయు విధము:— దీనిని తయారు చేయుటకు మొదట పండినట్టి,నీడలో యెండినట్టి పనసకఱ్ఱ, లేక ఏగిసకఱ్ఱను గుల్లగా తయారు చేయవలెను. ఒక్కొక్కప్పుడు యీ గుల్లను పనస, ఏగిస కఱ్ఱలు దొరకనిచో చందనపుకఱ్ఱ లేక తాటికఱ్ఱ లేక రేలకఱ్ఱలతోకూడ తయారుచేయటం జరుగుతూ వుండును. అయితే వీటన్నిటిలోను పనసకఱ్ఱ మిగుల శ్రేష్ట మగును. ఇందుకు ముఖ్య కారణము పనసకఱ్ఱ యెల్లప్పుడు సమశీతోష్ణముగ నుండును. గనుక అట్టి కఱ్ఱతో చేయబడిన గుల్ల గల మృదంగముయొక్క ధ్వని మాధుర్యముగనుండి యెల్లప్పుడును ఒకేవిధమైన గంభీర ధ్వనిని గలిగి యుండును.

(v) మృదంగము యొక్క కొలతలు:— మృదంగమున కాధారమైన గుల్లను 18 లేక 20 లేక 22 అంగుళముల పొడవు గల పనసకఱ్ఱతో తయారు చేయుదురు. అప్పుడు దీని ఆకారము అడుగు తీసిన రెండు పూలతొట్ల పైభాగమును జతపఱచినట్లు యిరుప్రక్కల సన్నముగను, మధ్య కొంచెము లావుగను వుండును. ఈ గుల్లకు యిరు ప్రక్కల నుండు రెండు రంధ్రముల (తలల) కు చర్మపు మూతలు మూసి తొడుగుదురు. ఈ మూతలు గుల్లయొక్క సైజునుబట్టి కుడి మూతకంటె ఎడమమూత వ్యాసము విధిగా ½ అంగుళము ఎక్కువగా నుండును. సాధారణంగా మృదంగములోని కుడి

మూత వ్యాసము 6$\frac{3}{4}$ అంగుళము నుండి 7 అంగుళముల వఱకును, ఎడమ మూత వ్యాసము 6$\frac{3}{4}$ అంగుళముల నుండి 7$\frac{1}{4}$ అంగుళముల వఱకును వుండవలెను. ఈ మూతల చుట్టును వలయాకారముగ నుండు చర్మపు జడ లుండును. వీటిని బొద్దు లందురు. ఈ బొద్దుల చుట్టును 16 రంధ్రము లుండును. వీటిని కండ్లు అని చెప్పెదరు. ఈ కండ్ల నుండి షుమారు $\frac{1}{4}$ అంగుళము వెడల్పును $\frac{1}{8}$ అంగుళము మందముగల నిడు పైన వారు (చర్మము)ను యెక్కించి బాగుగా రెండు మూతలను బిగువుగా నుండు నట్లు చేయుదురు.

(vi) మూతల కుపయోగించు చర్మములు:— మృదంగమున కిరుప్రక్కలను తొడుగు నట్టి కుడి, ఎడమమూతలను మేక చర్మముతో తయారు చేయుదురు. అయితే ఎడమ మూతలోని పైరెప్ప భాగమునకు మాత్రము గొడ్డు చర్మము నుపయోగించటం కద్దు. కుడి మూతలో మూడు చర్మము లుండును. వాటిలో అడుగున యుండు చర్మమును "ఒత్తుడు" చర్మ మనబడును. ఇది మన కంటి కగపడదు. దానికి పైన వుండు చర్మమును "పాట" చర్మ మనబడును. దీనిపై కరిణి వేయుదురు. దానికి పైన వుండు చర్మమును "రెప్పచర్మ" మనబడును. ఇది చాలా దళసరిగా నుండును. అయితే కొందఱు యీ మూతల లోపలి వలయమునకు గొఱ్ఱె చర్మమును,, పైవలయమునకు లేగ దూడ యొక్క చర్మమునుకూడా వుపయోగించటం కద్దు.

(vii) కరిణిని తయారుచేయు విధము:— పూర్వకాలములో కరిణిని తయారు చేయుటకు మొదట మాంగనీసును మెత్తగా పొడిచేసి దానిలో బాగా వుడికిన అన్నమును, చింతపండు రసమును కలిపి మెత్తగా నూరి వుండగా చేసెడివారు. కాని వర్తమానకాలములో కరిణిని చేయుటకు ఇనుప కొలిమిలో నుండు చిట్టెపురాళ్లను తెచ్చి మెత్తగా పొడిచేసి దానిలో మెత్తని అన్నమును కలిపి కాటుకవలె నూరి వుండగా చేయుట సాధారణంగా జరుగుచున్నది. దీనినే తమిళములో సోరు (soru) అనియు కరణాయ్ (karanai) అనియు, మరుందు (Marundu) అనియు వివిధ పేర్లతో వాడుచుందురు.

(viii) కరిణిని వేయు విధము:— కరిణిని మృదంగము యొక్క కుడి మూతలో పాటచర్మము నందలి మధ్యభాగమున వేయుదురు. ఈ కరిణి వేయనిచో మృదంగము నందు సుశ్రావ్యమైన ధ్వని కలుగ నేరదు. గుండ్రముగా నుండు దీని పరిమాణము ఆయా మూతల సైజు ననుసరించి యుండును. కరిణిని వేయుటకు ముందు పాటచర్మమును శుభ్రముచేసి దాని మధ్య భాగమున చిన్నచిన్న కరిణి మాత్రలను అంటించుతూ అది గట్టిపడునట్లుగా కరిణిరాతితో రాచుదురు. ఈ విధంగా అనేకసార్లు మాత్రల నంటించుతూ రాతితో రాచుతూ కరిణి ఫలముగ తయారగుటకు చాకుతో

చుట్టును గీచి తుడిచివేయుదురు. ఇట్లు చేయు నప్పుడు కరణి మధ్యభాగంలో దళసరిగాను, చుట్టును అంచులయందు పలుచగాను వుండునట్లు సరిచేయుదురు. మృదంగమునకు అతిప్రధానమైన యీ కరణిని వేయుటకు విశేషమైన అనుభవము శ్రుతిజ్ఞానము అవసర మగును. గనుకనే దక్షిణ భారతంలో మృదంగ వాద్యములో ప్రావీణ్యముగల వారెందరో యున్నను శ్రుతిపక్వముగా కరణిని వేయగలవారు బహు కొద్దిమంది మాత్రమే గలరు.

**(ix)** మృదంగమును శ్రుతి చేయు విధము:— మృదంగమును శ్రుతి చేయుటకు సాధారణంగా ఒక సుత్తెను, 2 అంగుళముల పొడవు, ½ అంగుళము వ్యాసముగల పిడిని వుపయోగించుదురు. మార్దంగికుడు మృదంగమును ఆధారశ్రుతి కనుగుణముగా శ్రుతిని హెచ్చింప దలచినచో కుడి మూత చుట్టు వలయాకారముగ నుండు చర్మపు బొద్దుల పైన పిడిని వుంచి సుత్తెతో అన్నివైపుల క్రిందికి కొట్టుచూ శ్రుతిని హెచ్చించును. శ్రుతిని తగ్గింప దలచినచో పిడిని బొద్దుల క్రింద నుంచి సుత్తెతో పైకి కొట్టుచూ శ్రుతిని తగ్గించును. ఇట్లు చేయునప్పుడు అన్నివైపులను సమాన ధ్వని గలుగునట్లు చూచుకొనును. మృదంగమును సాధారణముగా హార్మోనియములో 1 మొదలు 4½ లేక 5 వరకు శ్రుతి చేయవచ్చును. అవసరమునుబట్టి ఒక్కొక్కప్పుడు 5½ వరకు శ్రుతి చేయవచ్చును. కాని అట్లు చేయుట మూతకు ప్రమాదకారణ మగును. ఒక్కొక్కప్పుడు తగ్గుశ్రుతి మృదంగమును హెచ్చింప దలచినచో చాకుతో కరణిని గీచి తగ్గించి శ్రుతిని హెచ్చించటంకూడా కద్దు. కాని అటుల చేయుట వలన నాటు, మీటు, సాటులకుగల శ్రుతి సంబంధము వేరై అవి ఒకే శ్రుతిలో నిలకడగా చేరకుండుటకు కారణమగును. గనుక యీ పద్ధతి అంతగా మంచిది కాదనే చెప్పవచ్చును.

**(x)** కుడిమూతలో పలుకు ధ్వనుల పేర్లు:— కుడిమూతలో కుడిచేతివ్రేళ్లతో తెప్ప చర్మమును తట్టిన పలుకునది "మీటు" అనియు, కరణి మధ్యభాగమున తట్టిన పలుకునది "నాటు" అనియు, తెప్పను, పాటచర్మమును ఒకేసారి తట్టిన పలుకునది "సాటు" అనియు చెప్పబడును.

**(xi)** బోనమును తయారుచేయు విధము:— మృదంగములో కుడిమూతకు కరణి యెంత అవసర మగునో, ఎడమ మూతకు బోనముకూడ అంత అవసర మగును. మార్దంగికుడు కుడిమూతను ఆధారశ్రుతికి సరిచేసిన పిమ్మట ఎడమ మూతకు బోనము నంటించి గాని వాయించుటకు ప్రారంభించడు. ఈ బోనము తయారు చేయుట రెండు విధములుగా నుండును. అవి (1) మెత్తని గోధుమరవ్వను నీళ్లతో తడిపి బాగా నలిపి వుండ చేయుట. (2) బాగా వుడికిన అన్నములో మెత్తని తెల్లకచ్చిక బూడిదను కలిపి ఛక్కగా నలిపి వుండ చేయుట యగును.

(xii) బోనమును వుపయోగించు విధము:— బోనమును మృదంగమునకు గల ఎడమమూత యొక్క మధ్యభాగమున ఒకరూపాయి పరిమాణములో నంటింతురు. ఇట్లు అంటించుటలో కుడిమూతయొక్క శ్రుతికి అనగా మధ్య షడ్జమునకు ఒకస్థాయి తక్కువగానుండు మంద్రషడ్జమునకు సరిపోవుధ్వని పలుకు నటుల సంచేసికొందురు. కచ్చేరీ అంత్యమున యీ బోనమును విధిగా తీసివేయుదురు.

(xiii) మృదంగము నభ్యసించు విధము :— మృదంగము నేర్చుకొనువారు మొదట నోటితో జతులు నేర్చుకొని తరువాత జంత్రము (కఱ్ఱతో చేయబడిన సాధనము) మీద త్రికాలములుగాని, పట్కాలనుగాని అభ్యసింతురు. తరువాత చిన్న పాలవరుసలు, పెద్ద పాలవరుసలు మొదలగు జతులను ప్రారంభించి, ఆది, రూపక, త్రిపుట వంటి తాళము లందు కృషి చేయుటతో మృదంగము మీద అభ్యాసము మొదలిడుదురు. ఈవిధంగా దీర్ఘకాల కృషిచేసినగాని యీ వాద్యములో తగిన ప్రావీణ్యము సంపాదించుట సాధ్యముకాదు. సుప్రసిద్ధ గాయకుడు తన పాండిత్యమును, రాగ, తాన, పల్లవి, నెరవల్, కల్పన స్వరములను ప్రదర్శించుటలో చూప గలిగినట్లు, సుప్రసిద్ధమార్దంగికుడు తనపాండిత్యమును, పాటననుసరించి వాయించుటలోనేగాక, ఆయా తాళముల కనుగుణమైన జతులు, మోరాలు, ముక్తాయిలు తనిగా ప్రదర్శించుటలోకూడ చూపగలుగును. గనుక సంగీత కచ్చేరీలలో మార్దంగికునకు కనీసము రెండు పర్యాయములైన తనిగా వాయించుటకు అవకాశము యిచ్చెదరు. ఇట్లు చేయుటవలన కచ్చేరీ రక్తికట్టుటకు యెంతయు దోహద మగును.

## కంజిరా వాద్యవివరము.

(i) కంజిరా వాద్యము :— కర్నాటక సంగీత కచ్చేరీలలో నుపయోగించు చర్మ వాద్యములలో కంజిరానుకూడ ఒక ముఖ్య వాద్యంగా చెప్పవచ్చును. ఇది మృదంగ మంత సుశ్రావ్యమైన ధ్వని మాధుర్యము, శ్రుతిపక్వము గల వాద్యము కాకపోయినను, తనిగాను, ప్రక్కవాద్యముగాను, మృదంగముతో కలిపి జతగా వాయించు నపుడు దీనిలో ప్రదర్శింపబడు జతివరుసలు, మోరాలు, ముక్తాయిలు వినుట కెంతో రంజకముగా నుండి కచ్చేరీని రక్తివంతముగా నొనర్చుట కెంతేని తోడ్పడుచుండును. దక్షిణ ఇండియాలో ముఖ్యంగా సంగీత కచ్చేరీ లందును, భజన కాలక్షేపము లందును, వాద్యసమ్మేళనము లందును, తాళవాద్య కచ్చేరీ లందును దీనిని వుపయోగించడం విధిగా జరుగుచుండును.

(ii) కంజిరాను తయారుచేయు విధము :— ఇది ఒకవైపుమాత్రమే మూత గలిగి యాకారమందునను వాడునట్టి తాంబురైన్ (Tanburain) ను పోలియుండును. కంజి

రాను తయారు చేయుటకు పనసకఱ్ఱనుగాని, వేగిసకఱ్ఱనుగాని వుపయోగింతురు. ఈ కఱ్ఱను 2 లేక 2½ అంగుళముల పొడవును, 6 లేక 7 అంగుళముల వ్యాసమును ¼ అంగుళము మందమును గలిగియుండునట్టి గుల్లగా తయారు చేయుదురు. రెండువైపుల రంధ్రములుండు యీ గుల్లకు ఒకవైపున ఉడుము చర్మమును మూయుదురు.

(iii) చర్మము మూయు విధము :— ఉడుము చర్మమును మొదట శుభ్రపఱచి తడిపి సర్వీసువంటి మంచి జిగురుతో బిగువుగా నుండునట్లు గుల్లకు అంటించి దారముతో బిగింతురు. చర్మము బిగిసిన తరువాత దారమును వూడదీసి వేయుదురు. గుల్లయొక్క మధ్యభాగమున రంధ్రము పొడిచి దానిలో రెండు గుండ్రని లోహపు బిళ్లలను అమర్చుదురు. వాదకుడు దీనిని వాయించునపుడు ఆబిళ్ళలు కదలి ఆధ్వని కంజీరా వాద్యము సంగు శీనమై వినుటకెంతో శ్రావ్యముగా నుండును.

## ఘట వాద్య వివరము.

(i) ఘట వాద్యము :— కర్నాటక సంగీత కచ్చేరీలలో నుపయోగించు లయ వాద్యములలో "ఘటము" నొక ముఖ్య వాద్యంగా చెప్పవచ్చును. పూర్వకాలము నుండియు నీ వాద్యమును ప్రక్కవాద్యంగా సంగీత కచ్చేరీలలో నుపయోగించటం కద్దు. ఇది మృదంగమంత సుశ్రావ్యమైన ధ్వనిగల వాద్యము కాకపోయినను, మృదంగమునకు జతగా వాయించునపుడు మాత్రము వినుటకెంతో రంజకముగానే యుండును.

(ii) ఘటమును తయారుచేయు విధము:— ఘటము అనగా కుండ అని అర్థము. గనుక దీనిని మెత్తని యొఱ్ఱబంకమట్టితో చేసి కాల్చి తయారు చేయుదురు. దక్షిణ దేశంలో కొన్ని తావులందు మాత్రమే వీటిని ప్రత్యేకంగా తయారు చేయుచుందురు. దీనిలో శ్రుతిని మార్పు చేయుటకు వీలుండదు. గనుక వాదకుడు తనకు కావలసిన శ్రుతులలో సహజముగా ధ్వనించునట్టి కొన్ని ఘటములను ప్రత్యేకముగా తయారు చేయించుకొని వుంచుకొనును. ఏదైన సంగీత కచ్చేరీకి వెళ్లవలసినపుడు ఆనాటి కచ్చేరీ జరుగు శ్రుతికి తగిన ఘటమును తీసుకొని వాయించుచుండును.

(iii) ఘటమును వాయించు విధము :— వాదకుడు ఘటమును వాయించునపుడు దాని ముఖమును తన పొట్టకు ఆనించుకొనుట, తీయుట వలన మృదంగములోని ఎడమ మూతి యందు పలికించు గమకములను పలికించును. ఘటముయొక్క పైభాగమును రెండు చేతులతో తట్టుట వలన జతులను, మోరాలను, ముక్తాయిలను ప్రదర్శించును. దక్షిణ ఇండియాలో యీ వాద్యము నందు ప్రవీణులగు వారెందరో గలరు. అట్టివారిలో బ్ర॥ శ్రీ॥ శ్రీ ఘటం కుండరేకయ్యర్ వంటివారు సుప్రసిద్ధులగుదురు.

## మోర్సింగు వాద్య వివరము.

(i) మోర్సింగ్ వాద్యము :— కర్నాటక సంగీత కచ్చేరీలలో నుపయోగించు లయ సంబంధమైన ప్రక్క వాద్యములలో "మోర్సింగ్" ను ఒక ముఖ్య వాద్యంగా పరిగణింప వచ్చును. ఇది లోహ సాధనికి చెందిన మీటు వాద్య మగును. ఇది మృదంగమంత ప్రశస్తమైన వాద్యమని చెప్పవీలులేకపోయినను, ఆధారశ్రుతిలో లీనమై వినిపించు దీని ధ్వని మాత్రము యెంతో ఆకర్షణీయంగాను, హృదయ రంజకంగాను వుండును. గనుకనే సాధారణంగా దీనిని సంగీత కచ్చేరీలలోను, లయ భాషు (తాళవాద్యకచ్చేరీ)లలోను వుపయోగించటం జరుగుచున్నది.

(ii) శ్రుతిచేయు విధము :— దీనిని ఇనుముతో చేయుదురు. దీని మధ్యభాగమున నూదివంటి ఒక లోహపరికరము నమర్చుదురు. దానిని మీటుచూ అందు పలుకు ధ్వని ఆధారశ్రుతికి సరిపోవునట్టుల మోర్సింగ్ మొదటి భాగమున మైనము తగినంతగా అంటించి శ్రుతికి సరిపెట్టుదురు.

(iii) వాద్య మొనర్చు విధము :— వాదకుడు మోర్సింగ్ ను వాయించునప్పుడు దానిని నోటిలో నాలుకను అంటియుండునట్లుంచుకొని దానిగుండా గాలిని నోటిలోనికి పీల్చుచూ లోహపు నూదిని మీటుట ద్వారా జతులను, ముక్తాయిలను ప్రదర్శించును. ఈ విధంగా మోర్సింగ్ ను నాలుక నంటి యుంచి వాయించుటలో ఒక్కొక్కప్పుడు నాలుక దాని మధ్యలో చిక్కొని ప్రమాదము సంభవించుటకు కారణమగును. గనుక వాదకుడు మోర్సింగును వాయించునపుడు నాలుకను బహుజాగ్రత్తగా కాపాడుకొనవలెను. దక్షిణాపథములో యీ వాద్యము నందు నిపుణులైనవారెందరో గలరు. అట్టివారిలో కీ॥ శే॥ మోర్సింగ్ సీతారామయ్యర్ వంటివారు సుప్రసిద్ధులగుదురు.

## గెత్తు వాద్య వివరము.

(i) గెత్తువాద్యము :— ఇది గోటు వాద్యమును బోలియుండు నట్టి ఒక విధమైన తంతివాద్య మగును. అయితే యిది గోటువాద్యమువలెగాని, యితర తంతి వాద్యములవలె గాని సంగీతమును ప్రదర్శించునదిగాక కేవలము లయను మాత్రమే ప్రదర్శించు ప్రక్క వాద్య మగును. ఇందు ముఖ్యముగా 4 తంత్రు లుండును. అయితే వాటి క్రింద ధ్వనిమాధుర్యమును పెంపొందించునట్టి కొన్ని సహాయ తంత్రులుకూడ వుండును.

(ii) శ్రుతిచేయు విధము :— ఇందు గల 4 ముఖ్య తంత్రులను శ్రుతిచేయుటలో క్రింది నుండి పైకి వరుసగా 1వ, తంతిని మధ్యషడ్జముగను, 2వ, తంతిని మంద్ర

పంచమముగను, 3వ, తంతిని మంద్ర షడ్జముగను, 4వ, తంతిని అనుమంద్ర పంచమముగను శ్రుతి చేయుదురు. మిగతి సహాయ తంత్రులను ఆయా సందర్భముల కనుగుణముగా శ్రుతి చేయుదురు.

(iii) వాయించు విధము :— వాదకుడు గొట్టు వాద్యమును వాయించునపుడు జానిని తనముందు నుంచుకొని, ఒకఅడుగు పొడవుగల రెండు గట్టి వెదురుపుల్లలతో తంత్రులపై కొట్టుచూ గాయకుడు ప్రదర్శించు సంగీతమున కనుగుణంగా వివిధ జతులను, మోరాలను, ముక్తాయిలను వాయించును. ఈ వాద్యము వినుటకు రొంతో రంజకముగా నుండును.

## డోలక్ వాద్య వివరము.

i) డోలక్ వాద్యము :— భారతదేశ మంతటను ప్రచారంలోగల లయకు సంబంధించిన సంగీత వాద్యములలో "డోలక్" ను ఒక ముఖ్యవాద్యంగా చెప్పవచ్చును. దీనిని కర్నాటక, హిందూస్థానీ సంగీతముల రెంటిలోను నేడు వుపయోగించుటచే ఒక విధంగా దీనిని ఉభయ సంగీత లయవాద్యంగా చెప్పదగి యున్నది. ఈ విధంగా నిది ఉభయ శాస్త్రీయ సంగీతములందేగాక, లలిత సంగీతంలోకూడ దీని ప్రాముఖ్యం విశేషంగా నుండుటచే చలన చిత్ర రంగంలో యావద్భారతీయులచే ఒక ప్రముఖ వాద్యంగా పరిగణింపబడినది. ఇది మృదంగ మంత శ్రుతిపక్వమైన వాద్యము గాకున్నను మృదంగముతో జతగా వాయించు నపుడు మాత్రము రొంతో ఆకర్షణీయంగా నుండి కచ్చేరీ రక్తికట్టుటకు తోడ్పడుచుండును.

(ii) డోలక్‌ను తయారుచేయు విధము :— డోలక్‌ను పనస, లేక ఏగిసకఱ్ఱతో మొదట గుల్లను తయారుచేసి దానికి రెండువైపులను చర్మపు మూతలు తొడిగి సన్నని వారుతో బిగించి బిగువుగా నుండునట్లు తయారు చేయుదురు.

iii) డోలక్‌లోని రకములు :— ఇవి 3 విధములుగా నుండును. అవి (1) మృదంగడోలక్, (2) టూప్‌డోలక్, (3)హిందూస్థానీడోలక్ లగును.వాటి వివరములు.

(1) మృదంగ డోలక్ :— ఇది చూచుటకు మృదంగమునుబోలి యుండును. కుడికన్ను మూతకు రెప్పగాని, కరణిగాని లేకుండును. ఎడమకన్ను మూతకు మృదంగములోవలె బోనము వేయుదురు.దీనిపొడవు 24 అంగుళములును,మధ్యభాగమున చుట్టుకొలత 34 అంగుళములును, కుడి, ఎడమ కన్నుల వ్యాసములు 7 లేక 8 అంగుళములను వుండును. మిగత అన్ని విషయములు మృదంగమునే పోలివుండి కర్నాటక సంగీతానికి ముఖ్యంగా నుపయోగింపబడు చుండును.

(2) టూప్ డోలక్ :—ఇది పొడవు 22 అంగుళములును, మధ్యభాగమున చుట్టుకొలత 35 అంగుళములును, కుడి, ఎడమ కన్నుల వ్యాసములు 8 అంగుళములును గలిగి

వుండును. కుడి, ఎడమ మూతలను వారుతోగాక ఒక గట్టి నూలు త్రాడుతో బిగించుదురు. దీనిని సాధారణంగా గ్రామ్య సంగీతానికి వాడుదురు.

(3) హిందూస్థానీ డోలక్ :— ఇది పొడవు 20 అంగుళములును, మధ్యభాగమున చుట్టుకొలత 35 అంగుళములును, కుడి, ఎడమ కన్నుల వ్యాసములు 8½ అంగుళములును కలిగి వుండును. ఇరు ప్రక్కల నుండు మూతలను రింగులు తొడిగిన గట్టి నూలు త్రాడుతో బిగింతురు. దీనిని ముఖ్యంగా హిందూస్థానీ సంగీతమునందు వాడుదురు.

## డోలువాద్య వివరము.

(i) డోలువాద్యము :— కర్నాటక సంగీతమునం దుపయోగించు శాస్త్రీయమైన చర్మ వాద్యములలో మృదంగము తరువాత చెప్పదగిన ప్రశస్తమైన వాద్యము 'డోలు' అని చెప్పుటకేమాత్రము సందేహములేదు. దీనిని నాగస్వర వాద్యమునకు ప్రక్కన, లయవాద్యముగా నుపయోగింతురు. గనుకనే దక్షిణ ఇండియాలో నీ వాద్యము దిన దినాభివృద్ధి చెందుటకు కారణమైనది. దీనిలో పాండిత్యము సంపాదించుట మిగుల కష్టసాధ్యమైనను, యీ కళకు అచ్చటగల విశేష ప్రోత్సాహము వలన యెందరో దీనిని అభ్యసించి తగిన ప్రావీణ్యము సంపాదించ గలిగిరి. నిపుణులగు డోలు వాదకులు నాగస్వరమునకు జతగా ప్రదర్శించు తాళానుసారమైన జతులు, మోరాలు, ముక్తాయిలు వినుట కెంతయు రంజకముగానుండి డోలు వాద్యంలో ఆతనికిగల ప్రతిభా విశేషమును చాటు చుండును.

(ii) డోలు వాద్యములోని రకములు:—ఇవి మూడువిధములుగలవు.(1)డోల్కా. (2) డోలక్. (3) డాక్ అనునవి. వీటిలో డాక్ కొంచెము పెద్దదిగా నుండును.

(iii) తయారుచేయు విధము :— డోలు వాద్యమును తయారు చేయుటకు ముందు 18 లేక 20 అంగుళముల పొడవును, 9 లేక 10 అంగుళముల వ్యాసముగల పనస కఱ్ఱనుగాని లేక ఏగిస కఱ్ఱనుగాని తెచ్చి గుల్లగా తొలిచి తయారు చేయుదురు. ఇట్లు చేయుటలోయీ గుల్ల కిరు ప్రక్కల నుండు తలలు లేక రంధ్రములలో ఎడమ వైపు రంధ్రముకంటె కుడివైపురంధ్రము కొంచెము పెద్దదిగా నుండునట్లు తయారు చేయుదురు. ఈ రెండు రంధ్రములకు మేకచర్మముతో చేయబడిన రెండు మూతలను తొడుగుదురు. వీటిని కుడిమూత, ఎడమమూత అని చెప్పుదురు. కుడి, ఎడమమూతల చుట్టును గుండ్రముగా చర్మముతో చుట్టుదురు. వీటిని వలయములనబడును. ఈవలయములందు చేర్పబడుచురంధ్రములను "కండ్లు" అని చెప్పబడును, ఈకండ్లు ఒక్కొక్క మూతకు 12 వుండును. ఈకండ్లనుండి ఒకనిడుపైనవారు (సన్ననిచర్మపుకొస)ను దూర్చి లాగుచూ, రెండు మూతలను బిగువుగాను, కావలసిన శ్రుతిలోను వుండునట్లు సరిచేసి కొందురు. కొన్నిటిల్లో యీ వారుకు బదులుగా లోహపు తీగెను వుపయోగింతురు.

మూతలు రెంటిలోను ఎడమ మూత కంటె కుడి మూత ½ అంగుళము యెక్కువ వ్యాసము (Diameter) కలిగి వుండును. ఈ మూతలకు, అవి తొడగబడు గుల్ల సాధారణముగా 90° డిగ్రీల కోణములోనుండునట్లు తయారు చేయబడును.

(iv) డోలు వాయించుట కుపయోగించు సాధనములు :— పూర్వకాలములో సాధారణముగా డోలును ప్రత్యేకంగా తయారు చేయబడిన [illegible] కఱ్ఱపరికరము లతో వాయించెడివారు. కాని యిటీవల ఆ విధానము [illegible] ఒకవైపు చేతితోను, ఒకవైపు కఱ్ఱతోను వాయించుటే పరిపాటిగా నున్నది.

## తబలా వాద్య వివరము.

(i) తబలా వాద్యము :— ప్రాచీనకాలము నుండి ఉత్తర భారతదేశములో విశేషంగా ప్రచారంలో నుండు చర్మ వాద్యములలో "తబలా" మిక్కిలి ప్రాముఖ్యమైన వాద్యంగా చెప్పవచ్చును. మన కర్నాటక సంగీతమునకు మృదంగ మెంత, శాస్త్రీయమైన వాద్యముగా పరిగణింపబడునో, హిందూస్థానీ సంగీతమునకు తబలా కూడ అంత, శాస్త్రీయమైన వాద్యముగా పరిగణింపబడును. ఈవిధంగా శాస్త్రీయమైన హిందూస్థానీ సంగీతమునందేగాక, నాటక సంగీతములోను, లలిత సంగీతములోను కూడ దీని వుపయోగం అత్యధికంగా నుండుటచేతనే నేడు యీ వాద్యము ఉత్తర ఇండియాలోనేగాక దక్షిణ ఇండియాలోకూడ యెక్కువ ప్రచారంలోనికి రావటానికి కారణమైనదని గ్రహించదగును.

(ii) తయారుచేయు విధము :— తబలా వాద్యము మృదంగమువలె ఒకే వాద్యంగా నుండక రెండు భాగములుగా నుండును. గనుక కుడివైపు సగభాగమును, క్రింది వైపు రంధ్రము లేకుండునట్లును పైవైపు రంధ్ర ముండునట్లును గుల్లగా తయారుచేయుదురు. ఈ గుల్ల 10 లేక 12 అంగుళముల పొడవును, 6½ లేక 7½ అంగుళముల వ్యాసమును కలిగి యుండునట్లు తయారు చేయుదురు. దీనికి చర్మపు మూత తొడుగుదురు. దీనినే "తబలా" అని చెప్పబడును. ఇక రెండవ ఎడమవైపు సగభాగమును లోహపు రేకుతో క్రిందివైపు రంధ్రము లేకుండునట్లును, పైవైపు రంధ్ర ముండునట్లును, తయారుచేసి చర్మపు మూత తొడుగుదురు. దీనిని "బాయా" అని చెప్పబడును. ఇది 9 లేక 10 అంగుళముల పొడవును, షుమారు 8 లేక 9 అంగుళముల వ్యాసమును వుండునట్లు తయారు చేయుదురు. వీటిల్లో కుడిమూత పొడవు యెక్కువగా నుండి వ్యాసము తక్కువగా నుండును. ఎడమమూత పొడవు తక్కువగా నుండి వ్యాసము యెక్కువగా నుండును. మరియు దీనిని తయారు చేయుట కుపయోగించు కఱ్ఱల జాతులు, గుల్లలు తయారుచేయువిధము, మూతల కుపయోగించు చర్మపు జాతులు, [illegible] తయారు చేయుట, కరణిని తయారు చేయుట, కరణి వేయుట,

శ్రుతి చేయుట, ధ్వనులను పలికించుట మొదలగు అన్ని యితర విషయములును మృదంగమును బోలి వుండును.

(iii) మూతలు బిగించుటకు సాధనములు :— తబలా అండ్ బాయాల మూత లను బిగించునపుడు వారుకు క్రిందివైపున గుండ్రని చిన్నకట్టపిడులను చుట్టును దూర్చి యుంచబడును. వీటిని క్రిందికిగాని పైకిగాని కొట్టుటకు చిన్న రాగుప సుత్తెనుకూడ నుపయోగించెదరు.

(iv) శ్రుతిచేయు విధము :— తబలాలో సాధారణముగా 1 మొదలు 5½ లేక 6 శ్రుతి వరకు హెచ్చించుటకు వీలుండును. ఈ శ్రుతిని హెచ్చింపవలసి నచో సుత్తెతో కట్టపిడులను క్రిందికిని, తగ్గింపవలసినచో వీటిని పైకిని కొట్టి కొంత వరకు సరిచూసుకొందురు. ఇదుపరి మూతల చుట్టునుండు చర్మపు బొద్దులను పైనుండి క్రిందికిగాని,క్రిందినుండి పైకిగాని సుత్తెతోకొట్టుచూ ఆధారశ్రుతికి సరిచేసుకొందురు.

(v) కుడిమూతలో కరణి వేయు విధము :— తబలాలో మృదంగములోవలె షుమారు 2 అంగుళముల వ్యాసముగల కరణిని గుండ్రముగా వేయుదురు. ఇది ఆధారశ్రుతికి సరిపెట్టబడును.

(vi) ఎడమమూతకు కరణి వేయువిధము :— బాయాలో మృదంగములోవలె ఎప్పటి కప్పుడు బోనము తయారుచేసి వేసుకో నవసరములేదు. ఎందు కనగా! దీనిలో బోనమునకు బదులుగా కుడిమూతలోవలెనే షుమారు 1 అంగుళము వ్యాసముగల కరి ణిని గుండ్రముగా వేయుదురు. అట్లు వేయుటలో కుడిమూతలో పలుకు ఆధార శ్రుతికి 1 స్థాయి తక్కువైన మంద్రస్థాయి షడ్జమునకు సరిపోవునట్లు వేయుదురు.

(vii) తబలా వాయించు విధము :— తబలా వాయించునపుడు వాదకుడు తన ముందు కుడివైపున తబలాను, ఎడమవైపున బాయాను నిలువుగా నుంచుకొని కుడి చేతితో తబలాను, ఎడమచేతితో బాయాను వాయించును. అట్లు వాయించుటలో గాయకుడు లేక వాదకుడు ప్రదర్శించు సంగీతము ననుసరించుచు తాళానుసారమైన జతులు, మోరాలు, ముక్తాయిలు వాయించుటలో తనకు గల ప్రావీణ్యమును ప్రద ర్శించి సభికుల నానందింప జేయుటకు ప్రయత్నించును.

## ఖోల్ వాద్య వివరము.

(i) ఖోల్ వాద్యము :— మహారాష్ట్ర దేశములో సాధారణంగా భజన కాల క్షేపములందును, బృందగానము లందును వుపయోగించు చర్మ వాద్యములలో ఖోల్ ను ఒక ముఖ్య వాద్యంగా చెప్పవచ్చును.దీని నాదము ఘంగుమనుచూ, వేలాది జనసమూ హములందుకూడ ప్రతిధ్వని నిచ్చుచుండును. గనుకనే అచ్చట నీవాద్యమును దేవతా వుత్సవములలోకూడ తఱచుగా వాడుచుందురు. ఇది కొంచెము యించుమించుగా మన మృదంగాన్నిబోలి వుండును. కాని మృదంగముకంటె పొడవును, మధ్య చుట్టు కొలత యెక్కువగాను, 2 కన్నుల వ్యాసములు తక్కువగాను వుండును. అనగా పొడవు 25 అంగుళములును మధ్య చుట్టుకొలత 36 అంగుళములును, కుడికన్ను వ్యాసము 5 అంగుళములును, ఎడమకన్ను వ్యాసము 8 అంగుళములును వుండి కుడి కన్నుపైన చిన్న కరణి వేయబడును, మిగత విషయములు మృదంగమును బోలి వుండును.

## భారతీయ సంగీత చారిత్రక పురుషులగు

# వాగ్గేయ కారకుల చరిత్రము.

1. భరతుడు :— ఇతడు 4వ, శతాబ్దమునకు చెందినవాడు. సంగీత లక్షణ గ్రంథము లన్నిటిలో మొదటిదైన " నాట్య శాస్త్ర " మను గ్రంథమును రచించిన మహానీయుడు. గనుకనే యీ గ్రంథమునకు " అది లక్షణ గ్రంథ" మను పేరు వచ్చుటకు కారణమైనది. దీనిలో సంగీతముకంటె నాట్యశాస్త్రము గురించే యెక్కువగా వ్రాయబడినందున " నాట్యశాస్త్ర " మను పేరు కలిగెను. దీనిలో సంగీతము గురించికూడా ఆరు అధ్యాయములుగలవు.అవి (1) జాతి లక్షణ విధానము. (2) ఆతోద్యజాతివిధానము. (3) సుషిరాతోద్యాధికారము. (4) తాళవిధానము. (5) ధృవాధ్యాయము. (6) పుష్కరవాద్య విధానములగును. మరియు నితడు ఒక స్థాయిలో 22 శ్రుతు లుండునని చలవీణ, ధృవవీణలతో ప్రయోగ దృష్టాంతరములద్వారా నిరూపించిన గొప్ప సంగీత లక్షణకారు డగును. ఇతనికి భరతాచార్యుడని, భరతముని అను నామాంతరములు గలవు.

2. నారదుడు :— ఇతడు భరతుని తరువాతవాడని తెలియుచున్నది. ఇతనిచే రచింపబడిన "సంగీతమకరంద" మను గ్రంథము ఒక ప్రసిద్ధ లక్షణగ్రంథమగును. దీనిలో స్త్రీ, పురుష, నపుంసక రాగములుగను, ఆయా రాగములు పాడదగిన కాలము ననుసరించి, సంధిప్రకాశ, సూర్యాంశ, చంద్రాంశ రాగములుగను, ఉదయ, మధ్యాహ్న, సాయంకాల రాగములుగను, ముక్తాంగకంపిత, అర్ధకంపిత, కంపవిహీన రాగములుగను విభజించి వాటిని వివరించి యుండెను. మరియు "నారదశిక్ష" "చత్వారింశచ్ఛతరాగ నిరూపణ" వంటి లక్షణ గ్రంథములనుకూడ రచించినట్లు తెలియుచున్నది. అయితే యితడు త్యాగరాజునికి "స్వరార్ణవ" గ్రంథము నొసగినట్టి నారదమహర్షి అవునో కాదో తెలియుటలేదు. కాని కొందరు మాత్రము యితడు నారదమహర్షి కాడనియు, నారదుడను పేరుగల ఒక గొప్ప సంగీత లక్షణకారుడనియు తెలుపుచున్నారు.

3. మతంగుడు :— ఇతడు భరతునికి తరువాతివాడును, శార్ఙ్గదేవునికి ముందువాడును యగును. ఇతనిచే రచింపబడిన "బృహద్దేశి" అను గ్రంథము మిగుల ప్రసిద్ధమైనది. దీనిలో శ్రుతినిర్ణయం, స్వరనిర్ణయం, మూర్ఛనానిర్ణయం, తాననిర్ణయం 33 అలంకారములు, జాతులు, రాగలక్షణములు, భాషాలక్షణములేగాక ప్రబంధాధ్యాయములో 40 రకముల ప్రబంధములను, వాద్య, యంత్రములను, దేశీయరాగములను గురించికూడ వర్ణింపబడెను. అయితే యిందులోగల రాగలక్షణములు మాత్రము మార్గరాగ పద్ధతికి భిన్నముగాను, దేశీయరాగపద్ధతికి అనుకూలముగాను వుండుటచే నప్పు

కానే దీనిని "బృహద్దేశి" యని చెప్పుటకు కారణమయ్యెను. కర్ణాటక సంగీతమున కిది యొక గొప్పప్రమాణ గ్రంథమగును.

4. ప్రతాపశైలపుడు :— ఇతడు క్రీ. శ. 920 ప్రాంతమువాడు. బాదామి నేలిన చాళుక్యరాజు. ఇతడు రచించిన "సంగీతచూడామణి" అను గ్రంథము మిక్కిలి ప్రసిద్ధమైనది. దీనిని గురించి శ్రీ అన్నమాచార్యులు తన సంకీర్తన లక్షణ గ్రంథములో పేర్కొని యుండుట గమనించదగును.

5. మమ్మటాచార్యుడు :— ఇతడు క్రీ. శ. 1050 - 1150 ప్రాంతమువాడు. ఇతడు రచించిన "సంగీతరత్నమాల" ప్రసిద్ధ లక్షణ గ్రంథములలో నొకటి యగును. ఈ గ్రంథమున శుద్ధవరాటి, దేశవరాటి, దక్షిణసౌరాష్ట్రి, గుజ్జరి, టక్క, ఘంటారవము, నట్టనారాయణ, శంకరాభరణం వంటి దేశీయ రాగములను గూర్చి వివరింపబడెను.

6. పార్శ్వదేవుడు:— ఇతడు 12 వ, శతాబ్దమునకు చెందినవాడు. జైనపండితుడు. క్రీ. శ. 1165 లో యితడు రచించిన "సంగీతసమయసారం" మిగుల ప్రసిద్ధమైన గ్రంథమగును. ఇందుగల అనేక విషయములను రత్నాకర వ్యాఖ్యానకర్తలగు, శ్రీకల్లినాథ, సింహళభూపాలుర వ్యాఖ్యానములందు పేర్కొనబడినవి.

7. చాళుక్యసోమేశ్వరుడు:— ఇతడు 12 వ, శతాబ్దములోని వాడును, క్రీ. శ. 1174 -1177 కాలమున కల్యాణీనగరమును రాజధానిగా నేలిన చాళుక్యచక్రవర్తియు నగును. ఇతడు రచించిన "సంగీతరత్నావళి" అను గ్రంథము మిగుల ప్రసిద్ధమగును

8. జయదేవుడు:— ఇతడు 12 వ, శతాబ్దమునకు చెందినవాడు. జన్మస్థానము ఒరిస్సారాష్ట్రమునందలి జగన్నాథ క్షేత్రమునకు సమీపమునగల "కెందుబిల్వ" మను గ్రామము. తల్లి రమాదేవి. తండ్రి భోజదేవుడు. భార్య పద్మావతి. కృష్ణభక్తురాలు. ఇతడు బెంగాలులో నివసించెను. సంగీత, సాహిత్యములలో గొప్పపండితుడు. కృష్ణభక్తుడు. "గీతగోవింద" మను శృంగారరస ప్రధానమైన మహాకావ్యాన్ని, రాధాకృష్ణుల ప్రేమతత్వమునుగూర్చి అష్టపదులుగా రచించిన మహానుభావుడు. ఈ రచనలందు ఒక్కొక్క దానిలో 8 పాదములుండుటచే వీటికి అష్టపదులను పేరు కలిగెను. ఈ గ్రంథము 24 అష్టపదులును, 80 కి, పైగా శ్లోకములును గలిగి 12 సర్గలలో వ్రాయబడెను. గోవిందునిగూర్చి రచింపబడిన గేయ ప్రబంధ మగుటచే దీనికి "గీతగోవింద" మను పేరు కలిగెను. శ్రీకృష్ణుడు పరబ్రహ్మము గనుక ఆతని పేరు యిందు వుదహరింపబడలేదు. ఈ అష్టపదులు నాయకా, నాయికీ సఖులచే పాడబడినట్లు రచింపబడెను. వీటిలో 19 వ, అష్టపదిని దర్శనాష్టపది అనియు, సంజీవనీ అష్టపది అనియు చెప్పబడును. సంగీత రచనలకు యీ అష్టపదులే ప్రప్రథమములని తెలియుచున్నది. వీటి ననుసరించియే, రామకవి "రామాష్టపదులును, చంద్రశేఖరేంద్రసరస్వతి "శివా

ష్టపదులును, వేంకటమఖి "త్యాగరాజాష్టపదులు"ను రచించియుండిరి. ఇతడు క్రీ. శ. 28-12-1153 కు సరియగు శ్రీముఖ సంవత్సర మార్గశిర బహుళ ఏకాదశి దివసమున కైవల్యమొందినటుల తెలియుచున్నది.

9. శార్ఙ్గదేవుడు:—ఇతడు 12వ, 13వ, శతాబ్దములలోనివాడు. కాశ్మీరదేశస్థుడు. యాదవవంశస్థుడు. వర్షగణబుషిగోత్రీకుడు. తండ్రి సోడ్ఢలదేవుడు. తాత భాస్కరుడు. కాశ్మీరపండితుడు. శార్ఙ్గదేవుడు సంగీత, సాహిత్యములయం దపారమైన పాండిత్యముగలవాడు. సంశయములు లేనివాడగుటచే "నిశ్శంకు" డను బిరుదు నొందెను. క్రీ. శ. 1200 - 1247 వరకు దేవగిరి (దౌలతాబాద్- హైదరాబాద్ రాష్ట్రం)ని, రాజధానిగా పరిపాలించిన సింహాణ భూపాలుని ఆస్థాన విద్వాంసుడు. "అధ్యాత్మవివేక" మను వేదాంత గ్రంథము నేగాక "సంగీతరత్నాకర" మను ప్రసిద్ధలక్షణ గ్రంథమును కూడ రచించిన ప్రతిభావంతుడు. ఇతడు తన రత్నాకరములో ఆంధ్రి, గౌడీవంటి జాతు (రాగము) ల గానపద్ధతిని, ఆంధ్రీలా, కర్ణాటేలా, ద్రావిడేలావంటి ఏలాప్రబంధ లక్షణ విధానమును వివరించెను. భరతుడు షడ్జమధ్యమ భావము, షడ్జపంచమ భావము లతో కనిపెట్టిన 22 శ్రుతుల పద్ధతిని యితడు తన గ్రంథమున విపులీకరించెను. మరియు నీగ్రంథమున భరత, మతంగ, కీర్తిధర, కోహల, కంబళ, అశ్వతర, అంజనేయ, అభినవగుప్త, సోమేశ్వర మతములను, మరియు స్వరగతాధ్యాయం, రాగవివేకాధ్యాయం, ప్రకీర్ణకాధ్యాయం, ప్రబంధాధ్యాయం, తాళాధ్యాయం, వాద్యాధ్యాయం, నృత్యాధ్యాయమను 7 అధ్యాయములును, సింహాళ, శార్ఙ్గదేవ, కుంభకర్ణ నరేంద్ర, కల్లినాథులు రచించిన 4 సంస్కృతవ్యాఖ్యానములును, హంసభూపాలుడు వగ్గిరాలు రచించిన 2 ఆంధ్రవ్యాఖ్యానములును, గంగారాముడు రచించిన 1 హిందూస్థానీవ్యాఖ్యానమునుకూడ వివరించియుండెను. అయితే యీ 7 వ్యాఖ్యానములలో కల్లినాథుడు క్రీ. శ. 1420 లో రచించిన వ్యాఖ్యానము మాత్రము బహుదేశ ప్రసిద్ధమైయున్నది. శార్ఙ్గదేవుడు రత్నాకరమునందు వ్రాసిన కొన్ని భాగములు యిప్పటి లక్ష్యలక్షణములకు సమన్వయము గాకుండుటను. ప్రాచీనులగు శ్రీరామామాత్యులు, వెంకటమఖివంటి ప్రసిద్ధవేత్తలుకూడ తెలిపియుండిరి.

కర్నాటక - హిందూస్థానీ సంగీత విభజన :— శార్ఙ్గదేవుని "రత్నాకర" గ్రంథ రచనకాలము వరకు భారతీయ సంగీతం ఒకే పద్ధతిలో ఒకే పేరుతో నుండెను. కాని 13 వ, శతాబ్దంలో మహమ్మదీయ దండయాత్రలకు లోనైన ఉత్తర హిందూస్థానమున మొగల్ సామ్రాజ్య స్థాపనతో వారి పారశీక సంగీత పద్ధతులు అచ్చటి భారతీయ

సంగీతంలో లీనమై, హిందూస్థానీ సంగీతంగాను, దక్షిణ హిందూస్థానంలోగల సంగీతాన్ని కర్నాటక సంగీతంగాను చెప్పటం ప్రారంభమయ్యేను. వీటిలో మొదటిదానిని హనుమత్సంప్రదాయ మనియు, రెండవదానిని శారద సంప్రదాయ మనియు చెప్పటం కలదు. అయితే ప్రధానసూత్రాలలో యీ రెంటికిని భేదం లేకున్నను, శ్రుతివిధానం, రాగలక్షణం, గమకప్రయోగాలలో మాత్రము కొంత వ్యత్యాసమేర్పడి వేరుమార్గంలో పరిణామం చెందటం జరిగినది. శ్రుతి, భావములే ప్రధానలక్ష్యంగా హిందూస్థానీ సంగీత మభివృద్ధి చెందుచుండగా, శ్రుతి, భావములేగాక లయయుక్తమైన తాళవిధానం అతిప్రధాన లక్ష్యంగా కర్నాటక సంగీత మభివృద్ధి చెందడంతో దాని విశిష్టత జగద్విఖ్యాతమై ప్రపంచంలో మహోన్నతమైన స్థానాన్ని అలంకరించటానికి కారణమైనదని గ్రహించదగును.

10. జాయపసేనాని :— ఇతడు క్రీ. శ. 1213-1262 వరకు కాకతీయ సామ్రాజ్యంలో ఆంధ్రదేశము ఏకఛత్రాధిపత్యముగ నేలిన గణపతిదేవుని గజసైన్యాధ్యక్షుడును, గొప్పసంగీతలక్షణకారుడు నగును. ఇతడు "నృత్తరత్నావళి" అను నాట్యశాస్త్ర గ్రంథాన్ని, "గీతరత్నావళి" అను సంగీతలక్షణ గ్రంథాన్ని, "వాద్యరత్నావళి" అను వాద్యలక్షణ గ్రంథాన్ని రచించినట్లు తెలియుచున్నది. వీటిలో మొదటిదైన గ్రంథము మాత్రం కనుపించుచున్నది. ఇతడు బహుశా, శార్ఙ్గదేవ, సోమనాథులకు సమకాలికుడై యుండవచ్చునని తెలియుచున్నది.

11. హరిపాలదేవుడు :— ఇతడు క్రీ. శ. 1309 - 1312 వరకు "దేవగిరి"ని పాలించిన కడపటిరాజగును. తండ్రిపేరు కుమిరి. తాతపేరు సోమనాథుడు. మరియు నితడు "అన్హిలవాడ"ను పరిపాలించిన చాళుక్యరాజనికూడ కొందరు చెప్పుదురు. ఇతడు రచించిన "సంగీతసుధాకర" మను గ్రంథము మిక్కిలి ప్రసిద్ధమైనది. ఈతనికి "విచారచతుర్ముఖు" డను బిరుదుకూడ గలదు.

12. విద్యారణ్యుడు :— ఇతడు క్రీ. శ. 1320 - 1380 కాలమునకు చెందినవాడు. విద్యానగరరాజ్య ప్రతిష్ఠాపకుడు. "సంగీతసార" మను ప్రసిద్ధలక్షణ గ్రంథాన్ని రచించిన గొప్ప లక్షణకారుడు. వేద, భాష్య, సంగీతము లందుతి సమర్థుడు. వెంకటమఖిచే కనుగొనబడిన మేళకర్త - జన్యరాగ పద్ధతికి యితడే మూలపురుషుడు. ఈవిషయమును గోవిందదీక్షితులుకూడ తన "సంగీతసుధ" లో పేర్కొనుట జరిగియుండెను. మన సంగీతానికి కర్నాటక సంగీతమను పేరు వచ్చుటకుగల ప్రధానకారకులలో నితడొకడని తెలియుచున్నది.

13. అన్నమాచార్యుడు :— ఇతడు క్రీ. శ. 1404 - 1480 కాలమునకు చెందినవాడు, ఆంధ్రుడు. నందవరీకి బ్రాహ్మణుడు. జన్మస్థానము తాళ్లపాక గ్రామము.

నివాసము తిరుపతిక్షేత్రము.కుమారులు నరసింహాయ్య, పెదతిరుమలయ్య.శ్రీ వేంకటేశ్వరుని కంకితముగా భక్తితో నితడు తెలుగున రచించిన వేలకొలది కీర్తనలు రాగిరేకుల పై నుండుట మనము తిరుపతిలో నేటికిని చూడవచ్చును. ఈ రచనలను తిరుపతి దేవస్థానమువారు శ్రీ కళాప్రపూర్ణ, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి ఆధ్వర్యమున స్వర సాహిత్యములతో, ప్రకటించుచుండుట యెంతయు విశేషము. ఈయన సంస్కృతములో "రచించిన సంకీర్తన లక్షణము"ను యితని మనుమడు చినతిరుమలాచార్యులు తెనిగించియుండెను. భరత, శార్ఙ్గదేవాదులు తమ గ్రంథములందు నిర్వచించిన పదమను గేయరచనకు లక్షణము అన్నమాచార్యుడు తన గ్రంథములో పేర్కొని యుండెను. భక్తిరస ప్రధానమైన వేలకొలది పదము (సంకీర్తన) లను రచించుటచే యితనికి పదకవితా మార్గదర్శి" అనియు, మరియు "సంకీర్తనాచార్య" "ద్రావిడాగమ సార్వభౌమ" అను బిరుదు లొసంగబడెను. ఈతని రచన(పదము)లు శ్రీ వేంకటేశ్వరుడు నాయకునిగా,ఆయన లీలావిశేషములను కీర్తించునవి యగుటచే వాటిని "సంకీర్తనలు" లని చెప్పబడెను.

14. చతురకల్లినాథుడు :— ఇతడు క్రీ. శ. 1423 - 1446 వరకు విద్యానగరేలిన ఇమ్మడి దేవరాయల ఆస్థాన విద్వాంసుడు. శార్ఙ్గదేవుని "సంగీతరత్నాకరము"నకు దేశప్రసిద్ధమైన "కళానిధి" అను వ్యాఖ్యాన మొనర్చిన ప్రతిభావంతుడు. తండ్రి పేరు లక్ష్మీనారాయణాచార్యుడు. తల్లిపేరు నారాయణి. చతురుడనే సార్థకనామమే గాక సంగీతదేవత, అభినవ భరతాచార్య, రాయవాగ్గేయకార (రాజవాగ్గేయకార) తోడరమల్లాది బిరుదులతో ఇమ్మడి దేవరాయలచే సన్మానింపబడిన ఘనుడు.

15. పురందరదాసు :— ఇతడు క్రీ. శ. 1486 - 1564 కాలమునకు చెందినవాడు. జన్మస్థానము బళ్లారి జిల్లాలోని పురందరగడ (హంపీదగ్గర) అను గ్రామము. కర్నాటక బ్రాహ్మణుడు. మధ్వమతస్థుడు తండ్రిపేరు వరదప్ప. తల్లిపేరు కమలాంబ. భార్యపేరు సరస్వతీబాయి. ఈయన మొదటిపేరు శీనప్ప. గొప్ప ధనికుడు. ఇతడు మొదట పూనానగరములోను, తరువాత హంపీవిజయనగరములోను నివశించెను. అన్నమాచార్యునికంటె యువకుడు. వీరుభయులు సమావేశమైనట్లుకూడ చెప్పుదురు. ఇతడు పండరినాథుని భక్తుడై తన ఆస్తినంతయు దాన, ధర్మములకు వినియోగించిన గొప్ప త్యాగధనుడు. వేదోపనిషత్తులను ప్రజలకు బోధించిన చరితార్థుడు. కన్నడ భాషలో విశేషపాండిత్యము సంపాదించి భక్తితో 4,75,000 దేవరనామములను రచించి తరించిన మహానుభావుడు. కర్నాటక సంగీతమును ప్రారంభ శిక్షణకు వీలుగా స్వరావళి, జంట, అలంకార, పిళ్ళారిగీత, గీతముల రచించిన ఆదిగురువు. మరియు నితడు [illegible] యితర ప్రబంధములనుకూడ రచించిన సిద్ధాంత

స్నాడు. వేదాంత ప్రబోధములైన యీతని రచనలను కన్నడభాషలో 'దాసరపదగళు' అని చెప్పుదురు. వీరి రచనలు 'పురందరవిఠల' ముద్ర గలిగియుండును. స్వరావళిని మాయామాళవగౌళరాగములో బోధించుటను యితడే ప్రారంభించెను. ఇతనికి 'కర్నాటక సంగీత పితామహ'యను బిరుదు గలదు. ఇతని కుటుంబములోని వారందరును సంకీర్తన రచయితలగుదురు. ఇతడు రక్తాక్షి సం॥ పుష్య బ ౧౫ రోజున స్వర్గస్థుడయ్యెను.

16. రామామాత్యుడు :—ఇతడు 16 వ, శతాబ్దములోనివాడు, అరవీటిరామరాయల ఆస్థానవిద్వాంసుడు. రామరాయల కోరికపై క్రీ. శ. 1550 లో "స్వరమేళకళానిధి" అను గొప్ప సంగీతలక్షణ గ్రంథమును రచించిన ప్రసిద్ధ లక్షణకారుడు. రాయబకార, అభినవ భరతాచార్య, తోడరమల్లాది బిరుదులొందిన ఘనుడు. ప్రాచీనమూర్ఛనా జాతుల నుండి రాగములేర్పడు విధానమును వదలి జనక, జన్యరాగ పద్ధతిని ప్రవేశపెట్టిన ధీమంతుడు. తనకాలంలో వ్యవహారంలోనున్న 20 మేళరాగములలో "మాళవగౌళ" మిగుల ప్రాముఖ్యమైనదిగా చెప్పిన ప్రజ్ఞావంతుడు. ఇతడు తన గ్రంథములో రుద్రవీణను గురించి చెప్పుచూ, అవి 3 రకములనియు, (1) శుద్ధమేళవీణ, (2) మధ్యమేళవీణ, (3) అచ్యుతరాజేంద్ర మేళవీణ లనియు ఈ 3 వ. వీణను శ్రీకృష్ణదేవరాయల తమ్ముడైన అచ్యుతదేవరాయల ప్రోత్సాహమున నిర్మింపబడిన దనియు, పై మూడు వీణలునుమరల ఒక్కొక్కటి రెండురకములుగా నుండుననియు అవి (1) ఏకరాగ మేళ వీణ(ప్రాచీనవీణ) (2) సర్వరాగమేళవీణ (యిప్పటివీణ) అనియు పేర్కొనెను. ఇతడు నిర్వచించిన 20 ప్రాచీనమేళములలో సాళంగనాట, కేదారగౌళ మేళముల రెంటియొక్క లక్షణ మొకటిగా నుండుటచే కొందరు యీ మేళములు 19 అని చెప్పుటకు కారణమైనది.

17. సోమనాథుడు :— ఇతడు క్రీ. శ. 1609 ప్రాంతమందు గలవాడు. ఆంధ్రుడు. తండ్రిపేరు ముద్గలసూరి. తాతపేరు మంగనాథుడు. ఇతడు రచించిన "రాగవిబోధ" మను గ్రంథము మిక్కిలి ప్రసిద్ధమైనది. ఈ గ్రంథము రామామాత్యుని "స్వరమేళకళానిధి" ని యనుసరించి వ్రాయబడెను. దీనిలో 5 ప్రకరణములు గలవు. అవి (1)శ్రుతిస్వరవివేకం, (2) వీణావివేకం, (3) మేళవివేకం, (4) రాగవివేకం, (5) రాగరూపవివేకము లగును. ఇతడు తన గ్రంథమున మేళములు 23 గా నిర్ణయించి పేర్కొనెను.

18. చతురదామోదరుడు :— ఇతడు క్రీ. శ. 1570–1578 వరకు విజయనగరమును పాలించిన తిరుమలరాయుని ఆస్థాన విద్వాంసుడు. "గీతగోవింద" మునకు "శ్రుతిరంజని" యను వ్యాఖ్యానము వ్రాసిన చెరుకూరి లక్ష్మీధరపండితుని కుమారుడు. 'సంగీతదర్పణ' మను లక్షణ గ్రంథమును రచించిన గొప్ప పండితుడు. ఈ గ్రంథమును ఉత్తర భారతదేశమందు మిక్కిలి ప్రామాణికముగా తీసికొనుచుందురు. దీనిలో

రాగ, రాగిణీ, పరివారము లనబడు 132 రాగముల గురించి పేర్కొనబడెను. అంతేగాక (1) స్వరాధ్యాయం, (2) రాగాధ్యాయం, (3) రాగరాగిణుల కుదాహరణం, (4) ప్రకీర్ణకాధ్యాయం, (5) ప్రబంధాధ్యాయం, (6) వాద్యాధ్యాయం. (7) వాద్య ప్రబంధాధ్యాయం, (8) తాళాధ్యాయం, (9) దశప్రాణాధ్యాయం, (10) నృత్యాధ్యాయములుగూడ వివరింపబడెను. కల్లీనాథునికివలె యితనికికూడ 'చతుర' అను శబ్దము బిరుదు యగును.

19. లోచనకవి :— ఇతడు 16 వ, శతాబ్దమునకు చెందినవాడు. 'రాగతరంగిణి' అను గొప్ప లక్షణ గ్రంథమును రచించిన పండితుడు. ఇతడు తన గ్రంథమునందు 12 జనక మేళములను,వాటిజన్యరాగములను,మూర్ఛనాజాతుల నుంచి రాగమును గ్రహించు విధమును పేర్కొనెను. ఈతనిచే వ్రాయబడిన స్వర, రాగలక్షణములు ఉత్తరభారత దేశమందుగల సంగీతమునకు సంబంధించినవిగా నుండును.

20. పుండరీకవిఠలుడు:— ఇతడు క్రీ. శ. 1590 ప్రాంతమువాడు. కర్నాటక దేశస్థుడు. గొప్పగాయకుడు. ఉత్తరభారతంలో పర్యటించి ఖాన్ దేశంలోని 'ఆనంద వల్లి'ని పరిపాలించిన బుర్హాన్ఖాన్ ఆస్థానంలో సన్మానింపబడిన సమర్థుడు. ఖాన్ కోరికపై 'షడ్రాగచంద్రోదయ' మను గ్రంథమును రచించి, అందు స్వరప్రస్తార, స్వరమేళప్రస్తార, ఆలప్తి, ప్రాసాదములను, కొన్ని అధ్యాయములలో ఉత్తరభారత దేశ రాగస్వరూపమును నిర్ణయించిన మహానుభావుడు.ఇతడు కపిలముని కోరికపై 'రాగమాల' అను గ్రంథమును, అక్బర్ ఆస్థానముచేరిన పిదప మాధవసింహుని కంకితముగా'రాగమంజరి' అను గ్రంథమును రచించెను. దీనిలో స్వరాధ్యాయం, రాగాధ్యాయములు రెండేగలవు, 'నర్తననిర్ణయ' మను గ్రంథముకూడ యీతని రచనగానే తెలియుచున్నది.

21. మాధవభట్టు :— ఇతడు క్రీ. శ. 1600 ప్రాంతమువాడు. వారణాసివాస్తవ్యుడు. 'సంగీతచంద్రిక' యను లక్షణ గ్రంథమునకు కర్తయైనవాడు. ఇతడు తన గ్రంథములో శ్రుతి, స్వర, రాగ, గమక, ఆలాప లక్షణములను వివరించెను. ఈతని గ్రంథమును గురించి అన్నమాచార్యులు తన 'సంకీర్తనలక్షణం' లో పేర్కొనుట గమనించదగిన విషయమగును.

22. భావభట్టు :— ఇతడు షాజహాన్ చక్రవర్తి ఆస్థాన విద్వాంసుడైన పండిత రాజ జనార్దనభట్టు యొక్క కుమారుడు. మాళవరాజైన అనూపసింహుని కోరికపై 'సంగీతలక్షణ' మను గ్రంథమును దక్షిణదేశ సంగీత సంప్రదాయముగా రచించిన ప్రసిద్ధుడు. ఇతడు తన గ్రంథమున 20 జనకరాగములనే పేర్కొనెను.

23. గోవిందదీక్షితులు :— ఇతడు క్రీ. శ. 1577 - 1614 కాలమునతంజావూరును పరిపాలించిన అచ్యుతప్పనాయక, రఘునాథభూపాలుర కాలమున ప్రధాన మంత్రిగా నున్నవాడు. కర్నాటక స్మార్తబ్రాహ్మణుడు, అశ్వలాయనసూత్రానికి చెందినవాడు. వసిష్టగోత్రికుడు. భార్యపేరు నాగమాంబ. పుత్రులపేర్లు (1) యజ్ఞనారాయణదీక్షితులు, (2) వెంకటమఖి. ఇతడు రఘునాథభూపాలుని పేర ప్రకటించిన 'సంగీతసుధ' అను గ్రంథము యీతనిదిగాను ప్రతీతిగలదు. ఈగ్రంథమున స్వర, రాగవివేక, ప్రకీర్ణక, ప్రబంధ, తాళ, వాద్య, నర్తనాధ్యాయములు గలవు. రామామాత్యునిచే కనిపెట్టబడిన 'సర్వరాగవీణను' యితడే కొంచె సంస్కరించి రఘునాథవీణ యని పేరుపెట్టెనని చెప్పుదురు. 72 మేళకర్తల పద్ధతినికూడ యితడే మొదట కనుగొనెనని కొందరు చెప్పటంకద్దు. ఇతడు సంగీత, సాహిత్యములలో మహాపండితుడైన వాగ్గేయకారకుడు. రఘునాథభూపాలాంకితముగా యితడు 'సంగీతసుధానిధి' అను గొప్ప లక్షణగ్రంథాన్ని కూడ రచించెను.

24. వెంకటమఖి :— ఇతడు క్రీ. శ. 1620 ప్రాంతమువాడు. గోవిందదీక్షితుల రెండవ కుమారుడు. వెంకటేశ్వరదీక్షితులను పేరుకలవాడు. మొదట అన్నయగు యజ్ఞనారాయణదీక్షితులవద్ద సంగీతవిద్య నభ్యసించెను. తరువాత ఉత్తరదేశపు మేటిగాయకుడైన తానప్పాచార్యులవద్ద పరిపూర్ణమైన లక్ష్య, లక్షణజ్ఞానం సంపాదించిన మేధాసంపన్నుడు. గురువైన తానప్పాచార్యుని ధ్యానించుతూ ఆరభిరాగమున "గంధర్వజనతాఖర్వదుర్వార గర్వభంజన" అను గీతము త్రిఖండముగా రచించి గురువుకు, తండ్రికి, అన్నగారికి వినిపించి మెప్పునొందిన ప్రతిభావంతుడు. శ్రీ విజయరాఘవనాయకుని ఆస్థానవిద్వాంసుడు. గనుక ఆయన కోరికపై వీణ, శ్రుతి, స్వర, మేళ, రాగ, ఆలాప, ఠాయ, గీత, ప్రబంధ, తాళములను పది ప్రకరణములతో క్రీ. శ. 1660 లో "చతుర్దండిప్రకాశిక" అను గొప్ప లక్షణగ్రంథమును రచించిన సమర్థుడు గీత, ఠాయ, ప్రబంధ, ఆలాపములతో కూడినదగుటచేతనే యీ గ్రంథమునకు "చతుర్దండిప్రకాశిక" యను పేరుకలిగెను. ఈ గ్రంథమున రాగాంగ, ఉపాంగ, భాషాంగ రాగలక్షణములను శ్లోకములద్వారా నిరూపించి అందుకు వుదాహరణగా తన గీతములను పేర్కొనెను. మరియు "రాగలక్షణ" మను మరియొక గ్రంథముకూడ రచించినట్లు తెలియుచున్నది. దీనిలో 72 మేళకర్తలు, వాటి జన్యరాగములు, వాటి లక్షణములుకూడ కలవు. విద్యారణ్యుని కాలంలో 15 గాను, రామామాత్యుని కాలంలో 20 గాను వున్న ప్రాచీన మేళములను వేంకటమఖి తన సూక్ష్మదృష్టితో పరిశీలించి శాస్త్రీయ దృక్పథంతో మరికొన్ని చేర్చి 72 మేళకర్తలుగా నిర్ణయించెను. నాయక రాజులనాటి కర్నాటక సంగీత లక్ష్య, లక్షణవిధానము యీతని "చతుర్దండిప్రకాశిక"

గ్రంథమువల్ల మనము తెలుసుకోవచ్చును. ఇతడు తిరువారూరు శ్రీ త్యాగరాజ స్వామిని స్తుతించుచూ 24 అష్టపదులు వ్రాసెను. ఇతని మహిమల గురించి ఎన్నో కథలు గలవు. వాటిలోః (1) మాళవగౌళలో గీతముపాడి చోరబాధను, (2) రీతిగౌళలో గీతముపాడి రాజు ఉదరబాధను నివారించుట ముఖ్యమైనవగును.

25. గోవిందామాత్యుడు:- ఇతడు క్రీ. శ. 1577—1614 కాలమునాటివాడు. ఆంధ్రుడు. ఇంటిపేరు పోలూరివారు. నివాసము కోసలూరు. అచ్యుతదేవరాయల కాలమునాటివాడు. సంగీతసాహిత్యములలో గొప్ప సమర్థుడు. ఇతడు మేళకర్తలు 72 నూ, సంపూర్ణ-సంపూర్ణములుగానే వుండవలెనను మతముగలవాడు. గనుక వాటికి కనకాంగి, రత్నాంగి, గానమూర్తివంటి 72 పేర్లను యేర్పరచియుండెను. ఇవే నేటికిని వాడుకలోనున్నవి. వేంకటమఖి తానే కల్పించినటుల చెప్పబడిన 72 మేళములకు కూడ కనకాంబరి, ఫేనద్యుతివంటి 72 పేర్లను యేర్పరచియున్నను, వాటిలో కొన్ని మేళములు సంపూర్ణ-సంపూర్ణములుగా లేకను యిప్పటి వాడుకలోగల మేళకర్త పద్ధతికి భిన్నంగా నుండుటచేతను నేడు యీ గోవిందామాత్యుని 72 మేళకర్తలే విశేషప్రచారంలో నుండటానికి కారణమైనది. ఈ కారణంచే యితడు వేంకటమఖికి తరువాతవాడేమోనని కూడ అనుకోనవలసివస్తున్నది. ఇతడు "సంగీతశాస్త్రసంక్షేపము", "సంగ్రహచూడామణి" వంటి లక్షణ గ్రంథములను సంస్కృతంలో రచించెను. మరియు కొట్టమూరి బుస్సప్పపాలుని కోరికపై కోసలూరి శ్రీరామచంద్రుని కంకితముగా "రాగతాళచింతామణి" అను గొప్పలక్షణ గ్రంథమునుకూడా రచించినట్లు పరిశీలకులు తెలుపుచున్నారు. ఈ గ్రంథములో 5 ఆశ్వాసములుగలవు. అందు మొదటి ఆశ్వాసంలో నాదవిషయమునూ, రెండవ ఆశ్వాసంలో 22 శ్రుతులు, శుద్ధ వికృతి స్వరములు, దేశీరాగములునూ, మూడవ ఆశ్వాసంలో గ్రామత్రయము, షడ్జ, మధ్యమ గ్రామములందలి చతుర్దశమూర్ఛనలు, శుద్ధతాన, కూటతాన, స్వరప్రస్తార వివరములనూ, నాలుగవ ఆశ్వాసములో ఆనాటి 20 మేళములు, వాటి జన్య రాగ వివరములనూ, అయిదవ ఆశ్వాసంలో వాగ్గేయకారక లక్షణము, గాయకభేదాలు, గాయకదోషాలు, స్వరదోషాలు మొదలగునవియును పేర్కొనబడెను.

26. నారాయణతీర్థులు:— ఇతడు క్రీ. శ. 1580—1680 కాలమునకు చెందినవాడు. ఆంధ్ర బ్రాహ్మణుడు. సంగీత సాహిత్యములందును, నృత్య, వేదాంతాది శాస్త్రములందును గొప్ప పండితుడు. శ్రీకృష్ణభక్తుడు. సంస్కృతంలో "శ్రీకృష్ణలీలా తరంగిణి" అను గ్రంథమును మరికొన్ని వేదాంతగ్రంథములనే గాక తెలుగులో "పారిజాతాపహరణము" వంటి యక్షగానములుకూడ రచించిన ప్రతిభావంతుడు. ఈయన జన్మస్థానము కృష్ణాజిల్లాలోని శ్రీకాకుళమని కొందరును, కూచిపూడి అగ్రహారమని కొందర

రుడు. గుంటూరుజిల్లాలోని 'కాజ' అని కొందరును చెప్పుచేగాక ఇంటిపేరు తల్లావఝుల అనియు యీయనపేరు గోవిందశాస్త్రి అనియు, తండ్రిపేరు నీలకంఠశాస్త్రి అనియు ఇటుల అనేకరకములుగా పరిశీలకులు తెలుపుటచే వీటిలోఏదినిజమోకూడా నిర్ధారణగా తెలుపుటకు వీలులేకున్నది. కాని యితడు కృష్ణానదీ తీరప్రాంతమువాడని మాత్రము నిస్సంకోచముగా చెప్పవచ్చును. ఇతడు పరిణామశూల బాధనివారణకై శ్రీ తిరుపతి వేంకటేశ్వరుని దర్శించెననియు, ఆస్వామివారి ఆజ్ఞమేరకు,తమిళదేశములోని వరహూరువెళ్ళి అచ్చటి వేంకటరమణ ఆలయమునకు మూలప్రతిష్టచేసిన అనంతరం "శ్రీకృష్ణ లీలా తరింగిణి"ని గానంచేయడంతో దీర్ఘకాలంగానున్న ఆతని పరిణామశూలబాధ నివారణయ్యెననియు, అందుచే అచ్చటనే స్వామిని సేవించుచూ యుండునప్పుడు కొంత కాలానికి అవసానకాలము సమీపించి మాసిమాస, శుద్ధ అష్టమి, సుగవారం, కృత్తికా నక్షత్రమున సిద్ధిపొందిరనియు తెలియుచున్నది. వీరి సమాధి వేంకటరమణస్వామి ఆలయమునకు సమీపమునను, వీరి ఛాయాపటము ఆలయములోపలను నేటికిని కనుపడును. శ్రీకృష్ణజయంతినాడు భక్తులు వీరి తరంగములను విధిగా నచ్చట పాడుచూ భజనలు చేయుట నేటికిని చూడవచ్చును. ఇతడు భాగవతములోని దశమస్కందమందలి శ్రీకృష్ణగాథను సంస్కృతంలో 12 సర్గలు (అంకములు)గా రచించెను. ఈ గ్రంథమును "శ్రీకృష్ణలీలా తరంగిణి" యందురు. దీనిలో ప్రారంభమున మంగళాచరణము, తరువాత శ్లోకములు, ఇష్టదేవతా ప్రార్థనలు, తరంగములు వుండును. ఈ తరంగములు పల్లవి, అనుపల్లవి, చరణములతో స్వనామముద్రను గలిగి యుండును. కొన్నిటిలో జతులుకూడ నుండును. దక్షిణభారతంలో ప్రతి భజన కాలక్షేపములోను వీరి తరంగములు విధిగా పాడటం నేటికిని సంప్రదాయంగా నున్నది.వీరు మొదట సన్యసించిరి.

27. అచ్యుతప్పనాయకుడు:— ఇతడు క్రీ. శ. 1580–1614 వరకు తంజావూరు నేలిన నాయకరాజగును. ఆంధ్రదేశమునుండి వచ్చి, తమ యక్షగానములచే తనను మెప్పించిన భాగవత బ్రాహ్మణులకు అచ్యుతరాయ సముద్రంవంటి గ్రామములను దానమిచ్చిన గొప్ప ధర్మశీలుడగును. ఈ గ్రామానికే క్రమంగా భూపతిరాజపురమనియు, మెళత్తూరుఅనియు, మెరట్టూరనియు వివిధపేర్లు వ్యవహారంలోనికి రాగలిగెను. ఈ భూపతిరాజపురంలోని వరదరాజస్వామికి అంకితముగానే నారాయణతీర్థులు "పారిజాతాపహరణ" మనే యక్షగానాన్ని రచించినట్లు చెప్పుదురు. ఈ అచ్యుతప్పనాయకుని ఆస్థానంలోనే సుప్రసిద్ధ సంగీతలక్షణ కర్తయైన గోవిందదీక్షితులుకూడ ప్రధానమంత్రిగా నుండెనని గ్రహించదగును.

28. క్షేత్రజ్ఞుడు:— ఇతడు క్రీ. శ. 1600–1680 కాలమునకు చెందినవాడు. తెలుగు బ్రాహ్మణుడు. జన్మస్థానము కృష్ణాజిల్లాలోని "మువ్వ" అను గ్రామము.

ఇది భాగవతుల కూచిపూడికి సమీపమునగలదు. ఇతని మొదటిపేరు వరదయ్య. బాల్యము ననే సంగీత, సాహిత్య, నాట్యాభినయాలంకారాదిశాస్త్రము లభ్యసించునపుడు తన సహపాఠియైన ఒక దేవదాసిని ప్రేమించినందున వారిద్దరిమధ్య నడచిన సంభాషణలు తన పదరచనలయం దిమిడ్చియుండెను. తదుపరి ఆ దేవదాసియొక్క కోరికపైననే, అచ్చట గల శ్రీ వేణుగోపాలస్వామిపై "శ్రీపతి సుతుబారి" అను పదమును ఆనంద భైరవి రాగములో మొదట రచించుట జరిగెను. ఇతడు కంచి వరదునిపై రచించిన పదములలో తన జీవితకథను చిత్రించెను. ఇతడు మధుర, తంజావూరు, గోల్కొండ, విజయనగర సంస్థానములకు వెళ్ళి ఆయా రాజుల కోరికపై అనేక పదములను రచించి వినిపించి ఘనసత్కారములొందెను. ఇతడు తంజావూరు వెళ్ళినపుడు శ్రీ విజయ రాఘవనాయకుని కోరికపై "పంచరత్నము"లుగా పదములు రచించి ఆ రాజున కంకిత మిచ్చెను. ఇతడు పదములు వ్రాయుటలో అద్వితీయుడు. తెలుగులో శృంగార రస ప్రధానముగా యీతడు రచించిన పదములు నాలుగువేల వరకు గలవని తెలియు చున్నది, ఇవి "మువ్వగోపాల" ముద్రను గలిగియుండును. వీరి వంశీయులు యిప్పటికిని "మొవ్వ" గ్రామములో గలరు. ఈ మహనీయుడు పదములను రచించుచూ అనేక క్షేత్రములను దర్శించుటచే క్షేత్రయ్య, లేక క్షేత్రజ్ఞుడను సార్థకనామము నొందెను. శ్రీ జయదేవుడే నారాయణతీర్థులుగను, ఆ నారాయణతీర్థులే క్షేత్రయ్యగను అవ తరించినటుల ప్రతీతి గలదు.

29. మార్గదర్శి శేషయ్యంగార్:— ఇతడు 16—17 శతాబ్దములకు చెందినవాడు. వైష్ణవ బ్రాహ్మణుడు. సంగీత, సంస్కృతములందు గొప్ప పండితుడు. అయోధ్య నుండి శ్రీరంగక్షేత్రమునకు వలసవచ్చినవాడు. శ్రీరంగనాథుని భక్తుడు. గనుక రంగ నాథునిపై భక్తిరస ప్రధానమైన అనేక కీర్తనలను "కోసల" ముద్రతో రచించిన మహనీయుడు. ఇతడు తాను రచించిన కీర్తన లన్నియు గల గ్రంథమును శ్రీరంగ నాథుని పాదములవద్ద సమర్పించి మరునాడుదయమున వచ్చుసరికి అందు 60 కీర్తన ములు మాత్రమే యుండి మిగిలినవి చెదలుపట్టి యున్నందున ఆ అరువది కీర్తనలే స్వామివారంగీకరించెనని వాటిని ప్రచారంలోనికి తెచ్చెను. ఆనాటి పండితులు యీతని రచనలందుగల సంస్కృత పదజాలమునకును సంగీతఘణతులకును మెచ్చుకొని "మార్గ దర్శి" యని పొగడిరట. ఈతని మార్గములనే శ్రీస్వాతి తిరునాళ్ మహారాజా తన రచనలయం దనుసరించితినని చెప్పినట్లు తెలియుచున్నది.

30. రఘునాథనాయకుడు:— ఇతడు క్రీ. శ. 1614—1632 వరకు తంజావూరును పరిపాలించిన నాయకరాజగును. అచ్యుతప్పనాయకుని కుమారుడు. కృతికర్తగాను, కృతి భర్తగాను, పేరొందిన రాజకవిశేఖరుడు. మరియు "పారిజాతాపహరణ"

మను పద్యప్రబంధమును అశువుగా 6 గంటలలో రచించి తన తండ్రియగు అచ్యుతప్పనాయకునిచే కనకాభిషేకమొందిన అద్భుతమైన మేధాసంపన్నుడు. సంగీత, సాహిత్య, కవిత్వములలో గొప్ప ప్రతిభ కలవాడుగనుక గజేంద్రమోక్షము, జానకీ పరిణయము, రుక్మిణీకృష్ణ కల్యాణములవంటి యక్షగానములనేగాక నలచరిత్రవంటి మరికొన్ని యితరగ్రంథములనుకూడ రచించిన కవిపుంగవుడు. మరియు జయంతసేన, రామానందమువంటి అపురూపరాగముల సృష్టించుటయేగాక రఘునాథ వీణ యనబడు ప్రఖ్యాతిచెందిన సంగీతవాద్యమునుకూడ కనిపెట్టగలిగిన గొప్ప సమర్థుడు. సుప్రసిద్ధ లక్షణగ్రంథమైన "సంగీతసుధ" యను గ్రంథముకూడ నితడే రచించినట్లుగా ప్రతీతి యున్నను, అది యీయనకు ప్రధానమంత్రియైన గోవిందదీక్షితులే రచించి రఘునాథనాయకుని పేర ప్రకటించినట్లు వేంకటమఖియొక్క గ్రంథ ప్రకటనవలన తెలియుచున్నది.

31. విజయరాఘవనాయకుడు :- ఇతడు క్రీ. శ. 1633-1673 వఱకు తంజావూరును పాలించిన నాయకరాజగును. రఘునాథనాయకుని కుమారుడు. అష్టభాషాకోవిదుడు. అనేక యక్షగానములను, ద్విపదకావ్యములను, గోపికాగీతలవంటి రచనలనేగాక "రఘునాథనాయకాభ్యుదయ" మనే ద్విపదకావ్యాన్నికూడా రచించిన మేధాసంపన్నుడు. ఇతని పరిపాలనాకాలములో తనవల్లను, యితర ఆస్థాన విద్వాంసులవల్లను రచించబడిన యక్షగాన పదరచనలచే యీతని పరిపాలనాకాలమును యక్షగాన పదరచనలకు స్వర్ణయుగంగా చెప్పబడెను. పదకర్తయైన క్షేత్రయ్య యీయన తండ్రి ఆస్థానములోనేగాక యీయన ఆస్థానంలోకూడ విశేషకాల ముండి వేలకొలది పదములను రచించినట్లు తెలియుచున్నది. వీటిలో విజయరాఘవనాయకాంకితములైన పదములు 12 మాత్రమే కనుపడుచున్నవి. ఈయన తనకాలికి నవరత్నఖచితమైన సాహిత్యరాయ పెండేరమును ధరించి రాజసభలో జరుగు సంగీత, సాహిత్య గోష్ఠులకు అధ్యక్షతవహించేవాడని తెలియుచున్నది.

32. భద్రాచల రామదాసు :- ఇతడు క్రీ. శ. 1620 - 1680 కాలము నాటివాడు. తెలుగు నియోగిబ్రాహ్మణుడు. ఇతని మొదటిపేరు కంచర్ల గోపన్న. తండ్రిపేరు లింగనమంత్రి, తల్లి పేరు కామాంబ, నివాసము హైదరాబాద్ రాష్ట్రంలోని "నేలకొండపల్లి" గ్రామము. ఇతడు బాల్యమునందే బాలరామాయణాది గ్రంథములను పఠించి, రామభక్తి నలవఱచుకొని రామసంకీర్తనముల రచించి పాడుచుండెను. మరియు శ్రీ రఘునాథభట్టాచార్యులచే మంత్రోపదేశమై వైష్ణవదీక్ష నొందుటయేగాక కబీరుదాసుచే రామతారకమంత్రోపదేశముకూడ నొందెను. ఆ సమ

యంలోనే యితడు మహదానందముతో "తారకమంత్రము కోరిన దొరకెను" అను ధన్యాసిరాగంలో కీర్తన రచించి పాడెను. ఈయనకు వివాహమైన కొన్నాళ్ళకు ఒక పుత్రుడు జనించెను. తల్లి దండ్రుల మరణానంతరము యితడు విరక్తితో తనకున్న ఆస్తినంతయు దానధర్మములు చేసి సంసారపోషణకై బంధువుల సలహాపైన క్రీ. శ. 1650 లో హైదరాబాద్ వెళ్లెను. అచ్చట యితని మేనమామలును, అబ్దుల్లాతానాషా వద్ద మంత్రులు నగు అక్కన్న, మాదన్నగార్ల సహాయమున భద్రాచలము తహశీలు దారు వుద్యోగము సంపాదించెను. నిరంతర రామభక్తుడైన గోపన్న, భద్రాచలము చేరి ఆ తాలూకాలో వసూలుచేసిన తహశీలునంతటిని శ్రీరామకైంకర్యమునకే వినియోగించుచుండెను. ఈవిషయము తెలిసికొనిన తానాషా క్రోధావేశుడై క్రీ. శ. 1665 లో గోపన్నకు 12 సంవత్సరములు కఠినశిక్ష విధించి బందిఖానాలో నుంచెను. ఆ సమయంలో అతడు పడిన బాధలు వర్ణనాతీతములగును. ఆబాధల కోర్వలేక అత డెన్నో విధముల శ్రీరామచంద్రుని కీర్తించెను. భక్తితో కూడిన ఆ కీర్తనలు హృదయరంజకము లగును. ఈ విధముగా 12 సం॥ లు జైలులో బాధల ననుభవించి జీవితముపై విరక్తిచే విషముత్రాగుట కుద్యమించునపుడు దైవానుగ్రహమున విష మమృత మయ్యెను. భక్తరక్షకుడైన శ్రీరామచంద్రుడు లక్ష్మణసమేతుడై ఆరులక్షల వరహాలతో మారువేషమున తానాషా అంతఃపురమునందు ప్రవేశించి ఆ పైకము తానాషాకు చెల్లించగా తానాషా రామదాసుని బంధవిముక్తుని చేసెను. వెంటనే రామదాసు భద్రాచలమునకువెళ్ళి శ్రీరామకైంకర్యములతో జీవితమును గడుపుచూ కొంతకాలానికి ముక్తిచెందెను. ఈ రామదాసుని చరిత్రను మొదట యాదవదాసు, తరువాత సింగరి దాసు, నరసింహదాసు, కృష్ణదాసు మొదలగువారు యక్షగానాలు గా రచించిరి. రామదాసు తన జీవితంలోని వివిధఘట్టాలలో రచించిన కీర్తనలు షుమారు 100 కి పైగా కనుపడుచున్నవి. ఇవి బహుముద్రలతో సులభసంగీతశైలి గలిగి భక్తిరసపూరితము లగును. ఈతని మహిమలు యెన్నోగలవు. ఒకనాడు రామదాసు బ్రాహ్మణ సంతర్పణ జరుపు సమయములో ఆయనకుమారుడు ఆడుకొనుచూ గంజిగుంటలోపడి మరణించెను. అప్పుడు రామదాసు "కోదండరామ" అను కీర్తన భక్తితో గానము చేయగానే ఆబాలుడు వెంటనే సజీవుడైనట్లు చెప్పుదురు. ఇట్టి మహాభక్తుడు గనుకనే త్యాగరాజు తన రచనయగు "క్షీరసాగరశయన" అను కృతిలో "ధీరుడౌ రామదాసుని"అని యితని పేరు పేర్కొనుట జరిగెను.

33. అహోబలుడు :— ఇతడు 17వ, శతాబ్దమునకు చెందినవాడు. వైదిక బ్రాహ్మణుడు, గొప్ప లక్షణకారుడు. క్రీ. శ. 1650లో "సంగీతపారిజాత" మను లక్షణగ్రంథమును రచించిన సమర్థుడు. దీనిని దీనానాథుడు క్రీ. శ. 1724లో పారశీక

భాషలోనికి అనువదించెను. హిందూస్థానీ కాఫీ రాగమును యితడే సృష్టించెనని చెప్పెదురు. వీణయొక్క తీగ పొడవునుబట్టి ఒకస్థాయిలో 12 స్వరములను నిర్ణయించిన మేధాసంపన్నుడు. వీరి సంగీత లక్ష్య.లక్షణములు యిప్పటి విధానమున కనుకూలముగనే యున్నవి. ఇతడు షుమారు 300 సంll ల క్రిందట అహోబల ప్రాంతమున నివసించె నని చెప్పెదురు.

34. **విజయగోపాలుడు :—** ఇతడు 17వ, శతాబ్దములోనివాడు. సంగీత, సాహిత్యములందును, తెలుగునందును గొప్ప పాండిత్యము గలవాడు. మిక్కిలి భక్తుడు. ఇతడు "విజయగోపాల" అను స్వనామముద్రతో రచించిన కీర్తనలనేకము గలవు. వీటిని దక్షిణభారతంలో భజన కాలక్షేపములందు విధిగా పాడుచుందురు.

35. **శాహజీ :—** ఇతడు క్రీ. శ. 1684-1712 వరకు తంజావూరును పరి పాలించిన మహారాష్ట్రరాజు. ఏకోజీ (1676-1683) కుమారుడు. సంగీత సాహిత్య ములలో గొప్పసమర్థుడు. అభినవసాహిత్య భోజుడను సార్థకబిరుదు నొందవగినవాడు. సుప్రసిద్ధ గ్రంథకర్త. సంస్కృత తాంధ్ర, ద్రావిడభాషా పండితులనుపోషించి క్రీ.శ. 1693లో తన పేరున ఒక గ్రామాన్ని కూడ వారికి బహూకరించిన త్యాగమూర్తి. ఇతడు సంస్కృతములో "శబ్దరత్న సమన్వయము" శబ్దార్థ సంగ్రహము" అను 2 నిఘంటువు లను, తెలుగులో "శంకర పల్లకీ సేవాప్రబంధము" (తిరువారూరువీధివిటంక త్యాగ రాజస్వామి పల్లకీ సేవనుగుతించినది) ను, "విష్ణు పల్లకీ సేవాప్రబంధము" మొదలగు షుమారు 20 వరకు యక్షగానముల రచించి వాటిని శివ, రామ, కృష్ణ, గౌరీదేవుల కంకితమిచ్చిన మహానుభావుడగును.

36. **మొదటి శరభోజీ :—** ఇతడు క్రీ. శ. 1712 - 1728 వరకు తంజావూరును పరిపాలించిన మహారాష్ట్రరాజగును. శాహజీ మహారాజు తమ్ముడు. సంస్కృతాంధ్రములందును, సంగీతములోను గొప్ప విద్వాంసుడు. "రాఘవ చరిత్ర" మను కావ్యాన్నేగాక "శరభేంద్ర భూపాల కొరవంజి నాటక" మనే యక్ష గానాన్ని కూడ రచించిన రాజకవిచంద్రుడు. ఈ యక్షగానాన్ని కీ. శే. వీణధనమ్మ కూతురు జయమ్మ, ఆమె కుమార్తె బాలసరస్వతియు నృత్యనాటికగా నేటికిని ప్రదర్శనము లిచ్చుట జరుగుచున్నది.

37. **తులజాజీ :—** ఇతడు క్రీ. శ. 1728-1736 వరకు తంజావూరును పరిపాలించిన మహారాష్ట్ర రాజగు శాహజీమహారాజుయొక్క రెండవ సోదరుడు. సంగీత, సాహిత్యములలో గొప్ప పండితుడు. ఇతడు సంస్కృతంలో "సంగీత

సారామృత" మనే లక్షణ గ్రంథాన్నే గాక, తెలుగులో "శివకామసుందరీ పరిణయ" మను యక్షగానాన్నికూడా రచించి కీర్తినొందిన ప్రసిద్ధ రాజకవి శేఖరు డగును.

38. గిరిరాజ కవి :— ఇతడు క్రీ. శ. 1684 - 1712 వరకు శాహాజీ ఆస్థానంలోను, క్రీ. శ. 1712–1728 వరకు శరభోజీ ఆస్థానంలోను విద్వాంసుడుగా నున్న ప్రసిద్ధ వాగ్గేయకారుడు. ఈతని మనుమడే త్యాగరాజు. కనుకనే త్యాగరాజు తాను రచించిన బంగాళరాగ కృతిలో తన తాతపేరు వ్యంగ్యముగా వచ్చునటుల "గిరిరాజ సుతా తనయ" అని పేర్కొనుటకు కారణమైనది. ఇతడు సంగీత, సాహిత్యములలో గొప్పపండితుడు, కవియూ నగును. ఇతడు రచించిన (1) శాహేంద్ర చరిత్రము, (2) రాజమోహన కొరవంజి, (కొరవంజి=ఎరుకల పాత్ర). (3) లీలావతీ కల్యాణము (4) వాదజయం (5) సర్వాంగసుందరీవిలాసము మొదలగు యక్షగానములు మిక్కిలి సుప్రసిద్ధములగును.

39. సారంగపాణి :— ఇతడు క్రీ. శ. 1680 - 1710 కాలమునకు చెందినవాడు. కార్వేటినగర సంస్థానాధిపతియగు శ్రీ మాకరాజు వేంకట పెరుమాళ్ రాజు ఆస్థానంలో విద్యాధికారిగా నున్నవాడు. సంస్కృతాంధ్రభాషలలో పాండిత్యమును, కవిత్వములో విశేషప్రతిభను గలవాడు. సంగీత, నాట్యకళలలో మిగుల సమర్థత గలవాడు. తన యిష్టదైవమైన కార్వేటి నగర "వేణుగోపాలు"ని ముద్రతో తెలుగులో అనేక పదములను రచించినను, కొన్ని మాత్రము తన ప్రభువైన మాకరాజున కంకితముగా రచించెను. రాజాంకితముగనున్న యీతని పదములలో 75 శృంగార రస ప్రధానములుగాను, 66 వేశ్యావిలాస దూషణలుగలవిగాను, 48 భక్తి వైరాగ్య, నీతి ప్రబోధకములుగాను, 16 జానపద భాషలకు చెందినవిగాను వున్నవి.

40. గోవిందస్వామయ్య, మరియు కూవనస్వామయ్య:— వీరు క్రీ. శ. 1680-1710 ప్రాంతమువారు. సోదరులు, వాగ్గేయకారులు. కార్వేటినగర వాస్తవ్యులు. తెలుగు త్రైలింగ్య బ్రాహ్మణులు. తెలుగులో అనేకపదములు రచించిన ప్రతిభావంతులు. గోవిందస్వామయ్య భరతశాస్త్రములోకూడ ప్రవీణుడు. కార్వేటి నగర సంస్థానాధీశ్వరుడును,సాళ్వవంశీయుడునైన శ్రీ మాకరాజు వేంకట పెరుమాళ్ రాజుచే బహుసన్మానములందినవాడు. ఈయన మోహనరాగంలో రచించిన 'సరిగాదాని' అను స్వరాక్షర పదవర్ణమును, మరియు నవరోజు, కేదారగౌళ, ముఖారి వంటి రాగాలలో రచించిన పదములును మిగుల ప్రసిద్ధములగును. ఈయన తమ్ముడు కూవన స్వామయ్య రచించిన నాటకురంజిరాగములోని "ఇంత అలుక" అను పదవర్ణముకూడ ప్రసిద్ధమైనదగును. ఒకప్పుడు వేంకట పెరుమాళ్ రాజు తన రాణియగు వేంకటగిరి

రాజుగారి కుమార్తెను యేలుటకు నిరాకరించి పుట్టింటికి పంపివేయుగా గోవిందస్వామయ్య వెంకటగిరి వెళ్ళి రాణికి సంగీత, నాట్యములను నేర్పి పురుషవేషముతో ఆమెను రాజ (భర్త) సన్నిధికి రప్పించి సంగీత నాట్యములను ప్రదర్శింపచేయగా రాజు మెచ్చుకొని తిరిగి ఆమెను తన రాణిగా స్వీకరించెనని చెప్పుదురు.

41. ఘనం సీనయ్య :— ఇతడు క్రీ. శ. 1704-1731 ప్రాంతమువాడు. ఇంటిపేరు వంగలవారు. వైష్ణవభక్తుడు. సంగీత సాహిత్యములలో గొప్పపండితుడు. మధుర విజయరంగ చొక్కనాథుని మంత్రిపుంగవుడు. మన్నారు రంగని నొక నాయకి నిందాస్తుతి చేయుచున్నట్లు యితడు సురంజిరాగములో రచించిన "శివదీక్షా పరురాలనురా" అను శృంగారరసప్రధానమైన పదము దేశ ప్రసిద్ధమగును. మరియు నీలాంబరి రాగంలోని "మగవాడు వలచితేను సుఖము" అను పదము, తదితర కీర్తనలు కూడ యీతని రచనలలో ముఖ్యమైనవగును.

42. మధుర శ్రీనివాసయ్య :— ఇతడు క్రీ. శ. 1704 - 1731 కాలము లోని వాడు. మధుర విజయరంగ చొక్కనాథనాయకుని ఆస్థానములో నున్నవాడు. మధుర మీనాక్షీదేవి పరిచారకుడు. ఒకనాడు మీనాక్షీదేవి తన భక్తుడైన ఒక తపస్వికి అనుగ్రహించి తాంబూల విడెము నివ్వబోగా ఆ తపస్వి నిరాకరించినందున యచ్చటనే నిదురించుచున్న యీ శ్రీనివాసయ్య నోటిలోపడవేసి దేవి అంతర్ధాన మయ్యెనట. ఆనాటినుండియు నితడు "విజయగోపాల" ముద్రతో బహుకీర్తనములు రచించెను. ఇతడు నాటకురంజిరాగములో రచించిన "నిను మించినవారు" అను కృతియు, కల్యాణిరాగములోని "ఇంకొదయరాదా"వంటి కృతులు మిగుల ప్రసిద్ధము లగును.

43. మెరట్టూరు కాశీనాథయ్య :— ఇతడు త్యాగరాజుకు ముందు కాలమువాడు. వెలనాటి ఆంధ్రబ్రాహ్మణుడు. మెరట్టూరుకు వలసవచ్చిన ఆంధ్ర భాగవత కుటుంబానికి చెందినవాడు. గొప్పపండితుడు. ఇతడు అనేక దేవతలమీదనే గాక శాహజీ, శరభోజీ, తుళజాజీ, ప్రతాపసింహజీల కంకితముగాకూడ అనేక పదములను రచించిన గొప్ప సమర్థుడగును.

44. మెరట్టూరు వీరభద్రయ్య :— ఇతడు ప్రతాపసింహ మహారాజు కాలము నాటివాడు. ఆరాజుచే బహు సన్మానము అందినవాడు. తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజుల కులదైవమగు "ప్రతాపరాముని" ముద్రతో దేశీయ, రక్తి రాగములలో అనేక కీర్తనలు రచించినవాడు, మరియు ప్రతాపసింహునికి కంకిత

ముగా స్వరజతులు, దరువులు, పదములు, తిల్లానాలను విచిత్ర కల్పనలతో రచించిన మహానుభావుడు. ఈ మహనీయునివల్లనే కర్నాటక సంగీతము చాలావరకు చక్కని పద్ధతిలో పరిష్కరింపబడినదని చెప్పుదురు.

**45. మునిపల్లె సుబ్రహ్మణ్యకవి** :- ఇతడు క్రీ. శ. 1730-1780 కాలమునాటివాడు. తండ్రి పేరు రామలింగయ్య. నివాసము తిరుపతి లేక కాళహస్తి యగును. కాళహస్తి సంస్థానములో దామెర్లవారి పోషణక్రింద నున్నవాడు. గనుక దామెర్లవారి కంకితముగా కొన్ని పదములను, శ్రీ కాళహస్తీశ్వరుని కంకితముగా కొన్ని పదములను రచించియుండెను. దైవభక్తుడగుటచే శ్రీ తిరుపతి వేంకటేశ్వరుని కంకితముగా శ్రీరామకథను, శివుడు పార్వతికి వినిపించుచున్నట్లుగా "అధ్యాత్మ రామాయణ" మను గ్రంథమును తెలుగులో రచించెను. దీనిలో ఆరు కాండలు గలవు. 104 కీర్తనలలో పూర్తిచేయబడెను. ఈ 104 లో బాలకాండలో 17 న్నూ, అయోధ్యకాండలో 9 న్నీ, అరణ్య కాండలో 11న్నూ, కిష్కింధకాండలో 10న్నీ, సుందరకాండలో 10న్నీ, యుద్ధకాండలో 47న్నూ కీర్తనలు గలవు. వీటిలో కొన్ని కీర్తనలలో జతులుకూడ గలవు. ఇతడు సంస్కృతాంధ్రములలోను, సంగీత, నాట్య, అలంకార, వేదాంతశాస్త్రములలోను అపారమైన పాండిత్యము గలవాడును, గేయరచనా సమర్థుడు నగును. ఈతని కీర్తనలు పల్లవి, అనుపల్లవి, చరణములతోకూడి భక్తి, వేదాంత ప్రబోధకములైనవే గాక, శృంగార రసాత్మకములైన విశేషాలతోను, అనుప్రాసలతోను కూడియుండును. దక్షిణభారతములో వీరి కీర్తనలు విశేష ప్రచారములో గలవు.

**46. రామస్వామి దీక్షితులు** :- ఇతడు క్రీ. శ. 1738లో జన్మించెను. కాశ్యపగోత్రీకుడు. ఆపస్థంబసూత్రీకుడు. తండ్రి పేరు వేంకటేశ్వరదీక్షితులు. తల్లి పేరు భాగీరథమ్మ. గురువు పేరు బోధేంద్రసద్గురుస్వామి. ఇతడు బాల్యంలో కాంచీపురంలోనుండి వైద్యనాథదీక్షితారునివద్ద వీణ నభ్యసించెను. తదుపరి తల్లి దండ్రులతో దక్షిణదేశము వలసపోయి మధ్యార్జునము సమీపములోగల గోవిందపుర ములో నివసించెను. ఇతడు సంస్కృతాంధ్రములలో గొప్పపాండిత్యము గలవాడు. మంచి శారీరసంపత్తు గలవాడగుటచే తంజావూరులోని మెరట్టూరు వీరభద్రయ్యవద్ద సంగీతము నభ్యసించి రెండు సంవత్సరములలోనే రాగాలాపన, కీర్తన, పల్లవి, స్వరకల్పనలలో అఖండ ప్రజ్ఞావంతుడయ్యెను. తన గురువు ఆనతిపై తంజావూరు అమరసింహునిపై రచించిన రాగమాలికా కీర్తనను రాజుకు వినిపించి ఆయనచే బహుసన్మానము నందెను. తిరువారూరులోని కమలాంబా, త్యాగరాజస్వాములపై భక్తిపూరితము

లైన యనేక కీర్తనలు రచించెను. సంతతిలేనందువల్ల కుటుంబముతో వైద్యనాథము వెళ్ళి అచ్చట ముద్దుకుమారస్వామిని భక్తితో సేవించి వచ్చియుండునపుడు జనించిన పుత్రునికి ముద్దుస్వామియని పేరు పెట్టుకొనెను. మరియు "అష్టోత్తర శతరాగ తాళ మాలిక"యనునొక అపూర్వసంగీతరచన రచించి "శ్రీమణలిచిన్నయామొదలియార్" చే కనకాభిషేకము నొందెను. ఇతనికి ముద్దుస్వామిగాక చిన్నస్వామి, బాలస్వామి యను యిరువురు పుత్రులును, బాలాంబయను నొక పుత్రికయును గలదు. చిన్నస్వామికి ఒకప్పుడు కంటికి బాధ యేర్పడి దృష్టి తగ్గిపోగా రామస్వామి దీక్షితులు సకుటుంబంగా శ్రీ తిరుపతి వేంకటేశ్వరుని దర్శించి భక్తితో "మనసా వేరెతరుల తలచక" అను 48 రాగములలో నొక ప్రసిద్ధ రాగమాలికను, "ఇంకా దయ రాకున్న" అను (వేగవాహిని) కీర్తనను రచించి గానం చేయుగా వెంటనే దైవానుగ్రహమువ చిన్న స్వామికి దృష్టి కలిగెనని చెప్పుదురు. ఇతడు మధుర మీనాక్షీ దేవిపై 40 రాగములలో రాగమాలికను, హిందోళ, రీతిగౌళ, పూర్ణచంద్రిక వంటి రాగాలలో చౌక వర్ణములను, తానవర్ణములనేగాక, అనేక కీర్తనలనుకూడ "వేంకట కృష్ణ" ముద్రతో రచించెను. హంసధ్వని రాగ మీతనిచేతనే సృష్టింపబడినటుల చెప్పుదురు. ఈ రాగములో నిత డొక ప్రబంధముగూడ రచించెను. ఇతడు క్రీ. శ. 1817 కు సరియగు ధాత సం॥ మాఘ మాస శివరాత్రినాడు పరమపదించెను.

**47. ప్రతాపసింహ మహారాజు :–** ఇతడు క్రీ. శ. 1740 – 1752 వరకు తంజావూరును పాలించిన మహారాజు. ఈయన కుమారుడే అమరసింహమహారాజు. ప్రతాపసింహుడు సంగీత సాహిత్యములలోను, మహారాష్ట్రభాషయందును అతిసమర్థుడు. మృదంగవాద్యమునందుకూడ విశేష ప్రావీణ్యము కలవాడు. ఈయన మహారాష్ట్రభాషలో రచించిన "నవరత్నమాలిక" అను రాగతాళమాలిక మిగుల ప్రసిద్ధమైనదగును.

**48. పచ్చిమిరియం ఆదిఅప్పయ్య :–** ఇతడు క్రీ. శ. 1740–1833 కాలమునాటివాడు. కర్నాటక బ్రాహ్మణుడు. మధ్వమతస్థుడు. సంస్కృతాంధ్రములందును, సంగీతమందును అఖండమైన పాండిత్యముకలవాడు. తంజావూరు ఆస్థాన విద్వాంసుడు. "శ్రీ వేంకటరమణ" ముద్రతో రక్తి, దేశీయరాగములందు అనేక కీర్తనలు రచించిన మహానుభావుడు. మెరట్టూరు వీరభద్రయ్య సంగీత మార్గము ననుసరించినవాడు. భైరవిరాగములో అటతాళమున యీతడు రచించిన "విరుబోణి" వంటి తానవర్ణము యికముందు యేర్పడుట దుర్లభమనే నేటికిని పండితాభిప్రాయము. రాగాలాపన, మధ్యమకాల పల్లవియొక్క పద్ధతులు యీ మహనీయునివల్లనే

పరిశుద్ధమైనవిగా చెప్పుదురు. ఆకాలంలో త్యాగరాజాది వాగ్గేయకారులు సయితము వయోవృద్ధుడైన యీ ఆదిఅప్పయ్యగారిని తఱచుగా కలుసుకొని సంగీత లక్ష్య లక్షణ రచనా సందర్భములందు గల సందేహాలను నివర్తి చేసుకొనుచుండెడివారని తెలియుచున్నది.

**49. వీణ కృష్ణయ్య :—** ఇతడు ఆదిఅప్పయ్య కుమారుడు. ప్రసిద్ధ వైణికుడు. మైసూరు, విజయనగరం, కొత్తకోట, రాజ్యాధిపతులపై "సప్తతాళేశ్వర" మను మూడు ప్రబంధములను రచించిన సమర్థుడు. సప్తతాళములలో మొదటిదైన ధృవతాళములోనే మిగత ఆరుతాళములుకూడ అంతర్లీనమైయుండి ప్రబంధముయొక్క యెత్తుగడలోనే అన్ని తాళముల మొదటి ఘాతలు ఒకే ఘాతగా పడునట్లు రచించెను. ఈ ప్రబంధముల సాహిత్యములలో ఆ యా రాజుల నామాక్షరాలలో ఒక్కొక్క అక్షరము ఒక్కొక్క ఆవర్తములో మొదటి అక్షరముగా నుండి అర్థవంతముగా నుండును. ఈయన కుమారుడే వీణ సుబ్బుకుట్టిఅయ్య. ఇతడు రాగాలాపన, మధ్యమకాల పల్లవులను, వీణలో వాయించుటయం దద్వితీయుడని చెప్పుదురు.

**50. వుదైయూరు దురైస్వామయ్య :—** ఇతడు క్రీ. శ. 1782 - 1816 ప్రాంతమువాడు. శరభోజీ, శివాజీరాజుల సమకాలికుడు. నివాసము పంచనద క్షేత్ర మనే తిరువైయూరు. ద్రావిడ బ్రాహ్మణులలో ఔత్తరుడు. ఈయన తెలుగులో "సుబ్రహ్మణ్య" ముద్రతో కీర్తనములను, పదములను షుమారు 50 వరకు రచించెను. ఈయన కీర్తనలు సులభశైలిలోనుండి రంజకముగా నుండును. మరియు చిదంబరములోని శ్రీనటరాజస్వామియొక్క తాండవవిలాసముల వర్ణించుచూ నాలుగు ప్రసిద్ధకీర్తనములు రచించెను. వాటిలో తోడి రాగములోని "తత్త ధిమిత ధింధియని సదాశివు డాడినాడే" అనునవి ఒకటి యగును.

**51. యువరంగ భూపతి :—** ఇతడు 18వ, శతాబ్దమునకు చెందిన వాడు. ఉదయార్‌పాళయమునకు జమీందారు. సంగీత, సాహిత్యములలో మిగుల సమర్థుడైన వాగ్గేయకారుడు. ఆనాటి విద్వత్కవులతో సరితూగదగిన గొప్పసమర్థుడు. మరియు శహాన, భైరవి వంటి ప్రసిద్ధ రాగములలో అనేకపదములను రచించి విఖ్యాతి నొందినవాడు.

**52. మెరట్టూరు వెంకట్రామశాస్త్రి :—** ఇతడు క్రీ. శ. 1798–1855 కాలమునకు చెందినవాడు. ట్యైలింగ్య బ్రాహ్మణుడు, ఆంధ్రుడు. సంగీత త్రిమూర్తులకు సమకాలికుడు. ఆంధ్రదేశమునుండి మెరట్టూరుకు వలసవచ్చిన భాగవతకుటుంబా

నికి చెందినవాడు. తెలుగులోను, సంగీతములోను, అసాధారణమైన పాండిత్యము గల వాడు. ఈతడు రచించిన పదములు శృంగారరస ప్రధానమై, పదసౌష్టవము గలిగి యుండును. ఇతడు శరభోజీ, శివాజీ మహారాజుల కాలములో నున్నటుల తెలియు చున్నది. ఇత డనేక యక్షగానములు, నాటకములు, చిందులు రచించెను.

53. ఘనం కృష్ణయ్యర్ :- ఇతడు 18-19వ, శతాబ్దములకు చెందిన వాడు. తమిళబ్రాహ్మణుడు. తిరుచనాపల్లి జిల్లాలోని "తిరుక్కుణ్ణం" లో జన్మిం చెను. "ఉదయార్ పాళయము" లో నివసించెను. తండ్రిపేరు రామస్వామిఅయ్యర్. ఇతడు తంజావూరు ఆస్థాన విద్వాంసుడు. బొబ్బిలి కేశవయ్యవద్ద కొంతవరకు సంగీత విద్య నభ్యసించినవాడు. పల్లవి పాడుటయం దతిసమర్థుడు. పదములు రచించుటలో మిక్కిలి ప్రతిభావంతుడు. ఈతని పదములు శృంగారరస ప్రధానమై యుండును. తంజావూరు ఆస్థాన విద్వాంసులతో కలిగిన విభేదములవలన ఉదయార్ పాళయము వచ్చి ఆ రాజుయొక్క ఆస్థాన విద్వాంసుడైనవాడు. మరియు అచ్చటి రాజగు యువరంగభూపతిపైనను, మధ్యార్జునము సేలిన ప్రతాపసింహునిపైనను తమిళములో అనేక పదములను రచించి బహుసన్మానము లొందినవాడు. త్యాగరాజు యీతని గానమును విని మెచ్చుకొనినటుల చెప్పుదురు.

54. పైడాల గురుమూర్తిశాస్త్రి :- ఇతడు, 18వ, శతాబ్దమునకు చెందినవాడు. నివాసము తిరునల్వేలి జిల్లా"కయత్తారు" అను గ్రామము. రామస్వామి దీక్షితులకు సమకాలికుడు. తెలుగు మురికినాటిబ్రాహ్మణుడు. చతుశ్శాస్త్ర పండి తుడు. సంగీత, సాహిత్యములం దతిసమర్థుడు. గీత, లక్షణగీత, ప్రబంధ, కీర్తన లనేకము రచించిన మహానుభావుడు. షుమారు వేయిగీతములవరకు రచించియుండుటచే "వేయిగీత" అను సార్థక నామముకూడ నొందినవాడు. తన రచనలందు "గురుమూర్తి" అను స్వనామముద్ర నుపయోగించినవాడు. తనకు గల సంగీత, సాహిత్య రచనా విశిష్టతచే శ్రీమణలి చిన్నయామొదలియార్ చే మద్రాసునందు బహుసన్మానము లొందినవాడు. సంస్కృతములో యీయన రచించిన ధన్యాసిరాగములోని "నీరజ నయన" మోహనరాగములోని "సదాపతిం" వంటి కీర్తనలును, సహాన రాగంలోని "కంసాసుర" వంటి లక్షణగీతములును మిగుల ప్రసిద్ధములగును.

55. సదాశివ బ్రహ్మేంద్రసరస్వతి :- ఇతడు 18వ, శతాబ్దమునకు చెంది నవాడు. నివాసము కుంభకోణమువద్దగల "తిరువిశైనల్లూరు" గ్రామము. కామకోటి పీఠాధిపతియగు శ్రీపరమశివేంద్ర సరస్వతి స్వామివారి శిష్యుడు. పినతండ్రియగు రామ

(27)

భద్ర దీక్షితారునివద్ద సిద్ధవిద్యాభ్యాసమొనర్చిన మహానుభావుడు. భక్తిరసప్రధానమైన అనేక కీర్తనలనేగాక శివమానసికపూజ, ఆత్మవిద్యావిలాసము, బ్రహ్మసూత్రవృత్తి మొదలగు గ్రంథములనుకూడ రచించిన సమర్థుడు. రోజులతరబడి సమాధియందుండెడివాడు. కోయంబత్తూరు జిల్లాలో అమరావతి ప్రాంతమున కావేరీతీరములో గల నేరూరు, కొడుముడి మొదలగు పల్లెలందు దిగంబరుడైమౌన వ్రతముతో నివసించెడివారు. తన మరణకాలమును ముందుగా దెలిపి అదేవిధముగా క్రీ. శ. 1887 సం|| (మిధున మాస) జ్యేష్ఠ శుద్ధదశమి నాడు సిద్ధిబొందిన తపస్సంపన్నుడు. ఈయన వార్షికోత్సవములు నేరూరులో నేటికిని జరుగుచున్నవి. కొత్తకోట సంస్థానాధీశ్వరులు వీరి శిష్యకోటికి చెందినవారగుటచే నేరూరులో వీరి సమాధికి నిత్యోత్సవాలుకూడ జరిపించుచుందురు. ఈయనచే సంస్కృతములో రచింపబడిన అధ్యాత్మ కీర్తనలు "పరమహంస" ముద్రను కలిగి యుండును. వాటిలో సామరాగంలోని "మానస సంచరరే బ్రహ్మణి" అను కీర్తనయు, "బ్రూహి ముకుందేతి" అను వేరొక రాగములోని కీర్తనయు మిగుల ప్రసిద్ధములగును.

**56. కవి మాతృభూతయ్య :—** ఇతడు 18వ, శతాబ్దమునకు చెందినవాడు. తిరుచునాపల్లి వాస్తవ్యుడు. తైలింగ్య బ్రాహ్మణుడు. శ్రీసుగంధికుంతలాంబా దేవిని పూజించి యాదేవియనుగ్రహమువలన అనేక కీర్తనములను, పదములను రచించిన మహనీయుడు. అమరసింహమహారాజుయొక్క ప్రోత్సాహమున "పారిజాతాపహరణ"మనే యక్షగానాన్ని రచించినవాగ్గేయకారుడు. ఇతడు దారిద్ర్యముచే మిక్కిలి బాధపడుచుండగా దేవి కరుణించి ఒకనాటిరాత్రి స్వప్నములో దర్శనమిచ్చి నా భక్తుడైన ప్రతాపసింహుడు నీదారిద్ర్యమును పోగొట్టును. చింతపడకుము. అని చెప్పి వెంటనే ప్రతాపసింహునికి స్వప్నమునందీవిషయము తెలిపెనట. మహారాజు వెంటనే మేల్కొని దేవి ఆజ్ఞకు మిగుల సంతసించి మాతృభూతయ్యను ఆహ్వానించి, 10,000 రూపాయలతో అఖండమైన సన్మానముచేసి గౌరవించెనట. కుంతలాంబాంకితమైన యీయన రచనలు "త్రిశిరగిరి" (తిరుచిరాపల్లి) ముద్రను గలిగియుండును. వీరి రచనలలో "నీ మది చల్లగ" అను ఆనందభైరవిలోని కృతి మిగుల ప్రసిద్ధమగును.

**57. తోడి సీతారామయ్య :—** ఇతడు 19వ, శతాబ్దములోనివాడు. సంగీత, సాహిత్యములందతిసమర్థుడు. అనేక రచనలను రచించిన వాగ్గేయకారుడు. తోడి రాగాలాపన యీతని సొమ్మని చెప్పుదురు. గనుకనే తోడి సీతారామయ్య అని పిలువబడెను. ఈతని తోడి రాగమును విన కుతూహలముగల మహారాజులు యితడు

లోగడ తోడిరాగమును కుదువబెట్టినచోట వడ్డీతోసహా పైకము చెల్లించి యీయనచే తోడిరాగమును పాడించి సన్మానించెడివారని తెలియుచున్నది.

58 శంకరాభరణం నరసయ్య :- ఇతడు 18వ శతాబ్దమునకు చెందిన వాడు. శరభోజీ మహారాజు కాలము నాటివాడు. బ్రాహ్మణుడు. ద్రావిడ భాషలో గేయకల్పనలు విలసిల్లునట్లు పదములు రచించిన గొప్ప ప్రతిభగలవాడు. శంకరాభరణ రాగాలాపన యీతని సొమ్మని ఆనాటి ప్రసిద్ధ గాయకులేమి, ప్రజలేమి తలచుగా చెప్పుకొనెడివారని ప్రతీతిగలదు. కనుకనే యితడు శంకరాభరణం నరసయ్య అని సార్థక నామముతో పిలువబడెను.

59. ఉపనిషద్బ్రహ్మయోగి :- ఇతడు క్రీ. శ. 1720-1800 ప్రాంతము వాడు. జన్మస్థానము "బ్రహ్మపురం" అను గ్రామము. తండ్రిపేరు సదాశివయ్య. తల్లి పేరు లక్ష్మీదేవమ్మ. ఇతని అసలు పేరు శివరామయ్య. తల్లి దండ్రులకు సంతతి లేనందున కృష్ణపురంలోని శివకామసుందరీ, కరినాథదేవులను భక్తితో సేవించగా తద్వరప్రసాదమున యితడు జనించెను. ఇతడు సంస్కృతాంధ్రములలోను, ద్రావిడ భాషలోను,సాంగోపాంగముగ వేదాధ్యయనములోను గొప్పపండితుడు.వివాహానంతరం యీయనకు ఒక పుత్రుడు కలిగెను. తదుపరి వాసుదేవేంద్రయోగిచే సన్యాసాశ్రమము నొంది రామచంద్రేంద్రయోగిగా చెప్పబడెను. ఇతడు కాంచీపురంలో కైలాసనాథ స్వామి ఆలయంవద్ద గల అగస్త్యాశ్రమంలోని మఠమునందు నివసించెను. ఈ మహనీయుడు 108 ఉపనిషత్తులకును, భగవద్గీతకును భాష్యము వ్రాసి 17-12-1751 తేదీన పూర్తిచేసినందున "ఉపనిషద్బ్రహ్మేంద్రయోగి" అని ప్రసిద్ధిపొందెను. శ్రీ త్యాగరాజు, ముద్దుస్వామి దీక్షితులకు యీయన గురుతుల్యుడగును. మరియు భక్తి పూరితములగు అనేక సంకీర్తనములను రచించెను. వాటిని శ్రీ త్యాగరాజ, దీక్షితులచే పాడించుకొని విని ఆనందించేవాడనియు, దివ్యనామ సంకీర్తన రచనలో శ్రీ త్యాగరాజ, దీక్షితులకు యీయనే మార్గదర్శకుడనియు చెప్పుదురు.

60. పరిమళరంగ పదకర్త :— ఇతడు క్రీ. శ. 1700 ప్రాంతము లోనివాడు. తైలింగ్య బ్రాహ్మణుడు. మద్రాసుకు ఉత్తరమున నివసించినట్లుగా తెలియుచున్నందున ఆంధ్రుడనే చెప్పవచ్చును. సంగీత, సాహిత్యములలో గొప్ప సమర్థుడు. ఇతడు ప్రాసయమకములతో రచించిన పదములలోను, కీర్తనలలోను "పరిమళరంగ" ముద్ర కనుపడుచున్నందున యీతని పేరు పరిమళరంగడుగా కొందరు చెప్పుచున్నను, అసలుపేరుమాత్రము యేదో తెలియుటలేదు. మరియు

యీ పరిమళరంగడు యేక్షేత్రదైవమో, యీ రచయితయొక్క నివాస మేగ్రామమో కూడా తెలియుట లేదు. ఇతడు నరస్తుతికి విముఖుడనియు, గనుకనే దేవతాంకితముగా తన రచనలను సాగించెననియు చెప్పుదురు. తెలుగులో యితని పదములు షుమారు 40 వరకునూ గలవు. కీర్తనలు 8 వఱకును కనుపడుచున్నవి. కాని యింకను ఎన్ని గలవో తెలియుటలేదు. వీటిలో కొన్ని దేవీపరంగాను, కొన్ని దైవపరంగాను, కొన్ని జతులతో కూడినవిగాను వుండి నాయకా నాయకీ లక్షణము గలిగియున్నవి.

61 A. ఇతర తెలుగు పదకర్తలు:- ఈ పదకర్తలు 17వ శతాబ్దమునకు చెందినవారుగా తెలియుచున్నను వీరియొక్క పేర్లుమాత్రము తెలియుటలేదు. కాని వీరి యింటిపేర్లును, వీరి రచనల కుదాహరణముల నీ క్రింద తెలుపుట గమనించునది

(1) యీవరంగని పదములు :- ఉ॥ చెయి బట్టి నా సిగ్గు చెరుపవలెనా (సహాన)
(2) కస్తూరి రంగని పదములు :- ఉ॥ ఇంతెందు వచ్చితివిరా - అలదానియిల్లు.
(3) ఘట్టుపల్లివారి పదములు :- ఉ॥ తలచుకొంటే తాళజాలనే (కురంజి)
(4) బొల్లవరమువారి పదములు :- ఉ॥ మోసమాయె గదనే నా బుద్ధికి (ఆహిరి)
(5) శోభనగిరివారి పదములు :- ఉ॥ (1) చెలియ నీతో, (2) శైలతా(కాంభోజి)
(6) జటపల్లివారి పదములు :- ఉ॥ మగవారికి ధర్మమేడదే మగువ వారల నమ్మ
(7) ఇనుకొండవారి పదములు :- ఉ॥ నీవే యోడితే సెలత నాదానవు(రేగుప్తి)
(8) శివరాంపురమువారి పదములు :- ఉ॥ ఏమి సేయుదు నిమిష మేడాయెనే (కాంభోజి); పోదామా పారిపోదామా (ధన్యాసి).

పై విధముగా యెందరో పదకర్తలు, యెన్నో పదములను రచించి కీర్తి చెంది యుండిరి. ఇవేగాక వేణంగివారు వేణంగి ముద్రతోను, మల్లిఖార్జునుడు మల్లిఖార్జున ముద్రతోను రచించిన పదములు కూడ యెన్నో కలవు.

B. తమిళ పద కర్తలు :- వీరిలో వైదీశ్వరన్ కోవిల్ సుబ్బ రామయ్యర్, ఘనం కృష్ణయ్యర్, శంకరాభరణం నరసయ్య, ముత్తు తాండవరు, పాప వినాశ మొదలియార్ మొదలగువారు ముఖ్యులగుదురు.

62. శొంఠి వెంకటసుబ్బయ్య :- ఇతడు 18 - 19 శతాబ్దములకు చెందినవాడు. ఆంధ్ర త్రైలింగ్య బ్రాహ్మణుడు. ఆది అప్పయ్య గారి సమకాలికుడు. ఆంధ్రమునందును, సంగీతమునందును, గొప్ప సమర్థుడు. వేంకటమఖి సంప్రదాయముల నెరింగినవాడు. 2వ, తులజాజీ మహారాజుపై బిలహరిరాగంలో విచిత్రమైన నొకవర్ణ మునురచించి మెప్పొందినవాడు. కళాప్రియుడగు శ్రీమణలి చిన్నయా మొదలియార్

సభలో అపూర్వమైన తన రచనలను వినిపించి విశేష బహుమానము లొందిన ప్రతిభావంతుడు. ఈయన కుమారుడే శొంఠి వేంకటరమణయ్య అగును.

63. శొంఠి వేంకటరమణయ్య :— ఇతడు 18–19 శతాబ్దములకు చెందిన శరభోజీ కాలము నాటివాడు. శొంఠి వేంకటసుబ్బయ్యగారి కుమారుడు. సంగీత సాహిత్యములలో తండ్రిని మించినవాడు. తంజావూరు ఆస్థాన విద్వాంసుడు. త్యాగరాజునకు సంగీతవిద్యా గురువుగా నుండిన మహానుభావుడు. ఇతడు తిరువయ్యూరులో నివసించెనని తెలియుచున్నది.

64. త్యాగరాజు :— సంగీతత్రిమూర్తులలో నొకరుగా పేరొందిన సుకవి సామ్రాట్ శ్రీ త్యాగరాజు క్రీ. శ. 1767 సం॥మునకు సరియగు సర్వజిత్ సం॥ వైశాఖ శుద్ధ షష్ఠి శుక్రవారమున తిరువారూరులో జన్మించెను. ఇతడు ఆంధ్రుడు. ములకనాటి బ్రాహ్మణుడు. భారద్వాజసగోత్రీకుడు. ఇంటిపేరు కాకర్లవారు. తండ్రిపేరు రామబ్రహ్మము. తల్లి పేరు సీతమ్మ. తాత పేరు గిరిరాజకవి. ముత్తాత పేరు పంచనదబ్రహ్మము. సోదరులు పంచాపకేశుడు (జ్యేష్ఠుడు), రామనాథుడు, మూడవవాడు త్యాగరాజు. పంచనదబ్రహ్మము క్రీ. శ. 1600 ప్రాంతమున ఆంధ్రదేశములోని కర్నూలు జిల్లా, కంభంతాలూకా, కాకర్ల గ్రామమునుండి తమిళ దేశములోని తంజావూరు జిల్లా "తిరువారూరు" క్షేత్రమునకు వచ్చి యచ్చట స్థిరపడిపోయెను. తదాది వారి వంశీయు లచ్చటనే యుండిపోయిరి. త్యాగరాజు జన్మతః శ్రీరామభక్తుడై నందున బాల్యములోనే తల్లియొద్ద జయదేవుని అష్టపదులును, పురందరదాసుని దేవరనామములును, అన్నమాచార్యుని సంకీర్తనములను నేర్చుకొని తండ్రియొక్క పూజామందిరమువద్ద పాడుచుండెడివాడు. తండ్రివద్ద సంస్కృతాంధ్రములలో పాండిత్యము సంపాదించి ప్రతిదినము పోతన భాగవతమును పారాయణము చేయుచుండెడివాడు. మరియు మధురమైన కంఠధ్వని గలిగినవాడగుటచే త్యాగయ్యకు సంగీత శిక్షణ నిప్పించ దలచి తండ్రి రామబ్రహ్మము తంజావూరు ఆస్థాన విద్వాంసుడైన శొంఠి వేంకటరమణయ్యగారివద్ద ప్రవేశపెట్టెను. ఒక్క సంవత్సరములోనే త్యాగయ్య ఏకసంతగ్రాహియై గురువువద్ద సంగీతశాస్త్రమునం దత్యద్భుతపాండిత్యము సంపాదించుటయేగాక వీణలోకూడ మిక్కిలి ప్రావీణ్యము సంపాదించెను. సంగీత శాస్త్రములో యింకను అభివృద్ధిచెందుటకు మేనమామయగు వీణ కాళహస్తయ్యగారివద్దగల సంగీత గ్రంథములను పరిశీలిస్తూ వుండెడివాడు. ఒకనాడు యీయన పుణ్యవశమున రామకృష్ణానందస్వామియను యతీంద్రులు వీరింటికి వచ్చినపుడు త్యాగయ్యకు గల బుద్ధికుశలత, భక్తిపారవశ్యములకెంతయు సంతసించి "నారదోపాస్తి" అను మహామంత్రము నుపదేశించెను. త్యాగయ్య ఆ మహామంత్రమును భక్తితో పునశ్చరణచేయు

చుండునపుడు ఒకనాడు నారదమహర్షి యతిరూపములోవచ్చి త్యాగయ్య గానమును విని మహదానందభరితుడై "స్వరార్ణవము, నారదీయ"మను అపూర్వసంగీత గ్రంథముల నొసగుటయేగాక, నాయనా! సంగీతశాస్త్రములో నీకుగలసందియములన్నియు నీ గ్రంథములవలన తీరునని చెప్పి యంతర్ధానమయ్యెను. వెంటనే త్యాగయ్య తన కీ విధముగా దర్శనమిచ్చి గ్రంథములొసగినది నారదమహర్షియేనని గ్రహించి మహదానందముతో (1) శ్రీనారదనాద సరసీరుహభృంగ శుభాంగ (కానడ) (2) వరనారద నారాయణ స్మరణా (విజయశ్రీ) (3) రాజిల్లువీణగల్లురాయా (భైరవి) మొదలగు కృతులను గానము చేసెను. త్యాగయ్య 18వ, ఏట పార్వతి అను కన్యను వివాహమాడెను. తరువాత రెండు సంవత్సరములకు తండ్రియును, అయిదు సంవత్సరములకు భార్యయును మరణించగా ఆమె సోదరి కమలాంబను ద్వితీయవివాహమాడెను. ఆమెవలన ఒక కూతురు జనించగా సీతాలక్ష్మి అను పేరుపెట్టెను. ఆమెకు యుక్తవయస్సురాగానే అమ్మాళ్ అగ్రహారమున నివశించు కుప్పుస్వామయ్యకిచ్చి వివాహముచేసెను. త్యాగయ్య నిరాడంబరముగా ఉంఛవృత్తితో జీవించుచూ తనయిష్టదైవమైన శ్రీరామచంద్రుని కీర్తించుచూ యుండునపుడు పుణ్యవశమున శ్రీరామకృష్ణానందస్వామి అరుదెంచి తారక మంత్రముపదేశించెను. త్యాగయ్య భక్తితో రోజుకు 1,25,000 వంతున 96 కోట్లు రామతారకమును పూర్తిచేయగనే శ్రీరామచంద్రుడు లక్ష్మణ సహితుడై విశ్వామిత్ర యాగ సంరక్షణార్థము వెడలుచున్నట్టి దివ్యమోహన రూపములో దర్శనమిచ్చి అంతర్ధానమైరి. వెంటనే త్యాగయ్య మహదానందముతో "ఏల నీ దయరాదు(అఠాణా)అను రచనతో శ్రీరాముని అనేకవిధముల స్తుతించెను. సంస్కృతములో మొట్టమొదటగా వెలువడిన యీ కృతిని వినిన ఆనాటి మహాపండితులుసయితము త్యాగయ్య కేవలము అవతారమూర్తియని పొగడజొచ్చిరట. అదిమొదలుకొని త్యాగయ్య శ్రీరామచంద్రుని తన రచనలతో కీర్తించక ఒకనాడుకూడ భుజించలేదట. వాల్మీకి శ్రీమద్రామాయణమును 24 వేల శ్లోకములతో పూర్తిగావించినటుల వాల్మీకాంశమైనత్యాగయ్య 24 వేల కీర్తనలతో రామాయణమును రచించినటుల పెద్దలుచెప్పుదురు. అయితే ఆనాడు కాగితములు, అచ్చుయంత్రములు లేనికారణమున ఆ 24 వేలలో ప్రస్తుతము 2400 కీర్తనలు మాత్రమే కనుపడుచున్నవి. మరియు నితడు యిట్టి కీర్తనలనేగాక ప్రహ్లాద భక్తవిజయము, నౌకాచరిత్రము, సీతారామవిజయము వంటి ప్రబంధములనుకూడ రచించెను. కాని వీటిలో సీతారామవిజయముమాత్రము నేడుకనుపించుటలేదు. త్యాగయ్య రచనలు ద్రాక్షాపాకముగానుండును. వాటికిగల రాగ, భావ సంపత్తి, పదలాలిత్యమే వాటిని అఖండప్రచారములోనికి తేగలిగెను. ఈవిధముగా విశేష కీర్తినొందిన త్యాగయ్య సంగీత, సాహిత్య, కవితావిశిష్టతను తమ ఆస్థాన విద్వాంసులవలన వినిన తంజావూరు రెండవ శరభోజీ మహారాజు అమూల్యములైన అనేక కానుకలతో త్యాగరాజును తన

ఆస్థానములో కచ్చేరిచేయుటకు ఆహ్వానించగా ఐహికసుఖములకు విముఖుడైన త్యాగయ్య "నిధి చాల సుఖమా? రాముని సన్నిధిసేవ సుఖమా? నిజముగ బల్కు మనసా" అను (కల్యాణి) రచనతో ఆత్మపరిశోధన చేసుకొని మహారాజు ఆహ్వానమును, కానుకలను తిరస్కరించెను. మహారాజునకీ సంగతి తెలిసి బలవంతముగా తోడ్కొని రమ్మని భటులను పంపగా వెంటనే రాజునకు శూలనొప్పి కలిగి భరింపజాలకపోయెను. వెంటనే యిది పరమభక్తుడైన త్యాగరాజునకు చేసిన అపచార ఫలితమని గ్రహించి తన ప్రయత్నము విరమించగానే మహారాజుకు వెంటనే శూలనొప్పి నివారణమైనందున తానే పాదచారియై త్యాగయ్యవద్దకు వెళ్ళి ఆయన అమరగానము వినినట్లు చెప్పుదురు. ఈవిధముగా మహారాజుల ఆహ్వానముకూడ తిరస్కరించి తమ దారిద్ర్యమును కొంతవరకైనా తీర్చుటకు ప్రయత్నించని త్యాగయ్యపై అన్నయగు జపేశునికి మిక్కిలి ఆగ్రహము కలిగి ఒకనాటిరాత్రి త్యాగయ్య పూజించు శ్రీరామపంచాయతన విగ్రహములను కావేరీనదిలో పడవేసెను. తెల్లవారగనే పూజామందిరములో తన యిష్టదైవమగు శ్రీరామచంద్రుడు కనుపించనందుకు త్యాగయ్య యెంతో దుఃఖించి "ఎందు దాగినాడో" (తోడి) అను రచనను భక్తితో పాడుచూ సొమ్మసిల్లి నిదురించెను. ఆర్తజన రక్షకుడైన శ్రీరామచంద్రుడు స్వప్నములో తానువుండుచోటును తెలుపగా వెంటనే త్యాగయ్య మేల్కొని తనకు గలిగిన దివ్యస్వప్నమును తన శిష్యులకు చెప్పి కావేరీ నదికివెళ్ళి వెదకగా నొకచోట శ్రీరామపంచాయతనము కనుపించెను. తనకు మరల శ్రీరామచంద్రమూర్తి దివ్యదర్శనము కలిగినందుకు మహానందపరవశుడై "కనుగొంటిని" (బిలహరి), రారా మాయింటిదాక (అసావేరి), ఎట్లా దొరికితివో (వసంత), అను కీర్తనములచే ప్రార్థించి స్వామివారిని వూరేగింపుతో తన పూజామందిరమునకు చేర్చెను. త్యాగయ్యకుగల భక్తిపారవశ్యత, సంగీత, సాహిత్య, జ్యోతిష, గణిత, మంత్ర శాస్త్రములందుగల అద్భుత పాండిత్యములగురించి వినిన కాంచీపుర పీఠాధిపతియగు శ్రీ ఉపనిషద్బ్రహ్మేంద్రస్వామి త్యాగయ్యను ఒకసారి కాంచీపురమునకు రమ్మని ఆహ్వానము పంపగా త్యాగయ్య శిష్యసహితముగా కాంచీపురమునకు బయలుదేరెను. మార్గ మధ్యములో శిష్యుడైన వీణ కుప్పయ్యర్ ప్రార్థనపై తిరువొత్తియూరునందు కొన్నిరోజులుండినపుడు అచ్చటి త్రిపురసుందరీదేవిని దర్శించి భక్తితో "కన్నతల్లి (సావేరి), దరిని తెలిసికొంటి (శుద్ధసావేరి), సుందరి నిను (ఆరభి), సుందరి నన్నిందరిలో (బేగడ), సుందరి నీ దివ్య (కల్యాణి)", అను పంచరత్నములచే స్తోత్రము చేసెను. తరువాత చెన్నపట్టణము వెళ్ళి అచ్చట తిరువల్లిక్కేణిలోని పార్థసారథి స్వామిని దర్శించి "సారి వెడలిన యీ పార్థసారథి గని" (అసావేరి), అను రచనతో కీర్తించెను. తరువాత కోవూరు వెళ్ళి అచ్చటి సుందరేశ్వరుని దర్శించి "ఈ వసుధ నీవంటి"

(సహాన), కోరి సేవింప (ఖరహరప్రియ), శంభోమహాదేవ (పంతువరాళి), నమ్మివచ్చిన (కల్యాణి), సుందరేశ్వరుని (శంకరాభరణం)" అను పంచరత్నములచే స్తుతించెను. తదుపరి నాగులాపురం సమీపములోగల అడవిలో దొంగలు బాధింపగా "ముందు వెనుక" (దర్బారు), అను రచనతో ప్రార్థించగనే శ్రీరామలక్ష్మణులు కోదండపాణులై త్యాగయ్యపల్లకికి యిరుప్రక్కల నిలచి దొంగలబాధ నివారించిరి. తరువాత తిరుపతి క్షేత్రమునకుచేరి శ్రీ వేంకటేశ్వరుని దర్శించుటకు వెళ్ళగా స్వామికి అడ్డుగా తెర వేయబడి యుండెను. వెంటనే త్యాగయ్య తనకు స్వామి దర్శన భాగ్యము కలుగ నందుకు చింతించి "తెరతీయగరాదా (గౌళీ పంతు)" అను రచనతో ప్రార్థించగనే ఆ తెర దానంతట అదే తొలగిపోయెను. స్వామి తనకు దర్శనమిచ్చినందుల కెంతయు సంతసించి "వేంకటేశా(మధ్యమావతి)" వంటి రచనలతో స్వామినికీర్తించెను. తదుపరి పుత్తూరు చేరునపుడు ప్రమాదవశమున ఆలయములోని బావియందుపడి మరణించిన ఒక యాత్రికునిచూచి జాలిచెంది "నా జీవాధారా (బిలహరి)" అను రచనను భక్తితో గానము చేయగానే మరణించిన వ్యక్తి పునర్జీవితుడయ్యెను. తదుపరి కాంచీపురము వెళ్ళి శ్రీ ఉపనిషద్బ్రహ్మేంద్రస్వామిని దర్శించి, వారి ఆశీస్సులనొంది అచ్చటి వరదరాజ స్వామిని దర్శించి "వరదరాజ నిన్నే కోరి (స్వరభూషణి)" వరదానన (రాగపంజరం), వంటి అనేక కీర్తనలచే స్తోత్రము చేసెను. ఆ తరువాత తిరుగు ప్రయాణములో శిష్యుడైన వాలాజాపేట వేంకటరమణ భాగవతుని ప్రార్థనపై వాలాజాపేట వెళ్ళి యుండునపుడు మైసూరు సదాశివరావు త్యాగయ్యను దర్శించి ఆయన యందుగల భక్తిచే "త్యాగరాజ స్వామి వెడలిన (తోడి)" అను కీర్తనము రచించి వినిపించి వారిచే మెప్పొందెనట. తరువాత తిరువయ్యూరుచేరి యుండునపుడు కొన్నాళ్ళకు శ్రీరంగ క్షేత్రము వెళ్ళి శ్రీరంగనాథుని దర్శించి "రాజు వెడలె (దేశికతోడి), ఓ రంగశాయి (కాంభోజి), చూతాము రారె (ఆరభి), వినరావ నా మనవి (దేవగాంధారి)" వంటి కృతులచే స్తుతించెను. పిమ్మట నాగపట్నం వెళ్ళి అచ్చటి నీలాయతాక్షిదేవిని దర్శించి "కర్మమే బలవంతమాయె తల్లీ (సావేరి)"అను రచనతో కీర్తించెను. ఆ తరువాత లాల్గుడి వెళ్ళి అచ్చటి శ్రీమతీ దేవిని దర్శించి "గతినీవని (తోడి) లలితే శ్రీ (భైరవి) దేవిశ్రీతప స్తీర్థ (మధ్యమావతి), మహిత ప్రవర్ధ (కాంభోజి)"వంటికృతులతో స్తుతించెను. తదనంతరము ఘటికాచలము వెళ్ళి అచ్చటి యోగనరసింహస్వామిని దర్శించి "నరశింహ్మా నన్నుబ్రోవవే(బిలహరి) అను రచనతోను, యోగాంజనేయస్వామిని దర్శించి "పాహిరామదూత (వసంతవరాళి), కలుగునా (పూర్ణలలిత)" వంటి రచనల తోను ప్రార్థించి తిరువయ్యూరు చేరెను. మరియు నితడు ఘనరాగ పంచకములో "జగదానంద (నాట), దుడుకుగల (గౌళ), సాధించెనే (ఆరభి), కనకనరుచిరా(వరాళి), ఎందరో మహానుభావులు (శ్రీరాగం), అను పంచరత్నములనుకూడ రచించెను.

ఈ విధంగా త్యాగరాజు రచించిన ఘనరాగ పంచరత్నములేగాక నారద పంచరత్నములు, తిరువొత్తియూర్ పంచరత్నములు, కోవూరు పంచరత్నములు, నాగపుర పంచరత్నములు, శ్రీరంగ పంచరత్నములు కూడ అత్యంతప్రాముఖ్యమైన రచనలగుచున్నవి. వీరి ననుసరించే వీరి శిష్యుడు వీణకుప్పయ్యర్ కూడ కాళహస్తీశ్వర పంచరత్నములును, వేంకటేశ్వరపంచరత్నములును రచించెను. త్యాగరాజు తన మరణకాలము ఒక పదిపూటలలో గలదని క్రీ॥ శ॥ 1847 పుష్య శు ౧౦ రాత్రి స్వప్నమున తెలిసికొని మరునాడుదయముననే తనబంధుమిత్రులకు చెప్పి "గిరిపై నెలకొన్న" (సహాన)అను రచనతో శ్రీరాముని స్తుతించెను. ఈవిధంగా తొమ్మిదిరోజులు గడవగా 1847 పరాభవ సం॥ పుష్య బహుళ చతుర్థినాడు శ్రీ పరమహంస బ్రహ్మానందేంద్రస్వామివారిచే సన్యాసాశ్రమము స్వీకరించి నాదబ్రహ్మానందస్వామిగా పేరొందెను. మరునాడు ఉదయమున 11 గంటలకు శ్రీరామచంద్రుడు తన చెంతకు నన్ను తీసుకొనగలడనియు, ఆ సమయములో భజనలు చేయుడనియు శిష్యులందరికిచెప్పి పుష్య బ ౫ లు ఉదయముననే స్నాన సంధ్యావందనాది నిత్యవిధు లొనర్చి భక్తితో "పరమాత్ముడు (వాగధీశ్వరి) పరితాపము (మనోహరి)" వంటి కృతులను భక్తితో గానంచేసి 6-1-1847కు సరియగు పరాభవ సం॥ పుష్య బహుళపంచమి దివసమున ఉదయం సరిగా 11 గంటలకు యోగసమాధిలో నుండగా కపాలమునుండి ఒక దివ్యతేజస్సు పైకిపోయి సుకవి సమ్రాట్ శ్రీ త్యాగరాజస్వామి పరమాత్మునిలో లీనమయ్యెను.

శిష్యులు వీరి భౌతిక శరీరమును భజనలతో కావేరీతీరమునకు దీసుకొని వెళ్ళి సమాధిచేసి దానిపై తులసికోటను కట్టిరి. నాటినుండి నేటివరకు తిరువయ్యూరులోని వారిసమాధివద్ద పుష్య బహుళ పంచమి మొదలు స్వామివారి వర్థంతి మహోత్సవములు సుప్రసిద్ధ సంగీత విద్వాంసులందరునుచేరి అత్యంతజయప్రదంగా జరుపుచున్నారు. త్యాగరాజునికి షుమారు 30 మందివరకు శిష్యులుగలరు. వీరిలో వీణ కుప్పయ్యర్, వాలాజీపేట వేంకటరమణభాగవతులు మొదలగువారు ముఖ్యులగుదురు. నేడు వాడుకయందున్న త్యాగరాజాంకితముగల కృతులలో కొన్ని త్యాగరాజస్వామి రచనలు కానట్లు ఒక ప్రతీతి గలదు. అవి యేవనగా "వెడలెను కోదండపాణి (తోడి) శ్రీ తంజావూరు కృష్ణ భాగవతార్ను, పరాజ్ముఖ మేలరా (సురటి), అభిమానమెన్నడు (వివర్ధని). అను కృతులు శ్రీ మన్నారుగుడి రాజగోపాలయ్యర్ను, వినతాసుత (హరికాంభోజి), నీ చరణములే, నతజనపరిపాల (సింహేంద్ర మధ్యమము) అను కృతులు శ్రీ K. V. శ్రీనివాస అయ్యంగార్ను, దినమే సుదినము (లతాంగి )అను కృతి శ్రీ గిరీశయ్యర్ను రచించి త్యాగరాజునికి అంకితము యిచ్చినట్లు తెలియుచున్నది.

65. శ్యామ శాస్త్రులు : ఇతడు క్రీ. శ. 1763 - 1827 కాలమునకు చెందినవాడు. సంగీత త్రిమూర్తులలో నొకరు. వడదేశత్తు వడమాల్ అను శాఖకు చెందిన బ్రాహ్మణుడు. వీరి పూర్వులు ఆంధ్రప్రదేశ్‌లోని కర్నూలుజిల్లా కంభం వాస్తవ్యులని తెలియుటచే వీరిపూర్వులు ఆంధ్రదేశమునుండి తమిళదేశమునకు వలస వచ్చిన ఆంధ్రులని స్పష్టపడుచున్నది. శ్యామశాస్త్రి క్రీ. శ. 1763 చిత్రభాను సం॥ మేష రవి కృత్తికా నక్షత్రమున తిరువారూరులో జన్మించెను. తండ్రి పేరు విశ్వనాథ శాస్త్రి. శ్యామశాస్త్రి మొదటిపేరు వేంకటసుబ్రహ్మణ్యము. కాని తల్లిదండ్రులు ముద్దుకు శ్యామకృష్ణ యని పిలిచెడివారు. బాల్యంలోనే శ్యామశాస్త్రి సంస్కృతాంధ్ర జ్యోతిషములలోను, మేనమామవద్ద సంగీతములోను పాండిత్యము సంపాదించి 18 వ: యేట తల్లిదండ్రులతో తంజావూరు వచ్చియుండెను. ఒకనాడచ్చటికి సంగీతస్వామి యను యతీంద్రులు యాత్రార్థియై వచ్చియుండునపుడు విశ్వనాథ శాస్త్రి తనయింటికి భిక్షకు ఆహ్వానించెను. ఆ సమయంలో సంగీతస్వామి శ్యామ శాస్త్రిని చూచి యితడు భవిష్యత్తులో గొప్పవాగ్గేయకారకుడు కాగలడని తండ్రితో చెప్పుటయేగాక తా నచ్చటయున్న 3 సంవత్సరములు శ్యామశాస్త్రికి సంగీతశాస్త్రము లోని వివిధరహస్యములను దెలిపి అనేక సంగీత గ్రంథములనుకూడనిచ్చి, నాయనా, శ్యామా! నీవు సంగీతశాస్త్రములో అపారమైన పాండిత్యము గడించితివి; ఇక నీవు యీ తంజావూరు ఆస్థానవిద్వాంసుడగు పచ్చిమిరియం ఆదిఅప్పయ్యగారి పాటనుమాత్రము తఱచుగా వినుచుండుమని చెప్పి కాశీకివెళ్ళెను. శ్యామశాస్త్రి ఆదేవిధముగ ఆది అప్పయ్యగారి గానమును శ్రద్ధగా వినుచుండునపుడు ఆదిఅప్పయ్య శ్యామశాస్త్రిని కామాక్షీ! అని ఆప్యాయంగా పిలుస్తూ, ఆదరిస్తూ తనగానమును వినుపిస్తూ వుండే వాడట. ఇట్లుండునపుడు తన తండ్రి మరణానంతరము శ్రీ కామాక్షీదేవిని అర్చించు బాధ్యత శ్యామశాస్త్రికే యేర్పడెను. దేవీ అనుగ్రహమున శ్యామశాస్త్రి సాటిలేని గాయకుడై అనేక స్వరజతులను, తానవర్ణములను, కృతులను రచించగల్గెను. ఈ కృతులు సామాన్యులు సాధారణంగా పాఠంచేయలేనంత అతిక్లిష్టమైన రాగతాళాలలో రచింపబడెను. వీటిలో "జననీ నతజనపరిపాలినీ పాహిమాం భవానీ" అన్న కృతి ముఖ్యమైనదగును. ఇతడు ప్రతి శుక్రవారం కామాక్షీదేవిని భక్తితో పూజించు సమయంలో వారి నోటివెంట అద్భుతమైన రచనలు వెలువడుతూవుండేవట. ఇవి షుమారు 300 వరకు వుండి దేవీపరంగాను, "శ్యామకృష్ణ"ముద్రనుగలిగి నారికేళ పాక ముగా యుండును. ఈ రచనలలో నుండు క్లిష్టతను బట్టి ఆయన వాటిని పాఠంచేయ గల అర్హతగల కొందరికే నేర్పేవాడట. గనుకనే వీరి 300 కృతులలో కొన్ని మాత్రమే ప్రచారంలోవుండటానికి కారణమైంది. ఒకప్పుడు మధుర గానసభవారి ఆహ్వానంపై మధుర వెళ్ళి శ్రీ మీనాక్షీదేవిని దర్శించి భక్తితో "నవరత్నమాలిక"

అను 9 కృతులను రచించి గానం చేసెను. ఈయన కృతులు తెలుగు, సంస్కృతం, తమిళ భాషలందు గలవు. కొన్నిటిలో రాగముద్రను, కొన్నిటిలో స్వరాక్షరములను కూడ చేర్పులచి రచించెను. ఆనందభైరవి రాగంలోను, చాపుతాళంలోను వీరి కృతులు విశేషంగా యుండుటచే నివి రెండును శ్యామశాస్త్రికి అభిమానమైనవని స్పష్టపడుచున్నది. ముఖ్యంగా చాపుతాళంలోని 3+4=7 అక్షరకాలములను 4+3=7 అక్షరకాలములుగా వేయటమే వీరి రచనలందలి నడకలోని ప్రత్యేకతయగును.మరియు భైరవి రాగంలోగల స్వరజతిలోని 8 చరణములకు గల స్వరముల మొదటి అక్షరములు వరుసగా స రి గ మ ప ద ని స యను 8 స్వరములతో ప్రారంభించుట ఆయన స్వరజతిలోగల ప్రత్యేక విశిష్టత యగును. ఇతడు "భూలోకచాపచుట్టి" అను బిరుదు గల బొబ్బిలి కేశవయ్యను, తంజావూరు ఆస్థానములోను, అప్పుకుట్టి అను విద్వాంసుని నాగపట్నంలోను పోటీలో ఓడించినటుల తెలియుచున్నది. ఈయన త్యాగరాజుకు పరమమిత్రుడగుటచే తఱచుగా వారివద్దకు వెళ్ళి మాట్లాడి వస్తూవుండేవాడు. ముద్దుస్వామి దీక్షితునికి యితడే శ్రీ విద్యామంత్రోపదేశ మొనర్చెనని కొందరు చెప్పుదురు. ఈయనకు నిగ్రహానుగ్రహశక్తులు గలవనుట కనేక నిదర్శనములు గలవు. పతివ్రతలందరివలె ఈయనభార్యకూడ ఈయనకంటె అయిదురోజులు ముందుగాస్వర్గస్థురాలయ్యెను. తనను పరామర్శింపవచ్చిన బంధుమిత్రులతో శ్యామశాస్త్రి యిక నాకు అయిదు దినములే గడువుగలదని చెప్పి అదేవిధముగా ఆఱవనాడు క్రీ. శ. 1827 వ్యయ సం॥ మకరమాస శుద్ధ దశమినాడు తన 64 వ యేట శ్యామశాస్త్రి స్వర్గస్థుడయ్యెను. వీరి శిష్యులలో సుబ్బరాయశాస్త్రి, పెరంబూరు కృష్ణయ్య, అలసూరు కృష్ణయ్య మొదలగువారు ముఖ్యులగుదురు.

**66. ముద్దుస్వామి దీక్షితులు:—** ఇతడు సంగీత త్రిమూర్తులలో నొకరుగా పేరొందిన మహానుభావుడు. క్రీ. శ. 1775-1835 కాలమునకు చెందినవాడు. వేంకటమఖి వంశీయుడు. తండ్రి పేరు రామస్వామి దీక్షితులు. గురువు పేరు వేంకట వైద్యనాథ దీక్షితులు. రామస్వామిదీక్షితులకు సంతతిలేనందున 40వ యేట, భార్యాసహితుడై వైద్యనాథ క్షేత్రమునకు వెళ్ళి అచ్చటి ముద్దుకుమారస్వామిని భక్తితో సేవించి వచ్చియుండునప్పుడు ఆ స్వామి వరప్రసాదమున బాలుడు జనించుటచే యితనికి ముద్దుస్వామి దీక్షితులని నామకరణం చేసిరి. బాల్యంలోనే దీక్షితులవారు కావ్య, నాటకాలంకార శాస్త్రములలోను, మంత్ర, యోగ, జ్యోతిష, వ్యాకరణ, ఛందశ్శాస్త్రములలోను పరిపూర్ణమైన కృషిచేసి విశేష పాండిత్యం సంపాదించెను. వివాహానంతరం మణలివచ్చి చిన్నయా మొదలియార్ చే ఆదరింపబడియుండగా మహాసిద్ధుడైన శ్రీ చిదంబరనాథయోగి యచ్చటకువచ్చి దీక్షితుల వినయ విధేయతల

కును, పాండిత్యగరిమకును, సంతసించి దయతో నొక మహామంత్ర ముపదేశించెను. వెంటనే దీక్షితులు యతీంద్రుని వెంట కాశికివెళ్ళి యచ్చట అయిదు సంవత్సరములు మంత్రావృత్తి చేసికొనుటయేగాక అష్టమహాసిద్ధులను సంపాదించి, వేదాంత శాస్త్రోపదేశ మొంది, గురువుగారి అనుజ్ఞతో తిరిగి మణలి వచ్చి దేవతాత్మ ప్తికై అంతర్బహిర్యాగముల నిర్వర్తించెను. తదుపరి తిరుత్తణి వెళ్ళి శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని సన్నిధిలో సుబ్రహ్మణ్య షడాక్షరీ మహామంత్రము నావృత్తిచేసికొనుచుండునపుడు ఒక నాడు చెంగల్వరాయ డనబడు శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుడు ఒక మహాపురుషుని రూపంలో దర్శనమిచ్చి నోటిలో కండచక్కెరను వేసి అంతర్ధానమయ్యెను. దైవానుగ్రహంవలన వెంటనే దీక్షితులవారు ఆశువుగా "శ్రీనాథాది గురుగుహో జయతి" అను మాళవగౌళ రాగంలో ప్రథమావిభక్త్యంతముగా సంస్కృతంలో మొదటి కృతిని రచించెను. ఆ తరువాత క్రమంగా సంబోధన ప్రథమ మొదలగు 7 విభక్తుల లోను 7 కీర్తనలు గురుగుహాంకితముగా రచించెను. మరియు పంచలింగస్థల కృతులు (పృథివి=కంచి, ఆపో=తిరువనైక్కావల్, తేజో = తిరువణ్ణామలై, వాయు = కాళహస్తి, ఆకాశ=చిదంబరము)ను, తాన వర్ణములును, రాగమాలికలును, లక్షణ గీతములును యనేకము రచించెను. సోదరులగు చిన్నస్వామి, బాలస్వామితో కలసి కాంచీపురంలో 4 సం॥ లుండునపుడు శ్రీ కామాక్షీదేవి సన్నిధిలో శ్రీవిద్యోపాసన చేసుకొంటూ 'కంజాయతాక్షి', 'ఏకామ్రనాథం భజేహం' వంటి కీర్తనలు గేయ కల్పనలు విలసిల్లగా రచించి తన తమ్ములచే ప్రచార మొనర్చెను. అచ్చటగల స్వామి ఉపనిషద్బ్రహ్మముతో వేదాంత విచారణ చేయునపుడు శ్రీ స్వామివారు రచించిన రామాష్టపదులకు రాగ తాళములలో వర్ణక్రమము నేర్పఱచెను. తరువాతకుటుంబంతో తిరువారూరువచ్చియుండునపుడు, అచ్చటగల శ్రీ త్యాగరాజస్వామి దేవునిపైనను, ఆనందేశ్వర, సిద్ధేశ్వర, అచలేశ్వర, హాటకేశ్వర, వల్మీకేశ్వరులమీదను, షోడశ గణపతులమీదను, చోళమండలంలోగల శివ, విష్ణు క్షేత్రములమీదను, కాశీ, మధుర, అతఘురు కోవిల్ మొదలగు క్షేత్రములమీదను సంస్కృతంలో అనేకకీర్తనలను రచించెను. ఇతడు వేంకటమఖి వంశీయుడగుటచే ఆయనమేళకర్త రాగ సంప్రదాయము ననుసరించే తన కీర్తనలను రచించెను. ఈయన కృతులలో కొన్నిటియందు అనులోమ, విలోమ చిట్టస్వరము లుండును. ఉ॥ 'కమలాంబాం భజరే' (కల్యాణి) అను నవావర్ణకృతి, 'సదా వినుత పాదే'(రేవగుప్తి)అనునవియగును. కొన్నిటిలో గోపుచ్ఛ యతి, స్రోతోవహాయతులుగల సాహిత్యము లుండును. మరి కొన్నిటిలో చరణమునకు బదులుగా అనుపల్లవిలోనే మధ్యమకాల సాహిత్యము లుండును. తమ్ముడగు చిన్న స్వామి మరణించగా, బాలస్వామి చింతాక్రాంతుడై సేతుయాత్రచేసి తిరిగివచ్చునపుడు ఎట్టయాపురం మహారాజు యితనిని ఆదరించి వివాహముకూడ జరిపించెను,

దీక్షితులవారికి సంగతి తెలిసి బాలస్వామిని చూచుటకై ఎట్టయాపురం వచ్చునప్పుడు మార్గమధ్యములో వర్షాభావముచే యెండిపోవు పైరులను జూచి కనికరించి అమృత వర్షిణి రాగంలో "ఆనందామృత కర్షిణి అమృతవర్షిణి" అను కీర్తన రచించి గానం చేయడంతోనే దైవకృపవల్ల మేఘావృతమై అద్భుతమైన వర్షము కురిసెనట. వెంటనే ఎట్టయాపురం చేరి పెండ్లికొడుకై యున్న తన తమ్ముని జూచి సంతసించి తిరువారూరు వెళ్ళెను. క్రీ. శ. 1835 లో రాజపుత్రుని వివాహ సందర్భంలో ఆహ్వానము రాగా మరల ఎట్టయాపురం వెళ్ళి రాజపుత్రుని వివాహమైన కొలదిదినములకు అనగా క్రీ.శ. 1835 తులామాస కృష్ణచతుర్దశి నాడు తన 60 వ యేట ముద్దుస్వామి దీక్షితులు స్వర్గస్థులైరి. వీరికీర్తనలు షుమారు 300 వఱకు నుండును. అవి నారికేళ పాకముగా నుండును. వీటిలో యెక్కువభాగము సంస్కృతములో రచింపబడెను. వీరి శిష్యులలో తిరక్కడయూర్ భారతి, ఆవడయార్ వీణ వెంకట్రామయ్యర్, తేవూరు సుబ్రహ్మణ్యయ్యర్, కొర్నాడ్ రామస్వామి, బిల్వవనం మొదలగువారు ముఖ్యులగుదురు.

67. **చిన్నస్వామి దీక్షితులు** :- ఇతడు 18, 19 శతాబ్దములకు చెందినవాడు. ముద్దుస్వామి దీక్షితుల సోదరుడు. సంగీత, సాహిత్యములయం దతిసమర్థుడు. ఈయన నారదునిగూర్చి భక్తితో రచించిన "గానలోల కరుణాలవాల" (తోడి) "నారాయణానంత" (కల్యాణి) అను కృతులు మిగుల ప్రసిద్ధములగును. ఒకనాడీయన ఒకగానసభలో నాగవరాళి రాగ మాలాపనచేయుచుండగా ఒకనాగుబాము పడగ విప్పి ఆడుచూ వచ్చి రాగాలాపన ముగియునంతవఱకు విని వెంటనే యీయనకు సాష్టాంగపడి వెడలిపోయినట్లు చెప్పుదురు. ఇతడు మధుర గానసభవారి ఆహ్వానంపై వెళ్ళి అచ్చటనే స్థిరపడియుండునపుడు 45 వ యేట స్వర్గస్థుడయ్యెను.

68. **బాలస్వామి దీక్షితులు** :- ఇతడు 18, 19 శతాబ్దములకుచెందినవాడు. ముద్దుస్వామి దీక్షితుల కనిష్టసోదరుడు. సంగీత, సాహిత్యములందును, వీణ, వయొలిన్, సితారు, మృదంగవాద్యములందును గొప్పప్రావీణ్యముగలవాడు. ఎట్టయాపుర సంస్థాన విద్వాంసుడు. ఇతడు అనేక తానవర్ణములను, కృతులనేగాక శ్రీ వేంకటేశ్వర యెట్టేంద్రమహారాజున కంకితముగా వసంతరాగములో "స్వామికి సరి" యను దరువుకూడ రచించియుండెను. మరియు మణలి శ్రీ చిన్నయా మొదలియారుచే ఘనమైన సన్మానములుకూడ నొంది క్రీ.శ. 1858 సం॥కు సరి యగు పింగళినామ సం॥ కుంభరవి శుక్ల తదియ నాడు స్వర్గస్థుడయ్యెను.

69. **సుబ్బరామ దీక్షితులు** :- ఇతడు 19 వ శతాబ్దమువాడు. బాలస్వామి దీక్షితులకు దత్తపుత్రుడు. తండ్రులవలెనే సంస్కృతాంధ్ర సంగీతముల

లోను, ద్రావిడభాషలోను గొప్ప పండితుడు. ఇతడు తన 17 వ యేటనే దర్బారు రాగం, ఆదితాళంలో కార్తికేయునిపై ఒక వర్ణము రచించి ఎట్టయాపుర సంస్థానాధీశ్వరునిచే మెప్పొందిన ఘనుడు. మరియు నితడు ఆ మహారాజు ప్రోత్సాహమునసే "సంగీత సంప్రదాయ ప్రదర్శిని" అను గ్రంథము (రెండు భాగములు) ను, ప్రథమాభ్యాస మను నొక చిన్న గ్రంథమును రచించి మహారాజు ద్రవ్యసహాయమున ప్రకటించెను. పై రెండు గ్రంథములలోను వేంకటమఖి సంప్రదాయమననుసరించి ఆనాటి వాగ్గేయకారకులు రచించిన గీతములు, లక్షణగీతములు, స్వరజతులు, తిల్లానాలు, దరువులు, తానవర్ణములు, కృతులు, కీర్తనలేగాక, తాను రచించిన చౌకవర్ణ, తానవర్ణ, రాగమాలిక, సంచారులను, సంగీతలక్షణము, వాగ్గేయకారక లక్షణమునుకూడ చేర్చి ప్రకటించియుండెను. ఈ గ్రంథములు కర్నాటక సంగీతానికి మిగుల ప్రామాణికమైనవిగా చెప్పవచ్చును. ఇంతేగాక యితడు ఆంధ్ర మహాభారతాన్ని ద్రావిడ భాషలోనికి అనువదించిన సమర్థుడగును.

70. ఎట్టయాపుర సంస్థానాధీశ్వరులు :— క్రీ. శ. 1860 నుండి 1899 వఱకు ఎట్టయాపుర సంస్థానమును యీ దిగువ తెలిపిన ముగ్గురు ప్రభువులును వరుసగా పరిపాలించిరి. వీరు సంస్కృత, ఆంధ్ర, ద్రావిడభాషాభివృద్ధికేగాక సంగీతకళాభివృద్ధికికూడ అఖండమైన సేవచేసిన రాజపోషకులగుదురు. వీరిలో మొదటివారికి శ్రీ జగదీశ్వరరామకుమార ఎట్టప్ప అనియు, రెండవ వారికి శ్రీ ముద్దుస్వామి ఎట్టప్ప అనియు, మూడవవారికి శ్రీ జగదీశ్వరరామవేంకటేశ్వర ఎట్టప్ప అనియు పేర్లు గలవు. వీరు శ్రీ ముద్దుస్వామి దీక్షితులను, ఆయన సోదరుడు శ్రీ బాలస్వామి దీక్షితులను విశేషంగా సన్మానించియుండిరి. మరియు బాలస్వామి దీక్షితులను, వారి దత్తపుత్రుడు శ్రీ సుబ్బరామదీక్షితులను ఆస్థానవిద్వాంసులుగా నియమించుటేగాక సుబ్బరామదీక్షితులచే "సంగీత సంప్రదాయ ప్రదర్శిని" అను గొప్ప గ్రంథమును వ్రాయించి విశేష వ్యయ ప్రయాసలతో ప్రకటింపజేసిన సంగీతకళాపోషకు లగుదురు. ప్రశస్తమైన యీ గ్రంథములు యిప్పుడు దొరకుటలేదు.

71. స్వాతి తిరునాళ్ మహారాజు :— వీరు క్రీ. శ. 1829 - 1847 వరకు తిరువాన్కూరు సంస్థానమును పరిపాలించిన మహారాజగును. 16-4-1813 లో జన్మించెను. సంస్కృత, ఆంధ్ర, మళయాళ, మహారాష్ట్ర, పారశీక, హిందూస్థానీ, ఆంగ్లభాషలలోను; సంగీతము, కవిత్వములలోను అద్భుతమైన పాండిత్యము సంపాదించుటయేగాక తెనుగు,సంస్కృత,మళయాళ, మణిప్రవాళములలో పదములను,పదవర్ణములను, కృతులను, తిల్లానాలను రచించి చిరకీర్తి నొందిన మహారాజ వాగ్గేయకారకుడగును. వ్యవహారంలో యీయన కులశేఖర పెరుమాళ్ మహారాజని చెప్పబడెను.

ఈయన రచనలలో "సరసిజనాభ (కాంభోజి-అట) సామి నిన్నే నమ్మితిరా (యదుకుల కాంభోజి- అట)" వంటి తానవర్ణములు మిగుల ప్రసిద్ధములగును. వీరి వర్ణ రచనలు 21 వరకు గలవు. వాటిలో 6 భక్తిరసపూరితములును, 15 శృంగారరసపూరితములు నగును. ఈ 21 వర్ణములలో 2 తానవర్ణములును 19 చౌకవర్ణములు నగును. పదరచనలలో 5 తెలుగులోను, 10 సంస్కృతములోను, 50 మళయాళములోను గలవు. షుమారు 300 వఱకు గల యీయన రచనలలో కొన్నిటియందు స్వరాక్షరములుకూడ గలవు. ఈయన మళయాళభాషలో నొక సంగీతలక్షణగ్రంథాన్ని కూడ రచించినట్లు తెలియుచున్నది. దేవీ నవరాత్రులలో దేవిపై పాడుటకు ప్రత్యేకముగా యీయన నవరాగమాలికగా రచించిన 9 కీర్తనలు మిగుల ప్రసిద్ధములుగా నున్నవి. అవి ఏవనగా! (1) దేవి జగజ్జననీ (శంకరాభరణం – ఆది); (2) పాహిమాం (కల్యాణి- ఆది); (3) దేవీ పావనీ (సావేరి – ఆది); (4) భారతీ మాం అవ (తోడి – ఆది); (5) జననీ మాం అవ (భైరవి – త్రిపుట); (6) సరోరుహాసన (పంతువరాళి – ఆది); (7) జననీపాహి (శుద్ధసావేరి – త్రిపుట); (8) పాహి జననీ (నాటకురంజి- త్రిపుట); (9) పాహి పర్వతనందినీ (ఆరభి – ఆది) అనునవి యగును. వీటిలో మొదటి 6 న్నూ సరస్వతీదేవికిని మిగత 3 న్నూ పార్వతీదేవికిని అంకితమివ్వబడెను. మరియు నితడు "స్మరజనక (బేహాగ్)"వంటి కృతులును "వలపుతాళవశమా (అఠాణా–చాపు)"వంటి తెలుగు పదములనుకూడ రచించెను. ఆస్థానవిద్వాంసుడైన అనంతపద్మనాభస్వామియొక్క ప్రోత్సాహమున స్వాతితిరునాళ్ మహారాజు కుచేలోపాఖ్యానము, అజామిళోపాఖ్యానము వంటి హరికథలనుకూడ రచించెనని తెలియుచున్నది.

72. తూము నరసింహదాసు :- ఇతడు 18 – 19 శతాబ్దములకు చెందినవాడు. గుంటూరు వాస్తవ్యుడు. తండ్రి పేరు అచ్చయ్య మంత్రి. తల్లి పేరు వెంకమ్మ. త్యాగరాజుకు సమకాలికుడు. రామభక్తుడు. సంస్కృతాంధ్రములలోను సంగీతములోను విశేషపాండిత్యము గలవాడు. లౌకికమైనవుద్యోగము చేయుచున్నను, శ్రీరామచంద్రునిపైగల భక్తిచే యనేక కీర్తనముల రచించి పాడుకొనుచుండెడివాడు. ఈ కీర్తనలలో భక్తి, వేదాంతప్రబోధకములుగా నున్నవేగాక సీతారాముల కైంకర్యమున కుపయోగించు ఉత్సవసంబంధమైన మేలుకొలుపులు, హెచ్చరికలు, లాలిపాటలు, మంగళముల వంటి రచనలుకూడా గలవు. ఈ కీర్తనలను ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లో భక్తులు భజనకాలక్షేపములందు తఱచుగా పాడుచుందురు. వీటిలో భజన చేసే విధము తెలియండి (సౌరాష్ట్రి) రామనామామృతమే (మధ్యమావతి) వంటి కీర్తనలు బహుప్రసిద్ధములగును. ఇతడు పుణ్యక్షేత్రముల దర్శించుటకై దక్షిణదేశ పర్యటన చేయుచునపుడు తిరువొత్తియూరుకువెళ్ళి అచ్చట వీణ కుప్పయ్యర్ గారియింట్లో

బసచేసియున్న త్యాగయ్యగారిని దర్శించి వారి సంకీర్తనములను వినుటచే కలిగిన మహదానందముతో ఆశువుగా వారిపై కొన్ని పద్యములను చదివెనట. ఆ తరువాత యితడు వరదరామదాసుడను భక్తునితో కలసి భద్రాచలము వెళ్ళి శ్రీరాముని దర్శించి యచ్చటనే స్థిరపడిపోయి వుండునపుడు కొంతకాలానికి స్వర్గస్థుడయ్యెను.

73. వీణ పెదగురవాచార్యులు :— ఇతడు క్రీ. శ. 1794లో జన్మించెను. సంగీత సాహిత్యములలో గొప్ప పండితుడు. త్యాగరాజు కాలములోనివాడు. కాని ఆయనకంటె ముందుగానే 1822లో పరమపదించెను. త్యాగరాజు తీర్థయాత్రలు చేయు సమయములో వారిని యీయన, బొబ్బిలి కేశవయ్య కలుసుకొని విద్యాగోష్ఠి సలిపినట్లు చెప్పుదురు. ఇతడు విజయనగరం, తిరువాన్కూరు, మాడుగులవంటి సంస్థానములను దర్శించి ఆ సంస్థానాధిపతుల కంకితముగా గీతములు, వర్ణములు, తిల్లానాలు, స్వరపల్లవులు, శృంగార రస పదములు, శబ్దములు, జక్కిణి దరువులు, సలాము దరువులు, కీర్తనలు రచించి వారిచే ఘనమైన సన్మానము లొందినట్లు తెలియుచున్నది.

74 దుర్వాసుల సూర్యనారాయణ సోమయాజులు :— ఇతడు క్రీ. శ. 1842-1896 కాలమునాటివాడు. విజయనగరంలో విజయరామ గజపతిమహారాజుల ఆస్థాన విద్వాంసుడు. ఆ మహారాజుపై అనేక గీతములు, స్వరజతులు రచించి బహుమానము లొందినవాడు. మహారాజుతనకుమారుడైన ఆనందగజపతి యువరాజుతో ఉత్తర, దక్షిణ భారతదేశ పర్యటనకు వెడలినప్పుడు యీతనిని, శ్రీ వీణ వెంకటరమణదాసును వెంటబెట్టుకొని యాత్రలుచేసి వచ్చియుండినందున యీతనివలననే త్యాగరాజ, దీక్షిత, శ్యామశాస్త్రిల కృతులు మన ఆంధ్రదేశంలో విశేష ప్రచారం లోనికి రాగలిగినట్లు కొందరు చెప్పుదురు.

75. కంచి వేంకటాద్రి స్వామి:— ఇతడు 18 – 19 శతాబ్దములకు చెందినవాడు. త్యాగరాజ సమకాలికుడు. త్యాగరాజు సిద్ధిపొందినపు డచటనే యుండి వారి అంత్యక్రియలలో పాల్గొనినవాడు. కంచి వరదరాజస్వామి భక్తుడు. కంచివరదుని పైనను, శ్రీరంగంలోని అళఘిరిస్వామిపైనను విష్ణుపరంగా యీయన రచించిన సంకీర్తనములు మిగుల ప్రసిద్ధములగును. ఈ కీర్తనలు షుమారు 162 వఱకునున్నట్లు గ్రంథస్థముగా కనబడుచున్నవి. వీటిలో దివ్యనామ సంకీర్తనలు, హెచ్చరికలు, లాలిపాటలు, మంగళహారతులే గాక, సంభాషణలవంటి కీర్తనలుకూడ గలవు. ఇవి దక్షిణభారత మంతటను విశేష ప్రచారములో గలవు.

76. వీణ పెరుమాళ్ళయ్య :- ఇతడు క్రీ. శ. 1760-1790 కాలమున తంజావూరును పాలించిన తులజాజీ, అమరసింహమహారాజుల ఆస్థాన విద్వాంసుడు. ఆంధ్ర బ్రాహ్మణుడు. వీణను వాయించుటయం దతి సమర్థుడు. ఘనరాగ పంచకంలో తానం వాయించుట యీయన సామర్థ్య మను ప్రతీతి గలవాడు. దేశవ్యాప్తముగ పర్యటించి అనేక సంస్థానములలో కచ్చేరీలు చేసి రత్నఖచితమగు వీణయేగాక అనేక బహుమానములచే సన్మానింపబడినవాడు. ఒకప్పుడు పుదుక్కోట విజయరఘునాథ తొండమాన్ రాజాగారి సభలో వరుసగా 20 దినములు ఒకేరాగమును వీణయందు ప్రదర్శించి పదివేల రూపాయల సన్మానము నొందినవాడు. ఇతడు సావేరి, సౌరాష్ట్ర రాగములలో రచించిన అటతాళ వర్ణములు మిగుల ప్రసిద్ధములగును.

77. పల్లవి గోపాలయ్య :- ఇతడు క్రీ. శ.1788-1832 కాలమునాటివాడు. సాహిత్యరంగంలో రాజగోపాలకవిగా పేరొందినవాడు. సంస్కృతాంధ్ర, తమిళ భాషలందును, సంగీతమునందును విశేషపాండిత్యము గలవాడు. వెలనాటి బ్రాహ్మణుడు. ఆంధ్రుడు. తండ్రి పేరు గోపాలకవి. ఈయన పూర్వీకులు గుంటూరునుండి తంజావూరువెళ్ళి అచ్చట స్థిరపడిపోయిరి. ఇతడు "వేంకట" ముద్రతో అనేక తానవర్ణములను, కృతులను, రచించిన సమర్థుడగును. వీటిలో 'వనజాక్షి నిన్నే కోరి' (కల్యాణి-అట); అను తానవర్ణము, 'అంబనాను' (తోడి-ఆది) 'నీదు మూర్తి' (నాటకురంజి); వంటి కృతులు మిగుల ప్రసిద్ధములగును. రాగాలాపనలోను, పల్లవిపాడుటలోను యితనివి మించినవారు లేరను ప్రతీతిగలిగిన ప్రతిభావంతుడగుటచే పల్లవి గోపాలయ్యఅను సార్థకనామమొందెను.

78. పల్లవి శేషయ్య :- ఇతడు 18 - 19 శతాబ్దములకు చెందినవాడు, త్యాగయ్యగారి శిష్యుడగు నెయ్‌క్కరప్పట్టి సుబ్బయ్యగారి కుమారుడు. తెలుగు మురికినాటిబ్రాహ్మణుడు. నివాసము "నెయ్‌క్కరప్పట్టి"గ్రామము. సంస్కృతాంధ్ర ములలోను, సంగీతములోను గొప్పపండితుడు. లక్ష్యలక్షణ విద్వాంసుడు. పల్లవి పాడుటలో అద్భుతమైన ప్రజ్ఞగలవాడగుటచే పల్లవి శేషయ్య అని ప్రసిద్ధిచెంది యుండెను. తెలుగులో అనేకకృతులను. పదవర్ణములను, తిల్లానాలను రచించిన గొప్ప వాగ్గేయకారకుడు. ఒకనాటి గానసభలో ధన్యాసిరాగమును 8 గంటలు వరుసగా పాడి సభికులను తన్మయులుగా జేసిన సమర్థుడు. షుమారు 1000 రాగములకు లక్షణము తేర్పరచి వాటిలోగల తన రచనల కొన్నిటిని స్వరపరచి నొక గ్రంథమును ప్రకటించిన ప్రతిభావంతుడు. ఇతడొకసారి మైసూరువెళ్లి మహారాజదర్శనార్థమై శ్రీచాముండేశ్వరీ ఆలయప్రాంగణములో నిలచియుండగా దేవీ దర్శనార్థమేతెంచిన

మహారాజు యితనిని చూచి ఆహ్వానించినంతనే వెళ్ళి మహారాజుపై "భూమి వెలయు సోమకుల వరశ్యామ భూప శేఖరుని మనవివిని కామితార్థము లొసగి కావుము" అను తిల్లానాను ధన్యాసిరాగములో రచించి పాడగనే మహారాజు విని మిగుల సంతసించి ఘనమైన సన్మానము చేయుటయేగాక తన ఆస్థానవిద్వాంసునిగాకూడ నియమించెనట. ఈతనికృతులలో 'ఇకనన్ను బ్రోవ' (భైరవి-ఆది) వంటివి సుప్రసిద్ధములగును.

79. సుబ్బరాయశాస్త్రి :- ఇతడు క్రీ. శ. 1803 - 1862 కాలమునకు చెందినవాడు. శ్యామశాస్త్రుల కుమారుడు. సంస్కృతాంధ్ర, తమిళ భాషలందును, సంగీతములోను విశేషపాండిత్యముగలవాడు. ఇతడు కర్నాటక సంగీతమును మొట్టమొదట తండ్రిగారివద్దను, తదుపరి త్యాగయ్యగారివద్దను, హిందూస్థానీ సంగీతమును మొదట మేరు గోస్వామివద్దను, తరువాత రామదాసస్వామివద్దను నేర్చుకొనెను. ఇతడు వయొలిన్ వాద్యములోను, స్వరబదావాద్యములోను కచ్చేరీ చేయగల సమర్థుడు. "కుమార" ముద్రతో యితడనేక కృతులను, స్వరజతులను రచించెను. ఈ కృతులలో మధ్యమకాల సాహిత్యములను, స్వరసాహిత్యములను, చిట్ట స్వరములను కూడ చేర్పుచియుండెను. ఇట్టివి మధురమీనాక్షీదేవి సన్నిధిలో విశేషంగా ప్రచారములో నున్నవి. ఇతడు తిరువయ్యార్‌లోని శ్రీ ధర్మసంవర్ధనీదేవిని దర్శించి భక్తితో 'నిన్ను వినా గతిగాన జగాన' (కల్యాణి-ఆది) అను కృతిని రచించి అత్యద్భుతంగా గానంచేయగా గురువైన శ్రీ త్యాగయ్యగారు విని మహదానంద భరితుడయ్యెనట. ఇతడు మద్రాసులో 12 సంవత్సరములు నివసించెను. ఆ సమయములో తిరువళిక్కేణిలోని శ్రీపార్థసారథిస్వామిని దర్శించి భక్తితో 'నిను సేవించిన' (యదుకులకాంభోజ-చాపు) అను కృతిని రచించి పాడినట్లుగా చెప్పుదురు.

80 అన్నాస్వామి శాస్త్రి :- ఇతడు సుబ్బరాయశాస్త్రియొక్క దత్త కుమారుడు. క్రీ. శ. 1827లో జన్మించెను. సంగీతసాహిత్యములందును, భాష్య, నాటకాలంకార, వ్యాకరణశాస్త్రములందును గొప్పపండితుడు. వయొలిన్ వాద్యమునందద్భుతమైన ప్రావీణ్యముగలవాడు. ఇతడు కొన్ని కృతులను రచించెను. వాటిలో 'కామాక్షి, పాహి శ్రీ గిరిరాజసుత' వంటి స్వర సాహిత్యములు గల కృతులు మిగుల ప్రసిద్ధము లగును.

81. వీణ కుప్పయ్యర్ :- ఇతడు 18 - 19 శతాబ్దములకు చెందినవాడు. త్యాగరాజుకు ముఖ్య శిష్యుడు. తమిళ బ్రాహ్మణుడు. మదరాసులోని "తిరువొత్తియూరు" నందు జన్మించెను. గనుక తిరువొత్తియూర్ కుప్పయ్యర్ అని పిలువబడెను. నారాయణగౌళ రాగాలాపనలో విశేషప్రతిభ గలవాడగుటచే నారా

యణగౌళ కుప్పయ్యార్ అనియు,పాట కుప్పయ్యార్ అనియు చెప్పుకొనెడివారు.తండ్రి పేరు సాంబమూర్తి శాస్త్రి. ఈయన వీణావాద్యములో అద్భుతమైన ప్రతిభ గలవాడగుటచే సాంబడు వాయించాలి సాంబడే (ఈశ్వరుడే) వినాలి అని ప్రజలు చెప్పుకొనేవారు. కుప్పయ్యార్ సంగీత సాహిత్యములలో గొప్పపండితుడు, కవియు నగును. ఇతడు రచించిన తానవర్ణములు, కృతులు, తిల్లానాలు విశేష ప్రచారంలోనికి రాగలిగెను. ఇవి "గోపాలదాస" ముద్రను గలిగియుండును. వీటిలో "కనికరము లేకపోయె" (ఆనందభైరవి); "మనవ్యాలకింపవే దేవి" (ఖమాసు); "నా మొరాలకించి" (ధన్యాసి); "ఇంత పరాకేలనమ్మ" (బేగడ); "జగదభిరామ" (కానడ); "పరాకేల జేసేవు (గౌరీమనోహరి); వంటి కృతులు ప్రసిద్ధము లగును. ఇతనికి "గాన చక్రవర్తి" అను ప్రసిద్ధ బిరుదు గలదు. ఈయన శిష్యులలో పల్లవి సీతారామయ్య, ఫిడేల్ పొన్ను స్వామి మొదలగువారు ముఖ్యులగుదురు.

82. తిరువొత్తియూర్ త్యాగయ్యర్ :- ఇతడు 19వ శతాబ్దమునకు చెందినవాడు. కుప్పయ్యార్ కుమారుడు. ఇతడు మద్రాసులోని ముత్యాలపేటలో నివసించుటచే ముత్యాలపేట త్యాగయ్యర్ అనియు, స్వరకల్పనలో నిధి యగుటచే స్వరసింహ త్యాగయ్యర్ అనియు చెప్పబడెను. సంగీత సాహిత్యములలో విశేష ప్రతిభ గలిగినవాడు. ఘనరాగ పంచకముతో సహా 108 రాగములందు కృతులను రచించి "సంకీర్తన రత్నావళి" యను గ్రంథమును ప్రకటించిన ప్రతిభావంతుడు. తన తండ్రియగు కుప్పయ్యార్ గారి రచనలన్నిటిని చేర్చి "పల్లవి స్వరకల్పవల్లి" యను పేరిట నొక గ్రంథమునుకూడ ప్రకటించిన ప్రజ్ఞావంతుడు. మరియు నితడు త్యాగరాజునిపై గల విశేష భక్తిచే "త్యాగరాజ సద్గురుని దలతు" (ఖరహరప్రియ) అను కృతినికూడ రచించియుండెను.

83. షట్కాల గోవిందమారార్ :- ఇతడు త్యాగరాజును దర్శించి వారి ఆశీస్సుల నందుకొన్న గొప్ప విద్వాంసుడు. ఇతడు పల్లవిని షట్కాలములం దస్ఖలితముగా పాడగలిగిన సమర్థుడగుటచే షట్కాల గోవిందమారార్ అని చెప్పబడెను. ఈతని తంబురకు సప్తతంత్రులును, పతాకమును వుండెననియు, ఆ సప్తతంత్రులలో మూడు మంద్ర పంచమములును, మూడు మధ్య షడ్జములుగను, ఒకటి మంద్రషడ్జముగను శ్రుతి చేయబడుచుండినట్లుగా తెలియుచున్నది.

84 మానాంబుచావడి వేంకటసుబ్బయ్యర్ :- ఇతడు 18 - 19 శతాబ్దములలోనివాడు. తెలుగు మురికినాటి వైదిక బ్రాహ్మణుడు. త్యాగరాజునకు శిష్యుడును, మరియు బంధువు నగువాడు. సంగీత సాహిత్యములలో గొప్పపండితుడు.

దైవభక్తుడు. శ్రీ వేంకటేశ్వరుని స్తుతించుచూ, "వేంకటేశ" ముద్రతో అనేక కృతులను, రాగమాలికలను రచించిన విజ్ఞానవంతుడు. తన గురువైన త్యాగరాజును స్తుతించుచూ "సామికి సరి యెవరనవచ్చు" (దేవగాంధారి) అను కృతిని రచించి గురువుపై తనకుగల విశేషభక్తిని చాటుకొనిన పుణ్యపురుషుడు. ఈయనకు అనేకమంది శిష్యులు గలరు. వారిలో శ్రీ మహావైద్యనాథయ్యర్, శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్, శ్రీ శరభశాస్త్రి, శ్రీ లావణి వెంకట్రావు, శ్రీ ఫిడేలు వెంకోజీరావు, శ్రీ పంచాపకేశయ్య (త్యాగరాజునకు మనుమడు), శ్రీ శివరామయ్య మొదలగువారు ముఖ్యులగుదురు.

85. మూవనల్లూరు సభాపతయ్య :- ఇతడు 18 - 19 శతాబ్దములకు చెందినవాడు. ములకనాటి వైదిక బ్రాహ్మణుడు. ఆంధ్రదేశమునుండి వలసవచ్చిన భాగవత కుటుంబంలోని వాడు. తండ్రిపేరు దుర్గైస్వామయ్య. భరతనాట్యములోను, సంగీత సాహిత్యములలోను గొప్ప ప్రతిభావంతుడు. దైవభక్తిగలవాడు. మన్నారు గుడిలోని శ్రీ రాజగోపాలస్వామి కంకితముగా శృంగారరస ప్రధానమైన అనేక పదములను తెలుగులో రచించి చిరకీర్తినొందినవాడు. మరియు "సీతాస్వయంవర"మను కథను పాటలలో రచించిన సమర్థుడు. ఇతనియొక్క పదములలో 'అన్యాయముగ' (కాంభోజి-మిశ్రచాపు) వంటివి మిగుల ప్రసిద్ధములగును.

86. వాలాజాపేట వేంకటరమణ భాగవతులు :- ఇతడు క్రీ. శ. 18 - 19 శతాబ్దములకు చెందినవాడు. సౌరాష్ట్ర బ్రాహ్మణుడు. త్యాగరాజుకు ప్రేమపాత్రుడైన శిష్యుడు. త్యాగరాజునకు పూజాసమయములో భగవత్ప్రేరణచే గలుగు దివ్యతేజస్సునుగని వెంటనే ఆయన ముఖతా వెలువడు సంగీతరచనల (కృతుల)ను బహుజాగ్రత్తగా వ్రాయగలిగిన సమర్థుడు. ఇతడు కృతులను నేర్చుకొనునపుడు త్వరగా పాఠం చేయలేకపోవుటను గురువగు త్యాగయ్యగారు గ్రహించి జాలిచెంది శ్రీరాముని గూర్చి భక్తితో "జ్ఞానమొసగరాదా" (షడ్విధమార్గిణి) అను కృతిని పాడుచూ తన శిష్యునికి జ్ఞానప్రదానముచేయుమని ప్రార్థింపగా వెంటనే శిష్యుడైన వేంకటరమణ భాగవతులకు గ్రహణశక్తిగలిగి ఆనాటినుండి కృతులను త్వరగా పాఠం చేయగలిగెనని ప్రతీతిగలదు. ఇతడు సంగీత, సాహిత్యములలో గొప్ప పండితుడగుటచే అనేక కృతులను, వర్ణములను, స్వరజతులనేగాక గురువును స్తుతింపుచూ శాకర్ణవంశాబ్ధి అనెడి మంగళాష్టకమును, ధ్యానశ్లోకములనుకూడ రచించెను. ఈయన శిష్యులలో మైనూరు సదాశివరావు, కవి వెంకటసూరి, కాంచీపురం అరుణాచలాచారి మొదలగువారు ముఖ్యులగుదురు. ఈయన కుమారుడు శ్రీ కృష్ణస్వామిభాగవతులు

వ్రాసిన త్యాగరాజుని యొక్క జీవితచరిత్రమే నేడు మన సంగీతచరిత్రకు ముఖ్యాధారమైనదని గ్రహించునది.

87. మధ్యార్జునమ్ దుర్గైస్వామి అయ్యర్ :— ఇతడు 18 - 19 శతాబ్దముులకు చెందినవాడు. త్యాగరాజుని సమకాలికుడు. పల్లవి పాడుటలో అఖండమైన ప్రతిభగలవాడు. గనుక పల్లవి దుర్గైస్వామిఅయ్యర్ అని ప్రసిద్ధికెక్కెను. త్యాగరాజు శిష్యులగు గోవిందశివన్, సభాపతి అయ్యర్ ఈయన కుమారులని చెప్పుదురు.

88 పరమేశ్వర భాగవతార్ :— ఇతడు క్రీ. శ. 1815 - 1892 కాలమునకు చెందినవాడు. పాలఘాటు బ్రాహ్మణుడు. సంగీత, సాహిత్యములలో యితనికిగల ప్రతిభచే 18 వ యేటనే తిరువాన్కూరు సంస్థానములో ప్రధాన ఆస్థాన విద్వాంసుడయ్యెను. ఇతడు రచించిన కీర్తనలనేకములు గలవు. సుప్రసిద్ధుడైన శ్రీ కోయంబత్తూరు రాఘవయ్య యీతని ముఖ్యశిష్యుడగును.

89. వైకుంఠ శాస్త్రులు :— ఇతడు చోళదేశస్థుడు. ద్రావిడ బ్రాహ్మణుడు. సంస్కృత, వ్యాకరణ, సంగీతములం దతిసమర్థుడు. ఇతడు సంస్కృతంలో రక్తి రాగములందును, దేశీయరాగములందు "వైకుంఠ"ముద్రతో అనేక కీర్తనలు రచించినట్లుగా తెలియుచున్నది.

90. రామస్వామి శివన్ :— ఇతడు 19 వ శతాబ్దములోనివాడు. సంగీత సాహిత్యములలో కడు సమర్థుడు. "గుహదాస" ముద్రతో యితడనేక కృతులను, వర్ణములను రచించెను. వీటిలో పాహిమాం శ్రీ రాజరాజేశ్వరీ (జనరంజని) అను కృతియు, పంకజాక్షినీపై (కాంభోజి) అను వర్ణము మిగుల ప్రసిద్ధములగును. సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడుగా పేరొందిన శ్రీ మహావైద్యనాథయ్యర్ యీతని తమ్ముడగును.

91. అనయ్య :— ఇతడు శరభోజి మహారాజు కాలము నాటివాడు. తంజావూరు ఆస్థాన విద్వాంసుడు. తమిళ బ్రాహ్మణుడు. జన్మస్థానము "వైయేచేరి" గ్రామము. సంస్కృతాంధ్రములలోను, తమిళములోను, సంగీతములోను గొప్ప పండితుడు. "ఉమాదాస" ముద్రతో అనేక కృతులను రచించిన సమర్థుడు. ఈ రచనలలో "ఇంత పరాకా" (నాదనామక్రియ); "భజన శాయవే" (కేదార); "మహిమ తెలియతరమా" (శంకరాభరణం) "పరాకేల బాలా" (రీతిగౌళ); వంటి కృతులు మిగుల ప్రసిద్ధము లగును. ప్రసిద్ధగాయకుడగు మహావైద్యనాథయ్యర్ యీయన శిష్యుడగును.

92. మహావైద్యనాథయ్యర్ :— ఇతడు క్రీ. శ. 1844-1893 కాలమునకు చెందినవాడు. తమిళబ్రాహ్మణుడు. కౌండిన్యసగోత్రీకుడు. వివాసము

"వైయ్యచేరి" అను గ్రామము. తండ్రి పేరు దురైస్వామి అయ్యర్. అన్నల పేర్లు సాంబమూర్తి అయ్యర్, రామస్వామి శివన్. తమ్ముని పేరు అప్పాస్వామిఅయ్యర్. గురువు పేరు మానాంబుచావడి వేంకటసుబ్బయ్య. వైద్యనాథయ్యర్ 7వ యేటనే గొప్ప విద్వాంసుడయ్యెను. ఇతని సంగీత కచ్చేరియును, కథాకాలక్షేపమును వినిన వారందరును యితనిది గాంధర్వగానమని పొగడుచుండెడివారట. ఆనాటి రాజాధిరాజులు సయితము యీయనను ఆహ్వానించి కచ్చేరీలు చేయించి ఘనంగా సన్మానించెడి వారట. సుబ్రహ్మణ్య దేశికారు అను ఆయన గురుపూజ చేయు సందర్భంలో 13 సం॥ ములు వయసుగల యీ బాలుని ఆహ్వానించగా ఆనాడు యీ వైద్యనాథయ్యర్ చేసిన హరికథా కాలక్షేపమునకు పండిత పామరులుకూడ ముగ్ధులు కాగా దేశికారు ఆనంద పరవశుడై సభికుల సమక్షంలో యితనికి "మహా" అను గొప్ప బిరుదు నొసంగి ఘనంగా సత్కరించెను. ఇతడు 72 మేళకర్త రాగములలో నొక గొప్ప రాగమాలికను రచించిన మహానుభావుడగుటచే యితనిని ఆంగ్లకవియగు మోజార్టుతో పోల్చదగునని చెప్పుదురు. ఇతడు క్రీ. శ. 1893 సం॥ జనవరి 7వ తేదీన 49 వ యేట స్వర్గస్థుడయ్యెను.

93. పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ :- ఇతడు క్రీ. శ. 1845-1902 కాలము నాటివాడు. అష్టసహస్రబ్రాహ్మణుడు. ఆంధ్ర, తమిళ భాషలలోను, సంగీతములోను గొప్ప పండితుడు. మానాంబుచావడి వేంకట సుబ్బయ్యగారి శిష్యుడు. ఈయన గాత్రము మొదట అతికఠినముగా నుండుటచే విపరీతమైన సాధన చేసి తన గాత్రమును మాధుర్యమైనదిగా చేసుకొనగలిగిన సంకల్పసిద్ధుడు. ఇతడు త్యాగరాజ రచనల ననుసరించి "వేంకటేశ" ముద్రతో అనేక కృతులను, వర్ణములను, తిల్లానాలను, జావళీలను రచించిన సమర్థుడు. బేగడ రాగాలాపనలో ఈయనకు గల ప్రత్యేక నైపుణ్యమునకుగాను బేగడ సుబ్రహ్మణ్యయ్యర్ అని పిలువబడెను. మరియు అష్టోత్తరశత తాళములలో నొకటైన 128 అక్షరకాలములుగల సింహానందన తాళములో నొక గొప్ప పల్లవిని రచించి అత్యద్భుతంగా గానంచేసి సభాసదులను ఆనందపరవశులుగా చేయగల ఏకైక సంగీత విద్వాంసుడు. ఇతడు మొట్టమొదట తిరువాత్తియూర్‌లోను, తదుపరి చెన్నపట్నం (మద్రాసు) లోను నివసించుటచే పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ అని పిలువబడెను. ఈతని రచనలకుగాని, గానమునకుగాని రాగ భావమే ప్రత్యేకత యగును. ఈయన రచనలలో "ఇంతకంటె" (కన్నడ); రఘువంశ సుధాంబుధి చంద్ర" (కదనకుతూహలము); "మనసున నెర నమ్మితిని" (బేగడ); "నిన్నుజూచి ధన్యుడనైతి" (సౌరాష్ట్ర); వంటి కృతులు మిగుల ప్రసిద్ధములగును. ప్రఖ్యాత సంగీత విద్వాంసుడుగా కీర్తి నొందిన శ్రీ రామ్నాడ్ శ్రీనివాస అయ్యంగార్ యీయన ముఖ్యశిష్యుడగును.

94. రామనాథపురం శ్రీనివాస అయ్యంగార్ :- ఇతడు 19-20 శతాబ్దములకు చెందినవాడు. తమిళ వైష్ణవ బ్రాహ్మణుడు. సంగీత సాహిత్యములలోను, తెలుగులోను గొప్ప విద్వాంసుడు. పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ గారి ముఖ్య శిష్యుడు. రామ్నాడ్ రాజావారు యీయనకు సంగీత విద్యను నేర్పించి తన ఆస్థాన విద్వాంసునిగా చేసుకొనెను. ఇతడు తెలుగులో అనేక కృతులను, తానవర్ణములను, తిల్లానాలను, జావళీలను స్వనామ(శ్రీనివాస)ముద్రతో రచించినగొప్పసమర్థుడు. ఈ రచనలలో "నెరనమ్మిన" (కానడ-అట) అను తానవర్ణము, "సరగున పాలింప" (కేదారగౌళ); "పరమపావనా" (పూర్వకల్యాణి) వంటి కృతులు మిగుల ప్రసిద్ధములు. నేటిసుప్రసిద్ధ గాయకశిఖామణియగు సంగీత కళానిధి, సంగీత రత్నాకర శ్రీ అరియకుడి రామానుజ అయ్యంగార్ యీయన ముఖ్యశిష్యుడగును.

95. చెయ్యూరు చెంగల్వరాయశాస్త్రి :- ఇతడు క్రీ. శ. 1810 - 1900 కాలమునాటివాడు. ఇంటి పేరు మార్పెద్దివారు. జన్మస్థానము చెంగల్పట్టుజిల్లాలోని "పెరుంపేరు" అను గ్రామము. సంగీత సాహిత్యములందును, ఆంధ్రమునందును, భరతనాట్యశాస్త్రమందును మిగుల పాండిత్యముగలవాడు. ఇతడు సంస్కృతాంధ్ర, తమిళ భాషలం దనేక కీర్తనలు, పదములు, యక్షగానములు, పద్యకావ్యములు రచించెను. ఈతడు రచించిన కీర్తనలు షుమారు 1000 వరకు గలవని చెప్పుదురు. వీటిలో 360కీర్తనలు కంచి కామాక్షీదేవిపైనను, 240కీర్తనలు మధుర మీనాక్షీదేవిపైనను, 100 కీర్తనలకుపైగా శ్రీ తిరుపతి వేంకటేశ్వరునిపైనను రచింపబడినవి. ఈ కీర్తనలలో కొన్ని మధ్యమకాల సాహిత్యములతోను, కొన్ని అనుప్రాస, అంత్యప్రాసలతోను కూడి యుండును. ఇతడు పైన దెలిపిన రచనలేగాక, ముద్దుకుమార శతకము, చారులీలా విలాసము వంటి తెలుగు పద్య ప్రబంధములను, శుద్ధ స్వరాక్షరములతోకూడిన కందపద్యములనుకూడ రచించెను. ఈతని కందపద్యము నొకటి యీ క్రిందజూచునది.

కం॥ సామ పద గరిమ పసగని - గామని దనిగాని మగని గాదనిరిగదా ।
నీ మను మరి సరిపనిగని - పామరి పగమానిగాని పనిగాదనిదా॥

పై విధముగా నుండును. మరియు నితడు "దిగంతములు జయింప మీనాక్షీదేవి వెడలె" (భైరవి - ఆది) వంటి దరువులను, "సుందరేశవిలాస" మనే యక్షగానముకూడ తెలుగులో రచించియున్న గొప్ప ప్రతిభావంతుడగును,

96. వైదీశ్వరన్ కోవిల్ సుబ్బరామయ్యర్ :- ఇతడు 18-19 శతాబ్దములకు చెందినవాడు. తమిళ బ్రాహ్మణుడు. సంగీతములోను, తమిళ భాషలోను గొప్పపండితుడు. ఇతడు తమిళములో శృంగార రసప్రధానమైన అనేక పదములను "ముద్దుకుమార" ముద్రతో రచించి విశేషమైన కీర్తి నొందినవాడగును.

97. మైసూరు సదాశివరావు :— ఇతడు మహారాష్ట్ర బ్రాహ్మణుడు. 18 - 19 శతాబ్దములకు చెందినవాడు. వాలాజాపేట వేంకటరమణ భాగవతుల శిష్యుడు. మైసూరు సంస్థాన విద్వాంసుడు. సంగీత సాహిత్యములలో గొప్ప పాండిత్యముగల వాడు. ఇతడు స్వనామ (సదాశివ) ముద్రతో అనేక కృతులను, వర్ణములను, తిల్లానాలను రచించెను. ఈయన కృతులలో అనేకము స్వరసాహిత్యములతో కూడి యుండుటచే వినుట కెంతో రంజకముగా నుండును. వీటిలో "వాచామగోచరుండని" (అఠాణా) వంటి కృతులును, "ఏమగువబోధించెరా" (ధన్యాసి-ఆది) వంటి పదవర్ణములును, మిగుల ప్రసిద్ధములగును.

98. తిరుపతి నారాయణస్వామి :— ఇతడు ఆంధ్రుడు. తిరుపతి వాస్తవ్యుడు. తెలుగులోను, సంగీతములోను మంచి ప్రావీణ్యముగలవాడు. ఇతడు వేంకటేశ్వరుని భక్తుడు. "వేంకటేశ" ముద్రతో అనేక కృతులను, జావళీలను రచించెను. వీటిలో "పరాకేల సరస్వతి" (నాటకురంజి)"ఇకనైననా"(పుష్పలతిక) వంటి కృతులు మిగుల ప్రసిద్ధములగును.

99. మైసూరు లింగరాజు అర్సు :— ఇతడు మైసూరు సంస్థానమునకు చెందినవాడు. సంగీత సాహిత్యములలో గొప్పపాండిత్యము గలవాడు. కృతిరచయితలలో నొక ప్రముఖుడుగా పేరొందినవాడు. స్వనామ (లింగరాజ) ముద్రతో యితడు రచించిన కృతులు బహురంజకముగా నుండును. వీటిలో కొన్నిటికి చిట్టస్వరములుకూడ యుండును. ఇట్టి రచనలలో శృంగారలహరి (నీలాంబరి-ఆది) వంటి కృతులు మిగుల ప్రసిద్ధము లగును.

100. చిన్నికృష్ణదాసు :— ఇతడు సంగీతములోను, తెలుగులోను, విశేష పాండిత్యము గలవాడు. స్వనామ (చిన్నికృష్ణ) ముద్రతో యితడు రచించినకృతులు, స్వరజతులు, బహుప్రసిద్ధము లగును. వీటిలో "సాంబశివా యనవే" (ఖమాసు-ఆది) అను స్వరజతి విశేష ప్రచారములో గలదు.

101. ధర్మపురి సుబ్బరాయర్ & పట్టాభిరామయ్య :— వీరుభయులు సోదరులు. సంగీతములోను, తెలుగులోను గొప్పప్రవీణతగలవారు. తెలుగులో శృంగార రసప్రధానముగా వీరు అనేక జావళీలను రచించిరి. "ధర్మపురీశ" ముద్రతో సుబ్బారాయర్ను, "తాళవనేశ" ముద్రతో పట్టాభిరామయ్యయును, రచించిరి. ఈ జావళీలలో "మరుబారి తాళలేనురా" (ఖమాసు-ఆది); 'కొమ్మరో వాని కెంత బిగువే' (ఖమాసు-ఆది) వంటి రచనలు బహుప్రసిద్ధములగును. వీటిని సంగీత కచ్చేరీలందును, భరతనాట్య ప్రదర్శనములందును తఱచుగా పాడుచుందురు.

102. కున్నకుడి కృష్ణయ్యర్ :- ఇతడు తమిళ బ్రాహ్మణుడు. సంగీతములోను, తమిళములోను, తెలుగులోను, మిక్కిలి పాండిత్యముగలవాడు. రామనాథపురము సంస్థాన విద్వాంసుడు. స్వనామ (కృష్ణ) ముద్రతో యిత డనేక కృతులను, వర్ణములను, తిల్లానాలను రచించి కీర్తినొందినవాడు. ఈయన రచనలలో "నీవే నన్ను పరిపాలించుటకు" (కాంభోజి-ఆది) వంటి కృతులు మిగుల ప్రసిద్ధములగును.

103 కరూరు దక్షిణామూర్తిఅయ్యర్ & దేవుడయ్యర్:-వీ రుభయులు వరుసకు సోదరులు. కరూరు వాస్తవ్యులు. సంగీత, సాహిత్యములందు విశేషపాండిత్యము గలవారు. "గర్భపురి" ముద్రతో వీరు రచించిన కీర్తనలు బహుప్రసిద్ధముగా నున్నవి. వీటిలో "మరిమరి నిన్నే" (కాంభోజి–రూపకం) "బ్రోవసమయమిదె" (గౌరీమనోహరి–ఆది); "రారా రామా" (బంగాళా-ఆది) వంటి కృతులు ప్రసిద్ధములగును.

104 తచ్చూరు శింగరాచార్య సోదరులు :- వీరుభయులు సోదరులు. ఆంధ్ర వైష్ణవ బ్రాహ్మణులు. సుబ్బరాయశాస్త్రి శిష్యులు. చెన్నపట్టణము నందు నివసించినవారు. సంస్కృతాంధ్రములలోను, సంగీతములోను, విశేషపాండిత్యము గలవారు. విజయనగరం శ్రీ ఆనందగజపతి మహారాజువారి ఆస్థానవిద్వాంసులు. నేయుకల్పనలు విలసిల్ల అనేక కీర్తనలు, జావళీలు రచించిన వాగ్గేయకారకులు. వీరి రచనలు ముఖ్యముగా తోడి, భైరవి, కాంభోజి, శంకరాభరణం, బిలహరి, నాటకురంజి, ఆనందభైరవి, కల్యాణివంటి రక్తిరాగాలలో కనుపడుచున్నవి. ఈ సోదరులు సంగీత లక్ష్యలక్షణములలో విశేష కృషిచేసి, తాము రచించిన రచనలేగాక, పూర్వాచార్యులు రచించిన గీత, వర్ణ, పద, కీర్తనాదులనుకూడచేర్చి బహుజనోపయోగకరముగా (1) స్వరమంజరి (2) సంగీతకళానిధి (3) గాయకపారిజాతము (3) గాయకలోచనము (5) గాయకసిద్ధాంజన మను అయిదు గ్రంథములను ప్రకటించియుండిరి. మరియు వీరు శ్రీమాన్ వీణ రామానుజాచార్యులుగారు సమకూర్చిన "సంగీత సర్వార్థసారసంగ్రహము" అను గ్రంథమునుకూడ పరిష్కరించి నటుల తెలియుచున్నది.

105. తాళ్ళూరి నారాయణకవి :- ఇతడు 19వ, శతాబ్దములోనివాడు. సంగీత సాహిత్యములలో మిగుల సమర్థుడు. ఒక నాటి రాత్రి యీయనకు స్వప్నములో గురువైన శ్రీవేంకట శివార్యుడు కనుపించి, నాయనా! నీవు రామాయణమును కీర్తనలుగా రచింపుమని ఆనతిచ్చెనట. వెంటనే యితడు మేల్కాని తన స్వప్నవృత్తాంతమును తెలిపి రామాయణమును కీర్తనలతో హరికథగా రచించెనట. దీనిలో కీర్తనలేగాక తోహారాలు, మంజరులు, రగడలు, పంచచామరాదులు పైతమువుండి, అవి

అంత్యానుప్రాసాది నియమములతో కూడి వుండును. ఈ రామాయణమును "మోకుగుండు" అను గ్రామంలోని శ్రీరామచంద్రుని కంకితమివ్వబడినందున దీనికి మోకుగుండ రామాయణమని పేరు గలిగెనని చెప్పుదురు.

106 వీణ శేషన్న :- ఇతడు క్రీ. శ. 1852లో జన్మించెను. తండ్రి పేరు చిక్క రామప్ప. ఇతడు తంజావూరునుండి మైసూరు వచ్చి స్థిరపడిపోయెను. శేషన్న కర్నాటకుడు. తెలుగులోను, సంగీతములోను, గొప్ప పండితుడు. వీణలో అద్భుతమైన పాండిత్యముగలవాడు. గనుక వైణికశిఖామణి యను బిరుదు నొందెను. ఇతడు ఫిడేలు, జలతరంగిణి, స్వరబత్, పియానో, హార్మోనియము వంటి అనేక సంగీతవాద్యములందుకూడ మిక్కిలి ప్రావీణ్యము గలవాడు. తెలుగులో అనేక వర్ణములు, జావళీలు, తిల్లానాలు, రచించిన సమర్థుడు. మైసూరు ఆస్థాన విద్వాంసుడు. యావద్భారతములో పర్యటించి వీణావాద్యములో అఖండమైన ఖ్యాతి నార్జించిన ప్రతిభావంతుడు. ఇతడు క్రీ. శ. 1926లో స్వర్గస్థుడయ్యెను.

107. పరాంకుశదాసు :- ఇతడు 19వ, శతాబ్దమునకు చెందినవాడు. చెన్నపట్టణప్రాంతమున నివసించినవాడు. భజన సంప్రదాయమునకు చెందిన సంకీర్తన రచయితలలో సుప్రసిద్ధుడు, ఈయన కీర్తనలను పరాంకుశదాస కీర్తనలను పేరుతో నొక గ్రంథముకూడ మద్రాసులో ప్రచురింపబడెను. ఈ కీర్తనలు భక్తిరస పూరితములై శ్రీరామచంద్రుని స్తుతించునవిగా నుండును. వీటిలో యెక్కువ భాగము తెలుగులోను, కొన్ని మాత్రము సంస్కృతంలోను, తమిళంలోను, హిందుస్థానీలోను గలవు. ఈ కీర్తనలు, ఆంధ్ర, తమిళ దేశములందుగల భజన సమాజములందు తఱచుగా పాడుచుందురు. ఇతడు తన గురువైన తిరువేంగడ తాతాచార్యులమీదను, శ్రీ రామానుజాచార్యులమీద నేగాక మద్రాసులోని శ్రీ పార్థసారథి స్వామి, శ్రీ రంగనాథస్వాములమీద కూడ కొన్ని కీర్తనలు రచించెను. ఈతని రచనలలో కీర్తనలేగాక దేవుని నిత్యోత్సవ, కైంకర్యాదులందు పాడుకొను కందార్థములును, ఆరగింపు, విడెము, పవళింపు, లాలి, జోల, మేలుకొలుపు, మంగళములకు సంబంధించిన పాటలు, స్తోత్రములు కూడ గలవు. ఈతని రచనలలో ధన్యాసిరాగమునగల "రాముని మినహా భూమిలో వేరొక స్వామియు లేదు సుమా" అను కీర్తన మిగుల ప్రసిద్ధమగును. ఈ కీర్తనలోగల ఆఱు చరణములును, తెలుగు, తమిళము, కన్నడము, మహారాష్ట్రము, హిందుస్థానీ ఆంగ్లములనెడి, ఆఱు భాషలలో రచింపబడుటచే యిట్టి కీర్తనను, షడ్భాషా కీర్తన యని చెప్పబడును.

108. ఆదిభట్ల నారాయణదాసు :- ఇతడు క్రీ. శ. 1864 కు సరియగు రక్తాక్షి సంవత్సర శ్రావణబహుళ చతుర్దశినాడు ఆంధ్రప్రదేశ్ లోని అజ్జాడ

గ్రామములో జన్మించెను. తండ్రిపేరు వేంకటచయనులు. తల్లి పేరు నరసమ్మాంబ. పేరూరుద్రావిడ బ్రాహ్మణుడు. సంస్కృతాంధ్ర, ఆంగ్ల, పారశీకభాషలలోను సంగీత, జ్యోతిష, వ్యాకరణ, భరతశాస్త్రములలోను, కవిత్వములోను అద్భుతమైన పాండిత్యముగల వాగ్గేయకారకుడు. విజయనగరం మహారాజా సంగీతకళాశాలాధ్యక్షుడుగా చాలాకాలము పనిచేసిన సమర్థుడు. బహుగ్రంథకర్త. యావద్భారతములో పర్యటించి రాజాధిరాజులచే సైతము ఘనమైన సన్మానములొందినవాడు. హరికథాపితామహుడను గొప్పబిరుదునొందినవాడు. ఈయన అసలు పేరు [illegible] నారాయణదాసు అను పేరుతో ప్రసిద్ధినొందినవాడు. ఈయన హరికథలు [illegible] వరకు గలవని తెలియుచున్నది. (1) జానకీశపథము (2) రుక్మిణీకల్యాణము (3) మార్కండేయ చరిత్ర (4) హరిశ్చంద్రోపాఖ్యానము (5) అంబరీష చరిత్ర (6) భీష్మచరిత్ర (7) ప్రహ్లాదచరిత్ర (8) గజేంద్రమోక్షము (9) యథార్థరామాయణములగును. ఈయనకు అనేకమంది శిష్యులుగలరు. ఈ మహాపండితుడు యిటీవలనే స్వర్గస్థుడయ్యెను.

109. యల్ ముత్తయ్య భాగవతార్ :- ఇతడు క్రీ. శ. 1877 - 1945 కాలమునాటివాడు. తమిళనాడులో గల "పునల్వేలి" గ్రామమునందు జన్మించెను. హరికేశనల్లూరులో నివసించెను. తండ్రిపేరు లింగయ్య. తల్లి పేరు ఆనందవల్లి. ఇతడు సంస్కృతాంధ్రములలోను, కన్నడ, తమిళ భాషలందును, సంగీతములోను, కవిత్వములోను విశేషపాండిత్యముగలవాడు. సుప్రసిద్ధ గాయకుడేగాక, వయొలిన్, గోటు, మృదంగవాద్యములందుకూడ మిక్కిలి ప్రావీణ్యముగలవాడు. సంగీతకచ్చేరీలనేగాక హరికథా కాలక్షేపములనుకూడ అత్యద్భుతముగా చేయుగల గొప్పసమర్థుడు. ఇతడు వాడుకలోగల రాగములందేగాక అపూర్వరాగములలో సైతము రచించిన కృతులు, వర్ణములు, రాగమాలికలు, తిల్లానాలు, దరువులు యీయన జీవించియున్నప్పుడే విశేషప్రచారములోనికి రాగలుగుట యెంతయు విశేషము. ఇతడు మైసూరు ఆస్థాన విద్వాంసుడుగా నున్నప్పుడు క్రీ. శ. 1936 లో "చాముండాంబాష్టోత్తర శత నామ సంకీర్తనావళి" అనుగ్రంథమును కన్నడములో రచించెను. మరియు "శివాష్టోత్తర శతకీర్తనలు" అను గ్రంథమును సంస్కృతంలోను, "సంగీత కల్పద్రుమము" అను గ్రంథమును తమిళములోను రచించెను. క్రీ. శ. 1930 లో మదరాసు సంగీతఅకాడమి జరిపిన కాన్ఫరెన్సుకు అధ్యక్షుడుగానుండి "సంగీత కళానిధి" బిరుదునొందెను. 1931-1932 వరకు మదరాసు టీచర్సు మ్యూజిక్ కాలేజీకి అధ్యక్షుడుగానుండెను. 1936 నుండి తిరువాన్కూరు స్వాతితిరునాళ్ అకాడమికి అధ్యక్షుడుగా నుండి 1942 లో డాక్టరేట్ బిరుదుకూడ నొందెను. ఈయన క్రీ. శ. 1945 లో స్వర్గస్థుడయ్యెను.

110 హరి నాగభూషణము :— ఇతడు క్రీ. శ. 1884 లో జన్మించెను. ఆంధ్రుడు. వెలనాటి వైదికబ్రాహ్మణుడు. తండ్రిపేరు నరసింహశాస్త్రి. కృష్ణాజిల్లా బందరు వాస్తవ్యుడు. సంగీత, సాహిత్యములలోను, ఆంగ్లభాషలోను (బి. ఏ;) గొప్పపండితుడు. న్యాయవాదవృత్తిలో నుండియు జంత్ర (వయొలిన్) గాత్రములందు అత్యద్భుతంగా సంగీతకచ్చేరీలు, కథాకాలక్షేపములు, చేయగల ప్రతిభావంతుడు. అపురూపరాగములలో సైతము అనేక కృతులను రచించి సంగీత, సాహిత్య. భావనా పరాయణ, వాగ్గేయకారకరత్న వంటి బిరుదులనొందిన ప్రసిద్ధ పురుషుడు. అనేక సంస్థానములందు గానసభలుచేసి ఘనసన్మానములొందిన సమర్థుడు. ఈయన కృతులనేగాక త్యాగరాజ స్వామి చరిత్రము, శంకరాచార్య చరిత్రము, రామాయణము, రామరాఘవ స్థవరాజము, విభీషణ శరణాగతి (హరికథ), పాదుకా పట్టాభిషేకము (హరికథ) వంటి గ్రంథములుకూడ రచించియుండెను. ఈయన యిటీవలనే సన్యసించి స్వర్గస్థుడయ్యెను.

111. మాత్రు తాండవరు :— ఇతడు 18వ, శతాబ్దమునకు చెందినవాడు. ద్రావిడభాషయందును, సంగీతమందును గొప్ప పండితుడు. శివభక్తాగ్రేసరుడు. చిదంబరనాథునిపై భక్తి, శృంగారరసములలో యితడు రచించిన పదములు, కీర్తనలు, మిగుల ప్రసిద్ధము అగును. ఇతడు అరుణాచలకవిరాయర్‌కు ముందువాడని చెప్పుదురు.

112. అరుణాచలకవిరాయర్ :— ఇతడు క్రీ. శ. 1711-1777 కాలమునకు చెందినవాడు. తంజావూరు జిల్లాలోని "తిల్లైయాడి" గ్రామవాస్తవ్యుడు. ద్రావిడభాషలో పంచలక్షణములు తెలిసిన విచక్షణుడు. సంగీత విద్యా సమర్థుడు. కంబరామాయణమును అర్థ ప్రసంగమును చేయుటలో అతి సమర్థుడు. తండ్రి పేరు నల్లతంబి పిళ్లె. తల్లి పేరు వల్లియమ్మ. ఇతడు క్రీ. శ. 1771 లో రామనాటకమును తమిళములో కీర్తనలుగా రచించి వాటిని కళాపోషకుడగు శ్రీ మణలి ముద్దుకృష్ణ ముదలియార్ సభలో శ్రీ రామస్వామిదీక్షితులవంటి మహావిద్వాంసుల సమక్షమున వినిపించి కనకాభిషేకమొందిన ప్రతిభావంతుడు. మరియు నితడు శిర్‌గాజీ స్థలపురాణర్, శిర్‌గాజీకోవై హనుమార్ పిళ్లై తమిళ్, అశోముఖి నాటకంవంటి ప్రసిద్ధ రచనలుకూడ రచించిన సమర్థుడగును.

113. పాపవినాశ ముదలియార్ :— ఇతడు 18వ శతాబ్దములోని వాడు. తులజాజీ మహారాజు సమకాలికుడు. సంగీతమందును, ద్రావిడభాషయందును విశేషపాండిత్యము గలవాడు. ఇతడు "పాప వినాశ" అను స్వనామముద్రతో నిందాస్తుతిగా అనేక పదములను తమిళములో రచించి కీర్తి నొందెను.

114. కవికుంజర భారతి :— ఇతడు క్రీ. శ. 1810-1896 కాలమునాటి వాడు. రామ్నాడ్ జిల్లాలోని "పెరుంగరై" అను గ్రామమందు నివసించెను. తండ్రి పేరు సుబ్రహ్మణ్యభారతి. బాల్యమునందే సంగీత, సాహిత్యములలోను, తమిళము, కవిత్వముల లోను, గొప్ప పాండిత్యము సంపాదించినవాడు. దైవభక్తిగలవాడగుటచే యితడు తన విజ్ఞానమును దేవుని మహిమలను స్తుతించుటకై వినియోగించెను. మధురకవి భారతితో యితనికి మంచి స్నేహము కలదు. ఇతడు శివగంగరాజగు శ్రీ గౌరీవల్లభరాజు చేతను, రామనాథపురం రాజగు శ్రీ ముత్తురామలింగ సేతుపతి రాజుచేతను ఆహ్వానింపబడి తన రచనలచే వారిని మెప్పించి వారి ఆస్థాన విద్వాంసు డయ్యెను. మరియు శ్రీ పొన్నుస్వామి తేవర్ కోరికపై అరుణాచల కవిరాయర్ యొక్క రామనాటకమననుస రించి కందని చరిత్రను గేయనాటకంగా క్రీ. శ. 1865-1870 కాలములో రచించి పూర్తి చేసెను. కర్నాటక సంగీతములో యీతని స్కాందపురాణ కీర్తనలు విశేష ప్రాముఖ్యముగలవిగా ఎంచబడును. ఈయన తన 86వ యేట అనగా క్రీ. శ. 1896 కు సరియగు హేవళంబి సం॥ కార్తీక మాసమున స్వర్గస్థుడయ్యెను.

115. గోపాలకృష్ణ భారతి :— ఇతడు క్రీ. శ. 1811-1881 కాలమునకు చెందినవాడు. తమిళ బ్రాహ్మణుడు. నివాసము తంజావూరుజిల్లాలోని "నారిమనం" గ్రామము. తండ్రి పేరు రామస్వామి భారతి. తాత పేరు కోదండరామయ్యర్. గొప్ప వైణికుడు. గోపాలకృష్ణభారతి అజన్మ బ్రహ్మచారి. వేదములందును, యోగవిద్య యందును, సంగీతమందును విశేష ప్రతిభగలవాడు. సంగీతకాలక్షేపములచే నార్జించిన ధనమును దానధర్మములకు వినియోగించిన త్యాగమూర్తి. నందనార్ చరిత్రమును నాటకముగా రచించి శ్రీ కందప్ప చెట్టియార్ సమక్షంలో ప్రదర్శించి ఆయనచే గొప్ప సన్మానము నొందినవాడు. ఈ నాటకమును "శీషై" అను ఫ్రెంచి వుద్యోగి ప్రకటించెను. మరియు జ్ఞానబిందు, జ్ఞానకుమ్మి వంటి గ్రంథములను, అయుర్పాగైనయనార్, తిరు నీలకొంతనయనార్, కరైకాల్ అమ్మయార్ వంటి చరిత్రలను, మరికొన్ని సంగీతనాటకములను "గోపాలకృష్ణ" ముద్రతో రచించి క్రీ. శ. 1881 సం॥ మాఘ మాసములో మహాశివరాత్రి నాడు స్వర్గస్థుడయ్యెను.

116. వేదనాయకం పిళ్ళై :— ఇతడు 19వ శతాబ్దములోనివాడు. సంగీతములోను, ద్రావిడభాషలోను అతి సమర్థుడు. తమిళములో యితడు రచించిన కీర్తనలు బహురంజకముగానుండును. తమిళకీర్తనరచయితలలో నితడొక ముఖ్యుడగును.

117. మారిముత్తుపిళ్లె :- ఇతడు 19వ శతాబ్దములోనివాడు. తమిళములోను, సంగీతములోను గొప్పపండితుడు. ఈశ్వరభక్తుడు. చిదంబరములోని శ్రీ నటరాజ స్వామిని స్తుతించుచూ యితడు తమిళములోరచించిన కీర్తనలుభక్తిరసప్రధానములగును. పైనతెలిపిన తమిళ వాగ్గేయకారులేగాక తిరుజ్ఞాన సంబంధస్వామిగళ్, తిరువుక్కరసుస్వామిగళ్, సుందరమూర్తిస్వామిగళ్ (దేవరకీర్తనలు) అరుణగిరి నాథరులు (తిరుప్పుగళ్), సిద్ధార్థులు (తమిళకీర్తనలు) రామలింగస్వామి (తిరువరుట్పా) వంటి ప్రఖ్యాత తమిళ రచయితలు అమూల్యమైన తమ రచనలను మనకందించి కీర్తినొందిరి.

## 19–20శ॥లకు చెందిన సుప్రసిద్ధ గాయక, వాదక, భాగవతశిఖామణులు:-

118. కీర్తిశేషులైన శ్రీ అందనూర్ సుబ్బయ్యర్, పంజుఅయ్యర్, పెరియవైత్తి, చిన్నవైత్తి బ్రహ్మండవైత్తి, కోయంబత్తూరు రాఘవయ్య, ఖమాను మాధవరావు, తంజావూరు కృష్ణభాగవతార్, కుంభకోణం పంచాపకేశభాగవతార్, దాసవాద్యం కృష్ణయ్యర్, పాల్ఘాకృష్ణయ్యర్, స్వరబత్ కృష్ణయ్యర్, గోటువాద్యం శ్రీనివాసరావు, ఫ్లూట్ శరభశాస్త్రి, అనంతరామ భాగవతార్, జలతరంగం సుబ్బయ్యర్, ప్రతాప రామస్వామి, తిరువారూరు సుబ్రహ్మణ్యయ్యర్, (సంగీతకౌముది గ్రంథకర్త) కోనేరి రాజపురం వైద్యనాథయ్యర్, పుష్పవనం, వారణాశి సుబ్బరామయ్య, సుసర్ల దక్షిణామూర్తిశాస్త్రి, బిడారం కృష్ణప్ప, తిరుక్కోడికావల్ కృష్ణయ్యర్ (వయొలిన్) గోవిందస్వామిపిళ్లె (వయొలిన్) మృదంగం నారాయణస్వామి, మాముండిపిళ్లె (కొనగోలు) నైనాపిళ్లె, దక్షిణామూర్తిపిళ్లె (మృదంగం & కంజిరా) అళగనంబిపిళ్లె (మృదంగం) ఘటం సుందరేశయ్యర్, మోర్సింగ్ సీతారామయ్యర్, పొన్నుస్వామి పిళ్లె (నాగస్వరం) రాజరత్నంపిళ్లె (నాగస్వరం) వీణ ధనమ్మ, తుమరాడ సంగమేశ్వరశాస్త్రి (వీణ) ఈమని అచ్యుతరామశాస్త్రి (వీణ) పారుపల్లి రామకృష్ణయ్యపంతులు, బలిజేపల్లి సీతారామశాస్త్రి, ధేనువకొండ చిన్నయ్యపంతులు మొదలగు ప్రఖ్యాత విద్వాంసులు దక్షిణభారతంలో జనించి కర్నాటక సంగీతమును గాత్రంలో కొందరును, వాద్యములలో కొందరును, కథాకాలక్షేపములలో కొందరును అపూర్వమైన కృషి చేసి పొందిన పాండిత్య ప్రతిభవలన చిరకీర్తి నొందియుండిరి.